# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
VEEKSHANAM, TELUGU MONTHLY
సంపుటి : 13 సంచిక : 3 హైదరాబాద్ 164 మార్చ్ 2015 పేజీలు : 68 రు. 20

※ తెలుగు రాష్ట్రాల్లో మూఢ నమ్మకాలు

※ భూమిని కాపాడేది పోరాటాలే

※ ఆప్ విజయం దేనికి సూచన?

※ పాలకులకు గిట్టని 'సోషలిస్ట్, సెక్యులర్'

※ ఒబామా వ్యూహానికి మోడీ తోడ్పాటు

※ పెరుమాళ్ మురుగన్ - రచనా స్వేచ్ఛ

※ కమ్యూనిస్టులకు అధికారం ఇచ్చిన గ్రీస్

## వీక్షణం విడి ప్రతి కొనుగోలుదారులకు

## ఒక క్షమాపణ, ఒక విజ్ఞప్తి

వీక్షణం పాఠకులలో దాదాపు సగం మంది వీక్షణంకు చందాదారులు కారు, ఏనెలకానెల తమ తమ ప్రాంతాలలో వార్తాపత్రికలు అమ్మే దుకాణాలలో విడి ప్రతి కొనుక్కుని చదువుతుంటారు. గత రెండు నెలలుగా ఆ దుకాణాలలో వారికి వీక్షణం దొరకడం లేదు. రెండు రాష్ట్రాలలోని దాదాపు 300 న్యూస్ స్టాల్స్‌లో వీక్షణం పంపిణీ చేస్తూ ఉండిన ఆనంద్ ఏజెన్సీస్ వీక్షణంను ఇప్పుడు పంపిణీ చేయడం లేదు. మరొక రాష్ట్ర వ్యాప్త సోల్ ఏజెన్సీ గాని, ఎక్కడికక్కడ ఏజెన్సీలు గాని ఏర్పడేవరకూ న్యూస్ ఏజెంట్ల దగ్గర వీక్షణం దొరకదని చెప్పడానికి చింతిస్తున్నాం. పాఠకులకు కలుగుతున్న ఈ అసౌకర్యానికి క్షమించవలసిందిగా కోరుతున్నాం.

ఇప్పటిదాకా ఏనెలకానెల విడిప్రతి కొనుక్కుంటున్న పాఠకులు, అభిమానులు చందాదారులుగా చేరవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాం. ఎక్కువ కాపీలు అమ్మకం అయ్యే ప్రాంతాలలో, పట్టణాలలో కొత్త, నమ్మకమైన ఏజెంట్లను ఏర్పాటు చేయవలసిందిగా మిత్రులకు విజ్ఞప్తి చేస్తున్నాం.

**– సర్క్యులేషన్ మేనేజర్**
*9949391028*




ప్రతులకు:
**వీక్షణం**, మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫాక్స్ / ఫోన్ : 040-66843495 Email : veekshanam2003@gmail.com

164

ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

మార్చ్ 2015
సంపుటి : 13
సంచిక : 3





**అసహజ మరణాల సూచి జిల్లాల కరస్పాండెంట్లు**

**తెలంగాణ :** ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎస్.తిరుపతి; నల్గొండ – జి. వెంకటేశ్వర్లు; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎం. రాజేందర్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఇక్బాల్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – వి. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్.
**ఆంధ్రప్రదేశ్ :** అనంతపూర్ – కె. నాగేశ్వరాచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – కొండ్రాయుడు; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; ప్రకాశం – కర్ణ సతీష్‌బాబు; విశాఖపట్నం – పి.వి. రమణ; శ్రీకాకుళం – ఆర్. శ్రీలత



**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495

Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 20 | రు. 20 |
| సంవత్సరం | రు. 240 | రు. 200 |
| మూడు సంవత్సరాలు | రు. 600 | రు. 540 |
| ఐదు సంవత్సరాలు | రు. 1000 | రు. 900 |
| పది సంవత్సరాలు | రు. 2000 | రు. 1700 |

ఆన్‌లైన్ ద్వారా డబ్బులు పంపేవారు మాత్రమే బ్యాంక్ స్లిప్‌లపై 'veekshanam' అని రాసి వీక్షణం అకౌంట్ నెంబర్ – **01391101100217 5**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి.
ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 000/0139** నెంబర్ రాసి వేయవచ్చు.

**వీక్షణం చేస్తున్న కృషి పదికాలాల పాటు కొనసాగాలనే ఆకాంక్షతో మూలనిధికి ఫిబ్రవరి నెలలో వచ్చిన విరాళాలు - షేక్ పులివీడు గఫార్ (పీపుల్ ఫర్ సోషల్ సైన్సెస్), పోరుమామిళ్ల - రు.1000; గంటా రామన్న, హనుమకొండ - రు. 2000; టి. రమేష్, కరీంనగర్ - రు. 500; ఎస్. అహ్మద్, సూర్యాపేట్-రు. 3000; జి.ఎస్.కె. రాజా, హైదరాబాద్ - రు. 7500; ఎన్. వెంకటేశ్వర్లు, ఖమ్మం - రు. 5000; వై. రాజేశ్వరి, నెల్లూరు రు. 500; తహసిల్దార్ వి. బాలరాజు, అల్వాల్, హైదరాబాద్ - రు. 5000. దాతలందరికీ కృతజ్ఞతలు. - సం.**

**గమనిక: విరాళాలు పంపించిన వెంటనే దాతలు తమ పేరు, ఊరు, వగైరా వివరాలు తెలియజేయవలసిందిగా కోరుతున్నాం. - సం.**

వీక్షణం పత్రిక నిర్వాహకులకు మీ మొక్కవోని దీక్షకు, ఎదురీది నడిపించే దక్షతకు ఉడతాభక్తిగా చేదోడు కావాలన్న కాంక్షతో చిన్న మొత్తాన్ని చందా/విరాళాన్ని పంపించాను.

– జి.ఎస్.కె. రాజా
హైదరాబాద్

వీక్షణం ఫిబ్రవరి సంచికలో 'అరబిందో ఫార్మా కార్మికుల పోరాటం', 'పల్లెను మింగిన పెట్టుబడి' పుస్తకంపై 'అవసరమైన సమాచారం – పొసగని నిర్ధారణలు' సమీక్ష ఆసక్తి కలిగించాయి. పుస్తక సమీక్ష చదివిన తరువాత తట్టిన కొన్ని ప్రశ్నలు. కొన్ని గ్రామాల అధ్యయనంతో భూస్వామ్యం (భూస్వామ్యం అనే పదానికి ఉన్న బహుళ అర్థాల వల్ల ఈ మాట వాడుతున్నాను) అంతరించింది అని ఎలా నిర్ధారించగలరు అని రాశారు. అన్నం ఉడికిందో లేదో తెలుసుకునే పరీక్ష వంటిదే ఇది. ఆంధ్రప్రదేశ్‌లో ఫ్యూడల్ (లేక అర్ధ–ఫ్యూడల్ భూస్వామ్యం) అనేది ఉంటే అది – సంస్థానాల, జమీందార్ల అత్యంత స్పష్టమైన రూపం సాయుధ రైతాంగ ఉద్యమాల చరిత్ర ఉన్న – (పారడిజం) శ్రీకాకుళం, విజయనగరం జిల్లాల్లో ఉండాలి. ప్రత్యర్థి చేసే అత్యంత బలమైన వాదనను ఓడిస్తే, మిగతా వాదనలు ఓడించినట్లే, ఉదాహరణకు, బీహార్, జార్ఖండ్‌లలో ఫ్యూడల్ భూస్వామ్యం లేదు అని నిరూపిస్తే, పంజాబ్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్ వంటి రాష్ట్రాల గురించి చెప్పనవసరం లేదు. అలాగే, ఇప్పుడున్న జబ్బుకు మందు సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక పోరాటంలో ఉంది అని రాశారు. సామ్రాజ్యవాదం ఒక ఉత్పత్తి విధానం కాదు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం అనేది అమెరికాలోని విప్లవకారులకు కూడా వర్తిస్తుంది. ఇక మిగిలింది అర్ధ–ఫ్యూడల్ భూస్వామ్యం (పాత ఫ్యూడలిజం మిగిలి ఉంది అని ఎవరు అనలేరు కాబట్టి). అర్ధ ఫ్యూడల్ అనే మాటను రష్యన్ సమాజాన్ని వర్ణిస్తూ లెనిన్, ట్రాట్స్కీలు కూడా వాడారు. (ఉదాహరణకు, డగ్లొరిమర్ రచన లెనిన్స్ మార్క్సిస్ట్ ఫిలాసఫీ ఆఫ్ ఎ టు–స్టేజ్ రెవెల్యూషన్. స్క్రిబ్డ్....? కామ్ వెబ్‌సైట్‌లో దొరుకుతుంది). అర్ధ ఫ్యూడల్ అనే మాటను వారు ఒక వర్ణంగా (డిస్‌క్రిప్టర్) వాడారు. అదే అర్థంలో అయితే భారత సమాజాన్ని అర్ధ–ఫ్యూడల్ అనడంలో ఇబ్బంది లేదు. కాని అర్ధ–ఫ్యూడల్ అనేది ఒక ఉత్పత్తి విధానం అయితే దాని నిర్దిష్ట చలన సూత్రాలు (నిర్వచన) ఏమిటి, దాని మూలం ఎక్కడ అనే ప్రశ్నలు ఉదయిస్తాయి. చారిత్రక నేపథ్యం చూస్తే అర్ధ–ఫ్యూడల్ విధానం అనేది సామ్రాజ్యవాదానికి – ఫ్యూడల్ భూస్వామ్యానికి జన్మించిన ఉత్పత్తి విధానం. పెట్టుబడిదారీ విధానానికి అత్యంత ఉన్నత రూపం అయిన సామ్రాజ్యవాదం అభావం చెందకుండా ఇంకొక వెనుకబడిన ఉత్పత్తి విధానానికి జీవం పోస్తుందా? గతితర్కంలో ప్రధానమైంది రుణాత్మక గతితర్కం (నెగెటివ్ ఆస్పెక్ట్). వ్యవసాయ విప్లవం అనే కార్యక్రమం మొదలైన సుమారు 50 సంవత్సరాలలో అర్ధ–ఫ్యూడల్ భూస్వామ్యం ఒక్క అభావం (నెగేషన్) ఉండాలి. కాని, ఈ మొత్తం క్రమంలో అర్ధ–ఫ్యూడల్ భూస్వాముల నుండి కనీసం 1000 ఎకరాలు కూడా దున్నేవారు స్వాధీనం చేసుకున్న ఆధారాలు లేవు. బంజరు, ఫారెస్టు, పోడు భూముల స్వాధీనం, కూలీ రేట్లు, వెట్టి చాకిరీ, స్త్రీల, దళితుల ఆత్మగౌరవం, ఫారెస్టు అధికారుల లంచాలు, వడ్డీలు, తునికాకు, వెదురు సేకరణకు చెల్లించే వేతనాలు వంటి పోరాటాలపై రిపోర్టులు, పరిశీలన వ్యాసాలు, సృజనాత్మక సాహిత్య రూపాలు, పుస్తకాలు మాత్రం వందల సంఖ్యలో లభిస్తాయి. మరి దీనిని ఫ్యూడల్ అవశేషాల మీద జరిగిన పోరాటాలుగా ఎందుకు చూడకూడదో తెలియడం లేదు. ఫ్యూడల్ అవశేషాలు పెట్టుబడిలో ఉండడం భారత సమాజానికే పరిమితం అని భావించనవసరం లేదు. యూరప్ (ప్రధానంగా జర్మనీ) గురించి రాస్తూ మార్క్స్ అన్న మాటలు ఇవి...*we, like all the rest of continental western Europe, suffer not only from the development of capitalist production, but also from the incompleteness of that development. Alongside the modern evils, a whole series of inherited evils oppress us, arising from the passive survival of antiquated modes of production, with their inevitable trian of social and political anachronisms...* (దాస్ కాపిటల్, మొదటి జర్మన్ ముద్రణకు ముందు మాట. *Libcom.org* వెబ్ సైట్‌లో చదవచ్చు)

నాకు తెలిసినవరకు అర్ధ ఫ్యూడల్ వాదనకు అత్యంత బలమైన ప్రతినిధి అయిన ఆర్. ఎస్. రావు రచనలు అందుబాటులో లేవు. అక్కడ ఎవరైన వాటి గుణ దోషాల విశ్లేషణ చేస్తే ఈ వివాదానికి తెర దింపవచ్చు.

– నరేంద్రమోహన్,
ఆస్ట్రేలియా

హిజ్రా సమస్యపై రంగనాయకమ్మ వ్యాసం ఇంకా ఉంది అన్నారు గనుక ఇప్పుడే వ్యాఖ్యానించడం సరికాదు అనిపించవచ్చు. కాని మెతుకు చూస్తే అన్నం సంగతి తెలిసినట్టు జనవరి నెలలో వచ్చిన భాగం ప్రకారం రచయిత హిజ్రాలను సంఘ వ్యతిరేకులుగా, తప్పుడు పని చేస్తున్నవారుగా భావిస్తున్నట్లు అనిపిస్తున్నది. ఈ మాటలు పాలకులు, సమాజం, పెద్దలు అనేవి. ఎప్పుడైనా అణచివేతకు, దోపిడీకి గురయ్యే వాళ్లను ఇటువంటి మాటలతోనే పిలుస్తారు. వారి తప్పులను చెప్పకూడదని కాదు కాని, మొదట అణచివేతకు గురయ్యే వారిగా వారి పట్ల సానుభూతి ఉండాలి. ఆ కనీస సానుభూతి ఈ వ్యాసంలో కనిపించలేదు.

– కె. వెంకటేశం
నల్లగొండ

(మిగతా 61వ పేజీలో...)


Statement about ownership and other particulars of periodical **Veekshanam as require**d to be published in the first issue of every year after the last day of February

Form IV (See Rule 8)

| | | |
|---|---|---|
| 1. Place of publication | : | Hyderabad |
| 2. Periodicity of its publication | : | Monthly |
| 3. Printer's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 4. Publisher's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 5. Editor's name | : | N. Venugopal Rao |
| Whether citizen of India | : | Indian |
| Address | : | Mythri Residency<br>3-6-394, Street No. 3<br>Himayatnagar,<br>Hyderabad - 500 029. |
| 6. Name and addresses of individuals who own the newspaper | : | N. Venugopal Rao |

I, N. Venugopal Rao, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*
*(N. Venugopal Rao)*
Date : 1st March, 2015 Signature of the Publisher

# ఢిల్లీలో ఆమ్ ఆద్మీ పార్టీ అధికారం - ప్రజల గెలుపూ ఓటమీ

**ఢి**ల్లీ శాసనసభ ఎన్నికల్లో ఆమ్ ఆద్మీ పార్టీ (ఆప్) అఖండ విజయం సాధించడం దేశ రాజకీయాల్లో సంచలనానికీ అసంఖ్యాక విశ్లేషణలకూ దారితీస్తున్నది. సామాన్య ప్రజల అభిమతం ఎన్నికల ద్వారా వ్యక్తం కావడం సాధ్యమేనని ఈ ఫలితాలు రుజువు చేశాయని కొందరు వాదిస్తున్నారు. ఇది భారతీయ జనతా పార్టీకి వ్యతిరేక వోటు అని మరికొందరు అంటున్నారు. డబ్బు, కులం, మతం, అక్రమాలు లేకుండా అధికారానికి రావచ్చునని ఆమ్ ఆద్మీ పార్టీ రుజువు చేసిందని కొందరంటే, ఇది కార్పొరేట్ శక్తుల ముఠాతగాదాలో ఒక ముఠా గెలుపు మాత్రమేనని మరికొందరు అంటున్నారు. ఇది ఆడంబరపు సూట్ వాలాకూ నిరాడంబరపు మఫ్లర్ వాలాకూ మధ్య పోటీలో మఫ్లర్ వాలా గెలుపు అని కొందరంటే భాజపా కిరణ్ బేడీని తెచ్చిపెట్టడమే ఈ ఓటమికి కారణం అని మరికొందరు అంటున్నారు. ఈ విశ్లేషణలన్నిటిలోనూ ఎంతో కొంత వాస్తవం ఉన్నదనే అనిపిస్తుంది గాని అవన్నీ రూపం గురించినవే తప్ప సారాంశానికి వెళుతున్నవి కావు. అసలు భారత సమాజంలో సామాన్య ప్రజలకు తమ నిర్ణయం ప్రకటించే అవకాశం ఉన్నదా అనీ, ఈ దేశంలో పార్లమెంటరీ ప్రజాస్వామిక ఎన్నికల ప్రక్రియ ఎంత సక్రమంగా అమలవుతున్నదనీ ప్రశ్నించుకుంటే ఈ ఎన్నికల ఫలితాలను మరి కాస్త లోతుగా చూడవలసి వస్తుంది.

ఢిల్లీ ఎన్నికల ఫలితాలను ఆప్‌కు సానుకూలమైన వోటు గానూ, భాజపాకు వ్యతిరేకమైన వోటు గానూ చూడవచ్చు. మార్పు కోసం ప్రజలలో కనబడుతున్న తపనగా చూడవచ్చు. అధికారంలో ఉన్నవారి మీద అసహనానికి, కోపానికి సూచికగా చూడవచ్చు. గతంలో పాలన అర్ధాంతరంగా ముగిసిపోయినందువల్ల, నాయకుడు స్వయంగా 'క్షమించండి, పొరపాటు చేశాను' అని బహిరంగంగా ఒప్పుకున్నందువల్ల కలిగిన సానుభూతిగా చూడవచ్చు. ఢిల్లీలోని ప్రత్యేకమైన వర్గ పొందిక వల్ల వచ్చిన ఫలితంగా చూడవచ్చు. భాజపాలో అంతర్గత కుమ్ములాటల, అసంతృప్తుల ఫలితంగా చూడవచ్చు. ముఖ్యంగా దశాబ్దాలుగా పార్టీతో ఉన్నవారిని పక్కనపెట్టి అప్పటికప్పుడు వచ్చిన, అధికార అహంకారంతో ప్రవర్తించే కిరణ్ బేడీని నేరుగా ముఖ్యమంత్రి అభ్యర్థిగా ప్రకటించి నందువల్ల కలిగిన ఆగ్రహం కావచ్చు. పెద్ద కార్పొరేట్లకు వ్యతిరేకంగా చిన్న కార్పొరేట్లలో రగిలిన అసమ్మతి చిహ్నం కావచ్చు. మీడియా ప్రచార ఫలితంగానూ చూడవచ్చు. అంటే ఢిల్లీ ఎన్నికల ఫలితాలకు ఏదో ఒకటే కారణం లేదు, అనేక సంక్లిష్ట, చారిత్రక, సామాజిక, రాజకీయార్థిక కారణాలున్నాయి.

మొట్టమొదట భాజపా, మరీ ముఖ్యంగా నరహంతక నరేంద్ర మోడీ ప్రధాన మంత్రిత్వంలో చూపుతున్న దూకుడును ఏదో ఒక స్థాయిలో అరికట్టిన చర్యగా ఆప్ గెలుపును ఆహ్వానించి, అభినందించవలసిందే. ఎనిమిది నెలల కింద పార్లమెంటు ఎన్నికలలో ఢిల్లీలోని ఏడు స్థానాలకు ఏడు స్థానాలనూ గెలుచుకుని విర్రవీగిన భాజపా డెబ్బై శాసనసభ స్థానాలలో మూడు మాత్రమే దక్కించుకోగలిగిన శృంగభంగం జరిగినందుకు తప్పనిసరిగా దేశ ప్రజలందరూ సంతోషించవలసిందే. కాని ఇవాళ భాజపా, ఆ మాటకొస్తే కాంగ్రెస్ అయినా, ఏ పార్లమెంటరీ రాజకీయ పార్టీ అయినా పాటిస్తున్న భావజాలానికీ, అమలు చేసే విధానాలకూ ఆప్ భిన్నమైనదేమీ కాదు. కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలు, మత భావనల ద్వారా రాజకీయ పునాది పెంచుకోవడం అనే రెండు ప్రధాన భూమికలు అన్ని రాజకీయ పార్టీలతో సమానంగా ఆప్‌కూ వర్తిస్తాయి. ఆప్ కు కూడ కార్పొరేట్ శక్తుల మద్దతు ఉంది. రిలయన్స్, టాటా వంటి ఒకటి రెండు కార్పొరేట్ శక్తులను వ్యతిరేకించినట్టు, వారి ఆశ్రిత పెట్టుబడిదారీ తత్వాన్ని వ్యతిరేకిస్తున్నట్టు మాట్లాడుతున్నది గాని ఇతర కార్పొరేట్ల సహాయం తీసుకుంటూనే ఉంది. మొత్తంగా పెట్టుబడిదారీ విధానం పట్ల వ్యతిరేకత ఏమీ లేదు. ఇప్పుడు గెలిచిన అభ్యర్థులలో కోటీశ్వరుల సంఖ్య, నేరస్తుల సంఖ్య చూస్తే ఆప్ అన్ని పార్లమెంటరీ రాజకీయాల పక్షాల తానులో ముక్కేనని స్పష్టమవుతుంది.

కనుక ఆప్ విజయంలో ఆహ్వానం పలకవలసిన అంశాలూ ఉన్నాయి, జాగ్రత్త వహించవలసిన అంశాలూ ఉన్నాయి. ఎన్నికల ఫలితాలు వెలువడిన రోజునే సామాజిక శాస్త్రవేత్త సరోజ్ గిరి రాసినట్టు 'స్వాగతం ఆప్, వీడ్కోలు ఆప్' (హెల్లో ఆప్, గుడ్ బై ఆప్) అనవలసిన స్థితి ఉంది. విద్యుత్తు, మంచినీరు, పారిశుధ్యం, రవాణా, భద్రత వంటి ఢిల్లీ నగరానికి కీలకమైన అంశాలలో ఆప్ తన ఎన్నికల ప్రణాళికలో చెప్పినట్టు కొన్ని జనాకర్షక పథకాలు చేపట్టవచ్చు కూడ. కాని ఢిల్లీ నగర శాసనసభకు పూర్తి అధికారాలు లేకుండా ఉన్న ప్రత్యేక ప్రతిపత్తి దృష్ట్యా చూసినా, నగరంలో 60 శాతం జనాభా రు. 13,500 కన్న తక్కువ నెలసరి ఆదాయంతో బతుకు ఈడుస్తున్న పరిస్థితి దృష్ట్యా చూసినా, ఒక రాజకీయ పార్టీగా దాని స్వభావం దృష్ట్యా చూసినా ఆప్ ప్రజాజీవనంలో మౌలిక మార్పులు తీసుకురాజాలదు.

ఈ ఫలితాలతో దేశవ్యాప్తంగా ఆమ్ ఆద్మీ పార్టీ విస్తరిస్తుందని, ఆ పార్టీ సామాన్యుల పార్టీ అని, అది ప్రత్యామ్నాయమని ఊహాగానాలు సాగుతున్నాయి. వ్యవస్థలోపలే అతుకులు, మాట్లు, సంస్కరణలతో బాగుచేయవచ్చునని, వ్యవస్థను మార్చనక్కరలేదని వాదించే పార్టీని ప్రత్యామ్నాయంగా చూడడం, చూపడం అర్థరహితం. అది ఎక్కువలో ఎక్కువ మధ్యతరగతి ఆదర్శవాదుల పార్టీ కావచ్చు గాని సామాన్యుల, ప్రజల పార్టీ కాజాలదు. సామాన్యులను ఆకర్షించే, మాయచేసే పార్టీ కావచ్చు. అందువల్ల అవినీతిని తగ్గించడం, సంక్షేమ పథకాలు అమలు చేయడం వంటి ఉపరితల మార్పులు ఏవో కొన్ని చేయడం మినహా సమాజాన్ని, వ్యవస్థను మార్చే పని, అశేష జనబాహుళ్యానికి మెరుగైన జీవితం ఇచ్చే దిశగా అభివృద్ధి నమూనా అమలు చేయడం ఆ పార్టీకి అసాధ్యం. మార్పు కావాలనే ప్రజల కోరిక ఈ ఎన్నికల్లో వ్యక్తమైందని గుర్తించేవారెవరైనా, ఆ మార్పుకు ఆ పార్టీ చోదకశక్తి కాజాలదని కూడ గుర్తించవలసి ఉంది. ప్రజల్లోని ఈ మార్పు కోరిక, ఇటువంటి తప్పుడు మార్గాల్లోకి పోకుండా ప్రజలను సంఘటితం చేసి మౌలిక పరివర్తనా పోరాటాలలోకి మళ్లించడమే ఇవాళ దేశంలోని ప్రగతిశీల శక్తుల ముందున్న కర్తవ్యం. వీ

**సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ**

# తెలంగాణ ప్రజలు కోరిందేమిటి, జరుగుతున్నదేమిటి?

**త**మను తాము తెలంగాణ వాదులమనుకుంటూ తెరాస ప్రభుత్వాన్ని గుడ్డిగా సమర్థిస్తున్నవాళ్లకు ఈ ఎనిమిది నెలల పాలనలో తెలంగాణకు ఏమవుతున్నదో అర్థమవుతున్నదో లేదో తెలియదు. ఒక ప్రభుత్వంగా పాటించవలసిన మర్యాదలు, రాజ్యాంగ విధినిషేధాలు, పాలకుల వ్యక్తిగత ఇష్టాయిష్టాలు వంటి అంశాలను పక్కన పెట్టినా, తెరాస ప్రభుత్వపు ప్రకటనలు, వాగ్దానాలు, అమలు చేస్తున్న విధానాలు తెలంగాణ ప్రజా ఆకాంక్షలకు దూరంగా పోతున్నాయని చెప్పకతప్పదు. ఉద్యమ క్రమంలో తెలంగాణ సమాజం ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఎన్నో ఆకాంక్షలను ప్రకటించింది. మెరుగైన జీవితం, అభివృద్ధి అవకాశాలు, పౌరహక్కులు, సమానత్వం, ప్రజాస్వామ్యం, సుపరిపాలన వంటి అలా విస్తృతంగా వ్యక్తమైన ఆ తెలంగాణ ప్రజల కోరికలకూ 2014 జూన్ 2 తర్వాత జరుగుతున్న పనులకూ గుర్తించదగిన వ్యత్యాసం స్పష్టంగా కనబడుతున్నది. తెలంగాణ ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడితే తెలంగాణ వనరుల మీద ఇతరుల అధికారం తొలగిపోతుందనీ, అణగారిన వర్గాలకు తగిన ప్రాధాన్యత దక్కుతుందనీ వెలువడిన ఆశలు వమ్మవుతున్నాయి. దళితులకు భూపంపిణీ పథకం పంచపాండవులు మంచంకోళ్లలా ముగ్గురు అని రెండు వేళ్లు చూపి ఒకటి రాసినట్టుగా సాగుతున్నది. దళిత ఉపముఖ్యమంత్రిని అవమానకరంగా తొలగించడం జరిగింది. ఒక్క మహిళను కూడ మంత్రివర్గంలోకి తీసుకోలేదు. పాత ప్రభుత్వాల విధానాలను సమీక్షించి, అందులో తెలంగాణ వ్యతిరేకమైనవాటిని రద్దు చేయడం జరగలేదు. ప్రదర్శన వస్తువుల వంటి భవనాల ప్రణాళికలు తప్ప ఆయా వర్గాలలోని లక్షలాది ప్రజల అభివృద్ధి ఆలోచనలు లేవు. పాత విధానాలు యథాతథంగా కొనసాగడం మాత్రమే కాదు, ఇంతకాలం ఎవరి పెత్తనం కింద నలిగిపోయానని తెలంగాణ భావించిందో వారికే కొత్త విధానాలలో పెద్దపీట దక్కుతున్నది. తెలంగాణను దోపిడీ పీడనలకూ అవమానానికీ గురిచేసినవారికి ఇవాళ అత్యంత గౌరవం దక్కుతున్నది. ఫీ రియింబర్స్‌మెంట్ వంటి కుంభకోణాలుగా బయటపడిన పాత విధానాలు అదే విధంగా కొనసాగుతున్నాయి. తెలంగాణ ప్రజలు కోరుకున్న పనులు, చేయవలసిన పనులు జరగకపోగా, తెలంగాణ సమాజాన్ని వెనక్కి నడిపించే, ఇంతకాలం ప్రదర్శించిన చైతన్యాన్ని మొద్దుబార్చే పనులు మాత్రం వేగంగా జరిగి పోతున్నాయి. రియల్ ఎస్టేట్ వ్యాపారుల ప్రయోజనాల కోసం సెక్రటేరియట్ మార్చడానికి ప్రణాళికలు రచిస్తూ వాటికి వాస్తు కారణాలు చెపుతున్నారు. విద్యార్థి యువజనుల బలిదానాలతో, కోట్లాది ప్రజల క్రియాశీల భాగస్వామ్యంతో ఏర్పడిన తెలంగాణ, మొక్కుల వల్ల ఏర్పడిందని చెపుతూ ప్రజాధనం నుంచి మొక్కులు చెల్లిస్తున్నారు. పైనుంచి నీరు వచ్చే వాగులనూ, ప్రవాహాలనూ అడ్డుకునే నిర్మాణాలకు అనుమతిస్తూ చెరువుల పునరుద్ధరణ అంటున్నారు. నింపడానికి ఒక్క మంచినీటి వాగూ మిగలని హుస్సేన్ సాగర్ ను మొదలు ఖాళీ చేయించి రియల్ ఎస్టేట్ కు సిద్ధం చేస్తున్నారు. పాలకవర్గాలలో ఒక ముతా మార్పుతో పాలన మౌలికంగా మారుతుందని ఎవరూ ఆశించ లేదు గాని పైపై విషయాల్లోనైనా కాళోజీ అన్నట్టు 'ఎవరనుకొన్నారు, ఇట్లవునని ఎవరనుకొన్నారు'? వీ

**సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్**

# ఆంధ్రప్రదేశ్‌కు ప్రత్యేక ప్రతిపత్తి - భాజపా నమ్మక ద్రోహం

**ఆం**ధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టం 2014 మీద పార్లమెంటులో చర్చ జరుగుతున్నప్పుడు, విడిపోయిన తర్వాత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఆర్థికంగా దెబ్బతింటుందని, అందువల్ల దానికి అదనపు సౌకర్యాలు, వసతులు, నిధులు సమకూర్చాలని అప్పటి ప్రతిపక్షం భారతీయ జనతా పార్టీ గట్టిగా వాదించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాన్ని ప్రత్యేక ప్రతిపత్తి గల రాష్ట్రంగా గుర్తించాలని కోరింది. చివరికి రాజ్యసభ చర్చలో ఆ హామీలు ఇవ్వకపోతే తాము బిల్లును వ్యతిరేకిస్తామని, బిల్లు ఓడిపోయేలా వోటింగ్ కోరుతామని కూడ బెదిరించింది. ఆ తర్వాత బిల్లులో ప్రతిపాదించిన రాయితీలు మాత్రమే కాక, అదనంగా ఆరు రాయితీలను అప్పటి ప్రధానమంత్రి మన్మోహన్ సింగ్ ప్రకటించారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ప్రత్యేక ప్రతిపత్తి హోదా కల్పిస్తామనీ, ద్రవ్య లోటును అధిగమించడానికి సహాయం చేస్తామనీ, రాయలసీమ–ఉత్తరాంధ్రలకు ప్రత్యేక సహాయ ప్యాకేజీ ఇస్తామనీ, పద్నాలుగో ఆర్థిక సంఘం సిఫారసులు వెలువడేలోపు రాష్ట్రప్రభుత్వ ఆదాయవ్యయ లోటును పూరించుకోవడానికి కేంద్రం సహాయం చేస్తుందనీ హామీ ఇచ్చారు. పార్లమెంటరీ ప్రజాస్వామిక వ్యవస్థలో పాలక పక్షాలు మారినా గత ప్రభుత్వాల వాగ్దానాలను గౌరవించే సంప్రదాయం ఉంటుంది. పైగా ఇక్కడ, ఇటువంటి ప్రత్యేక సహాయాల కోసం పట్టు బట్టిన ప్రతిపక్షమే ఇవాళ అధికారపక్షం అయింది. కనుక ఏ రకంగా చూసినా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఆ హామీలన్నీ నెరవేరి ఉండవలసింది. కాని ఎన్‌డిఏ ప్రభుత్వం ఇవాళ ఆ వాగ్దానాలన్నిటినీ ఎగ్గొట్టడానికి సిద్ధపడినట్టు కనబడుతున్నది. ప్రత్యేక ప్రతిపత్తి రాష్ట్రంగా గుర్తించడానికి ఉన్న ప్రాతిపదికలు – కొండ ప్రాంతాలు, తక్కువ జనసాంద్రత, ఎక్కువ గిరిజన జనాభా, సరిహద్దు ప్రాంతం, ఆర్థిక, మౌలిక సౌకర్యాల వెనుకబాటుతనం – ఆంధ్రప్రదేశ్‌కు వర్తించవు. ఆర్థిక వనరుల కొరత అనే ఒక్క ప్రాతిపదిక మాత్రమే వర్తిస్తుంది. ఆ హోదా వస్తే కేంద్ర సహాయ నిధులలో ప్రాధాన్యత లభిస్తుంది. రాష్ట్రానికి పరిశ్రమలను ఆకర్షించేలా ఎక్సైజ్ పన్నులలో రాయితీ ఉంటుంది. కేంద్ర బడ్జెట్ కేటాయింపులలో ప్రాధాన్యత దొరుకుతుంది. రుణ మాఫీ, రుణ మార్పిడి సౌకర్యాలు దొరుకుతాయి. కేంద్ర ప్రభుత్వ పథకాలలో, విదేశీ సహాయంలో హెచ్చు వాటా ఉంటుంది. ఈ ప్రత్యేక సౌకర్యాలలో పన్ను రాయితీ మినహా మిగిలినవన్నీ రాష్ట్ర ప్రభుత్వానికి ఎక్కువ నిధులు అందడానికి ఉపయోగపడతాయి. అయితే ఎక్కువ నిధులు అందినంత మాత్రాన ప్రభుత్వం ఆ నిధులను ప్రజోపయోగ కార్యక్రమాలకు ఖర్చు పెడుతుందనే హామీ ఏమీ లేదు. కాని కనీసం ప్రజా సంక్షేమ పథకాలు అమలు చేయడానికి తన దగ్గర నిధులు లేవని ప్రభుత్వం సాకులు చెప్పే అవకాశం ఉండదు. బలమైన ప్రజాఉద్యమం నిర్మిస్తే ఆ నిధులను ప్రజల కోసం ఖర్చు పెట్టమని ఆందోళన జరపడానికి అవకాశం వస్తుంది. అందువల్ల ఆంధ్రప్రదేశ్ పాలకుల స్వభావం గురించి ఎవరికి ఏ అనుమానాలున్నా ప్రజల కోసమైనా సరే కేంద్ర ప్రభుత్వ వాగ్దానాలన్నీ అమలు చేయాలనే డిమాండ్ పై పోరాడవలసి ఉంది. వీ

# గ్రీస్‌లో సిరిజా విజయం సూచిస్తున్నదేమిటి?

దక్షిణ యూరప్‌లో ఒక కోటీ పది లక్షల జనాభా గల చిన్న దేశం గ్రీస్ ప్రజలు జనవరి 25న జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టు, పర్యావరణ, స్త్రీవాద తదితర విప్లవ, ప్రగతిశీల శక్తుల కూటమి అయిన సిరిజా (సినాస్పిస్మోస్ రిజోస్పాస్టికిస్ అరిస్టెరాస్ – విప్లవ వామపక్ష కూటమి) కి అత్యధిక స్థానాలు కట్టబెట్టి యూరప్‌లోను, మొత్తంగా ప్రపంచ ఆలోచనాపరులలోను సంచలనం సృష్టించారు. అధికారంలో ఉన్న న్యూ డెమోక్రసీ పార్టీని ఓడించి, మొత్తం పార్లమెంటులోని 300 స్థానాలలో 149 స్థానాలను, మొత్తం వోట్లలో 36.3 శాతాన్ని సిరిజా గెలుచుకుంది. ఆ ఆధిక్యత అధికారం చేపట్టడానికి సరిపోదు గనుక 13 స్థానాలు గల అనెల్ (అనెక్సార్టిటోయ్ ఎల్లినెస్ – స్వతంత్ర గ్రీకులు) అనే మితవాద పార్టీతో పొత్తు కుదుర్చుకుని జనవరి 26న అధికారం చేపట్టింది. సిరిజా అధ్యక్షుడు, కమ్యూనిస్ట్ పార్టీ ఆఫ్ గ్రీస్ నాయకుడు అలెక్సిస్ ట్సిప్రాస్ ప్రధానమంత్రిగా, తనను తాను 'తప్పులు చేసే మార్క్సిస్టు'గా అభివర్ణించుకునే యానిస్ వరోఫాకిస్ ఆర్థిక మంత్రిగా ప్రభుత్వం ఏర్పడింది. ఈ ప్రభుత్వం అధికారానికి వచ్చిన నెలరోజులుగా అటు పెట్టుబడిదారీ శిబిరంలోను, ఇటు మార్క్సిస్టు శిబిరంలోను ఈ విజయాన్ని ఎలా చూడాలని చర్చోపచర్చలు జరుగుతున్నాయి. యూరప్‌ను మళ్లీ కమ్యూనిస్టు భూతం ఆవహిస్తున్నదనడానికి ఇది సూచన అని, దీన్ని కట్టడి చేయాలని పెట్టుబడిదారీ సమర్థకులు వాదిస్తుండగా, సిరిజా ప్రతిపక్ష పార్టీగా చేసిన ప్రకటనలకూ, ప్రస్తుతం అధికార పార్టీగా చేస్తున్నపనులకూ పొంతన లేదని, అందువల్ల ఇది వర్గ సామరస్య ప్రభుత్వమే తప్ప ప్రజా ప్రభుత్వం కాజాలదని మార్క్సిస్టు శిబిరంలోని కొందరు మేధావులు వాదిస్తున్నారు. సిరిజా అధికారంలోకి వచ్చిన ప్రత్యేక పరిస్థితుల నేపథ్యంలో దాని రాజీ వైఖరులను అర్థం చేసుకోవాలని మరికొందరు మేధావులు వాదిస్తున్నారు. సిరిజా విప్లవకరంగా ఉండగలదా లేదా భవిష్యత్తు రుజువు చేస్తుంది గాని ప్రస్తుతానికైతే గత దశాబ్దానికి పైగా గ్రీస్‌ను పట్టి పల్లారుస్తున్న ఆర్థిక సంక్షోభాన్ని భరించలేని ప్రజల తీర్పే ఈ ఎన్నికల ఫలితం. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ, యూరపియన్ యూనియన్, యూరపియన్ సెంట్రల్ బ్యాంక్ అనే దుష్టత్రయం గ్రీస్ ఆర్థిక సంక్షోభాన్ని ఆసరాగా తీసుకుని, ఆర్థిక సహాయం పేరుతో గత ప్రభుత్వాల మీద దారుణమైన ఆర్థిక సంస్కరణల పథకాన్ని రుద్దాయి. పొదుపు చర్యల పేరుతో సంక్షేమ పథకాలను రద్దు చేయించాయి. కార్మిక వ్యతిరేక, ప్రజావ్యతిరేక ఆంక్షలను అమలు చేయించాయి. ఈ దుర్మార్గమైన విధానాల వల్ల నిత్య జీవితం దుర్భరంగా మారిపోయిన ప్రజలు ఆ ప్రభుత్వం పోతే చాలుననుకున్నారు. దుష్టత్రయం గ్రీస్ మీద రుద్దిన విధానాలను రద్దు చేస్తానని ఎన్నికల వాగ్దానాలలో భాగంగా ప్రకటించి సిరిజా ప్రజాదరణను చూరగొంది. కాని అధికారానికి వచ్చిన ఈ నెల రోజులలో ఆ విధానాలలో 70 శాతం మంచివేనని, 30 శాతం చర్చనీయమని ప్రధాని సన్నాయి నొక్కులు నొక్కుతున్నాడు. ఒక నిర్ణయాత్మక మార్పుకు నాంది పలికిన గ్రీకు ప్రజలు ఈ వెనుకడుగును అంగీకరిస్తారా, మరొక అర్థవంతమైన ప్రత్యామ్నాయం కోసం అన్వేషణ ప్రారంభిస్తారా చూడవలసే ఉంది. వీ

**ధనిక దేశాల నుంచి పేద దేశాలకు అందే సహాయం సాలీనా ఒక డాలర్ ఉంటే, పేద దేశాల నుంచి ధనిక దేశాలకు అసలు, వడ్డీ, లాభాలు వగైరా చెల్లింపులలో ఎనిమిది డాలర్లు వెనక్కి వెళతాయి. జూబిలీ 2000 కోఅలిషన్ అనే క్రైస్తవ సంస్థ 2000లో వేసిన లెక్క, తయారు చేసిన కార్టూన్ ఇది. ఈ పదిహేను సంవత్సరాలలో ఇది మరింత పెరిగి ఉంటుంది.**





❖ **తొలి మహామంత్రిణి - నాయకురాలు నాగమ్మ** (చరిత్ర దాచిన పల్నాటి ప్రామాణిక దర్పణం) - వై.ఎచ్.కె. మోహన్‌రావు - 68 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : వై.ఎచ్.కె. మోహన్‌రావు, పల్నాడు రచయితల సంఘం అధ్యక్షులు, ఇ.నెం. 11-61/3, జె.పి. రోడ్, పిడుగురాళ్ల - 522 413, గుంటూరు జిల్లా



❖ **విడనిముడి** (స్వీయ కవితల్లోని ఆత్మీయ అనుబంధాల కవిత్వం)- ముకుంద రామారావు - 117 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : పాలపిట్ట బుక్స్, 16-11-20/6/1/1, 403, విజయసాయి రెసిడెన్సీ, సలీంనగర్, మలక్‌పేట్, హైదరాబాద్ - 500 036; email:palapittabooks@gmail.com; ఫోన్:27678430



❖ **ఆకాశయానం** - కవిత్వం - ముకుంద రామారావు - 65 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; నవోదయ బుక్‌హౌస్; పాలపిట్ట బుక్స్



❖ **వైజ్ఞానిక భౌతికవాదం** - గతితార్కిక భౌతికవాదం - రాహుల్ సాంకృత్యాయన్ (అనువాదం: ఆలూరి భుజంగరావు, కవిని ఆలూరి) నవచేతన పబ్లిషింగ్ హౌస్ - 179 పేజీలు, 1/8 డెమీ, రు. 125 email:navachethanaph@gmail.com



❖ **దళిత సాహిత్య నేపథ్యం** - డా. ఎస్వీ సత్యనారాయణ - నవచేతన పబ్లిషింగ్ హౌస్-80 పేజీలు, 1/8 డెమీ, రు.50 పై రెండు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జి.ఎస్.ఐ. పోస్ట్, హైదరాబాద్ - 500 068. ఫోన్: 24224458 / 59 email:navachethanaph@gmail.com



❖ **అప్రజ్ఞాత - యజ్ఞం** - కాళీపట్నపు రామారావు - కావ్య పబ్లిషింగ్ హౌస్ - 86 పేజీలు, 1/16 డెమీ, రు. 60, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్; నవోదయ బుక్‌హౌస్; మైత్రీ బుక్‌హౌస్



❖ కథా రచనకు - **కథకుడి పాఠాలు** - బి.ఎస్. రాములు - ఎమెస్కో ప్రచురణలు - 176 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: సాహితి ప్రచురణలు, 29-13-53, కాళేశ్వరరావు రోడ్డు, సూర్యారావుపేట, విజయవాడ-2; ఫోన్: 0866-2436643, 6460633; email:sahithi.vja@gmail.com



❖ **చైతన్య తరంగాలు** (52 వ్యాసాల సంకలనం) - వి. జయరాముడు - 219 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: వి. జయరాముడు, ఫ్లాట్ నెం. 402, శ్రీకృష్ణ నిలయం, పిల్లర్ నెం 179, ఉప్పరపల్లి, రాజేంద్రనగర్ రోడ్, హైదరాబాద్-500048; సెల్ నెం: 9848215650



❖ **జన వేమన** - శ్రీశ్రీ - కూర్పు: సింగంపల్లి అశోక్ కుమార్ - శ్రీశ్రీ సాహిత్య నిధి - 32 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : శ్రీశ్రీ సాహిత్య నిధి, 305, ప్రగతి టవర్స్, వీరయ్య వీధి, మారుతినగర్, విజయవాడ - 520004; ఫోన్: 6617375, 6697375; సెల్: 9246277375, 9848504649 email:srisri_sahityanidhi@yahoo.com



❖ **రేణ** (మరికొన్ని కథలు) - చైతన్య ప్రకాశ్ - మట్టి ముద్రణలు - 138 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : పుట్ట పుస్తక శిబిరం, ఆలగడప, మిర్యాలగూడ, నల్లగొండ జిల్లా-508 207; సెల్ నెం.: 9848015364



❖ **జనమేవ జయతే** - కవితా సంపుటి - గులాబీల మల్లారెడ్డి - జైభారత్ జైహింద్ ప్రచురణలు - 95 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : పరిమళా పటేల్, ఇ.నెం. 13-72, సిరికళ్యాణి అపార్ట్‌మెంట్, ప్రగతినగర్, హైదరాబాద్. సెల్: 9912229594;




❖ **అంతర్జాతీయ విప్లవోద్యమాల్లోని ఆటు, పోట్లపై అధ్యయనం** - విరసం ప్రచురణ - 117 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: సి.ఎస్.ఆర్. ప్రసాద్, సి-132, ఎస్.వి.ఎన్. కాలనీ, గుంటూరు - 522 001; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **దండకారణ్యం - ఒక ఆకుపచ్చని కల** - దీర్ఘ కవిత - కెనరీ - విరసం ప్రచురణ - 40 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **భారతదేశంలో ఉత్పత్తి విధానం - ఉత్పత్తి సంబంధాలు** - విరసం ప్రచురణ - 47 పేజీలు, 1/8 డెమీ, రు. 20, ప్రతులకు: పాణి, 50-348, ఎల్ 19, బి-2, అరోరా నగర్, బి క్యాంప్, కర్నూల్-2, ఆంధ్రప్రదేశ్; అన్ని ప్రముఖ పుస్తక షాపుల్లో



❖ **విదిత** - సాహిత్య వ్యాస సంపుటి - పెనుగొండ లక్ష్మీనారాయణ - 244 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, హైదరాబాద్



❖ **నేను మాత్రం ఇద్దరిని** - వచన కవిత్వం - వర్మ కలిదిండి - డా. ఎస్వీ సత్యనారాయణ - 64 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: కెవిఎన్‌విఎం వర్మ, s/o. వెంకటకృష్ణం రాజు, డోర్ నెం. 3-39, రాజులపేట, చెరుకువాడ, ఉండి మం. పశ్చిమ గోదావరి జిల్లా-534199; సెల్: 9948943337; email:knvmvarma@gmail.com

# వర్తమాన చరిత్ర - రాజకీయార్థిక దృష్టి

**మేడ్ ఇన్ ఇండియా, మేక్ ఇన్ ఇండియా, మేక్ ఫర్ ఇండియా**

అభివృద్ధి మంత్రాన్ని జపిస్తూ మధ్యతరగతిని ఏదో ఒక మేరకు భ్రమలకు గురిచేయగలుగుతున్న ప్రధానమంత్రి నరేంద్ర మోడీ 2014 ఆగస్ట్ 15న ఎర్రకోట ఉపన్యాసంలో పారిశ్రామిక ఉత్పత్తి రంగానికి ప్రాధాన్యత ఇవ్వవలసి ఉందంటూ, 'భారతదేశానికి వచ్చి తయారు చేయండి (మేక్ ఇన్ ఇండియా) అని అన్ని దేశాలనూ ఆహ్వానిస్తున్నాను. భారత్ లో తయారైనది (మేడ్ ఇన్ ఇండియా) అనే సందేశం ప్రపంచం నలుమూలలకూ చేరాలి' అన్నాడు. ఈ ఉపన్యాసానికి కొనసాగింపుగా సెప్టెంబర్ 14నుంచి మేక్ ఇన్ ఇండియా అనే ఒక కొత్త అంతర్జాతీయ ప్రచారాన్ని భారత ప్రభుత్వం ప్రారంభించింది. ఇది ఏదో అపూర్వమైన కార్యక్రమమనీ, దానిద్వారా దేశ ఆర్థిక వ్యవస్థ ఉరుకులు పరుగులతో ముందుకు సాగుతుందనీ దేశంలోని బడా పెట్టుబడిదారీ సంస్థల ప్రచారసాధనాలు, సంఘ పరివార్ శక్తులు ఊదరగొడుతున్నాయి.

నిజానికి ఈ నినాదం కొత్తదీ కాదు, ఈ నినాదం నిజంగా అమలైన సందర్భం గత ఆరు దశాబ్దాలలో ఎన్నడూ లేదు. ఈ నినాదం స్వదేశీగా, స్వావలంబనగా కనబడుతూనే భారత ఆర్థిక వ్యవస్థను సామ్రాజ్యవాద దేశాల రథచక్రాలకు కట్టేసే కొత్త ఎత్తుగడ మాత్రమే. ఈ నినాదం నేపథ్యంలో భారత పారిశ్రామిక ఉత్పత్తి రంగం చరిత్రను పరిశీలిస్తే భారత బడా పెట్టుబడిదారీ వర్గపు దళారీ స్వభావం స్పష్టంగా అర్థమవుతుంది. మాటల్లో దేశీయత, చేతల్లో సామ్రాజ్యవాద అనుకూలతకు ఈ నినాదపు చరిత్రే నిలువుటద్దం.

పెట్టుబడిదారీ విధానం స్వేచ్ఛావాణిజ్యపు మొదటి దశను, వ్యాపారాన్ని, పారిశ్రామికీకరణను దాటి, గుత్తాధిపత్యం, ద్రవ్యపెట్టుబడుల దశకు, వలసలకూ సామ్రాజ్యవాదానికీ చేరినతర్వాత వలస దేశాలలో స్వతంత్ర పారిశ్రామికీకరణను అనుమతించలేదు, ఆటంకాలు కల్పించింది, తన కనుసన్నల్లో నడిచేలా చూసింది. తన మోచేతి కింది చిన్న వాటా భాగస్వాములుగా, దళారీలుగా తప్ప స్వతంత్ర పెట్టుబడిదారులు ఎక్కడైనా పుట్టుకువచ్చి తనకు పోటీ కాకుండా జాగ్రత్త పడింది. అందువల్ల సామ్రాజ్యవాద దేశాల పెట్టుబడులు, సాంకేతిక పరిజ్ఞానాలు, యంత్రాలు ప్రవేశించిన ఎన్నో దేశాలలో ఉత్పత్తి విధానాలలో మార్పులు వచ్చినప్పటికీ, స్థానిక ఉత్పత్తులు పెరిగినప్పటికీ అవేవీ ఆయా దేశాల 'జాతీయ' ఉత్పత్తులు కాలేకపోయాయి. అవి ఆ ఆర్థిక వ్యవస్థల దశనూ దిశనూ మార్చలేకపోయాయి.

నిర్దిష్టంగా భారత ఆర్థిక వ్యవస్థ అనుభవమే చూస్తే, ఇక్కడ పారిశ్రామిక ఉత్పత్తి రంగం అని పిలవగలిగినది 1860ల నాటికే ఏర్పడినప్పటికీ అది మొత్తంగా బ్రిటిష్ పెట్టుబడి కింద, బ్రిటిష్ సాంకేతిక నైపుణ్యంతో, భారతీయుల శ్రమతో రూపొందినదే. భారతదేశం బ్రిటిష్ ప్రభుత్వ పాలనలో ఉన్నదనే రాజకీయ కారణం వల్ల మాత్రమే కాక, భారత పారిశ్రామిక రంగపు ఆర్థిక కారణం వల్ల కూడ ఆ కాలంలో భారతదేశంలో తయారైన వస్తువులు మేడ్ ఇన్ ఇండియా అనే గుర్తింపు పొందలేకపోయాయి. అంతేగాక, భారత మార్కెట్ వంటి సువిశాల మార్కెట్ ను ఆక్రమించి తమ సరుకులు అమ్ముకోవడం అనే ఆర్థిక కారణమే రాజకీయ వలసాధిపత్య పాలనకు పునాది గనుక స్థానిక ఉత్పత్తి రంగపు ఉనికిని గాని, ఎదుగుదలను గాని అడ్డుకోవడానికే ప్రభుత్వ విధానాలు అనేక రకాలుగా ప్రయత్నించాయి. ఈ వలస దోపిడీ వల్ల దేశం నుంచి తరలిపోతున్న సంపదను లెక్కగట్టి ప్రకటించిన భారత జాతీయ ఆర్థికశాస్త్రవేత్తల, రాజకీయ నాయకుల సంప్రదాయం 1890ల నుంచే ప్రారంభమైంది.

అందువల్ల దేశ ఆర్థిక వ్యవస్థను సామ్రాజ్యవాద ప్రభావం నుంచి తప్పించడం జాతీయోద్యమ నినాదాలలో ఒకటిగా మారింది. విదేశ వస్త్ర దహనం, విదేశీ వస్తు బహిష్కరణ, స్వదేశీ వస్తువుల ఉత్పత్తి, వినియోగం, స్వావలంబన వంటి నినాదాలు ఆయా కాలాల్లో వచ్చాయి. ఈ నేపథ్యంలోనే 1947 తర్వాత భారత ప్రభుత్వ ఆర్థిక విధానాలలో వలస అనుభవపు దుస్థితి తిరిగి రానివ్వగూడదనీ, దిగుమతులకు ప్రత్యామ్నాయాలు వెతకాలనీ ఆలోచనలు తలెత్తాయి. ప్రణాళికాబద్ధ ఆర్థిక విధానంలో, పంచవర్ష ప్రణాళికలలో, ప్రభుత్వరంగ స్థాపనలో ప్రధాన ఉద్దేశ్యం భారత ఆర్థిక వ్యవస్థ వీలైనంతవరకు దిగుమతులను తగ్గించుకుని, భారతదేశంలోనే అవసరమైన వస్తువులను ఉత్పత్తి చేయాలనేది. అలా మేడ్ ఇన్ ఇండియా నినాదానికి ప్రాబల్యం వచ్చింది. దిగుమతులను ఎంత తగ్గించుకున్నా, తప్పనిసరిగా దిగుమతి చేసుకోవలసిన సరుకులూ సేవలూ ఉంటాయి గనుక దిగుమతి బిల్లుకు తగినంత విదేశీ మారక ద్రవ్యం సంపాదించేందుకు, భారత వ్యవసాయ, పారిశ్రామిక రంగాలలో సానుకూలత ఎక్కువగా ఉన్న, చవకగా తయారు చేయగలిగిన సరుకులను తయారు చేసి ఎగుమతి చేయాలనీ, అలా అంతర్జాతీయ మార్కెట్లలో 'మేడ్ ఇన్ ఇండియా' అనే ముద్రను స్థిరపరచాలనీ కూడా ఆలోచన ఉండింది. అప్పటికి గడియారాలంటే స్విట్జర్లాండ్, ఆటోమొబైల్ వాహనాలంటే జపాన్, ఎలక్ట్రానిక్ వస్తువులంటే యూరప్ వంటి ప్రఖ్యాతి ఉండేది. ఆ తర్వాతి దశాబ్దాలలో ఈ ప్రత్యేకతలు మారాయి గాని అది వేరే కథ. జాతీయోద్యమ విలువల ప్రభావం వల్ల పారిశ్రామిక ఉత్పత్తులలో భారతదేశం ఇలా ఏదైనా ఒక నాణ్యమైన ప్రత్యేక సరుకు ఇక్కడ మాత్రమే తయారవుతుందని చూపి ఎగుమతి చేయగలుగుతుందా, విదేశీ సరుకుల దిగుమతులు చేసుకోకుండా ఉండగలుగుతుందా, కనీసం తగ్గించగలుగుతుందా అని ఆలోచనలు వచ్చాయి.

కాని 1947 తర్వాత అమలయిన విధానాలలో పాలకులు ఆ ఆలోచనలను పెదాల మీద ప్రకటిస్తూనే, వాస్తవంలో మాత్రం తమ దళారీ స్వభావాన్ని కొనసాగించారు. దిగుమతుల ప్రత్యామ్నాయ పరిశ్రమలు స్థాపిస్తామని, ప్రోత్సహిస్తామని చెపుతూనే అనేక సాకులతో

దిగుమతులను కొనసాగించారు. స్వదేశీ మార్కెట్‌ను కూడ పక్కనపెట్టి ఎగుమతుల కోసం వెంపరలాడారు. విదేశీ మార్కెట్లకు తగిన పారిశ్రామిక ఉత్పత్తులను తయారుచేసే సామర్థ్యం లేకపోవడంతో, ఆ సామర్థ్యాన్ని సాధించకుండా బహుళజాతి సంస్థలు అడ్డుకోవడంతో భారత ఆర్థికవ్యవస్థ కేవలం వ్యవసాయోత్పత్తులను, ప్రాథమిక సహజవనరులను ఎగుమతి చేయడం ప్రారంభించింది. ఆ రోజుల్లోనే ఎగుమతి కోసం ఉద్దేశించి మేడ్ ఇన్ ఇండియా అనే మాట తయారు చేశారు గాని అది పారిశ్రామిక ఉత్పత్తులకు వర్తించలేదు. అప్పుడు విదేశాల నుంచి సగం తయారీ వస్తువులను దిగుమతి చేసుకుని వాటికి మెరుగులు పెట్టి మేడ్ ఇన్ ఇండియా అని ముద్ర కొట్టడం ప్రారంభించారు. అవి రూపంలో మాత్రమే మేడ్ ఇన్ ఇండియా కాని సారంలో కావు. అలా కొన్ని సరుకుల మీద మేడ్ ఇన్ ఇండియా అని రాసుకున్నప్పటికీ అవి ఎక్కువగా ఎగుమతి అయినదీ లేదు, వాటి వల్ల విదేశీ మారకద్రవ్యం ఎక్కువగా వచ్చినదీలేదు.

ఈ స్థితిలో రాజీవ్ గాంధీ 1985లో దిగుమతుల సరళీకరణ విధానం ప్రారంభించి అప్పటిదాకా ఆంక్షలు ఉండిన సరుకుల దిగుమతికి తలుపులు బార్లా తెరిచాడు. దానితో మేడ్ ఇన్ ఇండియా అనగలిగిన వస్తువులను కూడ విదేశాల నుంచి దిగుమతి చేసుకోవడం మొదలై అసలు ఆ మాటకు అర్థమే పోయింది. అయితే ఈలోగా ప్రపంచ వ్యాప్తంగానే జరిగిన ఒక పరిణామం వల్ల భారతదేశంలో పారిశ్రామిక సరుకుల ఉత్పత్తి పెరిగింది గాని అది దేశ ఆర్థిక వ్యవస్థకు, ఉద్యోగ కల్పనకు, మొత్తంగా సమాజానికి, ప్రజాచైతన్యానికి ఉపయోగకరమైన పద్ధతిలో జరగలేదు. ఒక సరుకును మొత్తంగా ఒక దేశంలో తయారు చేయడం కంటే, ఆ సరుకును భాగాలుగా విడదీసి ఎక్కడ ఏ భాగం తయారు చేయడం చవక అయితే అక్కడ తయారు చేసి, ఆ భాగాలన్నిటినీ మరొక దేశంలో ఒక్కచోట బిగించే పారిశ్రామిక ఉత్పత్తి విధానం ప్రపంచవ్యాప్తంగానే మొదలయింది. అందువల్ల బిగించే దేశం పేరు ఆ సరుకు మీద ఉన్నప్పటికీ అనేక దేశాల దళారీ, భాగస్వామ్య, ఔట్ సోర్సింగ్, కాంట్రాక్ట్ మాన్యుఫాక్చరింగ్ కంపెనీలు అందులో భాగం కావడం మొదలయింది.

ఆ తర్వాతి దశాబ్దంలో దిగుమతుల సరళీకరణ, నూతన ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ విధానాల్లో భాగంగా ఎగుమతే అభివృద్ధికి చోదకశక్తి అనీ, ఎగుమతి ప్రధాన ఆర్థిక వ్యవస్థను నిర్మించడం ద్వారానే దేశం అభివృద్ధి సాధిస్తుందనీ కొత్త నినాదాలు వచ్చాయి. కాని, ముడిసరుకులలో తప్ప దేశపు ప్రత్యేకత మరి దేనిలోనూ లేకపోవడం వల్ల, ఇక్కడి ప్రధాన పారిశ్రామిక ఉత్పత్తులన్నీ విదేశీ సాంకేతిక నైపుణ్యంతో, విదేశీ భాగస్వామ్యంతో, విదేశీ పెట్టుబడితో సాగుతుండడం వల్ల ఎగుమతి ప్రధాన ఆర్థిక వ్యవస్థ కూడ నినాదంగానే మిగిలిపోయింది గాని ఎగుమతులు పెరగనూ లేదు, పెరిగినా అంతకన్న ఎక్కువ దిగుమతులు పెరిగాయి.

ఈ చారిత్రక నేపథ్యంలో, ప్రపంచీకరణను మరింత దూకుడుగా అమలు చేయదలచిన నరేంద్రమోడీ చాల స్పష్టంగా విదేశీ పెట్టుబడిదారులను, బహుళజాతి సంస్థలను 'భారతదేశానికి వచ్చి మీ సరుకులు తయారు చేసుకోండి' అని పిలుస్తున్నాడు. వాళ్లు నేరుగా వచ్చి ఇక్కడ తమ చేతులు మురికి చేసుకోరు గనుక, వారు అటు కేవలం పెట్టుబడి ద్వారా, స్టాక్ మార్కెట్ మదుపు ద్వారా రావచ్చు. లేదా, స్థానికంగా ఉత్పత్తి సాగించదలచుకున్నా, అందుకు దేశీయ, స్థానిక పెట్టుబడిదారుల మద్దతు తీసుకుంటారు. అంటే ఈ నినాదం దేశంలో దళారీ పెట్టుబడిదారీ, వ్యాపార వర్గాలకు మేలు చేసే నినాదమే తప్ప ఆర్థిక వ్యవస్థ దిశను మార్చగలిగేది కాదు. స్వతంత్ర పెట్టుబడిదారీ ఉత్పత్తిని విస్తరించి, తద్వారా సామాజిక సంబంధాలను మార్చి దేశ ప్రజలకు మేలు చేసే నినాదం కాదు. ఈ మేక్ ఇన్ ఇండియా పాత జీహుజూర్ జోహుకుం విధానాలలో భాగమే.

మేడ్ ఇన్ ఇండియా అయినా, మేక్ ఇన్ ఇండియా అయినా భారత ప్రజల ప్రయోజనాలను తీర్చగలిగిన నినాదాలు, విధానాలు కావు. భారతదేశపు వనరులను భారత ప్రజల అవసరాల కోసం వాడడం, ఆ వనరులను ఉపయోగించి భారత ప్రజల అవసరాలు తీర్చే సరుకులు ఉత్పత్తి చేయడం, ఆ ఉత్పత్తి రంగంలో విస్తృతంగా ఉద్యోగాలు కల్పించి తద్వారా అటు దేశీయ నిరుద్యోగాన్ని రూపుమాపడం, ఇటు దేశీయ మార్కెట్ ను పెంపొందించడం ఇవాళ జరగవలసిన పనులు. దేశీయ మార్కెట్ అవసరాలకన్న ఎక్కువ, మిగులు ఉత్పత్తి చేయగలిగితే, వాటిని ఎగుమతి చేయడానికి అంతర్జాతీయ వాణిజ్యంలోకి దిగి, దేశానికి అవసరమైన వస్తువుల దిగుమతికి తగిన విదేశీ మారక ద్రవ్యాన్ని సంపాదించుకోవచ్చు. భారత పెట్టుబడిదారీ వర్గం నిజమైన స్వతంత్ర, జాతీయ పెట్టుబడిదారీ వర్గమే అయి ఉంటే, వ్యాపారం ద్వారా, మారుబేరం ద్వారా, దళారీతనం ద్వారా లాభాలు సంపాదించాలనే ఆలోచన కాక, స్వతంత్ర పారిశ్రామిక ఉత్పత్తి ద్వారా, దేశీయ మార్కెట్ ను సృష్టించి తన అదుపులో పెట్టుకోవాలనే కోరిక కలిగినదై ఉంటే ఈ దిశగా ఆలోచించి ఉండేది. పూర్తిగా అటువంటి దేశీయ పెట్టుబడిదారీ ఆలోచనతో కాకపోయినా, కనీసం అర్థశాస్త్ర చరిత్ర తెలిసినవాడిగా రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా గవర్నర్ మేడ్ ఇన్ ఇండియా, మేక్ ఇన్ ఇండియా బదులు మేక్ ఫర్ ఇండియా కావాలని అన్నాడు. అంటే దేశీయ మార్కెట్ (హోం మార్కెట్) పెంపొందించడం మీద దృష్టి పెట్టడం అవసరమన్నాడు. కాని ఆయన ఆ మాట అన్న వెంటనే భారత బడా పెట్టుబడిదారీ వర్గ ప్రతినిధులూ, సంస్థలూ, వారి ప్రచారసాధనాలూ ఆయన మీద విరుచుకుపడ్డాయి. హోం మార్కెట్ ను తామే అభివృద్ధి చేస్తామని, దానికి రక్షణలు కల్పించాలని ప్రభుత్వాలను కోరిన, నిర్దేశించిన, శాసించిన యూరపియన్ స్వతంత్ర జాతీయ పెట్టుబడిదారీ విధానం నుంచి చాల దూరం వచ్చామన్నమాట. అసలు ఆ మాటే గిట్టని దళారీ పెట్టుబడిదారీ శక్తుల దగ్గరికి చేరామన్నమాట. వెన్నెముక లేని, జాతీయభావం లేని ఈ దళారీ బడా పెట్టుబడిదారులు బహుళజాతి సంస్థలకు జూనియర్ పార్ట్ నర్లు (చిన్నవాటా భాగస్వాములు) గా ఉండడం కన్న ఎక్కువ కోరుకోవడం లేదు. తాము స్వతంత్ర పరిశోధన చేయకుండా, బహుళ జాతి సంస్థల పేటెంట్స్‌ను, ఇంటలెక్చువల్ ప్రాపర్టీని అంగీకరిస్తూ, వాళ్లకు రాయల్టీలు, టెక్నికల్ ఫీ చెల్లిస్తూ, టర్న్ కీ సాంకేతిక విధానాలు, టెక్నికల్ నో హౌ తీసుకుంటూ మేడ్ ఇన్ ఇండియా, మేక్ ఇన్ ఇండియా ఉత్పత్తులు సాగించి, సిద్ధంగా ఉన్న మార్కెట్లలో అమ్ముకుని, లాభాలు పంచుకోవడం కన్న మరొక ఆలోచన లేదు. ఇదీ ఈ దేశపు పెట్టుబడిదారీ విధానం. వీ

# మూఢనమ్మకాల్లో పోటీ పడుతున్న ప్రభుత్వాలు

***రాజ్యాంగ బద్ధంగా పాలించాల్సిన పాలకులు ప్రజల్ని వాస్తు పేరుతో మూఢ విశ్వాసాల్లో ఉంచి, అందినవరకు దోచుకోజూస్తున్నారని, వారి పట్ల ప్రజలు జాగరూకతతో ఉండాలని అంటున్నారు టి. రమేష్***

పాలకుల మూఢనమ్మకాలు ప్రజలను మరింత మూఢ నమ్మకాల ఊబిలోకి నెట్టివేస్తాయి. అదే పాలకులు కోరుకునేది. కౌటిల్యుని అర్థశాస్త్రంలో రాజు మూఢనమ్మకాలను ప్రజల్లో నుండి తొలగకుండా చూసుకోవాలని చెపుతాడు. సైన్య బలంతో కంటే మూఢ నమ్మకాల్లో ప్రజలు ఉంటే వారిని అణచిఉంచడం తేలికని చెపుతాడు. వర్ణ ధర్మాలను కాపాడడం రాజు ప్రథమ విధి. అందులో ప్రథమ తాంబూలంగా రాజు పొద్దున్నే లేచి బ్రహ్మణుల్ని కొలవాలట. పురోహితుడి సలహాతోనే రాజు రాజ్యం పాలించాలని ఐతరేయ బ్రహ్మణం చెపుతున్నది. పురోహితుడే రాజుకు ఆత్మ అని కూడా ఐతరేయం చెపుతున్నది.

మన రెండు తెలుగు రాష్ట్రాల అధినేతలైన చంద్రుళ్లు దీనిని బలంగా పాటిస్తున్నారు. రాజ్యాంగ స్ఫూర్తిని కాపాడుతామని చేసిన ప్రమాణాలను తుంగలోదొక్కి మూఢనమ్మకాలను పెంచి పోషించడంలో పోటీలు పడుతున్నారు. రాజ్యాంగంలోని ఆర్టికల్ 51ఎ (హెచ్) శాస్త్రీయ దృక్పథాన్ని, శాస్త్రీయ పరిశీలనా స్ఫూర్తిని, మానవత్వాన్ని, సంస్కరణ అభిలాషను పెంపొందించడం పౌరుల ప్రాథమిక బాధ్యతని చెప్పింది. సరిగా పాలకులు దీనిని పట్టించుకోకుండా అశాస్త్రీయ బావజాలాన్ని ప్రోత్సహించడమే తమ తక్షణ కర్తవ్యంగా వ్యవహరిస్తున్నారు. చంద్రబాబు ఒక బాబాను వెంటేసుకుని ఐఎఎస్, ఐపిఎస్‌లను యోగాలు చేయిస్తున్నాడు. తాత్కాలికంగా ఉండే క్యాంపు ఆఫీసును కూడా వాస్తు ప్రకారం మార్పులు చేసుకున్నాడు.

ఇక తెలంగాణ ముఖ్యమంత్రి చంద్రశేఖర్‌రావు నేనేమీ తక్కువ తిన్నానా? నీవు ఒకటి చేస్తే నేను రెండు చేయలేనా అని పోటీలు పడుతున్నాడు. వైఎస్ రాజశేఖరరెడ్డి కోట్లు గుమ్మరించి కట్టించిన క్యాంపు కార్యాలయం వాస్తు ప్రకారం సరిగా లేదని అక్కడక్కడ క్వార్టర్స్‌ను చూసి వాటిని వాస్తు సిద్ధాంతులు చెప్పిన ప్రకారం మార్పులు చేయించారు. మరలా అక్కడ కాదని పాత క్యాంపు ఆఫీసులోనే రెండు భవనాలు కాకుండా ఒకటి వాడుకుంటే బాగుంటుందన్న వాస్తు పండితుల సలహా మేరకు అందులోకి మారారు. మరలా ఇప్పుడు అది సరిగా లేదని ఐఎఎస్‌ల క్లబ్‌లో కొత్త భవనం కట్టాలని చూస్తున్నారట! అన్నింటికన్నా విచిత్రం ఏమిటంటే ప్రస్తుత సచివాలయం వాస్తు బాగాలేదట! అందుకే రాష్ట్రానికి ఇన్ని కష్టాలట! వాస్తు మారితే కష్టాలు తీరుతాయా? రాష్ట్రం దేదీప్యంగ అభివృద్ధి పథంలో దూసుకు పోతుందా?

అసలు వాస్తుశాస్త్రం మార్పులు సరైనవేనా? వాస్తు ఏమీ చెపుతుందో ఒక పరిశీలన చేద్దాం.

ఏ ఇద్దరు వాస్తు పండితులు వాస్తు ఫలితాలను ఒకే విధంగా చెప్పరు. ఒక్కొక్క వాస్తు పండితులు ఒక్కో విధంగా రాయడం వలన అనేక వాస్తు శాస్త్రాలు ఉన్నాయి. ఉదాహరణకు వరాహమిహిర, భృగు, మనుసార, మయమత మొదలైనవారు. వీరిలో ప్రతి ఒక్కరికి వారి దిక్పాలకులు వేరుగా ఉన్నారు. ఒక్కొక్కరికి తమ తమ స్వంత వ్యాఖ్యానాలు ఉన్నాయి. వారి కాలమాన పరిస్థితులను బట్టి నాటి స్థానిక పరిస్థితులు, వాతావరణం, సామాజిక ధర్మాలు, వస్తువుల ఆధారంగా వారి వ్యాఖ్యానాలు ఉన్నాయి.

కొన్ని వాస్తు సూత్రాల ప్రకారం దక్షిణానికి ఇంటి ముఖం ఉండ కూడదు. అలా ఉంటే ఇక్కట్లు తప్పవు. మరి కమర్షియల్ కాంప్లెక్స్‌లు ఒక్కసారి చూడండి. అందులో సగం దక్షిణ ముఖానికే ఉంటాయి. మరి వారంతా కష్టాలపాలవుతున్నారా? అంతెందుకు ప్రపంచాన్నే శాసిస్తున్న అమెరికా సామ్రాజ్యధినేత నివసించే వైట్‌హౌస్ ద్వారం దక్షిణానికే ఉంది. మరి అక్కడ ఈ వాస్తు ఏమయ్యింది?

సమతలంగా ఉన్న భూమి మీదనే ఇళ్లు కట్టాలి. గుట్టలపైన ఇండ్లు కడితే ఆయుక్షీణం, ధన నష్టమని కొన్ని వాస్తు సిద్ధాంతాలు చెపుతున్నాయి. మరి ఉభయతెలుగు రాష్ట్రాల్లోని అత్యధిక సంపన్నులు నివసించేది బంజారా హిల్స్, జూబ్లీహిల్స్ గుట్టల్లోనే కదా!

పశ్చిమాన నీళ్లు నిలువ ఉంటే దురదృష్టమని వాస్తు శాస్త్రాలు చెపుతున్నాయి. మరి దేశ ఆర్థిక రాజధానిగా భాసిల్లే ముంబాయి నగరానికి పశ్చిమాన అరేబియా సముద్రం ఉంది. దేశ వాణిజ్యంలో పాతిక శాతం కంటే ఎక్కువగా ఈ ముంబాయిలోనే జరుగుతుంది కదా! పాతిక శాతం ప్రభుత్వాదాయం ఈ నగరం నుండే వస్తుంది. ఇదేనా దురదృష్టమంటే?

ఒక వాస్తుశాస్త్రం తూర్పుకు ప్రవహించే నదులు సంపదను కలిగిస్తాయని చెపుతుంది. మరి సంపన్న రాష్ట్రాలుగా ఉన్న పంజాబ్, కేరళ, మహారాష్ట్ర, గుజరాత్‌లలో నదులు తూర్పుకు ప్రవహించవు కదా!

ఒకప్పటి ముఖ్యమంత్రి ఎన్‌టి రామారావుకి వాస్తు పండితులు ఉత్తరం నుండి 10 మీటర్ల దారి ఉండాలని, సెక్రటేరియట్‌కు ఉత్తరాన ఉన్న బస్తీలు వాస్తు విరుద్ధంగా ఉన్నాయని, వాటిని తొలగించాలని సలహా ఇచ్చారు. ఆ ప్రకారం ఆయన మార్పులు చేయించాడు. శాంతినగరంలోని ఇళ్లను కూల్చివేశారు. ఉత్తరంలో ప్రవేశద్వారం పెట్టారు. కాని తరువాత కొద్దికాంలోనే ఆయన ముఖ్యమంత్రి పదవి ఊడింది. ఏడు నెలల తరువాత ప్రాణాలే కోల్పోయారు.

ఆ తరువాత చంద్రబాబు హయాంలో వాస్తు పండితులు చెప్పినట్లు సెక్రటేరియట్‌లో మార్పులు చేయించారు. జ్యోతిబసు రికార్డును బద్దలు

కొట్టేలా అత్యధిక కాలం ముఖ్యమంత్రిగా ఉంటానని కలలు కన్నాడు. కాని వాస్తు మార్పులు చేసిన కొద్ది రోజులకే వచ్చిన ఎన్నికల్లో ఆయన పార్టీ ఓడిపోయింది. ఆ తరువాత వచ్చిన వైఎస్ఆర్ తన బ్లాక్ ఎదురుగా మీడియా కోసం ఒక భవనాన్ని నిర్మించగా ఆయన మరణానంతరం అధికారంలోకి వచ్చిన రోశయ్యకి అది వాస్తు విరుద్ధమని వాస్తు పండితులు చెప్పారు. మరి ఎలా ఆ భవనాన్ని అక్కడ నుండి మార్చలేం కదా అంటే దాని చుట్టూ కందకాలు తవ్వి అందులో మోటార్లుపెట్టి పంకాలు తిప్పాలని ఆ పండితులు సలహా ఇచ్చారు. ఆయన ఆ విధంగానే మార్పులు చేశారు. కొద్ది రోజులకే ఆయన ముఖ్యమంత్రి పదవి పోయింది.

ఈ విధంగా ఎవరు అధికారంలో ఉన్నా వాస్తు పండితుల సలహా మేరకు సచివాలయంలో మార్పులు చేస్తూనే ఉన్నారు. అయినా ఫలితం ఉండడం లేదు. అందుకేనేమో చంద్రశేఖర్‌రావు వాస్తు పండితులు అసలు సెక్రటేరియట్ మొత్తానికే వాస్తు సరిగా లేదు. దానిని మార్చాలని చెప్పారు. భారతదేశంలో వాస్తు ప్రకారం ఉన్న సచివాలయం ఏదో ఏ వాస్తు పండితుడైనా చెప్పగలరా? ఆ రాష్ట్రంలో ఏ సమస్యలు లేవా? అసలు ఏ సమస్యలు లేని కుటుంబం కాని, ప్రాంతంకాని, రాష్ట్రం కాని, దేశం కాని చూపెట్టగలరా? అక్కడ ఏ వాస్తు ప్రకారం కట్టారో చెప్పగలరా?

ఇక వాస్తు ఎంత వాస్తవమో పరిశీలిద్దాం.

*ఏవం సమ్యగ్గ విధృత్వాసర్వదిక్షుప్రదక్షిణం*
*ఇంద్రాంతకాప్పతీందుభ్యః సామగేభ్యోబలింహరేత్*

హోమం చేసి, దిక్కుల్లో ప్రదక్షిణం చేసి, దిక్పాలకులకు వారి పరివారానికి బలిహరణ వేయాలి. ఆయా దిక్పాలకులను సంతృప్తులను చేయాలి.

ఒక్కో దిక్కుకు ఒక్కొక్క దేవుడు దిక్పాలకులుగా ఉంటారట. ఉత్తరానికి సంపదల ప్రభువు కుబేరుడు(ఆర్థికం), దక్షిణానికి చావుల రేడు యముడు (విధ్వంసం), తూర్పు సూర్య దేవుడు ఆదిత్య (ప్రపంచ వీక్షణం), పశ్చిమ నీటి దేవుడు వరుణ (భౌతికపరమైన), ఈశాన్య శివుడు, ఆగ్నేయం అగ్నిదేవుడు అగ్ని(శక్తి సృష్టి), వాయవ్యం గాలి దేవుడు వాయువు (ప్రచారం), నైరుతి పితృ దేవతలు (చరిత్ర), కేంద్రంలో బ్రహ్మ (కోరిక).

ఇక్కడే ఇంకో విషయాన్ని కూడా పరిశీలించాలి. భూమి ఆకారం, పరిమాణం, చలనం ఎలా ఉన్నాయి? వాటి ఆధారంగా దిక్కులను ఎలా చూడాలి?

*ఉచ్ఛీర్షకేశ్రియై కుర్యాద్భద్ర కాళ్యైచపాదితః*
*బ్రహ్మ వాస్తోష్పతిభ్యాంతు వాస్తుమధ్యేబలిం హరేత్*

వాస్తు పురుషుడి తల, కాళ్లు నడమ భాగాల్లో 'వాస్తోష్పతియే' అని మంత్రం చదివి బలి ఇవ్వాలి. ఈ వాస్తు పురుషుడు తల కాళ్లను బట్టి మన ఇంటి వాస్తు తయారు చేస్తారట. దిక్పాలకులను, వాస్తుపురుషుడిని సంతృప్తి పరచడానికి మన పాలకులు మరి పైన చెప్పిన విధంగా బలులు కూడా ఇస్తారా?

ఇక దిక్కులు, దిక్పాలకుల గురించి చూస్తే గుండ్రంగా ఉండే భూమికి దిక్కులు ఎలా ఉంటాయి? వాటికి పాలకులు ఎలా ఉంటారు? ప్రదేశాలను గుర్తించడానికి మనం ఏర్పాటు చేసుకున్న సూచికలే దిక్కులు కాని. అవి మన జీవితాలను ఎలా ప్రభావితం చేస్తాయి? ఒకవేళ ప్రభావితం చేస్తాయని అనుకున్నా భూమి తన చుట్టు తాను గంటకు 1670 కిలో మీటర్ల వేగంతో తిరుగుతున్నది. ఇంతే కాకుండా సూర్యుని చుట్టు గంటకు 1,08,000 కిలో మీటర్ల వేగంతో తిరుగుతున్నది. ఇంత వేగంతో తిరిగే భూమికి దిక్కులు ఎప్పుడూ ఒకే విధంగా ఉంటాయా? భూమి ఏమన్నా మనం ప్రపంచ పటంలో చూసినట్లు నలుచదరంగా ఉంటుందా? గుండ్రంగా ఉండే భూమికి దిక్కులు ఎలా ఉంటాయి? ఒక బంతిని పట్టుకుని చూడండి. దిక్కులు ఉంటాయా? ఏ దిక్కు ఎటు ఉంటుందో తెలుస్తుందా? దానిని గిర్రునతిప్పండి. ఇప్పుడు దిక్కులు ఎలా ఉంటాయో చూడండి. మరి అంత వేగంతో తిరిగే భూమికి దిక్కులు ఏమిటి? దిక్పాలకులు ఏమిటి? వాస్తు పురుషుడు పడుకోవడం ఏమిటి? ఆయన తల, నడుం, కాళ్లు ఉన్న ప్రదేశాన్ని బట్టి వాస్తు ఫలితాలను చెప్పడమేమిటీ? ఇదంతా అసంబద్ధం. మరి అసంబద్ధమైన, అశాస్త్రీయ అంశాలకు ప్రజాధనాన్ని దుర్వినియోగం చేయడం ఏవిధంగా సమంజసం?

మరి పాలకులు ఎందుకు అలా ప్రవర్తిస్తున్నారు. అందులో వాళ్లకున్న ప్రయోజనమేమిటీ అందరం ఆలోచించాలి. ఎర్రగడ్డ ఛాతీ ఆసుపత్రిలోకి వాస్తులేని సచివాలయాన్ని మారుస్తామని చెప్పారు. అందుకోసం కోటి మంది జనాభాకు అందుబాటులో ఉండే ఛాతీవ్యాధుల ఆసుపత్రిని ఎవరు లేని మారుమూలకు తరలిస్తారట! ఇప్పుడు ఇంకో వాదన మొదలైంది. ఛాతి వ్యాధుల ఆసుపత్రికి వాస్తు సరిగా లేదని మరి ఆసుపత్రిని అక్కడ నుండి ఎత్తివేసి ఇక్కడ సచివాలయం కడతారా లేదా? ముఖ్యమంత్రి ఇంకో మాట అన్నారు. సచివాలయం ఇక్కడ కట్టినా కట్టకపోయినా ఛాతి వ్యాధుల ఆసుపత్రి మార్చడం ఖాయమని. అంటే దీనిని రియల్ ఎస్టేట్‌కు వాడుతారా? మరి 100 శాతం వాస్తు ప్రకారం సరిగా ఉన్న భూమిని ఏ వాస్తు పండితుడు చూపిస్తాడో? అప్పుడు రాష్ట్ర సమస్యలు వాటంతటవే ఆటోమేటిక్‌గా పరిష్కారమవుతాయా? లేక సమస్యల నుండి ప్రజల దృష్టిని మరల్చడానికి, వాటి గురించి ప్రజలు ఆలోచించకుండా చేయడానికి పాలకులు ఆడుతున్న నాటకమా? అనేది త్వరలో తేలుతుంది. కాని ప్రజల గురించి ఆలోచించే వాళ్లు ప్రజలకు మాత్రం ఒక్క విషయాన్ని స్పష్టంగా చెప్పాలి. పాలకులను చూసి తొడకోసు కోకండి. వాస్తు పేరుతో ఇండ్లను కూలగొట్టుకుని నష్టపోకండి.

*(రచయిత ప్రధాన కార్యదర్శి, జనవిజ్ఞాన వేదిక తెలంగాణ)* వీ

***రచయితలకు సూచన :*** *తక్షణ, సమకాలీన అంశాలపై రచనలు చేసి ఆ సంచికలోనే రావాలనుకొనే రచయితలు 20వ తేదీ లోగా పంపగలిగితేనే మరుసటి నెల సంచిక కోసం పరిశీలించడం సాధ్యమవుతుంది. ఆ తరువాత వచ్చిన రచన, అంశం ఎంత ముఖ్యమైనదైనా పరిశీలించడం, ముద్రణకు సిద్ధం చేయడం అసాధ్యమవుతుంది. రచయితలు గుర్తించగలరు. - సం.*

మరొక పత్రికకు పంపిన, మరొక పత్రిక పరిశీలనలో ఉన్న, మరొక పత్రిక ప్రచురణకు ఆమోదించిన రచనను వీక్షణంకు పంపగూడదు. - సం.

# తెలంగాణ విద్యార్థి సభలపై ప్రభుత్వ నిర్బంధం

*తెలంగాణ రాష్ట్రంలో ప్రభుత్వం ఒక విద్యార్థి సంఘం సభలు జరుపుకోనియ్యకుండా, నిఘా నేత్రంతో నిరంకుశంగా భావ ప్రకటన స్వేచ్ఛను కాలరాసిందని అంటున్నారు* **ఎస్. చంద్రయ్య**

'చరిత్ర పునరావృతమవుతుంది'. ఈ చరిత్ర పునరావృతం కావడం అనేది ద్విముఖాలుగా సాగే ప్రక్రియ. ఒకటి సమకాలీన సమాజాన్ని పురోగామి దిశగా నడిపించేది కాగా, రెండోది తిరోగమనం వైపు నడిపించేదిగా ఉంటుంది. నిజానికి మానవ చరిత్రంతా ఈ రెండింటి సంఘర్షణ ఫలితమే. ఇందులో మొదటిది పునరావృతం కావడం ఆహ్వానించదగిందే. రెండోది పునరావృతం కావడం దగ్గరే సమస్య మొదలవుతుంది. నేటికాలంలో కొత్త హక్కులను సాధించుకోవడం మాట పక్కకు పెడితే ఎంతోకాలం పోరాడి సాధించుకున్న హక్కులను నిలుపుకోడమే క్లిష్టంగా ఉంది. సరిగ్గా అట్లాంటి విచిత్రకరమైన స్థితి ఒకటి నేడు తెలంగాణలో కనిపిస్తున్నది. సమైక్యాంధ్రలో ఏ ప్రజాస్వామిక హక్కులు కాలరాయబడుతున్నాయని ఉద్యమించి సాధించుకున్నామో, తెలంగాణలో నెలకొనడం విచారకరమే కాదు ఘర్హనీయం కూడా.

పాలకులు ఎవరైనా వారి విధానాలు ఎప్పుడూ ప్రజలను దోచుకునే విధంగానే ఉంటాయనేది చరిత్ర చెపుతున్న సత్యం. దోపిడీ విధానాల రూపాలలోని తేడాలే తప్ప సారంలో అవన్నీ ఒకే తాను ముక్కలే. సరిగ్గా ముప్పయేళ్ల క్రితం 'తెలుగు వారి ఆత్మగౌరవ పరిరక్షణ' అనే ఎజెండాతో రాజకీయ పార్టీని స్థాపించి, అధికారంలోకి వచ్చిన నందమూరి తారక రామారావుకీ, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం అనే ఎజెండాతో అధికారంలోకి వచ్చిన కల్వకుంట్ల చంద్రశేఖర రావు (కెసిఆర్) కీ పెద్ద తేడేమి లేదు. అయితే ఎన్.టి. ఆర్ ఎజెండాతో తెలంగాణ ప్రాంత ప్రజలకు ఏకీభావం లేదు. కానీ కె.సి.ఆర్ ఎజెండాతో తెలంగాణ ప్రజల బలమైన మద్దతు ఉంది. 'నక్సలైట్లే అసలైన దేశభక్తులు' అని ఎన్నికలకు ముందు ఎన్టిఆర్ ప్రకటించగా, మావోయిస్టుల ఎజెండా యే మా ఎజెండా' అని అదే ఎన్నికలకు ముందు కె.సి.ఆర్ ప్రకటించడం విశేషం. అధికారంలోకి వచ్చిన తర్వాత ఎన్టిఆర్. ఏ విధంగానైతే 'ఆట, పాట, మాట బంద్' అంటూ నిర్బందాన్ని అమలు చేశాడో, ఎన్టిఆర్. కంటె రెండు ఆకులు ఎక్కువగా చదివానన్నట్టుగా కెసిఆర్ ప్రభుత్వం నిర్బందకాండను కొనసాగిస్తున్నది. పోలికతో చెప్పాలంటే ఎన్టిఆర్ పాలనలో తొండ రూపంలో ఉన్న ఈ నిర్బంధం కెసిఆర్ పాలనలో ముదిరి ఊసరవిల్లి అయింది. పాలన మొదలైన ఏడు నెలల్లోనే ప్రజల హక్కులు కాలరాసిన సందర్భాలు ఎన్నో.

పైన ప్రస్తావించినట్టు తెలంగాణలో, కొత్త హక్కులను సాధించుకోవడం పక్కకు పెడితే రాజ్యాంగంలో పొందుపరిచిన 'వాక్, సభా స్వాతంత్ర్యాల' రక్షణ కోసం పోరాటం చేయాల్సిన దుస్థితి నెలకొంది. తెలంగాణ ప్రజాఫ్రంట్ రాజకీయ తరగతులను అడ్డుకోవడంతో మొదలైన ఈ ప్రజాస్వామిక హక్కుల హరణం 'రాజకీయ ప్రత్యామ్నాయ వేదిక' సభలను, విప్లవ రచయిత వరవరరావు ఇంటి వద్ద ధర్నా, 'తెలంగాణ విద్యార్థి వేదిక' 4వ మహాసభలను అడ్డుకోవడం దాకా సాగుతూనే ఉంది. నిజానికి ఈ నిర్బంధాన్ని ప్రత్యక్షంగా ఎదుర్కొంటున్న ప్రజా సంఘాలూ, కె.సి.ఆర్, టి.ఆర్.ఎస్ శ్రేణులు తెలంగాణ కోసం కలిసి పోరాడినవారే. ఆ ఉద్యమంలో అడ్డురాని భావజాలం, 'మావోయిస్టుల ఎజెండా మా ఎజెండా' అని చెప్పినప్పుడు లేని సైద్ధాంతిక విభేదం, అధికారంలోకి రాగానే ఎందుకు ఏర్పడిందో ప్రజాస్వామికవాదులైన వారికి విడిగా చెప్పాల్సిన అవసరంలేదు. ఎన్టిఆర్ ఏ విధంగానైతే ప్రతిపక్షాన్ని లేకుండా చేయాలని ప్రయత్నించాడో సరిగ్గా అదే విధంగా కెసిఆర్ ప్రభుత్వం రచయితలపై, ప్రజాసంఘాలపై, విద్యార్థులపై నిర్బంధాన్ని అమలుచేస్తున్నది.

కెసిఆర్ ప్రభుత్వం ఈ నిర్బంధాన్ని చాలా జాగ్రత్తగా అమలు చేస్తున్నది. సాధారణంగా ప్రభుత్వాలు తమకు వ్యతిరేకంగా ప్రతిపక్ష పాత్రను పోషిస్తారని భావించిన వారందరినీ వివిధ ప్రలోభాలకు గురిచేసి మచ్చిక చేసుకోవడం పరిపాటి. కెసిఆర్ ఈ విధానాన్ని ఆవలంబించడం లో గత ప్రభుత్వాలకంటే నాలుగు ఆకులు ఎక్కువే చదివాడనిపిస్తుంది. కె.సి.ఆర్ తెలంగాణలో తనకు వ్యతిరేకమైన స్వరాన్ని వినిపించడానికి అవకాశమున్న ప్రతి ఒక్కరిని గుర్తించి, వారిని ఏదో ఒక విధంగా ప్రభుత్వంలో భాగం చేసుకోవడం అనే ప్రక్రియను అత్యంత వేగంగా చేస్తున్నాడు. ఈ ప్రక్రియలో ఆయన ముఖ్యంగా 1. తెలంగాణ మేధావులను ప్రభుత్వ పథకాల అమలు కార్యక్రమంలో ప్రత్యక్ష భాగస్వాములను చేయడం. 2. రచయితలను, ఇతర కళాకారులను వివిధ ప్రలోభాలకు గురిచేసి మచ్చికచేసుకోవడం. 3. వివిధ యూనివర్సిటీలలోని ముఖ్యంగా ఉస్మానియా విశ్వవిద్యాలయ విద్యార్థి నాయకులను వివిధ పదవుల పేరుతో లోబరుచుకోవడం అనే మూడు పద్ధతులను ఆవలంబిస్తున్నాడు. వీరిచేత ప్రభుత్వ వ్యతిరేకతను సాధ్యమైనంత మేరకు తగ్గించడం, అసలు ప్రశ్నించే స్వరాన్నే లేకుండా చేసున్నాడు. అంతేకాక ప్రభుత్వాలు అభివృద్ధిని కాంక్షించే భావజాలాలపై నిత్యం వ్యతిరేకమైన వ్యాఖ్యలను చేయించడం కొత్తకాకపోయినా అది కె.సి.ఆర్ పాలనలో పెచ్చుమీరింది. మేధావులు, అభ్యుదయ రచయితలుగా పేరు మోసిన వారి చేత 'ఇది మన ప్రభుత్వం, మన పాలన' అంటూ ప్రభుత్వ అనుకూల వ్యాఖ్యలను, రికార్డింగ్ మోతల్లా నిరంతరం వినిపించడం అనే పనిని చాలా చాకచక్యంగా అమలు చేస్తున్నాడు. తత్ఫలితంగా మేధావుల నుంచి తన చర్యలకు

తాత్కాలికంగానైనా ఆమోదాన్ని పొందే ప్రయత్నం చేస్తున్నారు. తమిళ రచయిత మురుగన్‌కు మద్దతుగా ఎన్నో వ్యాసాలను, సభలను నిర్వహించిన బుద్ధిజీవులు తెలంగాణలో రచయితలపై, విద్యార్థులపై, ప్రజాసంఘాలపై జరుగుతోన్న నిర్బంధాన్ని ప్రశ్నించడానికి ముందుకు రాకపోవడం కెసిఆర్ పథకంలో భాగమే.

ఈ సంఘాలనే కాదు తనకు వ్యతిరేకమైన మీడియాను కూడా నిర్మూలించే పనిలో ఉన్నది. తెలంగాణ సచివాలయంలోకి కూడా మీడియాను రానివ్వకుండా ఆంక్షలు విధించే ప్రయత్నం చేయగా, తీవ్రమైన వ్యతిరేకత రావడంతో, తాత్కాలికంగా వెనక్కు తగ్గింది. ఇంతకూ ప్రత్యమ్నాయ రాజకీయాలను బోధిస్తున్న ప్రజా, రచయితల సంఘాలతో పాటు తెలంగాణ విద్యార్థి వేదిక (టివివి) మహాసభలను కె.సి.ఆర్ ప్రభుత్వం ఎందుకు అడ్డుకుంటుందనేది తెలంగాణ ఉద్యమంలో టివివి కృషిని తెలుసుకుంటేగానీ అర్థం చేసుకోలేం. 'ఉద్యమాల ద్వారానే తెలంగాణ సాధ్యమవుతది, భౌగోళిక తెలంగాణ కాకుండా ప్రజాస్వామిక తెలంగాణ సాధించాలంటె నిరంతర పోరాటం చేయాల్సిందే, వేరే మార్గాలు లేవు' అనే నినాదాలతో తెలంగాణ విద్యార్థి వేదిక (టి.వి.వి) 2006 నుంచి తెలంగాణ ఉద్యమంలో ఎంతో క్రియాశీలక పాత్రను పోషించింది. ముఖ్యంగా 2009 తెలంగాణ ఉద్యమానికి సైద్ధాంతిక భూమికను అందించింది. తెలంగాణ విద్యార్థి నాయకులు వివిధ ప్రలోభాలకు లొంగినపుడు వారిని సరైన మార్గంలో నడిపించిన చరిత్ర తెలంగాణ విద్యార్థి వేదికకు ఉన్నది. ఒకానొక సందర్భంలో ఏర్పడిన ఉద్యమ స్తబ్ధతను ఛేదిస్తూ ఒక ప్రత్యామ్నాయ రాజకీయ ఆలోచనలను కలిగిన విద్యార్థి సంఘాలను కూడగట్టి తెలంగాణ విద్యార్థి ఐక్యకార్యాచరణ కమిటీని ఏర్పరచి దానికి నాయకత్వ బాధ్యతను నిర్వహించింది. ఉద్యమంలో ధర్నాలు, నిరాహార దీక్షలు మొదలైన ఉద్యమ రూపాలవల్ల తెలంగాణ సాకారం కాదని ఆచరణ ద్వారా గుణపాఠం నేర్చుకున్న టివివి ఉద్యమంలో 'మిలిటెన్సీకి' ఎక్కువ ప్రాధాన్యాన్నిచ్చింది. అటువైపుగానే తన ఉద్యమ కార్యాచరణను రూపొందించుకొని తన నాయకత్వంలోని జాక్‌ను సమాయత్తం చేసింది. దీనిలో భాగంగానే తీసుకున్న కార్యక్రమం అసెంబ్లీ ముట్టడి. దీన్ని విజయవంతం చేయడంలో క్రియాశీలక పాత్రను పోషించింది. విద్యార్థి వేదికకు చెందిన నలుగురు అమ్మాయిలు నాలుగంచెలుగా ఉన్న పోలీసుల, పారామిలిటరీ బలగాలను ఛేదించుకొని అసెంబ్లీలోకి ప్రవేశించారు. అప్పట్లో 'ఆ నలుగురు' పేరుతో వివిధ పత్రికల్లో వ్యాసాలు, వార్తా కథనాలు కూడా ప్రచురితమయ్యాయి. ఆ ముట్టడిలో అరెస్టై, జైలుకెళ్లిన 13 మంది విద్యార్థి వేదిక సభ్యులపై పెట్టిన కేసులను ఈ టి.ఆర్.ఎస్. ప్రభుత్వం ఇప్పటికీ కొట్టివేయలేదు. పాలకుల ద్వంద్వనీతికి ఇది ఒక తార్కాణం. తెలంగాణ రాష్ట్రం మాత్రమే తెలంగాణ ప్రజలను విముక్తి చేయలేదని ఒక విశాలమైన ప్రాపంచిక దృక్పథాన్ని కలిగిన విద్యార్థి వేదిక ప్రజాహితమైన అనేక ఇతర కార్యక్రమాలను భావజాల సారూప్యత కలిగిన సంఘాలను కలుపుకొని చేపట్టింది. ఇటీవల జరిగిన 'విద్యా పరిరక్షణ కమిటీ పోరాట యాత్ర' చేపట్టిన దేశవ్యాప్త ఉద్యమంలో కూడా చాలా క్రియాశీలకమైన భూమికనే పోషించింది. విద్యార్థి లోకం నుంచి ప్రత్యామ్నాయ రాజకీయాలను వినిపిస్తుంది కనుకనే ఈనాడు టి.ఆర్.ఎస్. ప్రభుత్వం విద్యార్థి వేదికను మాట్లాడనీయకుండా చేసే అణచివేతను కొనసాగిస్తోంది. ఉద్యమ కాలంలో అణచివేసే అవకాశం లేక ఏమీ చేయలేదు. కనుక ఇప్పుడు ప్రభుత్వమే టి.ఆర్.ఎస్. ది కనుక ఏం చేసినా చెల్లుబాటు అవుతుందనే నియంతృత్వ ధోరణిని ప్రదర్శిస్తున్నది. ఈ నియంతృత్వ ధోరణికి వెంటనే వత్తాసు పలకడం కోసం ప్రజల చుట్టూ ఒక మేధావి కోటరీని ఏర్పరిచింది.

విద్యార్థి, ప్రజాహితమైన వైఖరిని కలిగి ఉన్నందునే ఈనాడు విద్యార్థి వేదిక ఏ కార్యక్రమం, ఆఖరుకు జిల్లాస్థాయి శాఖలు చేసిన కార్యక్రమాలను సహితం అడ్డుకుంటున్న స్థితి తెలంగాణ ప్రభుత్వం అనుసరిస్తోన్నది. అందులో భాగంగానే 2015 జనవరి 29, 30 తేదీలలో నల్గొండ జిల్లాలో జరిపిన టివివి నాలుగొవ రాష్ట్ర మహాసభలను పోలీసులు అడ్డుకోవడం. కేవలం పాలకుల మార్పుతో కూడిన ఒక రకంగా అధికార మార్పిడితో కూడిన తెలంగాణ వస్తే తెలంగాణ ప్రజలకు ఒనగూరేదేమీ లేదని టివివి నమ్మినా, కనీసం భావప్రకటనా స్వేచ్ఛకు ఎటువంటి ఆటంకం ఉండదని టివివితో పాటు అనేక ప్రజాసంఘాలు నమ్మాయి. ప్రచారం చేశాయి. ప్రభుత్వం టివివిపై అనుసరిస్తోన్న నిర్బంధపు నాటకీయ పరిణామంలో ప్రత్యక్ష సాక్షిగా ఉన్న ఈ నిర్బంధాన్ని వ్యతిరేకిస్తూ రాసిన వ్యాసంలో ప్రొ.హరగోపాల్ 'తెలంగాణలో ఇంత త్వరితగతిన, ఇంత స్థాయిలో ప్రాథమిక హక్కుల కాలరాత జరుగతదని ఊహించలేదు' అని విచారం వ్యక్తం చేశారు.

టి.వి.వి రాష్ట్ర మహాసభల ఆ రెండు రోజుల సందర్భంలో పోలీసులు అనుసరించిన విధానాన్ని చెప్పడానికి ఈ వ్యాసం చాలదు. ఒక పుస్తకమే రాయాల్సి ఉంటుంది. సభలను అడ్డుకోడానికి ఎన్నో ఎత్తులు, సాకులు ఆ జిల్లా బాధ్యులను వ్యక్తిగతంగా బెదిరించడాలతో మొదలుకొని సభలకు హాలును అద్దెకు ఇచ్చిన ఆ హాలు యజమానిని భయానికి గురిచేసేంత వరకూ ఆగకుండా ఆ సభాప్రాంగణానికి తాళాలు వేయడం వరకూ ఎన్నో నాటకీయ పరిణామాలు. వివిధ ప్రజాసంఘాల, ప్రజాస్వామిక వాదుల ఒత్తిడులకు తలొగ్గిన ప్రభుత్వం చివరకు ఈ కింది నిబంధనలకు ఒప్పుకొంటేనే సభలకు అవకాశం ఇస్తామని ప్రకటించింది. అందులో ముఖ్యమైనవి మాత్రమే ఇక్కడ పేర్కొనడమైంది. '1. మీ సభా ప్రాంగణం లో ప్రతీ అంగుళాన్ని వీడియోతో చిత్రీకరిస్తాం. 2. మీరు తలపెట్టిన ర్యాలీని రద్దు చేసుకోవాలి. 3. ఈ సభలో ప్రసంగించే వక్తల వ్యక్తిగత వివరాలను మాకు అందించాలి. 4. సభా ప్రాంగణంలో పోలీసుల నిఘా ఉంటుంది. 5. నిర్వాహక సంఘ రాష్ట్ర, జిల్లా నాయకుల వివరాలను అందించాలి.'

పోలీసులు నియమించిన వీడియో గ్రాఫర్ మరీ అత్యుత్సాహం చేశాడు. ప్రతీ విద్యార్థి ముఖం దగ్గరకు వెళ్లి మరీ వీడియో తీసుకోవడం వల్ల కొత్తగా వచ్చిన ఇంటర్, డిగ్రీ విద్యార్థులు బెంబేలెత్తిపోయారు. ముందు చూస్తే వీడియో గ్రాఫర్ అత్యుత్సాహం, వెనక చూస్తే వ్యాన్‌తో సిద్ధంగా ఉన్న పోలీసులు విద్యార్థులు, విద్యార్థి వేదిక కార్యకర్తలు తీవ్రమైన అయోమయానికి, అసహనానికి గురయ్యారు. బహిరంగ సభానంతరం జరిగే ప్రతినిధుల సభలో కూడా పోలీసులు వచ్చి కూర్చొని, ఎంత చెప్పినా వెళ్లలేదు. ఇది ఎంతవరకు పోయిందంటే టివివి నూతన కమిటీని ఏర్పాటు చేసుకోవడానికి సమావేశమైన హాలులోకి కూడా పోలీసులు ప్రవేశించేదాకా పోయింది. ప్రభుత్వస్థాయిలో ఏ ప్రకటన

# రాజయ్య తొలగింపు నిజానిజాలేమిటి?

***ఉప ముఖ్యమంత్రి తొలగింపుకు అధికారిక వివరణ లేని స్థితిలో సాగుతున్న ఊహాగానాలను పేర్కొంటూ అవి సుపరిపాలనకు సూచికలుగా లేవని అంటున్నారు* ఎడ్ల పోచయ్య**

తెలంగాణ ఉప ముఖ్యమంత్రి డా. టి రాజయ్యను ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర రావు జనవరి 25న మంత్రివర్గం నుంచి తొలగించారు. అంతకు కొద్ది రోజుల ముందు నుంచే స్వైన్ ఫ్లూ వ్యాధి ప్రబలుతుండగా అరికట్టడంలో వైద్య, ఆరోగ్య శాఖ విఫలమవుతున్నదనే వార్తలు పత్రికల్లో వెలువడ్డాయి. రాజయ్యను తొలగించడానికి ఒకటి రెండు రోజుల ముందు నేషనల్ హెల్త్ మిషన్ ముఖ్య పాలనాధికారిని, ఆరోగ్య శాఖ కార్యదర్శిని, వైద్య ఆరోగ్య విశ్వవిద్యాలయ రిజిస్ట్రార్‌ను కూడ పదవుల నుంచి తొలగించారు. అప్పటికి రాష్ట్రంలో విస్తృతంగా ఉన్న స్వైన్‌ఫ్లూ వ్యాధిని అరికట్టడంలో ఆరోగ్య మంత్రిగా రాజయ్య బాధ్యతారహితంగా ప్రవర్తించడం, రాజయ్య మంత్రిత్వశాఖలో పెద్ద ఎత్తున అవినీతి ఆరోపణలు రావడం ఇందుకు కారణాలని ప్రచారసాధనాలలో వార్తలు, ఊహాగానాలు వచ్చాయి. ఈ రెండు ఆరోపణలూ పత్రికల్లో, టివి ఛానళ్లలో విపరీతంగా ప్రచారం అయినప్పటికీ ప్రభుత్వం వాటిని ఖండించనూ లేదు. ఉప ముఖ్యమంత్రి తొలగింపుకు కారణమేమిటో అధికారికంగా చెప్పనూ లేదు. తన మీద వచ్చిన ఆరోపణలు అబద్ధమని, ఎటువంటి విచారణకైనా సిద్ధమని, పత్రికల్లో వచ్చిన ఆరోపణలను ముఖ్యమంత్రి తనతో ప్రస్తావించలేదని ప్రకటించిన రాజయ్య, తొలగింపు తర్వాత కూడ తెలంగాణ రాష్ట్ర సమితిలోనే కొనసాగుతున్నారు.

మంత్రివర్గంలోకి ఎవరిని తీసుకోవాలో, ఎవరిని తొలగించాలో నిర్ణయించుకునే అధికారం రాజ్యాంగబద్ధంగా పూర్తిగా ముఖ్యమంత్రికే ఉంటుంది. ఎవరిని ఎందుకు తీసుకున్నారో, ఎవరిని ఎందుకు తొలగించారో బైటికి చెప్పవలసిన అవసరమేమీ లేదు. కాని ఆ పదవులన్నీ బహిరంగ ప్రజాజీవితానికి, గురుతరమైన పాలనా బాధ్యతా నిర్వహణకు సంబంధించినవి. మంత్రివర్గం ముఖ్యమంత్రి నియమించుకున్న మంత్రివర్గమే అయినప్పటికీ అది ప్రజా పాలనకు నిర్దేశించినది. కనుక ఏ ప్రజలను పాలించడానికి ఆ పదవులున్నాయో ఆ ప్రజలకు కారణాలు చెప్పే పారదర్శకత పాటించడం మంచిది. ఇవి ప్రభుత్వ పదవులు గనుక బైటికి చెప్పలేని వ్యక్తిగత కారణాలు ఉన్నాయనుకోవడానికి కూడ వీలు లేదు. మరీ ముఖ్యంగా అవినీతి ఆరోపణలు వచ్చినప్పుడు తప్పనిసరిగా ఆ అవినీతి ఎలా ఎక్కడ జరిగిందో, ఆ తొలగింపు వల్ల ఆ అవినీతి ఎట్లా ఆగిపోతుందో చెప్పడం స్వచ్ఛమైన ప్రజా పాలనను అందించడానికి అవసరం. కాని ఆ తొలగింపు జరిగి నెల కావస్తున్నా ఇప్పటికీ అధికారిక వివరణ ఏదీ లేదు. పైగా రాజయ్యను తొలగించిన వెంటనే ఆ స్థానంలో ఆయనకు ప్రత్యర్థిగా పేరుపొందిన, ఆయన గతంలో కాంగ్రెస్ అభ్యర్థిగా పోటీ చేసినప్పుడు తెలుగుదేశం అభ్యర్థిగా ఓడిపోయిన కడియం శ్రీహరిని మంత్రివర్గంలోకి తీసుకున్నారు.

రాజయ్యను ఎందుకు తొలగించవలసిందో చెప్పాలని సమాచార హక్కు చట్టం కింద దాఖలయిన అభ్యర్థనను ఆశ్చర్యకరంగా ముఖ్యమంత్రి కార్యాలయం అది తన పరిధిలోకి రాదంటూ, వైద్య, ఆరోగ్య శాఖకు బదిలీ చేసింది.

ఎప్పుడైనా అధికారికమైన వివరణ లేనప్పుడు వదంతులకూ, ఊహాగానాలకూ ప్రాధాన్యత వస్తుంది. ఆ వదంతులూ ఊహాగానాలూ స్వప్రయోజనపరులు ప్రచారం చేయదలచుకున్నవి కూడ కావచ్చు. ప్రభుత్వ వ్యతిరేకులు కూడ ఆ ప్రచారంలో భాగం కావచ్చు. కాని ఆ ఊహాగానాలు నమ్మదగినవనీ, లేదా కనీసం వాటిలో సగమైనా నిజం ఉండి ఉంటుందనీ ప్రతిఒక్కరూ అనుకుంటారు. అలాగే ఈ సందర్భంలో కూడ కనీసం నాలుగైదు వదంతులు, ఊహాగానాలు పత్రికలలోను, సోషల్ మీడియాలోను ప్రచారమయ్యాయి. వాటిలో నిజం ఉన్నదో లేదో ఎవరూ చెప్పలేని స్థితి ఉంది. ప్రభుత్వం మీద, ముఖ్యమంత్రి మీద, తెలంగాణ రాష్ట్ర సమితి మీద, రాజయ్య మీద, ఆయన దళిత అస్తిత్వం మీద తమకు ఉన్న అభిప్రాయాన్ని బట్టి ఎవరికి అనుకూలమైన వదంతిని వారు నమ్ముతారు.

ఆ వదంతులలో ఒకటి రాజయ్య మీద వేసిన వేటు నిజానికి రాజయ్యను మాత్రమే ఉద్దేశించినది కాదనీ, అది కొందరు మంత్రులకు హెచ్చరికగా తీసుకున్న చర్య అనీ. కె చంద్రశేఖర రావు ముఖ్యమంత్రిగా ఏ ఒక్క మంత్రికీ స్వాతంత్ర్యం ఇవ్వడం లేదనీ, ఏకవ్యక్తి పాలన

వచ్చినా దానికి వంతపాడే మేధావులు ఏ ఒక్క సభ మీద కానీ, కనీసం వ్యాస రూపకంగా కానీ ఖండించలేదు. నిజానికి నేడు తెలంగాణలో అమలవుతోన్నది – ఓ నిర్బంధకాండ. ఇటువంటి నిర్బంధకాండలు ఎన్నింటినో ఎదుర్కొన్న తెలంగాణ ప్రజలు మరింత చైతన్యమవుతారే తప్ప మడమ తిప్పరనే సత్యాన్ని చరిత్ర నిరూపిస్తున్నది. తెలంగాణ విద్యార్థి వేదిక ఇటువంటి తాటకు చప్పుళ్లకు భయపడే సంఘం కాదనే విషయాన్ని అనేక నిర్బంధ సందర్భాలలో రుజువు చేసింది. పోరాటాలకు విద్యార్థులు, ప్రజలు ఎప్పుడూ సిద్ధంగానే ఉంటారు. మరింత సమరశీలత ను ప్రదర్శిస్తారు. ప్రజలు, వారి పోరాటాలు, వారి విజయాలు చరిత్రలో అగ్రభాగాన నిలిచాయి తప్ప నాయకత్వ విద్రోహాలు ఎప్పుడూ అధః పాతాలానికే పోయాయి. ప్రజలే చరిత్ర నిర్మాతలు.

*(రచయిత పరిశోధక విద్యార్థి, సెంట్రల్ యూనివర్సిటీ, హైదరాబాద్)* వీ

నడుస్తున్నదనీ, ప్రతి నిర్ణయమూ ముఖ్యమంత్రి దగ్గరే జరుగుతున్నదనీ, ప్రతి ఫైలూ సంబంధిత మంత్రి దగ్గరి కన్న ఎక్కువగా ముఖ్యమంత్రి దగ్గరికే వెళుతున్నదనీ వదంతులున్నాయి. ఈ స్థితి వల్ల మంత్రులలో అసంతృప్తి ప్రబలుతున్నదనీ, ఈ అసంతృప్తివాదులు నీటిపారుదల శాఖ మంత్రి టి హరీష్ రావుకు దగ్గరవుతున్నారనీ, ఆయన దగ్గర తమ గోడు వెళ్లబోసుకుంటున్నారనీ, అలాగే రాజయ్య కూడ హరీష్ రావుకు దగ్గరయ్యారనే అనుమానమే పస్తుత చర్యకు కారణమనీ అంటున్నారు. అంటే రాజయ్య మీద తీసుకున్న చర్య హరీష్ రావుకు బెదిరింపు లాంటిదని అంటున్నారు. ముఖ్యమంత్రి మంత్రులను నామమాత్రంగా మార్చేశారనడానికి గత శాసనసభ సమావేశాలు, ఈ ఎనిమిది-తొమ్మిది నెలలలో మంత్రుల బహిరంగ ఆచరణ నిదర్శనంగా ఉన్నాయి.

సరిగ్గా దీనికి భిన్నంగా, రాజయ్య తాను నామమాత్రపు మంత్రిని కాదని చూపుకోవడానికి ప్రయత్నించినందువల్ల ఈ తొలగింపు జరిగిందని మరొక వదంతి ఉంది. రాజయ్య ఉపముఖ్యమంత్రిగా, దళిత శాసనసభ్యుడిగా తనకు అదనపు అధికారాలు ఉన్నట్టుగా భావించి, అలా ప్రవర్తించారని, తన శాఖ ఫైళ్లను ముఖ్యమంత్రి దగ్గరికి పంపక పోవడం, తనంతట తానే జిల్లాలు, ఆస్పత్రులు పర్యటించడం, మీడియాలో ఎక్కువ కనబడడం వంటి పనులు చేశారని, అవన్నీ ముఖ్యమంత్రి కన్నెర్రకు కారణమయ్యాయని ఆ ఊహాగానం. మంత్రివర్గం ఏర్పడిన నాలుగు నెలలకే రాజయ్య అటువంటి స్వతంత్ర ప్రవర్తన చూపి ముఖ్యమంత్రి చేత బహిరంగసభ వేదిక మీద చివాట్లు తిన్నారు. ఆరోగ్య విశ్వవిద్యాలయాన్ని వరంగల్‌లో ఏర్పాటు చేస్తామని సెప్టెంబర్‌లో రాజయ్య ప్రకటించినప్పుడు 'ఒళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు' అని ముఖ్యమంత్రి బహిరంగంగానే అన్నారు.

ఈ రెండు ఊహాగానాలలో ఏది నిజమైనా తెరాస ప్రభుత్వం అప్రజాస్వామికంగా నడుస్తున్నదనడానికీ, మంత్రులకు స్వతంత్ర ప్రతిపత్తి లేదనడానికీ, మంత్రివర్గంలో ముఠాలు ఏర్పడుతున్నాయనడానికీ సూచన. ఈ సూచనలలో ఏ మాత్రం నిజం ఉన్నా అది ప్రభుత్వానికీ ప్రజలకూ కూడ మంచిది కాదు.

ఈ ఊహాగానాలను మించినవి రాజయ్య మీద, ఆరోగ్య మంత్రిత్వ శాఖలోని సీనియర్ అధికారుల మీద వచ్చిన ఆర్థిక ఆరోపణలు. స్వైన్‌ఫ్లూ అరికట్టడానికి అవసరమైన మందులు, వాక్సిన్లు కొనడంలో అలసత్వం వల్లనో, అవినీతి వల్లనో, కాలం చెల్లిన మందులను కొన్నారని ఒక ఆరోపణ వినవస్తున్నది. అలాగే నేషనల్ హెల్త్ మిషన్ నిధులతో ఆరోగ్య శాఖకు అవసరమైన 104, 108 వాహనాలను కొనుగోలు చేసే విషయంలో రాజయ్య అవినీతికి పాల్పడ్డారని ఈ కథనం చెపుతున్నది. మొత్తంగా 290 వాహనాలు కొనడానికి బేరం కుదుర్చు కున్నారని, ఒక్కొక్క అంబులెన్సుకు రు. 16-17 లక్షలు చెల్లించడానికి, అందులో ఒక లక్ష రూపాయలు ముడుపుగా ఇవ్వాలని ఫోర్స్ అనే వ్యాపార సంస్థతో ఒప్పందం కుదిరిందని ఒక పత్రిక రాసింది. అలాగే డాక్టర్లు, నర్సులు, పారామెడికల్ సిబ్బందిని నియమించడానికి ఒక ఔట్ సోర్సింగ్ సంస్థతో ముడుపుల ప్రాతిపదికపైనే ఒప్పందం కుదుర్చుకున్నారని కూడ ఆ పత్రిక రాసింది. వీటిలో నిజానిజాలు ఎవరూ చెప్పలేరు గాని ప్రభుత్వ లావాదేవీలలో ఇటువంటి అక్రమాలు, అవినీతి సర్వసాధారణమే గనుక ప్రస్తుత సందర్భంలో అక్రమం జరిగినా జరగకపోయినా జరిగిందని నమ్మడానికే అవకాశం ఉంది.

విధి నిర్వహణకు, ఆర్థిక లావాదేవీలకు సంబంధించిన ఈ ఆరోపణలకన్న అన్యాయమైన నైతిక ఆరోపణలు కొన్ని కూడ ప్రచారంలో ఉన్నాయి. వాటి నిజానిజాలు కూడ తెలియవు.

అసలు ఈ ఆరోపణలన్నీ అవాస్తవాలు కావచ్చునని, కేవలం ముఖ్యమంత్రి తన ప్రతిష్ఠను పెంచుకోవడానికి, తాను మచ్చ లేని మనిషినని చూపుకోవడానికి రాజయ్యను బలిపశువుగా మార్చారని అంటున్నవాళ్లూ ఉన్నారు. గతంలో ఎన్ టి రామారావు కూడ ముఖ్యమంత్రిగా ఒక మంత్రివర్గ సహచరుడి మీద ఇటువంటి చర్య తీసుకుని తన ప్రతిష్ఠ పెంచుకున్న ఉదంతాన్ని వాళ్లు గుర్తుచేస్తున్నారు. ఒకవేళ ఎంతో కొంత నిజం ఉన్నా, ఇటువంటివీ, ఇంతకన్న మించినవీ ఆరోపణలు ఎదుర్కొంటున్న, నిజంగానే అవినీతిపరులైనవారు మంత్రివర్గంలో లేరా, ఒక దళిత నాయకుడి మీదనే ఈ చర్య ఎందుకు తీసుకోవలసి వచ్చిందని కొందరు ప్రశ్నిస్తున్నారు. ఇలా తాను దళిత కార్డు ఉపయోగించగలననే ధైర్యంతోనే రాజయ్య అక్రమాలకు పాల్పడ్డారని అనేవాళ్లు కూడ ఉన్నారు.

విస్తృత ప్రజా ఉద్యమ ఫలితంగా ఏర్పడిన రాష్ట్రంలో, ఆ ఉద్యమానికి నాయకత్వం వహించిన పార్టీ ప్రభుత్వంలో ఇటువంటి సమస్య తలెత్తడం, ఆ సమస్యను పారదర్శకంగా ప్రజల ముందు ఉంచకపోవడం ఆదర్శ వంతమైన రాజకీయాలకూ, సుపరిపాలనకూ నిదర్శనం అయితే కాదు. వీ

*(రచయిత పాత్రికేయులు)*

రాబోయే సంచికలలో...

- భారత రాజ్యాంగంలోని ఆర్టికల్ 25 ఏం చెబుతుంది - ఎ. రాజేంద్రబాబు
- రాజ్యాంగ రీత్యా మానవాభివృద్ధి అంటే ఏమిటి? - విద్యాభూషణ్
- ఆదివాసుల జీవితాలను చీకటి మయం చేస్తున్న బాక్సైట్ - కొర్ర జ్యోతి
- జర్మనీతో శాంతి సంధి కోసం లెనిన్ చేసిన పోరాటం - ఎన్.వి.ఎస్. నాగభూషణ్
- కార్పొరేట్‌లకు అనుకూలమైన సుబ్రమణియన్ కమిటీ సిఫారసులు - పి.వి. రమణ
- నరహంతకులే నేతలై దిగాలుపడుతున్న దేశం - డా. నూకతోటి రవికుమార్

# ప్రజల హక్కులను కాపాడని సిఆర్‌డిఏ

***స్వదేశీ, విదేశీ పెట్టుబడులను ఆకర్షించడానికి వేలాది ఎకరాల పంట భూములను రాజధాని పేరుతో ఆక్రమించి, వేలాది రైతుల జీవనోపాధిని దెబ్బ తీసి, వారిని కూలీలు చేయడమే ప్రభుత్వ లక్ష్యమని అంటున్నారు* చిమ్మె జాన్ బర్నబాస్**

విజయవాడ – గుంటూరు – తెనాలి – మంగళగిరి అర్బన్ డెవలప్‌మెంట్ అథారిటీ (విజిటిఎం) ని రద్దుచేసి, మరింత విస్తృత పరిధి 'రాజధాని ప్రాంత ప్రాధికార సంస్థ' (సిఆర్‌డిఏ) ను ఏర్పాటు చేశారు. దీనికి ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు అధ్యక్షుడిగా ప్రకటించుకున్నారు. శ్రీకాంత్ (ఐపిఎస్) ను కమిషనర్, కార్యదర్శిగా, మంత్రులు ప్రత్తిపాటి పుల్లారావు, నారాయణలను సభ్యులుగా నియమించారు. రాజధాని నిర్మాణానికి అన్ని మండలాలకు చెందిన గ్రామాల భూములను ప్రభుత్వం సేకరించవలసిన అవసరం ఉన్నదా? లక్ష ఎకరాల భూమి ఎందుకోసం? కేవలం వందల ఎకరాలలోనే రాజధానికి చెందిన అన్ని ప్రభుత్వ కార్యాలయాలను, సచివాలయం, అసెంబ్లీ, రాజభవన్‌లను నిర్మించుకోలేమా? దీని వెనుక ఉన్న అధికార పార్టీ నాయకుల ఆంతర్యం ఏమిటి? దూరాలోచన – దురాలోచన ఏమిటనేది ప్రజాస్వామిక వాదులుగా మనం ఆలోచించాలి? సద్బుద్ధితో ప్రజలను నడిపించాలి.

ముఖ్యమంత్రి చెపుతున్న సిఆర్‌డిఏ పరిధిలోని గ్రామాలలోనే ప్రభుత్వ భూమి వేల ఎకరాలలో ఉన్నమాట వాస్తవం. ఏమాత్రం సాగులో లేకుండా కూడా దేవాదాయ, ధర్మాదాయ భూమి కూడా ఉన్నది. తన పరిధిలోని అంశాన్ని పక్కనపెట్టి, ముఖ్యమంత్రి రైతుల నుంచి భూమిని సేకరించాలనే నిర్ణయాన్ని తీసుకోవడం కేవలం కార్పొరేట్ శక్తులకు, సామ్రాజ్యవాద ప్రపంచీకరణలో భాగంగా, విదేశీ పెట్టుబడులను ఆకర్షిస్తూ, తద్వారా, విదేశీ పాలకవర్గ, బడా పారిశ్రామిక వర్గాల మెప్పును పొందడానికేనన్నది సుస్పష్టం.

గుంటూరు – కృష్ణా జిల్లాల పరిధిలోని అనేక గ్రామాల పరిధిలోని రెవెన్యూ భూములన్నింటిని ఈ సిఆర్‌డిఏ పరిధిలోనికి తీసుకుని రావడం విచారించాల్సిన విషయం. ప్రభుత్వం దృష్టి ప్రపంచంలోనే పేరెన్నికన్న రాజధానిని నిర్మించాలనే సంకల్పం ఉన్నదని చెప్పుకుంటున్నది. కానీ ఆధునిక ప్రజాస్వామిక వ్యవస్థలో రాజధాని అర్థం భవన నిర్మాణాలూ – ఆకాశ హర్మ్యాలు కాదు – ప్రభుత్వ పాలనా విధానం – పరిపాలన సౌలభ్యం – ప్రజలకు అందుబాటులో ప్రభుత్వ ఉన్నతాధికారులూ – అవినీతి రహిత పాలన – ధనార్జన ధ్యేయం నిర్మూలించడం – రాజధాని రూపురేఖలు పాలన విధానంలో ఉంటుంది కానీ, పెద్ద – పెద్ద భవనాలలో ఉండదు. ప్రజలు కనీస అవసరాల కోసం – వృద్ధులు – వితంతువులు పింఛన్‌ల కోసం రోడ్డెక్కిన పరిస్థితి పోవాలి.

సిఆర్‌డిఏ పరిధిలోని గ్రామాలలో ఈ రోజు యుద్ధ వాతావరణం నెలకొన్నది. అరటి తోటలూ, పచ్చని పైర్లూ (మొక్కజొన్న, నిమ్మ, ద్రాక్ష తోటలు మొదలైనవి) కూడా అంటిస్తున్నారు. ఎవరు చేశారన్నది అప్రస్తుతం. ఎవరు చేసినప్పటికీ అది తప్పే అవుతుంది. ఆ పరిస్థితి కల్పించింది ఎవరు? పాలక పార్టీ అయిన తెలుగుదేశం నాయకులే దీనికి బాధ్యత వహించాలి. ప్రజల మధ్య వైషమ్యం కూడా పెంచిపోషించబడుతున్నది. సమస్య కేవలం భూమి ఇవ్వడమో లేదా భూమిని కొనడమో కాదు. సెంటు భూమి కూడా లేకుండా, కేవలం ఏరోజు కష్టంతో ఆరోజు పనిచేసి బతికే కుటుంబాల పరిస్థితి ఏమిటి? వారు ఆ గ్రామాలను వదిలి తట్టా – బుట్టా సర్దుకుని వేరొక నగరంలో స్థిరపడాలంటే ఎంత కష్టం. తాను నమ్ముకున్న ప్రాంతాన్ని వదిలిపెట్టి, మరో ప్రాంతంలో స్థిరపడడం, పిల్లల చదువులూ, వారి పెంపకం, అంతే కాకుండా జీవనోపాధి అన్నీ విచారకరమైన పరిస్థితే. రాజధాని పేరు మీద సామాన్యుని హక్కులను ప్రభుత్వం పూర్తిగా హరించివేస్తున్నది. ఒక సగటు పౌరుని జీవన పరిస్థితి దృష్ట్యా ఈ ప్రభుత్వం ఆలోచించడం లేదు. ఇది ప్రజలలో ఆందోళననూ, హింసనూ రేకెత్తించే ప్రమాదం ఉన్నది. మళ్లీ ఆ ఆందోళననూ, ప్రజా వెల్లువనూ నిరోధించడానికి, ప్రభుత్వం, పోలీసుల చేత హింసను ప్రయోగించే ప్రమాదం ఉన్నది. ఆ ప్రమాదాన్ని నివారించాల్సిన బాధ్యత సామాన్య పౌరులుగా మనందరి మీద ఉన్నది.

సామాన్య పౌరుని హక్కులను కాపాడవలసిన ప్రభుత్వం – పరోక్షంగా తన విధానాల ఫలితంగా, పౌరుల హక్కులను కాలరాస్తున్నది. రాజ్యాంగ హక్కులను హరించివేస్తున్నది. అవసరానికి మించి భూసేకరణ ద్వారా ప్రజలలో భయందోళనలు పెరిగాయి. రియల్ ఎస్టేట్ వ్యాపారులు తమ ధన దాహంతో లక్షలు విలువ చేసే భూమిని కోట్ల రూపాయలకు పెంచేసి, రెవెన్యూ అధికారులనూ, రిజిస్ట్రేషన్ శాఖను అవినీతిమయం చేసి, ప్రజలు తమకు తాము తముగా భూమిని అమ్ముకొని, మరో ప్రాంతంలో భూమిని కొనుగోలు చేయాలనే దురాశ – దురాలోచనకు లోనయ్యే విధంగా, తమ కుటుంబాలను మరో ప్రాంతానికి తరలిపోవాలనే సంకల్పానికి వచ్చే విధంగా, ఈ వ్యాపార వర్గాలు – శక్తులూ ప్రయత్నం చేస్తున్నవి.

రాజధాని నిర్మాణం పేరుమీద చంద్రబాబునాయుడు, అతని మంత్రి వర్గంలోని ముఖ్యులూ, వారి పార్టీకి చెందిన వ్యాపార వేత్తలూ, ధనవంతులూ మొత్తం ఆ ప్రాంతాన్ని ఏదో ఒక విధంగా తమగుప్పెట్లో పెట్టుకోవాలని భావిస్తున్నారు. అనగా టౌన్ ప్లానింగ్ పేరుమీద, నిబంధనల ప్రకారం 40 శాతం భూమి డెవలప్‌మెంట్‌కు తీసివేయాలి. మిగిలిన 60 శాతంలో 30 శాతం డెవలప్ చేసిన వారికి అనగా కార్పొరేట్ సంస్థలకూ, విదేశీ వ్యాపార సామ్రాజ్యానికి కట్టబెట్టడమే.

# రెండు తెలుగు రాష్ట్రాలకూ 'వాస్తుదోషం'

***ఇరు రాష్ట్రాల ముఖ్యమంత్రులూ వాస్తు గ్రహణం పట్టుకొని తెలుగు ప్రజల ఆశయాలను మరుగున పడేస్తున్నారనీ, ఈ మూఢనమ్మకాల వల్ల సమాజం అట్టడుగున పడిపోయిందనీ అంటున్నారు*** **వై.ఎచ్.కె. మోహన్‌రావు**

వైజ్ఞానికంగా ప్రపంచం గ్రహ పరిశోధనలో విజయ పరంపర చేపడుతూ దూసుకుపోతుంటే రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు గ్రహ బలాల శోధనలో నిట్టనిలువునా మునిగి పోయారు. రాజ్యాంగ బద్ధం కావలసిన పాలకులు వాస్తు నేస్తంగా మారారు. చట్టాలకు అనుగుణంగా సాగవలసిన పాలన మూఢ విశ్వాసాల చుట్టూ పరిభ్రమిస్తుంది. ఇరు రాష్ట్రాల ముఖ్యమంత్రులు వాస్తు, జాతకాల అనుసారం అడుగులు వేస్తున్నారు. సిద్ధాంతులు, జ్యోతిష్కుల సలహాల మేరకే పాలన సాగిస్తామనే మొండి తనంతో ఉన్నారు. తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖర్‌రావు వాస్తు, జాతకంతో పాటు యజ్ఞ, యాగాదులను కూడా సమతుల్యం చేయగా, అవశేష ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు వాస్తు, జాతక చక్రంతో సర్దుకుంటున్నట్లు కనిపిస్తుంది. నవగ్రహ గమానాలను ఆకళింపు చేసుకోవడంలోనూ, జాతక ఫలితాలను విశ్వసించడంలోనూ ఇరు రాష్ట్రాల ముఖ్యమంత్రుల మధ్య సారూప్యత కనిపిస్తుంది. అనేక ప్రజా సమస్యల పరిష్కారంలో విభజన ధర్మాలను గాలికి వదిలి ఎడమొహం పెడమొహంగా ఉంటూ కాలుదువ్వుకుంటున్న ఇరువురు సిఎంలు మూఢ విశ్వాసాలను కౌగిలించుకోవడానికి ఏకంగా ప్రయాణిస్తున్నారు. ఈ నేపథ్యంలో వారి మూఢ విశ్వాసాల మొండికత్తి ఎవరి నెత్తినపడి బతుకు రెండు ముక్కలవుతోందోనని రెండు రాష్ట్రాల ప్రజలు తీవ్ర ఆందోళనతో భయ కంపితులవుతున్నారు.

ఈ ఎనిమిది నెలల కాలంలో వాస్తుదోష పరిహారానికి రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు, సచివులు తమతమ నివాస భవనాలకు, కార్యాలయాలకు చేపట్టిన సవరణ కట్టుబడులకు ఒక ఆఫ్ ద రికార్డు అంచనా ప్రకారం ఖర్చు చేసిన ప్రజాధనం 173 కోట్లట. ఇరువురు ముఖ్యమంత్రులు కూడా తాము పదవీ స్వీకారానంతరం ప్రవేశిద్దామనుకున్న క్యాంపు కార్యాలయాల్లోకి వాస్తుదోష మంటూ అడుగుపెట్టలేదు. ఆ కార్యాలయాల్లోకి అడుగిడడం హత్య, ఆత్మహత్యా సదృశంగా భావించారు. చంద్రబాబు ముఖ్యమంత్రి అవగానే సచివాలయంలోని సౌత్ హెచ్ బ్లాక్‌ను కార్యాలయంగా చేసుకోవాలని వాస్తుదోష నివారణ కోసం కోట్లు గుల్లచేసి ముస్తాబు గావించిన అనంతరం ఆయన సన్నిహితులు, వాస్తు నిపుణులు అది వాస్తుకు అనుగుణంగా లేదని చెప్పడంతో కార్యాలయాన్ని ఎల్ బ్లాక్‌కు మళ్లించుకున్నాడు. 20 కోట్లు ఖర్చు చేసి అత్యాధునిక సౌకర్యాలతో, హంగు ఆర్భాటాలతో దసరా పండుగనాడు చంద్రబాబు ఎల్ బ్లాకులో అట్టహాసంగా ప్రవేశించాడు. తెలంగాణ ముఖ్యమంత్రి విశ్వాసాల విషయంలో చాటు మాటు వ్యవహారాలు పనికిరావు. ఏదైనా బహిరంగమే ఆయన నైజంకాగా, ఎపి సిఎం చంద్రబాబు మాత్రం ఈ విశ్వాసాల ఆచరణలో గోప్యత పాటిస్తున్నట్లు ఒక్కొక్క సంఘటనా తెరతీసుకుంటున్న కొద్దీ క్రమంగా బట్టబయలవుతుంది.

రిపబ్లిక్‌డే నాడు గవర్నర్ నరసింహన్ ఇచ్చిన తేనేటి విందుకు హాజరైన రెండు రాష్ట్రాల ముఖ్యమంత్రులు ప్రజా సంబంధ విషయాలు మాట్లాడుకున్నారో లేదో తెలియదు కానీ, వాస్తు సంబంధ విషాదాన్ని మాత్రం అత్యంత సామరస్యంగా పంచుకున్నారు. తెలంగాణ ముఖ్యమంత్రి వాస్తు సలహాల ప్రకారం ఏకంగా సచివాలయాన్నే

---

సింగపూర్ – జపాన్‌లను చేయడమనగా, సింగపూర్ – జపాన్‌లకు చెందిన కార్పొరేట్ సంస్థలకు ఆయా ప్రాంత భూమిని అప్పచెప్పడమే. తద్వారా వారి వ్యాపారాభివృద్ధి జరుగుతుంది. వారిని ఆహ్వానించిన తెలుగుదేశం పార్టీ ఆర్థికాభివృద్ధి జరుగుతుంది. ఇది వాస్తవం.

అంతేకాకుండా, లాండ్ పూలింగ్ విధానం ద్వారా భూమిని సేకరిస్తామని రాష్ట్ర ప్రభుత్వం చెపుతున్నది. అనగా భూసేకరణ చట్టానికి లొంగకపోతే బలవంతంగా భూమిని సేకరిస్తుంది. మరొక మాటలో చెప్పాలంటే, రైతులను బెదిరించి, పోలీసు, రెవెన్యూ అధికారుల ద్వారా భూమిని లాక్కోవడం అనవచ్చు. ఇది పూర్తిగా అప్రజాస్వామికం, ప్రజలకు రాజ్యాంగం ఇచ్చిన హక్కులను హరించడం అవుతుంది. అసలు లాండ్ పూలింగ్ అనేమాట ఏ చట్టంలో కూడా లేదు. భూములకు సంబంధించిన ఏ పారిభాషిక పదకోశంలోనూ లేదు. ఇది చెల్లదు కూడా. కానీ బలవంత బల ప్రయోగం ద్వారా, రైతుల భూములను సేకరించాలనే పట్టుదలతో ఈ ప్రభుత్వం ఉన్నది. దీనివల్ల జరగబోయే నష్టాలతో ప్రభుత్వానికి సంబంధం లేదనే ధోరణి కనపడుతున్నది.

వాస్తవానికి రాజధాని నిర్మాణానికి ఇన్నివేల ఎకరాల పంట భూముల సేకరణ జరపాల్సిన అవసరం లేదు. కేవలం గుంటూరు – విజయవాడ ప్రాంతాల మధ్య ఉన్న ప్రభుత్వ భూమి, దేవాదాయ భూములు సరిపోతాయి. కానీ ప్రభుత్వం అనవసరంగా, సిఆర్‌డిఎని సృష్టించి, ఒక రియల్ ఎస్టేట్‌గా మారిపోయి, మొత్తం అధికార యంత్రాంగాన్నంతా, దానికి బద్ధులను చేసి, ప్రజల పౌర, ప్రజాస్వామిక హక్కులకు భంగం కలిగించే వాతావరణాన్ని సృష్టించింది. దీనిని పూర్తిగా ప్రజాస్వామిక వాదులందరూ ప్రతిఘటించాలి. ఈ పరిస్థితికి కారణం అయిన ప్రభుత్వాన్ని గట్టిగా నిలదీయాలి. కలసివచ్చే శక్తులతో సంఘటిత పోరాటం నిర్మించాలి.

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

మార్చాలనుకుంటున్నాడు. ప్రస్తుతం సమైక్య ఆంధ్రప్రదేశ్‌కు ఇంతకాలం సచివాలయంగా సేవలందించిన భవనాలకు వీధి పోటుందట. అందువలన కెసిఆర్ ఆయన మంత్రి వర్గం సచివాలయాన్ని ఎర్రగడ్డ ఛాతీ వైద్యశాల ప్రాంతానికి మార్చాలని ఇటీవల జరిగిన క్యాబినెట్ సమావేశం తీర్మానించింది. ఈ మేరకు ఆర్థిక పరమైన క్రతువు కూడా ముగించి ఆఘమేఘాల మీద నిధులు కూడా మంజూరు చేసుకుంది. సంతోషించవలసిన విషయమేమంటే కెసిఆర్ నమ్ముకున్న వాస్తు సిద్ధాంతులు ప్రస్తుత రాజధాని హైదరాబాద్ జంట నగరాలకు వాస్తు దోషం ఉందని చెప్పకపోవడం. ఒకవేళ ఆ విధంగా కెసిఆర్ చెవిన పడుంటే రాజధాన్ని ఎక్కడకు తీసుకువెళ్లేవాడో? ఏం చేస్తాం. తెలంగాణ ప్రజలు, రాజధాని వాసులు కొంతమేర ప్రమాదం నుండి బయట పడ్డారనే చెప్పవచ్చు. అయితే సచివాలయం మార్పుపై తీసుకున్న నిర్ణయం మూఢ విశ్వాస మొండి కత్తిగా మారి ఛాతీ వైద్యశాలలో ఉద్యోగ బాధ్యతలు నిర్వహించే వారిని, అక్కడ వైద్యం చేయించుకునే రోగులను మాత్రం వెంటాడింది. ఇకపోతే ఎపి సిఎం చంద్రబాబు నాయుడి విషయానికి వస్తే వాస్తు, జాతక సలహాలను ప్రజలు గ్రహించకుండా చాటు మాటుగా వేగంగా చేసుకుంటూ పోతున్నాడు. అయితే ఆయన చేపట్టే తెరమాటు విశ్వాసాలన్నీ నివురు వీడిన నిప్పులా ధగధగలాడుతూ నిజరూపం ప్రదర్శించుకుంటూనే ఉన్నాయి. వాస్తు, జాతక విషయాలలో చంద్రబాబు చేతలను గమనించినట్లయితే తొలుతగా చెప్పుకోవలసిన సందర్భం నూతన రాజధాని నిర్మాణానికి ఎంచుకున్న తుళ్లూరు ప్రాంత కథ గురించి చెప్పుకోవాలి. గణతంత్ర దినోత్సవ వేడుకల్లో రాజ్‌భవన్‌లో ఇరువురు ముఖ్యమంత్రులు కలుసుకున్న సందర్భంలో తెలంగాణ ముఖ్యమంత్రి నూతన రాజధాని నిర్మాణంపై ఎంచుకున్న ప్రాంతాన్ని గురించి కితాబిస్తూ చేసిన వ్యాఖ్యానంతో చంద్రబాబునాయుడి రాజధాని వాస్తు కథనం గుట్టు విప్పుకుంది. ఈ సమయంలో ఎపి రాజధాని గురించి కెసిఆర్ చేసిన వ్యాఖ్యానమేమంటే! చంద్రబాబునాయుడు తూర్పు దిక్కున నది ఉండేలాగున మంచి వాస్తు నిబంధనలకనుగుణంగా రాజధాని నిర్మాణానికి ప్రాంతాన్ని ఎంచుకున్నాడని. ఇదే విషయాన్ని తెలంగాణ రాష్ట్ర ప్రతిపక్ష నేత కుందూరు జానారెడ్డి కూడా హర్షిస్తూ మద్దతు ఇచ్చాడు. 13 జిల్లాల్లో వివాదరహితమైన రాష్ట్ర ప్రభుత్వ, కేంద్ర ప్రభుత్వ వేలాది ఎకరాలు శిలాక్షరాలుగా కనపడుతుంటే తుళ్లూరు ప్రాంతంలో రెండు, మూడు పంటలు పండే సారవంతమైన భూములనే చంద్రబాబు ఎందుకు ఎంచుకున్నాడో? ఈ రాజ్‌భవన్ సంభాషణలు వెలికి తెచ్చాయి. ఇంతకాలం 13 జిల్లాలకు కేంద్ర స్థానంలో అందరికీ అందుబాటులో ఉండాలనే తుళ్లూరు ప్రాంతాన్ని రాజధానికి ఎంచుకున్నానని బుకాయిస్తున్న చంద్రబాబు మాటలు బూటకంగా మారాయి. తుళ్లూరు ప్రాంతంలో రాజధాని నిర్ణయం వెనుక బలమైన కారణం వాస్తు సిద్ధాంతమేనన్నది విస్పష్టమైంది.

ఇది ఇట్లా ఉంటే సంక్రాంతి పండుగకు చంద్రబాబునాయుడు ఎపిలోని తెల్లకార్డు గృహస్థులందరికీ చంద్రన్న కానుక పేరిట పండుగ చేసుకోమని చౌక దుకాణాల ద్వారా ఆరు వెచ్చాలను ప్రతి కుటుంబానికి ఉచితంగా పంపిణీ చేయించాడు. ఈ తంతు ముగిసిన అనంతరం రాష్ట్రంలో చర్చనీయమైన అంశమేమంటే! చంద్రబాబు జాతకం చూసిన జ్యోతిష్కుల సలహా మేరకే ఈ ఉచిత పంపిణీ కార్యక్రమానికి శ్రీకారం చుట్టాడని ప్రజలు బహిరంగంగా చెప్పుకున్నారు. ఆరు సరుకుల్లో నెయ్యి, పామోలిన్, కందిపప్పు, గోధుమపిండి, బెల్లం, జాతక దోష నివారణ సంబంధమైన శనగలు. చర్చ మొత్తంగా ఈ శనగల చుట్టూ తిరిగింది. ఎందుకంటే? చంద్రబాబునాయుడికి గురుగ్రహం అష్టమ దశలో సంచరిస్తుందట. ఈ స్థితి 'బాబు'కి ఆందోళనాభరితమైన దోషాన్ని ఆపాదిస్తుందట. దోషనివారణకు సిద్ధాంతులు, జ్యోతిష్కులు, ఏమి సెలవిచ్చారంటే, గురు గ్రహానికి ప్రీతి పాత్రమైన శనగలు దానం చేస్తే దోషం పరిహారమవుతుందన్నారట. అదీ 'చంద్రన్న కానుక' వెనుక దాగిన అసలు కిటుకు. ఈ మేరకే ఆరు సరుకులలో శనగలు చేర్చారట. వాస్తవానికి తొలుత శనగల స్థానే పచ్చి పప్పు ఇవ్వాలని పాలక బృంధం నిర్ణయించుకుంది. జ్యోతిష్కుల అమూల్య సలహాలతో పచ్చి పప్పు కనుమరుగై వాటికి పూర్వ రూపమైన శనగలు జాబితాలో చేరాయి.

కెసిఆర్ మెచ్చుకోలుతో రాజధాని వాస్తు రహస్యం వెలుగు చూస్తే, చంద్రన్న కానుకలోని శనగలు పంపిణీ చంద్రబాబు జాతక దోష పరిహారానికేనన్న సంగతి గుట్టు విప్పింది. ఈ సంఘటనలతో చంద్రబాబు మిగిలిన ప్రయాణమంతా వాస్తు, జాతకాల భూమికగా సాగుతుందనే అనుమానపు ఛాయలు రాష్ట్రమంతా అలుముకున్నాయి. కేవలం ఒక వ్యక్తి నమ్మకాలతో, విశ్వాసాలతో కోట్లాది ప్రజలు ఇబ్బందులతో సతమతం అవుతారని మానవతా వాదులు, హేతువాదులు ఆందోళన చెందుతున్నారు. చంద్రబాబు గ్రహరాశుల ప్రీతి కోసం రాష్ట్ర ఖజానాకు గండికొట్టడం వివేకవంతమైన చర్య కాదని ఆక్షేపిస్తున్నారు. తన యోగ క్షేమం కోసం ప్రజా ధనాన్ని వృథాగా ఖర్చు చేయడం సమంజసమేనా? అంటూ ప్రజలు నిలదీస్తున్నారు. ప్రయోజనం చంద్రబాబుకు, చిల్లులు ప్రజల జేబులకా? అంటూ ప్రశ్నిస్తున్నారు. ప్రజా ధనాన్ని గ్రహ ప్రీతి కోసం, దోష పరిహారం కోసం ఖర్చు చేయడాన్ని తీవ్రంగా ఆక్షేపిస్తున్నారు. కొందరైతే రాజధాని ప్రాంతానికి ఎంపిక చేసిన 29 గ్రామాల్లో పాలక తెలుగుదేశం పార్టీకి చెందిన ప్రజా ప్రతినిధులు, మంత్రుల వ్యవసాయ భూమి ఒక్క ఎకరమైనా ఉందా? అంటూ నిగ్గదీస్తున్నారు. అట్లా ఉండకపోవడం వలననే! పోతే పోయేది ప్రజలదేకదా! అనే భావనతో అత్యంత విలువైన భూములను లాగేసుకుంటూ తమ ఉసురుపోసుకుంటున్నాడని 'బాబు'పై దుమ్మెత్తిపోస్తున్నారు తుళ్లూరు ప్రాంత రైతులు. ప్రభుత్వాన్ని, పాలనను వాస్తు, జాతకాల ఆధారంగా నడపడం రాజ్యాంగ విరుద్ధమని రాజకీయ విశ్లేషకులు విమర్శిస్తున్నారు.

**ఎటుపోతున్నాం? :** గత 15 వందల సంవత్సరాలుగా భారత జాతి శాస్త్ర పరిశోధన, శాస్త్ర విజ్ఞానాన్ని వదిలి మతం, కులం, వాస్తు, జ్యోతిష్యం, జాతకం వంటి మరెన్నో మూఢ విశ్వాసాల మురుగులోపడి కొట్టుకుంటుంది. భారతీయుడు 'సున్నా'కనుగొన్న నాటి నుండీ భారతదేశం అంకెకు ముందు సున్నాగా, ప్రపంచంలోని అనేక దేశాలు అంకెకు తర్వాత సున్నాలుగా మారిపోయాయి. అభివృద్ధి పథంలో ఆకాశానికి దూసుకువెళుతున్న అగ్ర రాజ్యంతో పోల్చుకుంటే నూతన ఆవిష్కరణల విషయంలో మనదేశం పాతాళం అంచుకు జారింది. భారతదేశంలో ప్రస్తుతం మన కంటికి కనిపిస్తూ మనం వినియోగించుకుంటున్న వస్తువుల్లో ఫలానాది మన భారతీయులు కనుగొన్నారని ధైర్యంగా చెప్పుకోలేని దైన్య స్థితిలో మనజాతి కునారిల్లుతుంది. ఇతర దేశస్థులు కనుగొన్న వస్తు సముదాయాన్ని దిగుమతి చేసుకుని పరాన్న బుక్కుల్లా వినియోగించుకుంటూ గొప్పలు

పోతున్నాం. ప్రపంచంలో మన దేశమే గొప్పదని, మనమే అద్వీతీయమని, ప్రపంచమంతా మనవైపే చూస్తుందని మన పాలకులు, నాయకులు వేదికలపై జబ్బలు చరుసుకుంటున్నారు. నిన్నటికి నిన్న ప్రధాని నరేంద్రమోడీ, అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా ముందు మోకరిల్లి ఆరేళ్ల క్రితం అంగీకరించిన అణు ఒప్పందం ఆచరణకు ఆటంకంగా ఉన్న నిబంధనలకు మనవైపు నుండే అంగీకరిస్తూ తలాడించడం మనం చూశాం. ప్రమాదాల సమయంలో మనకు అణు రియాక్టర్లు సరఫరా చేసేవారే నష్టపరిహారం చెల్లించాలంటూ ఆరేళ్లుగా భీష్మించుకుని బల్లగుద్దిన కేంద్ర పాలక వర్గం నష్ట పరిహార నిధులు సమకూర్చుకుంటామని చెప్పి సాగిలపడిన తలవొంపులు మనకు గత స్మృతి వీచికగానే తోస్తుంది. అభివృద్ధిలో ఆకాశం తాకామని చెపుతున్న మన పాలకులు, అమెరికా డాలరుకు 63 రూపాయలు, బ్రిటన్ పౌండుకు 23 రూపాయలు ఎందుకు చెల్లించాలనే ప్రశ్నను ఎప్పుడైనా వేసుకున్నారా? మనకు స్వాతంత్ర్యం వచ్చిన 1947లో డాలరుకు 3.30లుగా ఉన్న మన రూపాయి విలువ 68 సంవత్సరాల స్వాతంత్ర్యానంతర పాలనలో 63 రూపాయలుగా పతనమైతే మన ప్రగతి, అభివృద్ధి ఏ దశలో ఉన్నాయో మనం ఆలోచన చేసుకుంటున్నామా? మనం కూడా అభివృద్ధిలో ముందుకెళ్లాం. కానీ! సాటి దేశాల అభివృద్ధితో పోల్చితే మన ఎదుగుదల ఏపాటిదో మూల్యాంకనం చేసుకోలేకపోతున్నాం. మనదేశంలో చదువుకున్న విద్యార్థులంతా అమెరికా విమానం ఎప్పుడు దొరుకుతుందా? అని ఆకాశంవైపు చూస్తుంటే! వారి తహతకు సరిపడా జీతాలు ఇవ్వగలిగిన స్థితిలోలేని మన ప్రభుత్వాలు హెచ్ వన్‌బి వీసాల పునరుద్ధరణ కోసం అమెరికాను దేబరించడం అత్యంత అవమాన కరమైన చర్యగా తోస్తుంది. ప్రతి విషయాన్ని ఆధ్యాత్మిక చింతనతోనూ, ధార్మిక ప్రవచనాలతోనూ ముడిపెట్టి శాస్త్ర పరిశోధనల్లోనూ, ప్రయోగాల్లోనూ మనం అడుగు ముందుకు వేయలేకపోతున్నాం. 'మా పూర్వీకులు నేతులు తాగారు మా మూతులు వాసన చూడండి' అంటూ ప్రపంచం ముందు మీసాలు మెలిపెడుతున్నాం. పూర్వీకులు నేతులు తాగారో! లేదో! కూడా తెలుసుకోకుండానే ప్రగల్భాలు పోతున్నాం. భూమిని చాపలా చుట్టి చంకలో పెట్టుకుని వెళ్లి సముద్రంలో పడవేశాడని తెలిపే హిరణ్యాక్ష భాగవత కథలతో కాలం వెళ్లదీస్తున్నాం. మాకెప్పుడో పుష్పక విమానం ఉంది. దానిలో ఎందరైనా, ఎక్కడైనా, ఇంధనంతో అవసరం లేకుండా ప్రయాణం చేయవచ్చనే ఇతిహాస గాథలు చెప్పుకుని సంబరపడుతున్నాం. ఎప్పుడో త్రేతాయుగంలోనూ, అంతకంటే ముందూ, ఆ తదుపరి ద్వాపరంలో ఉన్నదని చెపుతున్న పుష్పకం ఇప్పుడెందుకు కనుమరుగయిందని ప్రశ్నించుకోలేకపోతున్నాం. రైట్ సోదరులు కనిపెట్టి ఆచరణలోకి తీసుకువచ్చే వరకూ విమానాన్ని ప్రత్యక్షంగా చూడని మనం ఆకాశయానంలో అందరికంటే ముందున్నామంటూ ఊహల ఊయలలో ఊగుతున్నాం.

ఇవాళ ఏ దేశాలైతే అభివృద్ధిలో, ప్రగతిలో సాంకేతికంగా అగ్రదేశాలై తలమానికంగా ప్రపంచాన్ని శాశిస్తున్నాయో! ఆ దేశ ప్రజలకూ విశ్వాసాలున్నాయి. అయితే ఆయా దేశాల పౌరులూ, పాలకులూ విశ్వాసాలను విడిచిపెట్టకుండానే మరోచేత్తో శాస్త్ర విజ్ఞానాన్ని, శాస్త్ర పరిశోధనలను, ప్రయోగాలను గట్టిగా పట్టుకుని ప్రపంచ వేదికపై నూతన ఆవిష్కరణలను పరిచయం చేస్తున్నారు. శాస్త్ర సాంకేతాలకు పెద్దపీఠవేసి ముందుకూ, మును ముందుకూ పరుగులు పెడుతున్నారు. ఇటీవల మన ఇస్రో అంతరిక్ష శోధనలు గావిస్తున్న అన్ని దేశాలను ఆశ్చర్య చకితంగా మార్చి అత్యంత ఉన్నతమైన కీర్తి గడించింది. అతి తక్కువ ఖర్చుతో అత్యంత వేగంగా ప్రయాణించే అంతరిక్ష నౌక మంగళయాన్‌ను రూపొందించింది. ఈ మంగళయాన్ వ్యోమ నౌక గంటకు 78 వేల కిలోమీటర్లకి పైగా వేగంతో ప్రయాణం చేసింది. ఈ విజయం జాతికంతటికీ ఆనందదాయకం, హర్షదాయకం. దేశ సాంకేతిక విజ్ఞానానికే కీర్తికిరీటం. అయితే మంగళయాన్ మూలాలు మనవి కాదు కదా! దీనితల్లి వేరు మనదేశానికి చెందినది కాదు కదా! మరి మూలాల్లోకి మనం ఎప్పుడు వెళతాం? అన్నదే సమాధానంలేని సందేహం. ఈ మంగళయాన్ నౌక సాంకేతిక పరిజ్ఞానాన్ని ఆసరా చేసుకుని ఆకాశ రవాణా వాహనాల తయారీలో మన శాస్త్రజ్ఞులు విజయవంతమైతే మనదేశం నుండి అమెరికా 15 నిమిషాలలో చేరుకునే అవకాశముంది. అది అలా ఉంటే నిన్నటి వరకూ ఇస్రో ఛైర్మన్‌గా ఉన్న రాధాకృష్ణన్ తీరే ఆక్షేపణీయంగా ఉంటుంది. అంతరిక్షంలోకి పంపే నౌక నమూనాను ప్రతి పర్యాయం తిరుమలకు తీసుకువచ్చి అక్కడ పూజలు జరిపించి అంతరిక్ష పరిశోధనలకు కూడా మూఢ విశ్వాసాలను అన్వయించేవాడు. ఒక విధంగా ఈ పరిణామం మూఢ విశ్వాసాలను మరింత పెంచి పోషించడమే అవుతుంది. పోనీ రాధాకృష్ణన్ తిరుమల వచ్చిన ప్రతిసారి ప్రయోగం విజయవంతం అయినదా! అంటే అదీలేదు. ఒక్కోసారి బుస్సున ఆకాశానికి ఎగిరేది, మరోమారు తుస్సుమంటూ నేలను తాకేది. ఇలాంటి చర్యలు శాస్త్ర పరిశోధనలను, ప్రయోగాలను బలహీన పరుస్తాయి. ఈ అడుగులు నమ్మకాల మూకుడులో పేలాల్లా వేగడం మినహా మరొకటి కాదు. ఇతర దేశాలలో మాదిరిగా మనదేశంలో శాస్త్రజ్ఞులు, శాస్త్ర పరిశోధనలు, ప్రయోగాలు ఎందుకు విస్తరించడం లేదని మన పాలకులు ఆలోచించే స్థితిలోనే లేరు. దేవాలయానికి వెళ్లి ఆత్మ నమస్కారం చేయడం, చర్చిలోకి వెళ్లి ప్రార్థన చేయించుకోవడం, మసీదుకు వెళ్లి టోపి పెట్టుకుని నమాజు నటించడం అనంతరం ఎన్నుకున్న ప్రజలందరికీ మూకుమ్మడిగా టోపీలు పెట్టడం ఆనవాయితీగా మార్చుకున్నారు మన పాలకులు. ఎవరికి ఏ నమ్మకాలున్నా అభ్యంతరం లేదు. దేశ పురోగతికి ఆటంకం కాకుండా ఉంటే సమంజసంగా ఉంటుంది. నమ్మకాలున్నవారు ఎందుకు ఆలోచించడం లేదో? అర్థం కాదు. మూఢ విశ్వాసాలున్న వారంతా ఒక నిర్దిష్టమైన సంశయానికి సమాధానం వెతుక్కోవల్సిన అవసరం ఎంతయినా ఉంది. ఈ విశ్వాసాలున్న వారంతా పూర్వ జన్మనూ, పునర్జన్మను నమ్ముతున్నారు కదా? ప్రస్తుత వర్తమాన జన్మ ఎట్లా సాగిపోవాలోననే ప్రతి నిమిషాన్ని ఒడిదుడుకులను, సుఖ దుఃఖాలను, కష్ట నష్టాలను జన్మించడానికి పూర్వమే లిఖించబడుతుందని నమ్మేవారు ఈ వాస్తు, జాతకం, జ్యోతిష్యం వెంట పడిపోవడమేమిటి? వీటి వలన లిఖితం ఎట్లా మారుతుంది? మేధావులైన వీరంతా ఈ దిశగా ఆలోచించుకోరా? పాలకులు, మేధావులు, శాస్త్రజ్ఞులు మూఢ నమ్మకాలలో తల ముంచి ఆలోచనా రహితంగా ప్రజాధనం వృథా చేయకుండా ముందుకు వెళితే కనీసం భవిష్యత్ అయినా మిగతా అగ్ర రాజ్యాల సమీపానికి చేరుకోగలం.

*(రచయిత పల్నాడు రచయితల సంఘం అధ్యక్షులు)* వీ

# భూమిని కాపాడేది పోరాటాలే

***నూతన రాజధాని పేరుతో రైతుల నుంచి బలవంతంగా పంట భూములను లాక్కొని కార్పొరేట్ కంపెనీలకు కట్టబెడుతున్న పాలకులకు వ్యతిరేకంగా ప్రజలు పోరాడాలని అంటున్నారు* ముప్పాళ్ల భార్గవ శ్రీ**

హైదరాబాద్‌లో ఇటీవల జరిగిన మంత్రివర్గ సమావేశం సందర్భంగా పత్రికల్లో మంగళగిరి నియోజకవర్గంలోని యర్రబాలెం, ఉండవల్లి, నవులూరు గ్రామాల రైతులు ఊరేగింపుగా తరలివచ్చి భూ సమీకరణకు వ్యతిరేకంగా 9.2 ఫారాలు అధికారులకు అందచేశారనే వార్తలపై సిఎం చంద్రబాబు ఆగ్రహం వ్యక్తంచేసి సిఆర్‌డిఏ వైస్ చైర్మన్, మంత్రి నారాయణకు మరో గ్రామంలో ఇలాంటి పరిస్థితి తలెత్తకుండా చూడాలని ఆదేశాలు జారిచేసినట్లు వార్త వచ్చింది. ఆ తరువాత మంత్రి నారాయణ, స్థానిక నాయకులతో కలిసి రాజధాని ప్రాంత గ్రామాల్లో పర్యటిస్తూ, ఫిబ్రవరి 14 నాటికి 29 గ్రామాల్లో భూసమీకరణను పూర్తి చేస్తామని ప్రకటించారు. మల్కాపురం గ్రామంలో అయితే రైతులు 'సంతోషం' పట్టలేక మంత్రిని ఏకంగా గుర్రం ఎక్కించి ఊరేగించారు కూడా! ఇప్పటికి 29 గ్రామాల్లోని రైతులకు చెందిన 36 వేల ఎకరాల్లో 20 వేల ఎకరాలు సమీకరించినట్లు మంత్రి 'గర్వం'గా ప్రకటిస్తున్నారు.

వాస్తవానికి సమీకరించిన భూముల్లో మూడు వంతులకు పైగా రాజధాని ప్రకటించిన తరువాత భూములు కొన్న ఎన్ఆర్ఐలు, మంత్రులు, ఎంపి, ఎంఎల్ఎల బీనామీలే అంగీకార పత్రాలు ఇచ్చారన్నది దాచేస్తే దాగని సత్యం. తుళ్లూరు ప్రాంతంలో ఉన్న మెట్టభూముల రైతాంగం కూడా ప్రభుత్వం ప్రకటించిన ప్యాకేజీకి చట్టబద్ధత ఏమిటన్న సవాలక్ష సందేహాలతో అంగీకార పత్రాలను వేగంగా ఇవ్వడం లేదు. ఎనిమిది వేల ఎకరాలకు పైగా జరీబు భూములున్న ప్రాంతంలో మాత్రం అత్యధిక శాతం రైతులు భూములు ఇవ్వడానికి తమ అభ్యంతరాలను తెలియజేస్తూ 9.2 ఫారాలను వేలసంఖ్యలో అధికారులకు రోజూ అందిస్తూనే ఉన్నారు. మాగాణి భూములను భూసమీకరణ నుండి మినహాయించే వరకు పోరాడతామని రైతులు, ముఖ్యంగా మహిళా రైతులు దృఢ దీక్షను వ్యక్తం చేస్తున్నారు. వారికి సంఘీభావంగా ఈ ప్రాంతంలోని వివిధ రైతు కూలీ సంఘాలు, ప్రజాతంత్రవాదులు, న్యాయవాదులు నిరంతర కృషిని కొనసాగిస్తున్నారు.

అయితే 9.2 ఫారాలు ఇస్తున్న ఉండవల్లి, పెనుమాక గ్రామాల రైతులను మంత్రి నారాయణ బ్లాక్‌మెయిలింగ్ చేసే విధంగా రాజధాని వచ్చిన తరువాత ఈ గ్రామాలను వైద్య, విద్య, సాఫ్ట్‌వేర్ పరిశ్రమల వంటి జోన్ల పరిధిలో చేర్చకపోతే నష్ట పోతారని కూడా బహిరంగ ప్రకటనలు చేస్తున్నారు. అయితే భూసమీకరణ చట్టం ప్రకారం ఫిబ్రవరి 11న భూసమీకరణ ముగిసినా రైతుల నుంచి భూసమీకరణ ఆశాజనకంగా లేకపోవడంతో ఫిబ్రవరి 14 వరకు అధికారులు పొడిగించారు. అయినా 20 వేల ఎకరాలకు మించి భూసమీకరణ జరగకపోవడంతో మంత్రి పత్తిపాటి పుల్లారావు 'రైతుల కోరికమేరకు' ఫిబ్రవరి ఆఖరు వరకు గడువును పొడిగిస్తున్నట్లు ప్రకటించక తప్పలేదు.

ఈ పొడిగింపు రైతుల కోరిక మేరకు కాదు. రైతుల్లో మరిన్ని భ్రమలు, భయాలు కల్పించి భూములను గుంజుకొనే కుట్ర ఇందులో ఉంది. అలానే రాజధాని ప్రాంత గ్రామాల్లో రైతులు తిరిగి పంటలు వేయకూడదని సిఆర్‌డిఏ కమిషనర్ శ్రీధర్ చేసిన అడ్డగోలు ప్రకటనపై అంగీకార పత్రాలు ఇవ్వని రైతులు తీవ్ర నిరసన తెలియజేయడంతో కమీషనర్ తమ ప్రకటనను వెనక్కి తీసుకోక తప్పలేదు. అయితే అంగీకార పత్రాలు ఇచ్చిన రైతులు కూడా ఇంతవరకు రాజధాని నిర్మాణంపై మాస్టర్ ప్లాన్ ప్రకటించని పక్షంలో తమ భూముల్లో కూడా పంటలు వేసుకొని అవకాశం ఇవ్వాలని చేస్తున్న ఆందోళనను ప్రభుత్వం పట్టించుకోకపోవడం అన్యాయం. ప్రభుత్వం ఎన్ని విధాలుగా టక్కు టమారాలతో మోసగించాలని చూస్తున్నా రైతులు ఏ మాత్రం భ్రమలకు లోనుకాకుండా 9.2 ఫారాలను ఉద్యమంగా ఇస్తున్నారు. రైతులు తామెందుకు ప్రభుత్వానికి భూములు ఇవ్వదలచుకోలేదో న్యాయ పరమైన, రాజ్యాంగపరమైన, సామాజికపరమైన అంశాలను ఈ కింది విధంగా స్పష్టంగా పేర్కొంటున్నారు.

కె.శివరామకృష్ణన్ నిపుణుల కమిటీ సిఫార్సు చేసిన ప్రకారం ఇటువంటి పెద్ద ప్రాజెక్టుకు పర్యావరణ ప్రభావ అంచనా (ఇఐఎ) ను నిర్వహించడం అవసరం. దీని ద్వారా ప్రస్తుత వ్యవసాయ పద్ధతులను, స్థానిక పర్యావరణాన్ని కాపాడుకోవడం, స్థిరమైన పర్యావరణాన్ని అభివృద్ధి పరచడం, రాబోయే వంద సంవత్సరాలను ప్రాథమిక దృష్టిలో పెట్టుకొని ప్రకృతి బీభత్సాలు కలిగించే నష్టం అంచనాలను విశ్లేషణ చేయాలి. పక్షపాత విధానంతో ప్రభుత్వం నిర్ణయం తీసుకోవడం వలన ఇఐఎ లాంటి వాటిపట్ల శ్రద్ధ చూపలేదు.

కృష్ణానది ఒక జీవనది. ఎక్కువ సంవత్సరాలు వరదలతో ఉంటుంది. తుళ్లూరు, తాడేపల్లి, మంగళగిరి మండలాలు వరదప్రాంత మండలాలని కేంద్ర, రాష్ట్రాలు ప్రకటించాయి. రాజధాని నగరాన్ని ఈ మూడు మండలాల్లోనే నిర్ణయించారు. వరద ప్రాంతంలో నివసించే ప్రజలకు వరదలు ఇబ్బందికరం. నదీ పరివాహక ప్రాంతంలో సహజసిద్ధ సంపద, జీవన అవకాశాలు సమృద్ధిగా ఉండడం వలన వారు ఈ ప్రాంతాన్నే ఎంచుకొంటారు. ఆస్తులను, పశు సంపదను, బతుకు దెరువును, ఆఖరికి ప్రజల ప్రాణాలను కూడా వరదలో పోగొట్టుకోవడానికి సిద్ధపడడం వలన ఈ సదుపాయాన్ని ఈ నిండైన సామాజిక జీవితాన్ని పొందగలిగారు.

వరదలు వచ్చినప్పుడు నదిలోపలి లంకలన్నీ మునిగి పోతాయి. అలానే ఈ మూడు మండలాల్లోనే ఎక్కువ ప్రాంతాలు కూడా

మునిగిపోతాయి. ప్రకాశం బ్యారేజీకి ముందు ఐదు వంతెనలు ఉండడం వలన వరదనీరు నిలిచిపోతుంది. పారే వరదనీరు నిలిచిపోయినందున విజయవాడలోని కృష్ణలంక ప్రాంతం నీటిలో మునిగిపోతూ ఉంటుంది.

నూతన రాజధానిని దృష్టిలో పెట్టుకొని భవిష్యత్తులో కనీసం పది వంతెనలు ఈ నదిపై రాబోతున్నాయి. కావున ప్రతి ఏడాది నిరంతరంగా వరదలను చవిచూడబోతున్నాం. మనిషి చేసిన పాపానికి ఢిల్లీ పక్కనే ఉన్న యమునా నది ఒక ఉదాహరణ. ఆ నది మీద 15 వంతెనలను ముందు చూపు లేకుండా నిర్మించినందున వారు బాధలు పడుతున్నారు. వారు ప్రతి సంవత్సరం వరదలను ఎదుర్కొంటున్నారు. కావున కృష్ణానదికి ఈ పరిస్థితి తిరిగి రాకూడదు.

నూతన రాజధాని ప్రాంతంలోనే ఉన్న కొండవీటి వాగు వలన నీరుకొండ, రాయపూడి, వెలగపూడి, మందడం, కృష్ణాయపాలెం తదితర గ్రామాలు ఐదు టిఎంసిలకు పైగా వరద నీటితో మునిగిపోయి ఆ వరద నీటి నుంచి బయటపడడానికి నెలరోజుల పైగా పడుతుంది. వరద నీటిలో పంటలు మునిగి పోవడం వలన ప్రతి సంవత్సరం వానకాలంలో రైతులు పంట నష్టానికి గురవుతూనే ఉన్నారు. సరిగ్గా ఇలాంటి ప్రదేశం లోనే నూతన రాజధానిని ప్రకటించడం ఏమాత్రం సమర్థనీయం కాదు.

విజయవాడకు 150 కి.మీ. పరిధిలో భూకంపాలు వచ్చే ప్రమాదం ఉందని జియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా ప్రకటించిన విషయం తెలిసి కూడా నూతన రాజధానిని ఆ ప్రాంత పరిధిలోనే నిర్ణయించడం ఏ మాత్రం సరికాదు.

ఇలాంటి పెద్ద ప్రాజెక్టులకు సామాజిక ప్రభావ అంచనాను తప్పని సరిగా చేయాలి. 40 ఏళ్లు కట్టే ప్రాజెక్టు నిర్మాణాన్ని 100 సంవత్సరాల ముందుచూపుతో నిర్మించాల్సి ఉండగా రైతుల నుండి భూములను గుంజు కోవడానికి ప్రభుత్వం తొందరపాటు నిర్ణయం తీసుకోవడం సరికాదు. ఈ ప్రాజెక్టు వలన ఈ ప్రాంత ప్రజల జీవితాలు పూర్తిగా సంక్షోభంలో పడబోతున్నాయి. రైతులు కాక వ్యవసాయంపై ఆధారపడిన ఇతర వృత్తుల ప్రజలకు పునరావాసం, పునర్నిర్మాణ చర్యల గురించి ఏ మాత్రం పట్టించుకోకపోవడం అమానవీయం.

ప్రజల అవసరాల కోసం భూమి కావాలనుకొన్నప్పుడు ప్రభుత్వం విధి విధానాలను తప్పనిసరిగా అనుసరించాలి. శివరామకృష్ణన్ కమిటీ గ్రీన్‌ఫీల్డ్ కాపిటల్‌కి వెళ్లవద్దని, ప్రభుత్వం భూములను తీసుకోవాలని చేసిన సిఫార్సును ప్రభుత్వం పెడచెవిన పెట్టింది. ప్రభుత్వ భూములు గుంటూరు జిల్లాలో 21,596 ఎకరాలు, కృష్ణా జిల్లాల్లో 43,932 ఎకరాలతో పాటు కృష్ణా డివిజన్‌లో ఫారెస్టు భూములు 1,23,402 ఎకరాలు కలుపుకొని మొత్తం ప్రభుత్వ భూమి 1,88,930 ఎకరాలు ఉండగా, అన్ని విధాల రాజధాని నిర్మాణానికి ప్రయోజనకరం కాగా ప్రభుత్వం ప్రైవేటు భూములను తీసుకొని పథకం ప్రకారం సింగపూర్ ప్రభుత్వంతో అవగాహనకు వచ్చి వారికి భూములను ఒప్పందాల పేరుతో చౌకగా అమ్మేయడానికి పూనుకోవడం పూర్తిగా రాజ్యాంగ విరుద్ధం. నూతన రాజధాని ప్రాంతంలో వర్షాధారం మీద పండే భూములతో పాటు దాదాపు 120 రకాల పంటలు పండే జరీబు భూములు కృష్ణా నది కరకట్టన ఆనుకొని వేలాది ఎకరాలు ఉండడం వలన ఈ ప్రాంత ప్రజలకే కాక చుట్టు పక్కల జిల్లాల వారికి కూడా ఆహారం సమృద్ధిగా లభిస్తున్నది. దీనికి భిన్నంగా ప్రభుత్వం నిర్ణయం తీసుకోవడం అంటే వ్యవసాయ రంగాన్ని సంక్షోభంలోకి నెట్టడం రాజ్యాంగ విరుద్ధం అవుతుంది. సింగపూర్, జపాన్ టెక్నాలజీతో కొత్తరకం రాజధానిని నిర్మించ పూనుకోవడం విడ్డూరం.

డిసెంబర్ 22న భూసమీకరణ కోసం అసెంబ్లీలో సిఆర్‌డిఎ బిల్లును ఆమోదింప చేసుకొన్న తరువాత 28న కొందరు దుండగులు మాగాణి ప్రాంతంలోని ఎనిమిది చోట్ల తోటలను తగలబెట్టారు. ఆసరాగా తీసుకొని విచారణ పేరుతో 500 మంది పోలీసులతో తుళ్లూరు ప్రాంతాన్ని నింపారు. గ్రామాలపై దాడులు చేసి, అనేక మంది అమాయక రైతులను అరెస్టు చేశారు. దాదాపు 3000 మంది రైతుల్ని విచారించి వారిచేత రాత పూర్వక స్టేట్‌మెంట్లు తీసుకొని ఈ ప్రాంతంలో భయానక వాతావరణం సృష్టించి బలవంతపు భూసమీకరణకు పూనుకోవడం అప్రజాస్వామికం.

మనరాష్ట్రానికి చెందిన ఇన్‌క్యాప్, సింగపూర్‌కు చెందిన ఇంటర్నేషనల్ ఎంటర్‌ప్రైజెస్‌తో ఎంఒయును వరల్డ్ క్లాస్ రాజధాని నగర నిర్మాణం కోసం చేసుకొంది. ఈ ఎంఒయు న్యాయపరంగా చెల్లదు. కాబట్టి దీని ఆచరణ క్రమంలో వచ్చే సమస్యలను పరస్పర చర్చల ద్వారా పరిష్కరించు కోవాలని విధానపరంగా నిర్ణయించడం, ఆర్కిటెక్ట్ యాక్ట్ 1972 ప్రకారం చట్ట విరుద్ధం. ఇది పూర్తిగా రాజ్యాంగాన్ని ఉల్లంఘించడమే అవుతుంది.

రాజధాని కమిటీ పేరుతో మంత్రులు రాజధాని పరిధిలోకి వచ్చే గ్రామాల గురించి రోజుకో ప్రకటన చేస్తూ ఆఫీసర్లకు నోటిమాట ఆర్డర్లు వేస్తున్నారు. భూసమీకరణ కోసం రైతులపై తీవ్రంగా ఒత్తిడి తీసుకురావడం రాజ్యాంగంలోని ఆర్టికల్ 21ని ధిక్కరించడమే అవుతుంది. భూసమీకరణ విధానంపై రైతుల నుంచి తీవ్ర వ్యతిరేకత వస్తున్న స్థితిలో సిఆర్‌డిఎ బిల్లు తీసుకురావడం పూర్తిగా రాజ్యాంగ విరుద్ధం.

సిఆర్‌డిఎ చట్టం 2014 ప్రకారం రాజధాని నిర్మాణానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల పాత్ర లేకుండా రైతులు మాత్రమే పెట్టుబడులు పెడుతున్నప్పుడు నష్టపరిహారం కోసం రైతులు పది సంవత్సరాలు వేచి ఉండడం రాజ్యాంగంలోని ఆర్టికల్ 21 ప్రకారం ఏమాత్రం సమ్మతం కాదు. ఆ విధంగా రైతుకు రావాల్సిన నష్టపరిహారాన్ని పూర్తిగా నిరాకరించడమే అవుతుంది. ఆ విధంగా రైతుల ప్రాథమిక హక్కులను హరించడమే అవుతుంది. అలానే రైతులకు ప్రభుత్వం సాలీనా ప్రకటించిన మొత్తం కూడా వారు వ్యవసాయం ద్వారా పొందే ఆదాయానికి చాలా తక్కువ. వాస్తవ పరిస్థితులపై ఆధారపడకుండా ఏకపక్షంగా ప్రభుత్వ నిర్ణయాలను ప్రకటించడం ఏ మాత్రం న్యాయ సమ్మతం కాదు.

సిఆర్‌డిఎ చట్టం ప్రకారం అభివృద్ధి చేసిన భూమిని అనేక ప్రయోజనాలకు ఉపయోగించుకునే హక్కు ఉన్నప్పుడు భూమి ఇచ్చిన రైతుకి అభివృద్ధి చేసిన భూమిలో హక్కు ప్రశ్నార్థకంగా మారిపోవడం రైతుల్ని మోసపుచ్చడం కాదా!

భూసమీకరణ అధికారులు విడుదల చేసిన నోటిఫికేషన్లు, వాటిల్లో సూచికలు ఇచ్చిన 253, 257, 254, 971 జిఒలను గుంటూరు జిల్లా కలెక్టర్ ప్రకటించినప్పటికీ, సాధారణ రైతుకి అంతర్జాల పరిజ్ఞానం లేనందున వాటి గురించి ఏమి తెలియనప్పుడు ఆ జిఒలకు ఏమి విలువ ఉంటుంది?

గత అనుభవాల నుండి గుణపాఠాలు తీసుకొనే విధంగా ప్రభుత్వానికి సంబంధించిన అన్ని విభాగాలను రాజధాని నగర ప్రాంతంలోనే నిర్మించకుండా రాష్ట్రంలోని అన్ని ప్రాంతాలకు సమతుల్యతను పెంచే విధంగా ప్రభుత్వ విభాగాలను వికేంద్రీకరించడం ద్వారా ఇతర దూర ప్రాంత జిల్లాల ప్రజలను సంతృప్తిపరచి తద్వారా ప్రాంతీయ అసమానతలను తొలగించే విధంగా 'ప్రజా రాజధాని' నిర్మాణం ఉండాలి.

మొత్తం భూమిలో ఐదుశాతం పేదలకు ఇళ్లు కట్టించి ఇస్తామన్నది కంటితుడుపు చర్య మాత్రమే. చివరికి రైతుల శవాల దిబ్బల మీద బహుళ జాతి కంపెనీల పునాదులు వేసుకునే విధానాలు ఇందులో ఇమిడి ఉన్నాయి.

సిఆర్‌డిఎ చట్టంలోని సెక్షన్ 53(1) (ఎఫ్) ప్రకారం సమీకరించిన భూమిని రాజధాని నగరాన్ని అభివృద్ధి చేయడానికి లేక నివాసాలకు, కమర్షియల్ కాంప్లెక్సులకు ఇచ్చే అధికారం సిఆర్‌డిఎకి కట్టబెట్టే అధికారాన్ని ఉంచుకోవడం అంటే ఈ ప్రొవిజన్ మాటున బహుళజాతి కంపెనీలకు భూమిని కట్టబెట్టడం అన్యాయం.

చట్టంలో సెక్షన్ 55 (1) ప్రకారం ప్రభుత్వం నియమించే కమిషనర్ మొదలుకొని ఇతర అధికారులందరూ ప్రభుత్వం చేతిలో తోలుబొమ్మలుగా ఆడుతారు. ప్రభుత్వ అధికారులు గమనించవలసినది ఇప్పుడున్న ప్రభుత్వం ఎల్లకాలం ఉండదు గనుక ఇప్పుడు అధికారులు ఇచ్చిన అనుమతులకు రేపు న్యాయపరమైన ఇబ్బందులు వచ్చి ఆఖరికి జైలుకి కూడా వెళ్లవచ్చు. గతంలో న్యాయపరమైన ఇబ్బందుల వలన జైళ్లకు వెళ్లిన ప్రభుత్వ అధికారుల అనుభవాలను తప్పక దృష్టిలో పెట్టుకోవాలి.

చట్టంలోని సెక్షన్ 55 (5) ప్రకారం భూసమీకరణ విధానం పట్ల రైతుల అభ్యంతరాలను నిర్ణీత గడువు లోపల వినడం అసాధ్యం అన్న విషయం అధికారులకు బాగా తెలుసు. కావున రైతుల అభిప్రాయాలను వినడానికి తగిన సమయం ఇచ్చినప్పుడే రైతుల హక్కులను కాపాడినట్లు అవుతుంది.

సెక్షన్ 57 (3) – (4) ప్రకారం రైతులకిచ్చే భూసమీకరణ అధికారిక పత్రం రిజిస్టర్డ్ టైటిల్ డీడ్ లక్షణాలు కలిగి ఉండాలి. ఈ అధికారిక పత్రం అమ్ముకొనే, తనఖా పెట్టుకునే విధంగా న్యాయపరమైన లక్షణాలు కలిగి ఉంటేనే అన్ని విధాలా రైతుకి ప్రయోజనకరం. అయితే రైతులకిచ్చే అధికారిక పత్రంలో సంబంధిత అధికారి సంతకం తప్ప ఎటువంటి ప్రభుత్వ ముద్ర లేకుండానే ఇవ్వడం చట్టవిరుద్ధం.

చట్టంలోని రూల్ 5(3) ప్రకారం భూమిలేని కుటుంబాలకు నెలకు రు.2500 పెన్షన్ కింద క్యాపిటల్ రీజియన్ సోషల్ సెక్యూరిటీ ఫండ్ నుంచి 10 ఏళ్లు ఇస్తామని ప్రకటించారు. భూమిలేని వ్యవసాయ కూలీలు ఇప్పుడు ప్రభుత్వం ప్రకటించిన మొత్తం కంటే ఐదారు రెట్లు సంపాదించుకుంటున్నారు. అయితే ఇప్పుడు చట్టంలో పెన్షన్‌గా మాత్రమే ప్రకటించడం అంటే 60 ఏళ్లు దాటిన వారికే పరిమితం చేయడం ద్వారా వ్యవసాయ కూలీ కుటుంబాలను దిక్కులేని అనాథలుగా చేయడం దుర్మార్గం.

రూల్ 5(12) ప్రకారం ప్రభుత్వం చేత ఆమోదించబడిన భూసమీకరణ బాధ్యతను అధికారులకు లేక స్థానిక సంస్థలకు అప్పజెప్పడం అంటే ప్రభుత్వం మెచ్చిన బహుళజాతి కంపెనీలకు వారు ఏజెంట్లుగా మాత్రమే మిగిలిపోతారు. రూల్ 12 (ఎ) ప్రకారం సమీకరించిన భూములలో పార్కులు, ఆట స్థలాలు, బహిరంగ ప్రదేశాలు, రోడ్లు, పౌర సౌకర్యాలు ఏర్పాటు చేసినందుకు అభివృద్ధి చార్జీలను ఆ ప్రాంత రైతుల నుండి వసూలు చేయడం అన్యాయం. రైతులిచ్చిన భూముల మీద వ్యాపారం చేస్తూ తిరిగి రైతుల మీద భారం వేయడం అప్రజాస్వామికం. కావున ఈ చార్జీల వసూళ్ల నుండి రైతులను తప్పక మినహాయించాలి. అలానే రైతుల వాటాగా ఇచ్చే అభివృద్ధి చేసిన ప్లాట్లపై వసూలు చేసే చార్జీల నుండి కూడా రైతులను మినహాయించాలి.

భూసమీకరణ కోసం ప్రభుత్వం ఇచ్చిన నోటిఫికేషన్ పూర్తిగా చట్ట విరుద్ధం, మోసపూరితం, రాజ్యాంగ విరుద్ధం. కాబట్టి మేము ఈ విధానాన్ని పూర్తిగా వ్యతిరేకిస్తున్నాం. పైన చూపిన న్యాయపరమైన, రాజ్యాంగపరమైన అంశాల ఆధారంగా మేము మా భూములను భూ సమీకరణ కోసం ఇవ్వదలచుకోలేదు.

రాజధాని ప్రాంత రైతులు తామెందుకు తమ భూములను భూ సమీకరణ కోసం ఇవ్వదలచుకోలేదో చాలా సహేతుకంగా, న్యాయపరంగా, రాజ్యాంగపరంగా, ప్రజాస్వామికంగా వివరించుకున్నారు. ఇంత స్పష్టంగా రైతుల అభిప్రాయాలుంటే ప్రభుత్వం ఎందుకు రైతుల గోడు పట్టించుకోవడం లేదు! ప్రభుత్వం కావాలనే పథకం ప్రకారం రైతుల అభ్యంతరాలకు విలువ ఇవ్వదలచుకోలేదు. ఆ విధంగా ఇస్తే చంద్రబాబు మానస పుత్రిక భూసమీకరణ పథకానికి నిలువెల్లా తూట్లు పడతాయి. ప్రపంచంలోనే నంబర్‌వన్ రాజధాని నిర్మాణం పేరుతో సింగపూర్, జపాన్, దావోస్‌లకు చెందిన బహుళజాతి కంపెనీలకు ఎర్రతివాచీ పరచి, పనిలో పనిగా తన అనుచర గణం ప్రయోజనాలను నెరవేర్చడం ఈ పథకం అసలు స్వరూపం ఇందులో ఉంది. గతంలో వ్యవసాయం దండగ అన్న చంద్రబాబు నేడు సరికొత్తగా వ్యవసాయాన్ని లాభసాటి చేస్తానని చెప్పడంలో చంద్రబాబు మాటలకు అర్థాలు వేరులే అనుకోక తప్పదు.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల ప్రైవేటీకరణ విధానాల ఫలితంగా వ్యవసాయ రంగం సంక్షోభంలో కూరుకుపోయింది. అయితే ఆహార కొరత సంభవించ కుండా ఉండాలంటే పంట భూములను కాపాడుకోవడం అత్యవసరం. అలానే పంట భూములపై ఆధారపడ్డ చిన్న, సన్నకారు రైతాంగానికి, కౌలు రైతులకు, వ్యవసాయ కూలీలకు, వివిధ వృత్తులవారికి ఆర్థికపరమైన, సామాజికపరమైన హామీలు చట్టపరంగా లభించే వరకు రాజధాని ప్రాంత రైతాంగం దృఢ దీక్షతో ఉద్యమ పథంలో ముందుకు సాగాలి. రైతులు సాగించే ఉద్యమానికి 2007లో పశ్చిమబెంగాల్‌లోని నందిగ్రాంలో జరిగిన పోరాటం ఎంతో ఆదర్శంగా నిలుస్తుంది. అక్కడ బుద్ధదేవ్ భట్టాచార్య నాయకత్వంలో వామపక్ష ప్రభుత్వం ఉన్నా నందిగ్రాంలోని 10 వేల ఎకరాల పచ్చని పంట పొలాల్లో ప్రత్యేక ఆర్థిక మండలాల చట్టం ప్రకారం కెమికల్ హబ్ నిర్మాణం చేయడానికి ఇండోనేషియాకు చెందిన సలీం గ్రూపుకు అప్ప చెప్పారు. ఈ నిరంకుశ నిర్ణయంపై నందిగ్రాం ప్రాంత రైతాంగం, ప్రభుత్వం తన నిర్ణయాన్ని వెనక్కి తీసుకునే వరకు, ఆఖరికి 12 మంది రైతులు పోలీసు కాల్పుల్లో మరణించినా వెనకడుగు వేయకుండా దృఢ దీక్షతో ఉద్యమాన్ని సాగించారు. ఇలానే భూములను కాపాడుకోవడానికి ఒడిషాలోని జగత్సింగ్‌పూర్ జిల్లాలో దక్షిణకొరియాకు చెందిన పోస్కో ఉక్కు నిర్మాణ సంస్థపై ఆ ప్రాంత రైతాంగం సాగిస్తున్న నిరంతర పోరాటం, మన రాష్ట్రంలో సోంపేట, కాకరాపల్లి బీలభూముల రైతాంగం థర్మల్ ప్రాజెక్టుల నిర్మాణంపై సాగిస్తున్న పోరాటాలు నూతన రాజధాని ప్రాంత రైతాంగానికి ఆదర్శం కావాలి.

*(రచయిత సిపిఐ(ఎం.ఎల్) రాష్ట్ర కమిటీ సభ్యులు)* వీ

# తెలుగు రాష్ట్రాలపై స్వైన్‌ఫ్లూ విహారం

***రెండు తెలుగు రాష్ట్రాల్లోనూ స్వైన్‌ఫ్లూ వ్యాధి బారినపడి ఎంతోమంది సామాన్య ప్రజల ప్రాణాలు పోయాయనీ, ఈ వ్యాధి వ్యాపించకుండా పాలకులూ, అధికారులూ నివారణ చర్యలు తీసుకోవడంలో విఫలమయ్యారనీ అంటున్నారు* షేక్ కరీముల్లా**

గతకొద్ది రోజులుగా స్వైన్‌ఫ్లూ వ్యాధి మూలంగా మరణాలు సంభవిస్తున్నాయి. ఈ దశలో రెండు తెలుగు రాష్ట్రాలు ఉలిక్కిపడ్డాయి. మెడికల్ టూరిజానికి దక్షిణాదిలోనే మహానగరంగా చెప్పుకునే హైదరాబాద్‌ను స్వైన్‌ఫ్లూ వణికిస్తోంది. ఎక్కువ కేసులు ఇక్కడే నమోదైనాయి. ఇక రాష్ట్రాలలోని పలు గ్రామీణ ప్రాంతాలలో కూడా కేసులు నమోదవుతూ విస్తరిస్తున్న జాడలు కనిపిస్తున్నాయి. ఇలాంటి ప్రాణాంతక అంటు వ్యాధులు విస్తరిస్తే పరిస్థితి ఎలా ఉంటుందో ఎవరు ఊహించలేని పరిస్థితులలో తెలుగు రాష్ట్రాలలో భయాందోళనలు నెలకొన్నాయి.

చలి వాతావరణం స్వైన్‌ఫ్లూ వ్యాప్తికి దోహదకారిగా ఉంది. ఏ ఇద్దరు కలిసిన ఈ వ్యాధి గురించే చర్చించుకుంటున్నారంటే పరిస్థితిని ఊహించవచ్చు. జనం మందులు, మాస్క్‌ల కోసం డాక్టర్లను, మెడికల్ షాప్‌లను సంప్రదిస్తున్నారు. విధిలేని పరిస్థితులలో రెండు తెలుగు రాష్ట్రాలు కేంద్రాన్ని సాయం కోరాయి. ఈ నేపథ్యంలో సెంటర్ ఫర్ డిసీజ్ కంట్రోల్ వైద్య బృందాలు హైదరాబాద్‌కు వచ్చాయి.

ఈ ప్రాణాంతక వ్యాధి నుంచి రక్షణ ఎలా పొందాలనే అంశంపై ప్రజలకు అవగాహన కల్పించడంలో అధికార యంత్రాంగం ఘోరంగా విఫలమైంది. చల్లని స్వైన్‌ఫ్లూ మృత్యువు చాపకింద నీరులా విస్తరిస్తోంది. ఇప్పటికే అధికారికంగా 700 పై చీలుకు కేసులు నమోదయ్యాయి. రెండు రాష్ట్రాలలో ఈ వ్యాధి భారినపడి మృత్యువు ఒడిలోకి చేరుతున్న వారి సంఖ్య రోజురోజుకి పెరుగుతోంది.

ఈ ఏడాది అత్యధిక మృతుల సంఖ్య కేసులు తెలంగాణలో నమోదు కావడం గమనార్హం. 2009 నుంచి ఇప్పటి వరకు మొత్తం నమోదైన కేసులలో 80 శాతం కేసులు హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాల పరిసరాలలో నమోదయ్యాయి. కారణం ఇక్కడ జన సాంద్రత ఎక్కువ గనుక ఈ వైరస్ విస్తరిస్తుంది. జన సాంద్రత ఎక్కువగా ఉండి, ప్రయాణాలు ఎక్కువగా చేస్తే దీని వ్యాప్తి ఎక్కువగా ఉంటుంది. దీనికి తోడు ఈ వ్యాధి సోకిన తర్వాత ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలి అనే దానిపై అవగాహన లేకపోవడం వ్యాప్తికి మరొక కారణం. స్వైన్‌ఫ్లూ లక్షణాలున్న వ్యక్తి గదికే పరిమితం కాకపోవడం, జనంలో ఉండడం వలన ఈ వైరస్ మరింత మందికి సోకుతుంది. ఢిల్లీ స్వైన్‌ఫ్లూ కేసులలో ద్వితీయ స్థానంలో ఉంది. రాజాస్థాన్ 3వ స్థానంలో, గుజరాత్ 4వ స్థానంలో, తమిళనాడు, హర్యానా, మహారాష్ట్ర, కర్ణాటక, మధ్యప్రదేశ్, ఉత్తరప్రదేశ్‌లు ఆ తరువాతి స్థానాలలో ఉన్నాయి.

## వైరస్‌లతో మానవాళికి గల వైరం

మానవాళికి ప్రాణ నష్టం కలిగిస్తున్న సూక్ష్మజీవులతో గల వైరం ఇప్పటిది కాదు. భూమి వయస్సు 460 కోట్ల సంవత్సరాలైతే, మనకు లభ్యమైన అతి పురాతన శిలాజాల దాఖలాలను బట్టి బ్యాక్టీరియా, వైరస్‌లు 350 కోట్ల సంవత్సరాల క్రితమే ఉన్నట్లు తెలుస్తుంది. ఈనాడు మనకు తెలిసిన కొన్ని సూక్ష్మజీవులు ఆక్సిజన్, వెలుతురు కూడా లేకుండా బతకగలవు. భూమి పుట్టిన కొత్తలో చాలా వేడిగా ఉండేది. ఇప్పుడున్నట్లుగా ఆక్సిజన్ కూడా ఉండేది కాదు. ఇవి అప్పటి పరిస్థితులలో పరిణామం చెందినవే. అసలు ప్రకృతిలో ప్రాథమిక భూమిక సూక్ష్మజీవులదే. బ్యాక్టీరియాలు చిన్న తమ్ముళ్ల వైరస్‌లు.

1917 తర్వాత వైరస్‌ల గురించిన అవగాహన పెరుగుతూ వచ్చింది. ప్రకృతిలో రోగాల భారిన పడని ప్రాణి ఏదీ ఉండదు. మానవ జాతి విషయానికి వస్తే 14వ శతాబ్దపు ప్లేగు వ్యాధికి యూరప్‌లో వేల కొలది ప్రజలు చనిపోయారు. 15వ శతాబ్దపు చివరలో చెమటలు పట్టే ఒక వింత వ్యాధి వల్ల ఇంగ్లండ్‌లో వేల జనం చనిపోయారట. 1918లో మొదలైన ఒక రకమైన ఫ్లూ ప్రపంచ వ్యాప్తంగా నాలుగైదు కోట్ల మందిని బలితీసుకుంది. అలాగే మశూచి, క్షయ, పోలియో, హెపటైటిస్, క్యాన్సర్ వైరస్ (అంతు లేకుండా కణ విభజన చేయగలిగిన జన్యు పదార్థం ఉంటుంది) 1970 తర్వాత ఎయిడ్స్, ఎబోలా, హెపటైటిస్-సి మొదలగునవి ఆవిర్భవించడమే కాక పాతవాటిలోని కొన్ని మందులను ఎదుర్కోగలిగే అవతారాలెత్తాయి.

1980లలో బ్రిటన్‌లో పశువుల మాంసం తిన్న వారికి మ్యాడ్‌కెం, 2003లో చైనాలో తలెత్తిన సార్స్ వ్యాధికి కొంత మంది చనిపోయారు. పక్షుల, కోళ్ల ద్వారా ఈ మధ్య వస్తున్న బర్డ్ ఫ్లూ ఇప్పుడు తలెత్తిన స్వైన్‌ఫ్లూ మొదలగునవి ఈ వ్యాధుల వలన కోట్లాది మంది చనిపోయారు. 20వ శతాబ్దానికి పూర్వం యూరప్‌లో జరిగిన యుద్ధాలలో ఆయుధాలతో పోలిస్తే ఎక్కువ మంది రోగాల బారినపడి ప్రాణాలు కోల్పోయారు. ప్రపంచంలో ప్రతిచోట నిలదొక్కుకుని జీవిస్తున్న రకరకాల సూక్ష్మజీవుల నుంచి తప్పించుకోవడం అసాధ్యం. దీనికి కారణం వీటి నిర్మాణం అసాధరణమైనది. వీటికి న్యూక్లియస్ (కేంద్రం) ఉండదు. వీటి డిఎన్ఎ చిన్న చుట్టాలాగా కణం మధ్యలో తేలుతూ ఉంటుంది. వీటిలో కొన్ని రకాలు, ప్రతికూల వాతావరణంలో కూడా శతాబ్దాల పాటు నశించకుండా ఉండి, అనుకూల పరిస్థితి రాగానే మొలకెత్తుతాయి.

మరికొన్ని పరిస్థితులలో తమ ఉనికికే ప్రమాదం కలిగినప్పుడు ఇవి తమ సమీపంలోనో, పరిసరాలలోనో లభ్యమయ్యే డిఎన్ఎను స్వీకరించి తమ లక్షణాలను మార్చుకోగలవు. ఎట్టి పరిస్థితిలోను నాశనం కాకుండా ఉండేందుకు అవి విశ్వ ప్రయత్నం చేస్తూ ఉంటాయి. మనకు

కనపడని ఈ రకరకాల క్రిములు ఎప్పుడైనా, ఎక్కడైన మన ప్రాణాలు తీయగలవు. ఎన్నిరకాల కొత్త మందులు కనిపెట్టిన అవి తమ స్వభావాలని మార్చుకొని మానవాళి మీద దొంగ దెబ్బ తీస్తూనే ఉంటాయి. ఈ లక్షణాల రీత్యా ఈ సూక్ష్మజీవులను నాశనం చేయగలిగే యాంటీబయటిక్ మందులు వైరస్‌ల మీద పని చేయవు. వీటికి వ్యాక్సిన్‌లు, టీకాలు, యాంటీ వైరల్ మందులు వేసుకోవాలి. ఆరోగ్యంగా ఉండే జీవకణాలకు హాని కలిగించకుండా వైరస్‌ను మాత్రమే నాశనం చేయగలిగే మందుల తయారీలో చాలా ఇబ్బందులున్నాయి.

కాబట్టి అణు యుద్ధాలకు కూడా వెరవని పెద్ద దేశాలన్ని ఈ సూక్ష్మజీవుల దాడి గురించి ఆందోళన చెందుతున్నాయి. ఈ విషయంలో అందరూ ఏకమై ప్రపంచ ఆరోగ్య సంస్థల వంటి సంస్థల ద్వారా సకాలంలో తగిన చర్యలు తీసుకోకపోతే భయంకరమైన పరిణామాలు కలుగవచ్చు.

కనపడే శత్రువు కన్నా కనపడని శత్రువు వల్ల ప్రమాదం ఎప్పుడూ ఎక్కువే. ఈ ప్రాపంచిక శాస్త్రీయ దృక్పథం నుంచి ప్రస్తుతం విజృంభిస్తున్న స్వైన్‌ఫ్లూను ఎదుర్కోవలసి ఉంటుంది

**రెండేళ్లకోసారి వైరస్ విజృంభణ**

మనదేశంలో 2009 నుండి ఇప్పటివరకు ఏటా స్వైన్‌ఫ్లూ కేసులు నమోదవుతున్నాయి. ఈ ఏడాది మరింత విజృంభిస్తోంది. దీని కారక హెచ్-1, ఎన్-1 వైరస్ ప్రతి రెండేళ్లకొకసారి విజృంభిస్తోంది. ఎందుకంటే దీని పునరుత్పత్తికి సమయం ఇదే. పైపెచ్చు విపరీతంగా పెరిగిన చలి వాతావరణం దీని విజృంభణకు దోహదపడింది. అమెరికా నుంచి దిగుమతి అయిన స్వైన్‌ఫ్లూ మనదేశంలో మొదటి కేసు హైదరాబాద్‌లో నమోదయింది. 2009 మే 13న అమెరికా నుంచి వచ్చిన ఓ వ్యక్తికి ఈ వైరస్ సోకింది. అప్పటి నుండి ఇది దశల వారిగా విజృంభిస్తోంది.

**స్వైన్‌ఫ్లూ వ్యాధి లక్షణాలు**

దీని కారక వైరస్ పందుల నుండి మనుషులకు, మనుషుల నుండి మనుషులకు వ్యాప్తి చెందుతుంది. ఈ వైరస్ సోకిన వ్యక్తులు తుమ్మిన, దగ్గిన ఇతరులకు సోకుతుంది. సోకిన వారికి మొదట సాధారణ జ్వరం, గొంతునొప్పి, తుమ్ములు, ముక్కు, కళ్లవెంట నీరు కారడం, చలి, ఒళ్లు నొప్పులు తదితర లక్షణాలుంటాయి. తర్వాత దగ్గు, నీరసం, నిస్సత్తువ, వాంతులు, విరేచనాలు, ఆయసం, శ్వాస సంబంధిత సమస్యలు ఎక్కువవుతాయి. ఇక మూడవ దశలో ఊపిరి తిత్తులకు ఇన్‌ఫెక్షన్ సోకుతుంది. ఈ దశకు చేరుకున్న రోగులు 70 శాతం చనిపోతారు.

**నిరోధించడం ఎలా?**

నివారణ చర్యల్లో భాగంగా వ్యాక్సిన్ వేసుకోవచ్చు గాని అందరికి పనికిరాదు. వ్యాధి నిరోధక శక్తి తక్కువగా ఉన్నవారు పిల్లలు, వృద్ధులు వ్యాక్సిన్ వేసుకోవాలి. వాక్సిన్ 70 శాతం వరకే రక్షణనిస్తుంది. మిగతా 30 శాతం జాగ్రత్తలతోనే సాధ్యం. శుభ్రంగా చేతులను తరచూ సబ్బుతో కడుక్కోవాలి. చేతివేళ్లు శుభ్రం చేసుకోకుండా నోరు, కళ్లు, ముక్కులను తాకరాదు. దగ్గు, తుమ్మేటప్పుడు టిష్యు పేపర్స్ అడ్డం పెట్టుకోవాలి. వెంటనే వాటిని పారవేయాలి. వ్యాధి గ్రస్తులను కలవడం, రద్దీ ప్రాంతాలలో తిరగడం తగ్గించుకోవాలి. బయటి ప్రాంతాలకు వెళ్లవలసి వస్తే మాస్క్ ధరించాలి. శ్వాస సంబంధిత ఇబ్బందులు, ఛాతి పొత్తికడుపులో నొప్పి, అకాస్మాత్తుగా కోమాలోకి వెళ్లడం తీవ్ర జ్వరం వాంతులు, విరోచనాలు లాంటి లక్షణాలు కనిపిస్తే అశ్రద్ధ చేయకుండా మంచి వైద్యులను సంప్రదించాలి.

**ప్రభుత్వాల పాత్ర**

స్వైన్‌ఫ్లూ ప్రమాద ఘటికలు తారాస్థాయికి చేరిన కేంద్ర, రాష్ట్రాల వైఖరి మాత్రం నిమ్మకు నిరెత్తినట్లుంది. కనీసం వ్యాధి నిర్ధారణకు కావలసిన ల్యాబ్‌లు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఎక్కడా లేవని, నిర్ధారణ పరీక్షలకు హైదరాబాద్‌కు పంపడం మూలంగా కొంత ఆలస్యం అవుతున్నమాట వాస్తవమేనని ఆరోగ్య సంచాలకులు డా. అరుణ కుమారి చెప్పారు. ఒకవైపు రోజు రోజుకు రోగుల సంఖ్య, మరణాల సంఖ్య పెరుగుతున్న రాష్ట్రంలో స్వైన్‌ఫ్లూ ప్రమాదం లేదని, అప్రమత్తంగా ఉన్నామని మంత్రులు ప్రకటనలు ఇవ్వడం తప్ప అచరణ శూన్యం. ఈ వ్యాధి సోకిన వారు 'టామీఫ్లూ' మందులు రోజుకు రెండు ట్యాబ్లెట్స్ చొప్పున వారం రోజులు వాడాల్సి ఉంటుంది. కాబట్టి ప్రతి ఏరియా, జిల్లా అసుపత్రుల్లో ఈ వ్యాధికి సంబంధించిన 'టామీఫ్లూ' మందులు పూర్తి స్థాయిలో అందుబాటులో ఉంచాలి.

ముందుజాగ్రత్త చర్యలో భాగంగా 'ఆర్స్ నికమ్ ఆల్బమ్' -200 పోటెన్సీ (పెద్దలకు) 30 పోటెన్సీ (పిల్లలకు) లాంటి చౌకగా లభించే హోమియో మందులను విరివిగా ప్రజలకు అందుబాటులో ఉంచి స్వచ్ఛందంగా అందించాలి. ఈ చర్యలు యుద్ధ ప్రాతిపదికన చేపట్టాలి. అవసరమైతే హెల్త్ ఎమర్జెన్సీ ప్రకటించాలి. ఈ చర్యలు చేపట్టకుండా చేతులు కాలక ఆకులు పట్టుకున్నట్లు కేంద్రం, రాష్ట్రాలకు మొక్కుబడి ఆదేశాలిచ్చి చేతులు దులుపుకుంది. ఇక రాష్ట్రాలది అదే వరస. చికిత్స చేస్తున్న వైద్యులకు కూడా వ్యాధి సోకడం ఆందోళనకరం. వీరికి కావలసిన మాస్క్ లాంటి రక్షణ సామగ్రి కూడా కనీసం అందుబాటులో లేదంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు.

120 కోట్లకు పైగా జనాభా కలిగిన దేశంలో కొత్త అంటు వ్యాధి ప్రబలితే అంతకంటే ప్రమాదం మరేముంటుంది. అసలు ఇలాంటి ఉపద్రవం వస్తే ఎదుర్కొనే సమగ్ర వ్యవస్థ మనకు లేదు. ఏ పార్టీ అధికారంలోకి వచ్చిన ప్రజారోగ్యానికి అరకొర నిధులు కేటాయించడం తప్ప చేసిందేమి లేదు. దేశ స్థూల జాతీయోత్పత్తిలో 5 శాతం నిధులు వైద్య, ఆరోగ్య, కుటుంబ సంక్షేమానికి కేటాయించాలని ఐఎంఎ నిపుణుల సూచనలను ప్రభుత్వాలు పెడ చెవిన పెడుతున్నాయి. ప్రస్తుతం గ్రామాలు, పట్టణాలలో దోమల మందుకు కూడా దిక్కులేదు. రక్షిత తాగునీరు లేదు. పారిశుధ్య పరిరక్షణ కూడా లేదు. ఇకనైనా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఈ స్వైన్‌ఫ్లూ నివారణకు తక్షణ చర్యలు చేపట్టి ప్రజల ప్రాణాలు కాపాడాలి. ప్రజా ఆరోగ్యానికి సరిపడ నిధులు ఇచ్చి మౌలిక సదుపాయాలు కల్పించి ప్రజారోగ్యానికి పెద్దపీత వేయాలి.

*(రచయిత ఉపాధ్యాయుడు)* వీ

# ఆప్ విజయం దేనికి సూచన?

***మతవిద్వేషాలు రెచ్చగొడుతూ, కార్పొరేట్ సంస్థల సేవలో తరిస్తున్న పాలకులకు బదులు ప్రజలు ప్రత్యామ్నాయాన్ని వెతుక్కుంటున్నారనడానికి ఢిల్లీ ఎన్నికల ఫలితాలే సూచిక అంటున్నారు*** **వై. రామచంద్రం**

ఢిల్లీ అసెంబ్లీ ఎన్నికల ఫలితాలు దేశ వ్యాప్తంగా చర్చనీయాంశంగా మారాయి. ఎన్నికల ఫలితాలను ఆయా పార్టీలు, ప్రజాస్వామిక వాదులు, మీడియా రకరకాలుగా విశ్లేషిస్తోంది. ఈ ఫలితాల ప్రాధాన్యతను వివరించడమే ఈ వ్యాస ఉద్దేశ్యం.

ఎన్నికలు జరిగింది దేశ రాజధాని ఢిల్లీ కావడం. దానికి ఉండే ప్రాధాన్యత రీత్యా అధికారంలో ఉన్న బిజెపి తన ప్రతిష్ఠను నిలుపుకోవడం కోసం ఢిల్లీ ఎన్నికలను ప్రతిష్ఠాత్మకంగా తీసుకుంది. ఎన్నికల ప్రచారం కోసమే బిజెపికి చెందిన 120 మంది ఎంపిలు, 19 మంది కేంద్ర మంత్రులు, బిజెపి పాలిత రాష్ట్రాల ముఖ్యమంత్రులు, సంఘపరివార్, ప్రధాని నరేంద్రమోడీ ప్రచారంతో ఢిల్లీని హోరెత్తించారు. కేంద్రంలో బిజెపి అధికారంలోకి వచ్చిన తరువాత ఎన్నికలు జరిగిన రాష్ట్రాల్లో తన ఆధిక్యతను కొనసాగిస్తూ వచ్చింది. గత పార్లమెంట్ ఎన్నికల్లో ఏడు పార్లమెంట్ స్థానాలనూ గెలుచుకున్న పార్టీ అసెంబ్లీ ఎన్నికల్లో మూడు ఎంఎల్ఏ స్థానాలకే పరిమితమై ప్రతిపక్ష హోదా కూడా దక్కలేదు. గతంలో అధికారంలో ఉన్న కాంగ్రెస్ పార్టీ తన ఉనికిని కూడా నిలబెట్టుకోలేదు. వివిధ రాజకీయ పార్టీల గెలుపు ఓటములకు సంబంధించిన లెక్కలు ఒపినియన్ పోల్స్ రూపంలో విడుదలయ్యాయి. వీటి అంచనాలనూ తారుమారు చేస్తూ ఊహించని ఆధిక్యతతో ఆమ్ ఆద్మీ పార్టీ అధికారంలోకి రావడం ప్రాధాన్యతకు ప్రధాన కారణమైంది.

కేంద్రంలో ఒక స్థిరమైన ప్రభుత్వం ఉంటేనే తమ ప్రయోజనాలు సాఫీగా నెరవేరుతాయని కోరుకునే కార్పొరేట్ సంస్థలు, సంఘపరివార్, మీడియా బిజెపిని అధికారంలోకి తెచ్చాయి. గుజరాత్‌ను 'అభివృద్ధి' మార్గం వైపు నడిపించిన మోడీని ప్రధాన మంత్రిగా ముందుకు తెచ్చాయి. ఇవన్నీ కలిసి బిజెపికి కేంద్రంలో ప్రతిపక్షం కూడా లేని మెజారిటీని అందించాయి. దీంతో బిజెపికి, సంఘపరివార్ శక్తులకు ఎదురులేకుండా పోయింది. బిజెపి అధికారంలోకి రావడానికి కారణమైన కార్పొరేట్ సంస్థల ప్రయోజనాలే ప్రధానమైపోయాయి. వీటి ప్రయోజనాలను నెరవేర్చడం కోసం అప్రజాస్వామిక పద్ధతుల్లో భూసేకరణ వంటి ఆర్డినెన్స్‌లను తెచ్చింది. ఘర్ వాపసీ పేరుతో ఇతర మతాల వారిని హిందూ మతంలోకి బలవంతంగా తీసుకురావడానికి మత మార్పిడులకు పాల్పడుతోంది. ఎనిమిది నెలల పాలన కాలంలో బిజెపి ముందుకు తెచ్చిన మతోన్మాదాన్ని, గత యుపిఎ ప్రభుత్వం తెచ్చిన నూతన ఆర్థిక విధానాలను మరింత వేగంగా అమలుచేస్తోంది. ఈ విధానాల వల్ల అవినీతిలో కూరుకుపోయిన కాంగ్రెస్‌ను, వాటిని మరింత బలంగా అమలుచేస్తున్న బిజెపిని ఢిల్లీ ప్రజలు అధికారానికి దూరం పెట్టారు. అవినీతి వ్యతిరేక ఉద్యమంలో కేజ్రీవాల్‌తో కలిసి పనిచేసిన కిరణ్‌బేడీని అదే కేజ్రీవాల్‌పై బిజెపి ముఖ్యమంత్రి అభ్యర్థిగా నిలబెట్టడంతో పార్టీ స్థానిక నాయకులే బిజెపికి సహకరించలేదు. బిజెపి విదేశీ ఆర్థిక విధానాలను అవలంబిస్తూ, దేశీయంగా సాంస్కృతిక విధానాన్ని అవలంబించడాన్ని ప్రజలు తిరస్కరించారు.

దేశ రాజధాని ఢిల్లీలో గెలిస్తే మోడీ నియంత ధోరణికి పట్టపగ్గాలుండవనే ఉద్దేశంతో కూడా అంతర్గత నాయకత్వం బిజెపి గెలుపుకు సహకరించలేదు. బిజెపేతర పార్టీలన్నీ కలిసి బిజెపిని ఓడించాయనేది పోలయిన ఓట్ల శాతాన్ని బట్టి తెలుస్తోంది. ఎన్నికల పార్టీలకు అధికారమే ప్రధానం తప్ప పార్టీకోసం పనిచేసిన కార్యకర్తలు, నాయకులు అప్రధానం అనే విషయం చాలా స్పష్టంగా మనకు మరోసారి ఇక్కడ కనిపించింది.

ఢిల్లీ ఎన్నికల్లో జాతీయ పార్టీలను ఓడించి ఊహించని ఆధిక్యతతో ఆమ్ ఆద్మీ పార్టీ గెలిచింది. దీనికి ప్రారంభం అన్నాహజారేతో కేజ్రీవాల్ కలిసి పనిచేసిన అవినీతి వ్యతిరేక ఉద్యమంతో బీజం పడింది. అవినీతికి వ్యతిరేకంగా పనిచేసిన కొద్దిమంది 'ఆమ్ ఆద్మీ పార్టీ'ని ఏర్పాటు చేశారు. గత ఎన్నికల్లో పోటీచేసి ఇతర పార్టీల సహకారంతో అధికారంలోకి వచ్చింది. ఢిల్లీ ప్రజలు స్థానికంగా ఎదుర్కొంటున్న ప్రధాన సమస్యలయిన తాగునీరు, విద్య, వైద్యం, విద్యుత్, అవినీతి, మహిళలకు భద్రత కల్పించడమే ఆమ్ ఆద్మీ పార్టీ ఎజెండాగా ప్రకటించి ముందుకుసాగింది. ఈ క్రమంలో ఇతర పార్టీలు అసెంబ్లీలో జనలోక్‌పాల్ బిల్లు పెట్టడానికి సహకరించకపోవడంతో కేజ్రీవాల్ ముఖ్యమంత్రి పదవికి రాజీనామా చేశారు. కేజ్రీవాల్ తాను చేసిన పొరపాటును క్షమించమని ఈ ఎన్నికల ప్రచారంలో ప్రజలను కోరారు. ఈ ప్రచారంలో గతంలో అధికారంలో ఉన్నపుడు ఇచ్చిన హామీలైన తాగు నీరు, విద్య, వైద్యం, తక్కువ ధరకు విద్యుత్, అవినీతి నిర్మూలన అనే విషయాలపైనే కేంద్రీకరించి ప్రజల ముందుకెళ్లాడు. ఆమ్ ఆద్మీ పార్టీ గత 49 రోజుల పాలనలో సామాన్య ప్రజలకు కొంత ఏమైనా చేస్తారనే భావన కలిగించింది. బిజెపి తాము అధికారంలోకి వస్తే ప్రజలకు ఏమి చేయగలమో అనే దానికన్న ఆమ్ ఆద్మీ పార్టీ నాయకులపై వ్యక్తిగత విమర్శలు చేయడంతో అది ఆమ్ ఆద్మీ పార్టీకి అనుకూలాంశంగా మారిపోయింది. పూర్తి అవినీతిలో కూరుకుపోయిన యుపిఎను, హిందూ మతోన్మాద, నూతన ఆర్థిక విధానాల ఎజెండాతో తోసుకు వస్తున్న ఎన్‌డిఎను ప్రజలు అధికారానికి దూరంపెట్టి ఆమ్ ఆద్మీ పార్టీని గెలిపించారు. ఇది పాలకుల పట్ల ప్రజలు తెలిపిన నిరసనగా భావించాలి. చీపురు పట్టిన మనిషికి ఈ సమాజంలో

ఉన్న విలువెంతో మనకు తెలుసు. చీపురు గుర్తు కూడా ఆమ్ ఆద్మీ పార్టీకి ఒక అనుకూల అంశమయింది. చీపురే తమ జీవనోపాధిగా బతికే వాళ్లు, ఆటోవాలాలు, కూలీలు ఆమ్ ఆద్మీ పార్టీకి ఈ ఎన్నికల్లో మద్దతుగా నిలిచారు. అట్లాగే గుత్తపెట్టుబడిదారుల మధ్య పోటీని ఎదొర్కోలేని కింది స్థాయి పెట్టుబడిదారులు కూడా ఆమ్ ఆద్మీ పార్టీకి మద్దతుగా నిలిచారు. బిజెపిలోని కొద్ది మంది నాయకులు మోడీ అహంకారాన్ని దించడానికి బిజెపికి సహకరించలేదు.

ఎనిమిది నెలల పాలనలో మోడీ 'అభివృద్ధి' పేరుతో తోసుకు తెస్తున్న కార్పొరేట్, పెట్టుబడిదారులకు అనుకూలమైన నూతన ఆర్థిక విధానాలను, హిందూ మతోన్మాదాన్ని ప్రజలు తిరస్కరిస్తున్నారనడానికి ఈ ఎన్నికల ఫలితాలే నిదర్శనం. పట్టణాల్లో ఉండే ఆస్తిపర వర్గాల అండతో పట్టణాల్లో పట్టు సంపాదించి గ్రామాలకు విస్తరించాలనే బిజెపి ఎజెండాకు ఢిల్లీ ప్రజలు గండికొట్టారు.

మోడీ ప్రపంచ కార్పొరేట్ శక్తుల దృష్టిని ఆకర్షించాలనే ఉద్దేశంతో అతి తక్కువ కాలంలో ఏ ప్రధాని తిరుగనన్ని దేశాలు తిరిగాడు. దీని వల్ల దేశానికి జరిగిన ప్రయోజనాలకంటే ఎక్కువ ప్రజా ధనం వృథా అయింది. ఒక పక్క ప్రజాస్వామిక దేశమని చెపుతూనే ప్రభుత్వం ప్రజా అభిప్రాయాన్ని పక్కకునెట్టి, ప్రజా ప్రయోజనాలకు వ్యతిరేకమైన ఆర్డినెన్స్‌లు తెచ్చి చట్టంగా మార్చడానికి తీవ్ర ప్రయత్నం చేస్తోంది. పరమత సహనం కోల్పోయి ఇతర మతాల పట్ల విద్వేషాన్ని ప్రకటనల రూపంలో, భౌతిక దాడుల రూపంలో వ్యక్తం చేయడం తీవ్రమైంది. ప్రభుత్వం ఒక వైపు స్వచ్ఛభారత్ అంటూ మరో వైపు ప్రకృతి విధ్వంసం చేస్తున్న కార్పొరేట్ సంస్థలకు ఇబ్బడి ముబ్బడిగా అనుమతులిస్తోంది. కార్పొరేట్ సంస్థల సేవకోసం గతంలో చేసిన చట్టాలనే మారుస్తోంది. మోడీ ముఖ్యమంత్రిగా గుజరాత్‌లో మతకల్లోలాలు సృష్టించి మైనారిటీలపై దాడులు చేసి మూడువేల మందిని చంపించాడు. ప్రజల మధ్య అభద్రతా భావాన్ని కల్పించి స్మశాన శాంతిని ఏర్పాటు చేసి అధికారంలోకి వచ్చాడు. బిజెపి అధికారంలోకి రావడం కోసం గుజరాత్ నమూనానే చాలా ప్రణాళికా బద్ధంగా అమలు చేస్తుండడాన్ని ప్రజలు గమనిస్తున్నారు. కశ్మీర్‌లో ఎన్నికలు జరుగుతాయనగా పొరుగుదేశమైన పాకిస్థాన్‌తో సృష్టించిన యుద్ధ వాతవరణమే దీనికి కారణం. ఆ క్రమంలోనే ఢిల్లీ ఎన్నికల సందర్భంగా చర్చీలపై దాడులను అర్థం చేసుకోవాలి. ఈ ప్రయత్నం ఫలించకపోగా అది మరింత వ్యతిరేకతకు దారితీసి ఆమ్‌ఆద్మీ పార్టీ ఆధిక్యతకు అవకాశం కల్పించింది.

దేశంలో కనీసం ప్రతిపక్షం లేకపోవడం పాలకులు తమ ఇష్టానుసారంగా ఎలా వ్యవహరిస్తారో ప్రభుత్వం తెచ్చిన 6 ఆర్డినెన్స్‌లను చూస్తే తెలుస్తుంది. బీమా రంగంలో విదేశీ పెట్టుబడుల వాటాను పెంచడం, రైతుల అభిప్రాయం లేకుండా భూసేకరణకు మార్గం సుగమం చేయడం, బొగ్గు క్షేత్రాలను పొందడానికి కాచుకు కూచున్న కార్పొరేట్ సంస్థలకు కట్టబెట్టడం లాంటి ఆరు ఆర్డినెన్స్‌లను చట్టబద్ధం చేయడానికి బడ్జెట్ సమావేశాలను వాడుకోనున్నారు. ఇదే పరిస్థితి ఢిల్లీలో కూడా వచ్చినా ఆశ్చర్యపడవలసింది ఏమి లేదు.

ఈ ఫలితాల్లో బిజెపి అనుకున్నట్లు ఢిల్లీ మత విద్వేషాల ప్రణాళిక పారకపోవడం వల్ల బిజెపికి గతంలో వచ్చిన ఓట్ల శాతం కంటే కొద్ది తేడా వచ్చింది. ఎందుకంటే బిజెపి ఎక్కువ సీట్లు గెలువకపోవచ్చు కాని ఓటు బ్యాంకులో కొద్ది తేడా మాత్రమే వచ్చింది. బిజెపికి సంబంధించిన ఉన్నత వర్గాల ఓటు బ్యాంకు దానికి స్థిరంగానే ఉంది. మధ్యతరగతిలో ఒక సెక్షన్, అట్టడుగు వర్గాలు ఆమ్ ఆద్మీ పార్టీకి ఓటు వేశాయనేది పోలయిన ఓట్ల శాతాన్ని బట్టి తెలుస్తోంది. దీన్నిబట్టి ఈసారి ఎన్నికల్లో కొంత వర్గ సమీకరణ జరిగింది.

చాయ్‌వాలాగా ప్రచారం చేసుకున్న వ్యక్తి ఈ రోజు వేసుకునే బట్టల ఖరీదు కోట్లలో ఉంది. రాజకీయ నాయకులు అధికారం కోసం ప్రజల్ని ఎన్ని రకాలుగా నమ్మిస్తారో బిజెపి వేస్తున్న ఎత్తులను చూస్తే మనకు చాలా స్పష్టంగా అర్థమవుతుంది. గత పార్లమెంట్ ఎన్నికల్లో బిజెపి అధికారంలోకి వస్తే విదేశాల్లో దాచిన అక్రమ సంపాదనను దేశానికి తిరిగి తెస్తామని ప్రజలను నమ్మించింది. అధికారంలోకి రాగానే కుంటి సాకులు వెతుకుతూ విదేశీ చట్టాలు ఒప్పుకోవని పూటకో మాటతో ప్రజలను తప్పుదోవ పట్టించే ప్రయత్నం చేస్తోంది.

కేంద్రంలో జిజెపి అధికారంలోకి వచ్చి మోడీ ప్రధాని అయిన తరువాత పార్టీలోని నాయకులు, మంత్రులు హిందూ మతోన్మాదాన్ని రెచ్చగొట్టే తీవ్రమైన ప్రకటనల పట్ల ఇంతవరకు స్పందించలేదు. ఢిల్లీ ఎన్నికల ఫలితాలు వెలువడి వాటిపై సమాజంలో ప్రభుత్వ విధానాలపై, సమాజంలో చర్చ జరుగుతోంది. ఈ క్రమంలో మోడీ దేశంలోని అన్ని మతాలను సమానంగా చూస్తామని, కించపరిచే విధంగా ఎవరు వ్యవహరించినా కఠిన చర్యలు తీసుకుంటామని ప్రకటన చేశారు. దీన్ని ప్రజలు ఎలా విశ్వాసంలోకి తీసుకుంటారు? ఇందులో అవకాశవాదం తప్ప ఇంకేమీ లేదనేది ఆ పార్టీ నడిచి వచ్చిన కాలం చెపుతోంది.

బీహార్‌లో బిజెపి అధికారం కోసం ప్రభుత్వంలో అంతర్గత సంక్షోభం సృష్టించి చేయగలిగిన ప్రయత్నాలు చేసి విఫలం అవడంతో గొంతు మార్చింది. ఎన్నికలు దగ్గరపడుతుండడంతో మోడీ, బిజెపి నాయకత్వం తమ నిర్ణయాల పట్ల తామే సరయినవి కావు అనే విధంగా మాట్లాడుతున్నారు. ఈ విధానాలు ఎన్నికల అవకాశవాదం తప్ప వీరికి ప్రజా ప్రయోజనాలు ఏవీ పట్టవు అనేదానికి ఇదొక నిదర్శనం.

ఢిల్లీలో ఆమ్ ఆద్మీ పార్టీ గెలుపును పాలక ప్రభుత్వ విధానాల పట్ల ప్రజలు తిరస్కార భావంతో వేసిన ఓటుగా అర్థం చేసుకోవాలి. అయితే ఆమ్ ఆద్మీ పార్టీ అధికారంలోకి రావడంతో ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పు వస్తుందనే భ్రమలు ఏమీ లేవు. కాని పాలకులకు ఇది ఒక హెచ్చరికగా పనిచేస్తుంది. పాలనా విధానాల్లో మార్పు రాకుండా ప్రజల జీవితాల్లో మార్పురాదు. ఎందుకంటే ముప్పయేళ్లు పశ్చిమబెంగాల్‌ను ఏలిన సిపిఎం ప్రజల మౌలిక అవసరాలు తీర్చకపోవడంతో ప్రజలు తమ మౌలిక అవసరాల కోసం పోరాడుతున్నారు. తమిళనాట బ్రాహ్మణ వ్యతిరేక, ద్రవిడ ఉద్యమం నుంచి పుట్టుకు వచ్చిన డిఎంకె, అన్నాడిఎంకె పార్టీలు ఆ స్ఫూర్తిని నిలుపుకోకుండా అవినీతిలో కూరుకుపోయాయి. ఉత్తర ప్రదేశ్‌లో దళితులకు రాజ్యాధికారం పేరుతో వచ్చిన బహుజన సమాజ్ పార్టీ కూడా మేము అవినీతికి అతీతులం ఏమి కామని నిరూపించుకుంది. తెలుగు ప్రజల ఆత్మగౌరవం పేరుతో వచ్చిన తెలుగుదేశం పార్టీ పాలనలో కనీస ప్రజాస్వామిక హక్కులను కూడా అమలు చేయలేదు. ప్రజా పోరాటాల నేపథ్యాన్ని అర్థం చేసుకోకుండా

# పెరుమాళ్ మురుగన్ - రచనా స్వేచ్ఛ

***సమాజంలోని మూఢ విశ్వాసాలను ప్రశ్నించినందుకు హిందుత్వ శక్తులు రచయితపై మానసిక, భౌతిక దాడులు జరిపి ఆయన రచనలను తగులబెట్టి భావ ప్రకటనా స్వేచ్ఛను హరిస్తున్నారని అంటున్నారు భాస్కర్ ఏంపెల్లి***

కొంగునాడుగా పిలువబడే పశ్చిమ తమిళనాడులోని గౌండర్ సామాజిక వర్గానికి చెందిన రచయిత పెరుమాల్ మురుగన్. స్థానికంగా ఉన్న సామాజిక అంశాలను తీసుకొని నవలలు, కథలు, కవిత్వం రాస్తుంటాడు. తమిళనాడు ప్రభుత్వ 'కథ బుక్స్' నుండి అవార్డులు అందుకున్నాడు.

ఇప్పుడు వివాదాస్పదమయిన 'మాదొరుబాగన్' (వన్ పార్ట్ ఉమన్) అర్ధనారీశ్వరుడు అనే అర్థంలో వచ్చిన పుస్తకం పెరుమాల్ మురుగన్ రాశాడు. తిరుచెంగొడ్ అనే పట్టణంలో పద్నాలుగు రోజులు జరిగే అర్ధనారీశ్వరుని దేవాలయ ఉత్సవాలకు, ఆ ప్రాంతంలో 'దేవుడిచ్చిన బిడ్డలుగా' పిలవబడుతున్న వారికి సంబంధం చెప్పే ప్రయత్నంలో వచ్చిందీ నవల. కలి, పొన్న అనే గౌండర్ కులానికి చెందిన అన్యోన్య దంపతులు పిల్లలు పుట్టకపోవడం వల్ల చాలా అవమానాలు ఎదుర్కొంటారు. అందరు దేవుళ్లకు మొక్కి ఆర్థికంగా నష్టపోతారు. అయినా వారికి పిల్లలు కలుగరు. ఒక రోజు కలి అమ్మ, పొన్నను చెరియట్ ఉత్సవానికి పంపిద్దాం, దేవుడే తనకు పిల్లలు ఇస్తాడు అని చెపుతుంది.

అర్ధనారీశ్వరుని దేవాలయంలో జరిగే పద్నాలుగు రోజుల ఉత్సవంలో చివరి రోజు జరిగేదే ఈ ఉత్సవం. ఆ రోజు రాత్రి దేవాలయ పరిసరాల్లో అన్ని నిబంధనలు ఎత్తివేస్తారు. పిల్లలు లేనివారు ఇక్కడ ఎవరితోనైనా ఇష్టంతో శృంగారంలో పాల్గొనవచ్చు. ఆ రోజు పురుషున్ని దేవునిగా చూస్తారు. అలా పుట్టిన పిల్లలను దేవుడిచ్చిన పిల్లలు అంటారు. దానికి కలి ఒప్పుకోడు. కానీ ఒప్పుకున్నాడని చెప్పి పొన్నను పుట్టింటివారు చెరియట్ ఉత్సవానికి పంపిస్తారు. అది తెలిసిన కలి చాలా వేదనకు గురవుతాడు. అతని మానసిక స్థితి పొన్నను ఇక తన భార్యగా ఒప్పుకోడేమో లేదా ఆత్మహత్య చేసుకుంటాడేమో అనే భావంలో నవల ముగుస్తుంది.

ఈ నవల రచయిత దేవాలయం చరిత్రను సాహిత్యంలో, జానపదంలో ఉన్న ఆధారాలను తీసుకుని పట్టణ నిర్మాణం, ఆచారాలు, మత జీవితం స్వాతంత్ర్యానికి పూర్వం ఎలా ఉన్నాయో రాశారు. ఇది ఊహా జీవితంగా రాసింది కాదు. రచయిత రెండు సంవత్సరాలు పరిశోధన చేసి స్థానిక సాహిత్యం నుండి ఆధారాలు తీసుకుని చరిత్రను నవలీకరించడం జరిగింది.

---

ప్రశ్నిస్తు ముందుకు వస్తున్న ఉద్యమాలను అణిచివేయడమే పరిష్కారంగా ఎంచుకుంటున్నారు. తెలంగాణలో ప్రజలు, ముఖ్యంగా 1969లో నుంచి చేసిన పోరాటాల ఫలితంగా వచ్చిన తెలంగాణ రాష్ట్రంలో ప్రజల పరిస్థితి ఎలా ఉందో చూస్తూనే ఉన్నాం. రాజ్యాంగంలో పొందు పరిచిన కనీస ప్రజాస్వామిక హక్కులను కూడా అమలు చేయడం లేదు. ఎన్నికల్లో నెగ్గి అధికారంలోకి వచ్చాక ప్రజల్లో ఉన్న అసంతృప్తిని తమ స్వంత ప్రయోజనాలకు మాత్రమే వాడుకుంటున్నాయి. ఆ ప్రజల నిరసనలను నీరుగార్చే ప్రయత్నం చేస్తాయి తప్ప, ప్రజలు లేవనెత్తుత్తున్న మౌలిక సమస్యలకు పరిష్కారాలు చూపడంలేదు. ప్రజలు తమ మౌలిక సమస్యలు తీరేవరకు ప్రత్యామ్నాయ మార్గాలు ఎప్పుడూ వెతుకుంటూనే ఉన్నారు.

వ్యవస్థలో ఎక్కడో ఒక దగ్గర మాత్రమే లోపం ఉందని చెప్పి అది ఒకటి బాగు చేస్తే అంతా బాగుంటుందని ప్రజలను నమ్మించడానికి రకరకాల వ్యవస్థలు, పార్టీలు రకరకాల కారణాలతో ముందుకు వస్తున్నాయి. అందులో భాగంగా వచ్చిందే ఆమ్ ఆద్మీ పార్టీ. అంతే తప్ప ప్రజల జీవితాల్లో మౌలికమైన మార్పు ఈ పాలకుల వల్ల సాధ్యం కాదనడానికి 68 ఏళ్లు మన కళ్లముందే గడిచిన చరిత్ర చెపుతున్న పాఠం. ఇక ఆమ్ ఆద్మీ పేరుతో వచ్చిన పార్టీలోని నాయకుల చరిత్రను చూస్తే కోటీశ్వరులు, నేర చరిత్ర కలిగి న్యాయస్థానాల్లో కేసులు ఎదుర్కొంటున్న వాళ్లు ఎక్కువగా ఉన్నారు.

ఈ ఫలితాలు మోడీని, బిజెపిని నేల మీదకు దించడానికి, మోడీ అహంకారానికి కాస్త విరామంగా భావించవచ్చు. ఇక్కడ వేల సంవత్సరాలుగా ప్రజలు కాపాడుకున్న సహజ వనరులను బహుళజాతి సంస్థలకు కట్టబెట్టడంలో పోటీపడి, స్థానిక ప్రజలను నిర్వాసితులను చేస్తున్నారు. ఇదే అభివృద్ధి అని నమ్మిస్తున్నారు. అందులో వచ్చే కమిషన్లతో సంతృప్తిపడుతూ అధికారం నిలుపుకునే ప్రయత్నమే చరిత్ర పొడవునా కొనసాగుతోంది. ఈ పాలకుల విధానాలకు కొంత భిన్నంగా ఆమ్ ఆద్మీ పార్టీ ముందుకు తెచ్చిన ప్రజల కనీస అవసరాలైన తాగు నీరు, విద్యుత్ చార్జీల తగ్గింపు, అవినీతి నిర్మూలన, మహిళల భద్రత వంటి అంశాలు ఢిల్లీ సామాన్య ప్రజలు ఆమ్ ఆద్మీ వైపు మొగ్గు చూపడానికి కారణం. ఇది ప్రజలకు ఒక ఉపశమనంగా అర్థం చేసుకోవాలి. ఇంతవరకు ఏలిన పార్టీల పట్ల ఎంత వ్యతిరేకత ఉందో ఈ తీర్పును బట్టి మనకు అర్థమవుతోంది. ఇది పాలక పార్టీల విధానాల పట్ల ప్రజలు వ్యక్తంచేసిన నిరసననే తప్ప ఇది ప్రజలకు ప్రత్యామ్నాయం ఎంత మాత్రం కాదు. ప్రజలు ప్రత్యామ్నాయం కోరుకుంటున్నారనడానికి ఢిల్లీ ఎన్నికల ఫలితాలు కూడా ఒక సంకేతం.

*(రచయిత వీక్షణం కరస్పాండెంట్)* వీ

ఈ పుస్తకం 2010లో తమిళంలో వచ్చింది. 2014లో ఇంగ్లిష్ అనువాదం వచ్చిన తర్వాత ఈ నవల మీద వివాదం చెలరేగింది. తిరుచెంగొడ్ అర్ధనారీశ్వరుని దేవాలయాన్ని, మహిళా భక్తులను కించపరిచేదిగా ఉందని బిజెపి, ఆర్ఎస్ఎస్, స్థానిక హిందూ మత సంస్థలయిన హిందూ మక్కల్‌కచ్చి, హిందూ మున్నని అనే సంస్థలు నవల ప్రతులను తగులబెట్టాయి. రచయితకు ఫోన్లో బెదిరింపులు, తిట్లు ఎక్కువయ్యాయి. ఒక రోజు కొంత మంది వ్యక్తులు రచయిత ఇంటికి గుంపుగా వచ్చి పుస్తక ప్రతి కావాలని అడిగారు. తిరుచెంగొడ్ పట్టణ ఆర్ఎస్ఎస్ అధ్యక్షుడు మహాలింగం తన కార్యకర్తలతో అర్ధనారీశ్వరుని దేవాలయం నుండి పోలీస్‌స్టేషన్ వరకు ఊరేగింపు తీసి, పోలీస్‌స్టేషన్ ముందు కాలపెట్టారు. రచయితను, ప్రచురణకర్తను అరెస్టు చేయాలని డిమాండ్ చేశారు. పెరుమాల్ మురుగన్ జిల్లా ఎస్‌పిని కలిసి రక్షణ ఇమ్మని అడిగితే ఊరు వదిలి వెళ్లమని, చెన్నైకి పారిపోమని సలహా ఇచ్చారు. ఆయన కుటుంబంతో సహా చెన్నైకి వెళ్లి తలదాచుకున్నాడు.

**ఖాప్ పంచాయితీని తలపించిన శాంతి చర్చలు**

జిల్లా అధికారులైన డిఆర్ఒ, ఆర్‌డిఒ, డిఎస్‌పిలు ఈ వివాదాన్ని పరిష్కరిస్తామని ఇరువర్గాలను పిలిచారు. సమావేశం జరుగుతున్న ఆఫీసు దగ్గర వంద మంది ఆందోళనకారులు అందరిని సమావేశంలోకి అనుమతించాలని ఒత్తిడి చేస్తే 30 మందిని అనుమతించారు. పెరుమాల్ మురుగన్, ఆయన లాయరు ఇంకోవైపు. చర్చ జరిగిన తర్వాత వివాదం సమసిపోతే చాలనుకుని మనస్ఫూర్తిగా (పశ్చాత్తాప పడుతున్నానని) రాసిస్తానని ఒప్పుకున్నాడు. 'బేషరతుగా క్షమాపణ' చెపుతున్నానని రాసివ్వాలని, లేదంటే ఆందోళనకారులు శాంతించరని అధికారులు తేల్చి చెప్పారు. చాలా తర్జనభర్జన తర్వాత అందుకు కూడా ఒప్పుకున్నాడు. అంతా అయిపోయింది అనుకునేంతలోనే 'నవలలోని పట్టణం పేరు మార్చాలని హిందూ సంస్థలు అభ్యంతరం చెపుతున్న విషయాలు తొలగించాలని (ఇందులో 20వ చాప్టర్ మొత్తం ఉంది) అమ్ముడుపోని కాపీలను వెనక్కి తీసుకోవాలని, ఇకపై సున్నితమైన, వివాదాస్పదమైన విషయాలను రాయనని చెప్పాలనే అంశాలను చేర్చారు. అభ్యంతరం వ్యక్తం చేసిన మురుగన్ మీద అధికారులు ఇది శాంతి భద్రతలకు సంబంధించిన విషయమని అనవసరంగా వివాదం చేస్తున్నావని ఆగ్రహం వ్యక్తం చేశారు. షరతులు అంగీకరించకపోతే నీకు రక్షణ కల్పించలేమని, తర్వాత పరిణామాలకు బాధ్యత వహించాల్సి వస్తుందని హెచ్చరించారు. ఈ మొత్తం ప్రక్రియలో ఎక్కడా కూడా భావ ప్రకటన స్వేచ్ఛ, రచయిత స్వేచ్ఛ రాజ్యాంగ హక్కులను అధికారులు గుర్తించలేదు.

జిల్లా అధికారుల తీరుతో మనస్తాపం చెందిన మురుగన్ మీరు ఇష్టం వచ్చినట్లు రాసుకోండి నేను సంతకం పెడతానని చెప్పారు. ఇలాంటి షరతులు విధించడం రచయితకు మరణశిక్ష లాంటిదే. అందుకే ఆయన 'పెరుమాల్ మురుగన్, రచయిత, చనిపోయాడు. అతడు దేవుడు కాదు కనుక తిరిగి రాలేడు. అతనికి పునర్జన్మ మీద నమ్మకం లేదు. ఒక సామాన్య టీచర్‌గా, పి. మురుగన్‌గా బతుకుతాడు. అతన్ని వదిలివేయండి' అని ప్రకటించాడు. ప్రచురణకర్తలు తన పుస్తకాలు అమ్మవద్దని, పాఠకులను తన పుస్తకాలను తగులపెట్టమని, సాహితి వేదికలకు తనను ఆహ్వానించవద్దని అందరిని వేడుకున్నాడు. 'నా పుస్తకంలో ఏముందో చర్చించకుండా తగులబెట్టిన ఈ సమాజం కోసం రాయడంలో అర్థం ఉందా అనిపిస్తుంది. ఈ సంఘటన నా రచనల మీద చాలా ప్రభావం చూపిస్తుంది. ఇక ముందు స్వతంత్రంగా ఆలోచించగలనా తెలియదు' అని ఆవేదన చెందారు.

బిజెపి, ఆర్ఎస్ఎస్ వారు స్త్రీకి లైంగిక స్వేచ్ఛ ఉండాలి అంటే జీర్ణించుకోలేరు. అందుకే వారు అభ్యంతరం వ్యక్తం చేస్తున్నారు. సంతానం కోసం ప్రతి గుడిని మొక్కుతున్న కలి, పొన్నకు తిరుచెంగొడ్ కొండ చివర ఉండే పెద్దరాయి చుట్టూ ప్రదక్షిణలు చేస్తే కోరికలు తీరుతాయని ఒక ముసలావిడ చెపుతుంది. ఆ రాయి చుట్టూ నడిచేందుకు అవసరమైన స్థలం ఉండదు. ఒక్క అడుగు మాత్రమే పెట్టే అవకాశం ఉంటుంది. ఏ కాస్త తప్పినా కిందపడి చనిపోవడం ఖాయం. అంత ప్రమాదకరమైన ప్రదక్షిణ కూడా పిల్లలు పుడతారనే ఆశతో పొన్న చేస్తుంది. అటువంటి అశాస్త్రీయ ఆచారాలను వ్యతిరేకించాలని ఈ హిందూత్వ వాదులకు అనిపించదు. కానీ సంతానం కోసం ప్రాణాలు లెక్కచేయని పొన్న, అర్ధనారీశ్వరుని దేవాలయంలో జరిగే చెరియాట్ (స్వేచ్ఛా శృంగారం) ఉత్సవంలో పాల్గొంది అంటే మహిళలను కించపరిచేదిగా కనిపించింది.

మామూలుగా కోర్టులు పుస్తకాలు నిషేధించిన సందర్భాలు చాలా ఉన్నాయి. అయితే బిజెపి అధికారంలోకి వచ్చిన ప్రతిసారీ హిందూత్వ సంస్థలు పుస్తకాలు నిషేధిస్తున్నాయి. మద్రాస్ హైకోర్టు రిటైర్డ్ జడ్జి చెప్పినట్లు 'ఇప్పుడు రాజ్యాంగ బద్ధమైన భావ వ్యక్తీకరణను హరించడం కాదు. ఏమీ రాయాలి? ఏమి చదవాలి అని ప్రైవేట్ ఫాసిస్టు గ్రూపులు నిర్ణయించడం అసలు ప్రమాదం'.

**'కులం' కోణం**

ఈ నవలలోని ప్రధాన పాత్రలు గౌండర్ కులానికి చెందినవి. పశ్చిమ తమిళనాడులోని కొంగునాడు ప్రాంతమంతా కొంగు వెల్లలార్లు లేదా గౌండర్లుగా పిలువబడే కుల ఆధిపత్యం ఎక్కువ. నవలలో ప్రస్తావించిన తిరుచెంగొడ్, నామక్కల్ ప్రాంతాలు ఈ కొంగునాడులో భాగం. స్వాతంత్ర్యం పూర్వపు రోజుల్లో వీరు ఉన్నత కులాల జాబితాలో ఉండేవారు. తరువాత వెనుకబడిన కులాల జాబితాలోకి మార్చుకో గలిగారు. ఈ ప్రాంతంలో వీరు ఆర్థికంగా బలమైన సామాజిక వర్గం. వీరిలో చాలా మంది మూడవ తరం వ్యాపారస్తులు ఉన్నారు. గ్రే కాటన్, టెక్స్‌టైల్స్, ఎగ్స్, హెవీ వెహికిల్స్ పరికరాలు ఎగుమతి చెస్తుంటారు. 2009లో వీరి ఎగుమతుల విలువ రు. 40,000 కోట్లు. కొంగునాడు విద్యా సంస్థలకు, కోచింగ్ సంస్థలకు పేరున్న ప్రాంతం. ఇవి కూడా గౌండర్ల ఆధిపత్యంలో నడుస్తుంటాయి.

గౌండర్లు కాంగ్రెస్, ఎఐడిఎంకె, డిఎంకె, కమ్యూనిస్టు పార్టీలు, ఇతర హిందూ మతసంస్థల్లో బలమైన వ్యక్తులుగా ఉన్నారు. వీరి ఆర్థిక ప్రయోజనాలు కాపాడుకోవడానికి ఒక రాజకీయ పార్టీ అవసరం అయింది. 2009లో కొంగునాడు మున్నేత్ర కజగం (కెఎన్ఎంకె)ను స్థాపించారు.

ఎన్నికలకు నాలుగు నెలల ముందు పార్టీ ప్రకటించినప్పటికి 6 లక్షల ఓట్లు సాధించారు. ఒక స్థానంలో కూడా గెలవకపోయినా, అధికారం నిర్ణయించే శక్తిగా మారారు. కాంగ్రెస్ డిఎంకె కూటమి ఓటమి పాలై ఎఐడిఎంకె అధికారంలోకి రావడానికి కారణం అయ్యారు. కొన్ని ప్రాంతాల్లో వేరే పార్టీల్లోని తమ కులస్తులను గెలిపించుకోవడం కోసం డమ్మీ అభ్యర్థులను పోటీలో నిలిపి ఓట్లు చీల్చారు. తమ కులం నుండి ఒక ఎంపి అయినా ఉండాలని నామక్కల్ డిఎంకె అభ్యర్థి గాంధీ సెల్వన్‌ను గెలిపించుకున్నారు. రాష్ట్రంలో 70 లక్షల గౌండర్ల ఓట్లు ఉన్నాయి. కాబట్టి ఓటింగ్ శాతం పెంచుకుంటే ఇంకా ఎక్కువ ప్రభావం చూపించగలమనే ప్రయత్నాల్లో ఉన్నారు.

కెఎన్ఎంకె పార్టీ స్థాపించినప్పుడు వారు స్పష్టంగా 'మేము సామాజికంగా, ఆర్థికంగా, అకాడమిక్‌గా బలవంతులం కానీ రాజకీయంగా కాదు', పైగా రాష్ట్రంలో రోజు రోజుకు బలపడుతున్న దళిత రాజకీయాలు గౌండర్లలో ఒత్తిడిని పెంచాయి. అందుకే పార్టీ పెడుతున్నామని ప్రకటించారు. కొంగునాడు ప్రాంతంలో గౌండర్లకు, దళితులకు మధ్య వైరం ఉంది. కోయంబత్తూరు ప్రాంతంలో ఇది కాస్త ఎక్కువగా ఉంది. గౌండర్ల సమస్య ఏంటంటే దళితులు ఎస్‌సి, ఎస్‌టి అత్యాచార నిరోధక చట్టం ఉపయోగించి కేసులు పెడుతున్నారు. అందుకే ఈ చట్టంలో మార్పులు చేయాలనేది వీరి డిమాండ్. చట్టం పూర్తిగా రద్దు చేయాలని అనడం లేదు. కానీ బేయిల్ తప్పకుండా ఇవ్వాలి అంటారు. దళితులు వెనుకబడి ఉన్న మాట వాస్తవమే కానీ దానికి గౌండర్లు కారణమనుకోవడం సరైనది కాదని సమర్థించుకుంటున్నారు.

ఈ నేపథ్యంలో పెరుమాల్ మురుగన్ కొద్ది కాలంగా గౌండర్ల ఆధిపత్యంలోని కొంగునాడు విద్యా సంస్థలను 'బ్రాయిలర్' స్కూల్స్‌గా విమర్శిస్తూ వ్యాసాలు రాస్తున్నాడు. ఈ విద్యా సంస్థల్లో ర్యాంకులు వచ్చిన విద్యార్థులు కూడా పెరియార్ యూనివర్సిటీలో మిగతా చోట్లా విఫలం అవుతున్నారు. ఇక్కడ విద్యార్థులకు కేవలం బట్టీ పట్టడం నేర్పిస్తున్నారు అనేది మురుగన్ విమర్శ. అంతే కాకుండా 2013లో వచ్చిన తన నవల 'అలందాస్ పచ్చి'ని, కులాంతర వివాహం చేసుకున్నందుకు ధర్మపురిలో రైలు పట్టాలపై శవమైన దళిత 'ఇలవరసన్'కి అంకిత మిచ్చాడు. దళిత వ్యతిరేకులైన గౌండర్లకి ఇవి నచ్చలేదు.

మాదొరుబాగన్ నవల ఇతివృత్తం గౌండర్ల కులం, వారు రాజకీయ అధిపత్యం చెలాయించాలనుకుంటున్న కొంగునాడు ప్రాంతం పిల్లలు లేని గౌండర్ స్త్రీ స్వేచ్ఛా శృంగారం జరిగే చెరిమట్ ఉత్సవంలో పాల్గొనడం కుల సంకరణం జరిగినట్లు భావించాల్సి వస్తుంది. నవలలో ఒక దగ్గర కలికి, భావమరిది ముత్తుకు మధ్య చివరి రోజు ఉత్సవానికి పొన్నను పంపే విషయంలో వాదన జరుగుతుంది. గతంలో అంటరాని కులాల వారిని ఉత్సవానికి అనుమతించకపోయేది. ఇప్పుడు వారే ఈ ఉత్సవానికి ఎక్కువగా వస్తున్నారు. ఒకవేళ పొన్న ఏ అంటరాని కులాల యువకుడినో కలిస్తే అలా పుట్టే బిడ్డను 'దేవుడిచ్చిన బిడ్డగా' నేను చూడలేను. అదే జరిగితే నేను పొన్నను తాకను కూడా తాకను అని కలి అనడం జరుగుతుంది. ఇదంతా గౌండర్ల అస్తిత్వాన్ని, దానిమీద నిర్మిస్తున్న రాజకీయాన్ని, దానితో కాపాడాల్సిన ఆర్థిక ప్రయోజనాలను దెబ్బతీసేవిగా ఉంది.

అంతే కాకుండా తమిళనాడులో అరంగ్రేటం కోసం బిజెపి, ఇతర హిందూత్వ శక్తులు చాలా రోజులుగా ఎదురుచూస్తున్నాయి. 2016 తమిళనాడు అసెంబ్లీ ఎన్నికలు ముందు ఉన్నాయి. ఇప్పుడు బిజెపికి రాష్ట్ర రాజకీయాలను ప్రభావితం చేయగలిగే కొంగునాడు ప్రాంతం, గౌండర్ల మద్దతు వ్యూహాత్మకంగా చాలా అవసరం. అందుకే నవల తమిళంలో వచ్చినప్పుడు లేని అభ్యంతరం ఆంగ్ల ప్రచురణతో వచ్చింది. ఇదంతా నిర్మాణాత్మకంగా జరిగిందని, దీని వెనుక సుబ్రమణ్యస్వామి లాంటి కాషాయ మేధావులు ఉండకపోలేదని గమనించాలి.

ఆర్ఎస్ఎస్ పుస్తకాలను బహిష్కరించడానికి, కాలపెట్టడానికి వ్యతిరేకమని కొంగునాడులో జరుగుతున్న దానితో మాకు సంబంధం లేదని దాని నాయకులు ప్రకటించారు. హిందూత్వ రాజకీయాలను ప్రచారం చేసే అరవిందన్ నీలకందన్ వారికి వత్తాసు పలికాడు. మురుగన్ తన పుస్తకాలు వెనక్కి తీసుకుంటున్నానని ప్రకటించిన నెల రోజుల తర్వాత, తమిళనాడు హైకోర్టు ఈ వివాదంపై తీర్పు రావడానికి ఒకరోజు ముందు తిరుచెంగొడ్‌లో పుస్తక వ్యతిరేక సభను హిందూ వాక్కల్ కచ్చి నిర్వహించడం జరిగింది. ఈ సభకు వచ్చిన అరవిందన్ నీలకందన్ ఈ నవల వలన 'రాబోయే తరాలకు తిరుచెంగొడ్ మీద తప్పుడు అభిప్రాయాలు ఏర్పడతాయి. కాబట్టి ఇలాంటివి మనం అనుమతించవద్దు' అని అన్నాడు.

హిందూ వాక్కల్ కచ్చి వ్యవస్థాపకుడు అర్జున్ సంపత్, క్రిష్టియన్ స్వచ్ఛంద సంస్థలు ఈ నవలకు నిధులు ఇచ్చాయి అని ఆరోపించారు. ఇండియన్ ఫౌండేషన్ ఫర్ ది ఆర్ట్ (ఐఎఫ్ఎ) రతన్ టాటా ట్రస్టు ద్వారా నిధులు సమకూర్చిందని రచయిత చెప్పాడు. ఎంక్వయిరీ చేసుకోవచ్చు. క్రిష్టియన్ సంస్థలను వివాదంలోకి లాగితే హిందూత్వ శక్తులకు మద్దతు సులభం అవుతుంది. అదే సభలో 'మద్రాస్ హైకోర్టు తీర్పు ఎలా ఉన్నా, పుస్తకం మీద దేశ వ్యాప్త నిరసనలు తెలియ చేస్తామని' అర్జున్ సంపత్ ప్రకటించాడు. ఈ వ్యాఖ్యల నేపథ్యంలో అతన్ని అరెస్టు చేయడానికి సిద్ధమైన తిరుచెంగొడ్ పోలీసులు చివరి నిమిషంలో ఎస్‌పి ఆదేశాల మేరకు వెనక్కి తగ్గారు. తమిళనాడులో జరగబోయే ఆసక్తికరమైన పరిణామాలకు ఇవి సంకేతాలు కావచ్చు. రాబోయే అసెంబ్లీ ఎన్నికలు రసవత్తరంగా ఉండవచ్చు.

బిజెపి, ఆర్ఎస్ఎస్‌లు, కొంగునాడు ప్రాంత గౌండర్లు ఈ వివాదంలో కలిసి పోవడంతో డిఎంకె, ఎఐడిఎంకె కానీ నోరు తెరవలేని పరిస్థితి. తమిళనాడు రాజకీయాలు, రాజకీయ పార్టీలు అభ్యుదయమనుకున్న వారికి ఇది ఆశ్చర్యకరమైన పరిస్థితి. ఇటువంటి పరిస్థితిలో తమిళనాడులో పౌర సమాజం, హక్కుల సంఘాల వెలితి స్పష్టంగా కనిపిస్తుంది. రాజకీయ పార్టీలకు ఎన్ని అభ్యుదయాలు ఉన్నా ఎన్నికల రాజకీయాల్లో రాజీ పడాల్సి వస్తుంది అనేది మరోసారి విదితమయింది.

మొత్తానికి కులం, మతం, పెట్టుబడి కలిసి రాజకీయాధికారం కోసం ఆడుతున్న ఆటలో ఒక రచయిత 'బలి' అయ్యాడు. ఇంకా చాలా మంది అవుతారు.

(తమిళనాడుకు చెందిన మిత్రుడు, పరిశోధక విద్యార్థి అరున్ కుమార్‌కు కృతజ్ఞతలు)

*(రచయిత ఆర్థికశాస్త్ర పరిశోధక విద్యార్థి, సెంట్రల్ యూనివర్సిటీ)* వీ

# ఒబామా వ్యూహానికి మోడీ తోడ్పాటు

***గణతంత్ర దినోత్సవానికి ప్రత్యేక అతిథిగా వచ్చిన అమెరికా అధ్యక్షుడు ఒబామా అసలు ఉద్దేశం అణు ఒప్పందాన్ని అమలు చేసుకోవడమేననీ, అందుకు ప్రధాని మోడీ వంతపాడడం దేశ సార్వభౌమత్వాన్ని పణంగా పెట్టడమేననీ అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

అమెరికా సామ్రాజ్యవాద అధినేత, ప్రపంచ శత్రువు, యుద్ధోన్మాది, రక్తపిపాసి, బరాక్ ఒబామాను భారత గణతంత్ర దినోత్సవ వేడుకలకు విశిష్ట అతిథిగా ఆహ్వానించడం అవమానకరం. విస్తారమైన భారత మార్కెట్‌ను, ప్రధానంగా దేశంలోని అపారమైన సహజ వనరులనూ, సంపదనూ కొల్లగొట్టడానికి ఉద్దేశించిన ఒబామా పర్యటనకు నరేంద్ర మోడీ సర్కార్ సాగిలపడింది. ఒబామా పర్యటన సందర్భంగా మన పాలకులు, కార్పొరేట్ బేహారులు అంబానీ, అదానీ, టాటా, బిర్లా, మహీంద్రలు దేశ ప్రయోజనాలను కూడ పక్కన పెట్టి సామ్రాజ్యవాద దేశాధినేతకు చేసిన సాష్టాంగ ప్రమాణాలు జుగుప్సాకరంగా ఉన్నాయి. అమెరికా అధ్యక్షుడు బరాక్ ఒబామా అడుగులకు మడుగులొత్తి తరించిపోవాలన్న తహతహే పాలక ప్రముఖుల్లో కనిపించింది. ప్రధాని నరేంద్ర మోడీ ఎంతో గొప్పగా చెపుతున్న 'మేక్ ఇన్ ఇండియా' ఆనవాళ్లు ఎక్కడా కనిపించలేదు. భారత్‌ను అమెరికాకు ఉపగ్రహంగా మార్చే ప్రయత్నమే సర్వత్రా కనిపించింది. అమెరికాతో చేసుకున్న ఒడంబడికలు, అవగాహనలు భారతదేశాన్ని మరింత పరాధీనతలోకి నెట్టివేసే తీరుగానే ఉన్నాయి. అమెరికాకు ఆసియాలో నమ్మకమైన బంటుగా మనదేశాన్ని మార్చి తన ప్రయోజనాలను నెరవేర్చుకునే కుట్రలో భాగంగానే ఒప్పందాలు కుదిరాయి.

గణతంత్ర దినోత్సవం రోజున ఒబామాను ఆహ్వానించి, అమెరికా ఇష్ట ప్రకారం అణు ఒప్పందంలో మార్పులు చేసి, మన రక్షణరంగంలో కీలక రంగాలు వారి చేతిలో పెట్టి, అది చెప్పినట్లు మన ఆర్థిక వ్యవస్థలో ముఖ్యమైన మార్పులుచేసి, అన్నింటికన్నా ముఖ్యంగా అమెరికా రాజకీయ భౌగోళిక రాజకీయ వ్యూహంలో మనదేశాన్ని జూనియర్ భాగస్వామిగా చేయడం, మనదేశ ఆర్థిక, వ్యూహాత్మక రంగాల్లోని కీలక ప్రయోజనాలను అమెరికాకు దఖలు పరచడమే అవుతుంది. 'అణు నష్టపరిహారం'పై తాజా ఒప్పందం, రక్షణ సహకారం మరో పదేళ్ల కొనసాగింపు, మోడీ ఈస్టు పాలసీ చైనాను కట్టడి చేసే విధానాలు అమెరికా పన్నిన వ్యూహాత్మక వైఖరికి అనుగుణంగా ఉన్నాయి. అమెరికా నేతలు విదేశాలకు వెళ్లేదే ప్రధానంగా వ్యాపారాల కోసం. సేల్స్‌మెన్‌గా వ్యవహరించడానికి ఆ దేశ నేతలకు ఎటువంటి సంకోచం ఉండదు. అంటే, తప్పనిసరిగా వాణిజ్య చర్చలు, ఒడంబడికలు ఉంటాయి.

ప్రపంచ పెద్దన్న పర్యటన అంటే అందరికీ ఆసక్తే. ఆయన అడుగు తీసి అడుగు వేస్తే ప్రచార మాధ్యమాలకూ ప్రధాన శీర్షికలే. అయితే ఒబామా పర్యటన, మోడీ ఆతిథ్యంపై జరుగుతున్న ప్రచారమంతా ఏ వర్గాల ప్రయోజనాల కోసమన్నదే ఇప్పుడు ప్రశ్న. అమెరికా అధినేత పర్యటనలో ప్రభుత్వం సాగిలపడిపోయింది. ప్రోటోకాల్‌ను పక్కన పెట్టి స్వయంగా ప్రధాని మోడీ విమానాశ్రయంలో స్వాగతం దగ్గర నుంచి, పెరేడ్ ప్రాంతానికి తన స్వంత వాహనంలోనే ఒబామా వచ్చే వరకు అడుగడుగునా అతిథి మర్యాదలను ఘనంగా నిర్వహించారు. మీడియా సైతం ఒబామా, మోడీ ఎన్నిసార్లు ఆలింగనం చేసుకున్నారు, ఎన్నిసార్లు మాట్లాడుకున్నారు, మన దేశ సైనిక పాటవాన్ని ఒబామా ఎలా కొనియాడారు, ఎన్నిమార్లు హిందీలో నమస్తే, జైహింద్ అన్నారు, ఒబామా వాహనం బీస్టు, ఆయన విమానం ఎయిర్‌ఫోర్స్ వన్‌లో సౌకర్యాలేంటి వంటి అంశాల చుట్టూనే కథంతా తిరిగింది. ఇంకొన్ని మీడియా సంస్థలు మరికాస్త ముందుకెళ్లి మోడీ ఎలాంటి కుర్తా ధరించారు, తలపాగా ఏ రంగులో ఉంది, మోడీ డ్రస్సులకు డిజైనర్ ఎవరు, మోడీ స్వయంగా ఒబామాకు టీ కలిపి ఇచ్చారు లాంటి కథనాలను వండి వార్చేశాయి. అయితే జాతి ప్రయోజనాలు పట్టించు కోకుండా కేవలం ఇలాంటి ప్రచారానికే మీడియా పెద్దపీట వేస్తూ జరిగిన తతంగమంతా సమస్యల నుంచి ప్రజల దృష్టిని మళ్లించేందుకే.

అగ్రదేశ అధినేత పర్యటన వల్ల ఒరిగిందేంటన్న దానిపై ఇప్పటి వరకూ ఎలాంటి స్పష్టత లేదు. ప్రభుత్వం నిర్దిష్టంగా ఒక్క ప్రకటనా చేయలేదు. అణు ఒప్పందంలో కీలకమైన జవాబుదారీతనం, నష్ట పరిహారాల విషయంలో భారత్ వెనక్కు తగ్గింది. అగ్రరాజ్యంలోని బడా పారిశ్రామికవేత్తల ప్రయోజనాల కనుగుణంగా జవాబుదారీతనాన్ని తనపైనే వేసుకొని అమెరికా కంపెనీలకు దాసోహమైంది. రియాక్టర్లలో ప్రమాదం సంభవిస్తే ఎవరు బాధ్యత వహించాలన్న సందిగ్ధానికి ఒబామా పర్యటన తెరదించింది. దీనికి ప్రతిగా ఐరాస భద్రతా మండలిలో భారత్ శాశ్వత సభ్యత్వానికి అమెరికా మద్దతు పలికేందుకు సంసిద్ధత వ్యక్తం చేసింది. అయితే దీని వెనుక అమెరికా ప్రయోజనాలున్నాయన్నది నిజం. అది ఆసియాలో అమెరికా వ్యూహాత్మక ప్రయోజనాల చదరంగంలో భారత్‌ను బంటుగా మార్చే ప్రయత్నం. ఈ ప్రాంతంలోని సముద్ర జలాలలో, ముఖ్యంగా దక్షిణ చైనా సముద్రంలో స్వేచ్ఛగా సంచరించే హక్కును, సముద్రాంతర భద్రతను నొక్కి చెప్పడంలో అమెరికాతో భారత్ గొంతు కలపడం అమెరికా వ్యూహాత్మక ప్రయోజనాల వలలోకి దేశాన్ని నెట్టడమే. స్వతంత్ర విదేశాంగ విధానానికి స్వస్తి పలుకడమే.

ఇవాళ ఆసియా, పసిఫిక్ ప్రాంతం అగ్రరాజ్యాల పోటీకి కేంద్రంగా మారింది. ఈ ప్రాంతంలో చైనా, రష్యాలు ఒకవైపు, అమెరికా, జపాన్, ఆస్ట్రేలియా, దక్షిణ కొరియా దేశాలు మరోవైపు పోటీపడుతున్నాయి. చైనాను చుట్టేయాలని అమెరికా పథకం ఎప్పటి నుంచో ఉంది. రెండవ

ప్రపంచ యుద్ధం తరువాత అమెరికా, ఈ ప్రాంతంలో తన సైనిక స్థావరాలను నెలకొల్పింది. జపాన్, దక్షిణకొరియా, తైవాన్, పిలిప్పైన్‌లతో ఆర్థిక సైనిక ఒప్పందాలు చేసుకొంది. దానిలో భాగంగానే భారతదేశాన్ని తన జూనియర్ భాగస్వామిగా చేసుకుంది. భారత్‌తో వ్యూహాత్మక భాగస్వామ్య ఒప్పందం చేసుకుంది. అంతేకాదు హిందూ మహాసముద్ర ప్రాంతంలో భారత్‌తో రక్షణ ఒప్పందం కుదుర్చుకొంది.

చైనా రోజు రోజుకి ఆర్థిక శక్తిగా అభివృద్ధి చెందుతోంది. 2016 నాటికి స్థూల జాతీయోత్పత్తిలో ప్రపంచంలో అమెరికాను దాటి మొదటి ఆర్థిక శక్తిగా చైనా తయారవుతుందని ఐఎంఎఫ్ అంచనా వేసింది. విదేశాలలో పెట్టుబడులు పెట్టడంలో కూడా చైనా వేగంగా పురోగమిస్తోంది. చైనాను చుట్టేసి తన అదుపులో ఉంచుకోవాలని అమెరికా చేసే ప్రయత్నాలు రోజు రోజుకు బలహీనపడుతున్నాయి. పైగా, చైనాయే ఆర్థికంగా వేగంగా అభివృద్ధి చెందుతోంది. అమెరికాకే సవాలుగా నిలబడబోతోంది. ప్రపంచంలో అన్ని ప్రాంతాలలో ఆర్థికంగా తన ప్రభావాన్ని పెంచుకుంటోంది. అయితే అమెరికా ఈ ప్రాంతంలో తనకు గల పలుకుబడినీ, ఆధిపత్యాన్నీ నిలబెట్టుకోవడానికి చైనాతో రాజీ, పోటీ అనే విధానాన్ని అనుసరిస్తోంది. ఈ క్రమంలో చైనా, రష్యాతో కలిసి ఆర్థిక, రాజకీయ, సైనిక సహకారం పెంచుకోవడం తీవ్రం చేసింది. ఈ మేరకు చైనా, రష్యాల మధ్య స్నేహ, సహకారాలు, మిత్రుత్వం పెరిగింది. ఈ సహకారం అంతర్జాతీయ వేదికలలో స్పష్టంగా ప్రదర్శితమవుతోంది.

అమెరికాతో రష్యా సంబంధాలు దిగజారడం వలన, రష్యా, చైనాల మధ్య ఆర్థిక, రాజకీయ, సైనిక సంబంధాలు బలపడుతున్నాయి. రష్యా ఇప్పుడు చైనాకు అతిముఖ్యమైన ఎయిర్ డిఫెన్సు మిసైల్లను (ఎస్400) అమ్ముతోంది. అంతేగాక ఇంటర్ కాంటినెంటల్ బాలిస్టిక్ మిసైల్లను ఆటంకపరచడానికి రూపొందించిన ఎస్500 అత్యాధునిక మిసైల్లను సరఫరా చేయడానికి కూడా అంగీకరించింది. ప్రపంచంలోని అన్ని ప్రాంతాల్లో ఆర్థిక, వాణిజ్య, వ్యాపారరంగాలలో ఎక్కువ చొరవ ప్రదర్శిస్తోంది. ఇప్పటి వరకు చైనా శాంతి, అభివృద్ధి, స్థిరత్వం గురించి ప్రధానంగా ప్రబోధిస్తూ వచ్చింది. ఈ నినాదాలతోనే ప్రపంచంలో అన్ని దేశాలతో ఆర్థిక, వాణిజ్య, రాజకీయ సంబంధాలను పెంపొందించు కుంటూ వస్తోంది. అదే సమయంలో ఆర్థిక అభివృద్ధితో పాటు సైనిక అభివృద్ధిని కూడా సాధించుతోంది. ముందు ముందు చైనా, రష్యా ప్రయోజనాలకూ, అమెరికా పశ్చిమ దేశాల ప్రయోజనాలకూ మధ్య సంఘర్షణలు తప్పవు.

జపాన్ పర్యటనలో ఉన్నప్పుడు మోడీ చైనాను 'విస్తరణవాద' దేశంగా పేర్కొని భారత్ పట్ల ఆ దేశంలో సరికొత్త అనుమాన బీజాలు నాటారు. ఇరుగు పొరుగు దేశాలుగా భారత్, చైనాలు ఎప్పటికైనా పరస్పర సామరస్య, సహకారాలను పెంపొందించుకోవడంలోనే ఉభయుల భవిష్యత్తు ఇమిడి ఉంది తప్ప, దూరంగా ఉండి స్వప్రయోజనాల కోసం తగవులు పెట్టే అమెరికాతో అంటకాగడంలో కాదన్న స్పృహ మోడీ ప్రభుత్వంలో పూర్తిగా లోపించింది. సోవియట్ యూనియన్ రోజుల నుంచీ రష్యా మనకు సహాయం అందించింది. ఇప్పుడు భారత్ గడ్డ మీద నిలబడి అమెరికా అధ్యక్షుడు రష్యాను కట్టడి చేస్తామనడం కూడా దారుణమే. ఆసియా పసిఫిక్, హిందూ మహాసముద్ర ప్రాంతాల్లో శాంతి, సుస్థిరత, వికాసానికి ఇరు దేశాల సన్నిహిత భాగస్వామ్యం అత్యంత అవసరమని భావిస్తున్నట్లు నేతలిద్దరూ చేసిన సంయుక్త ప్రకటనలో పేర్కొన్నారు. అయితే, ఇది చైనాను అప్రమత్తం చేస్తుందనడంలో సందేహం లేదు. చైనా అధికారిక మీడియాలో వెలువడిన వ్యాఖ్యానంలో దీని ఛాయలు కనిపించాయి. చైనా, రష్యాలతో భారత్‌కున్న సంబంధాలను విచ్ఛిన్నం చేసేందుకు అమెరికా చూస్తున్నదని చైనా మీడియా హెచ్చరించింది కూడా. స్వతంత్ర విదేశాంగ విధానాన్ని అమెరికాకు మరింత నిర్లజ్జగా తాకట్టు పెట్టడమే కాక, దేశాన్ని భవిష్యత్తులో మరింత ప్రమాదకరమైన ఆటకు రంగస్థలిగా మార్చడానికి మోడీ ప్రభుత్వం సిద్ధపడుతోంది. దేశ స్వావలంబనను నొక్కిచెప్పవలసిన సందర్భం పరాధీనతకు అద్దంపట్టడం గర్హనీయం.

ఒబామా భారీసంఖ్యలో వ్యాపారవర్గాలను వెంటబెట్టుకుని భారత్ వచ్చారు. ఇరుదేశాల మధ్య ఒప్పందాలు జరిగిపోయాయి. ఆ ఒప్పందాల వల్ల మనకు నికరంగా ఎంత లాభం లేక ఎంత నష్టం అన్నది తెలియదు. రక్షణ, వ్యాపారం సహా ఆయా రంగాలలో అమెరికా మీద మనం అతిగా ఆధారపడుతున్న సంగతి మాత్రం నిర్ద్వంద్వంగా స్పష్టమైపోయింది. ఇప్పటికే ఉన్న రక్షణ ఒప్పందానికి మరో పదేళ్లు సరికొత్త జీవం పోసే ఒప్పందంతోపాటు, భారత్ – అమెరికా అణు ఒప్పందం అమలుకు ప్రతిబంధకంగా ఉన్న అంశాలలో అవగాహనకు సంబంధించిన ఒప్పందం కూడా ఉంది. ఏదైనా అణు విద్యుత్కేంద్రంలో ప్రమాదం సంభవించినప్పుడు నష్టపరిహారం భారత ప్రభుత్వ సంస్థ చెల్లించాలా లేక సామగ్రి సరఫరా చేసిన కంపెనీలు చెల్లించాలా అన్న వివాదం దగ్గర ఒప్పందానికి పీటముడి పడిన నేపథ్యంలో, ఆ అడ్డంకిని దాటామని ఇరువురు చెప్పారు కానీ, ఎలా దాటారో, ఆ క్రమంలో భారత్ ఏ మేరకు రాజీ పడిందో మాత్రం వెల్లడించలేదు. హైప్‌రూపంలో సృష్టించిన మాయ తెరలు తొలగిన తర్వాతే అసలు నిజం బయట పడుతుంది. అమెరికా ముందు మోడీ ప్రభుత్వం మోకరిల్లిన ప్రాథమిక దృశ్యం మాత్రం స్పష్టంగా కనిపించింది.

అమెరికా భారత్ నేతల జనవరి 27 నాటి సంయుక్త ప్రకటన ఇరు దేశాల మైత్రీ సంబంధాల గురించి గొప్పగానే ఉద్ఘాటించింది. కానీ అది సమానుల మధ్య మైత్రి కాదన్న సంగతి తేలిపోయింది. ఒబామా – మోడీ ఒప్పందాల్లో వర్తక, వాణిజ్య ఒప్పందాలు కూడా కీలకంగా ఉన్నాయి. మునుపెన్నడూ లేని విధంగా ఇరుదేశాల మధ్య వ్యాపార సంబంధాలు వేగంగా, పెద్దమొత్తంలో జరగడానికి ఉన్న అవరోధాలన్నింటినీ తొలగించి వ్యాపారానికి రహదారి విస్తృతం చేశారు. గత దశాబ్దకాలంలో భారత్‌తో అమెరికా వాణిజ్యం ఐదు రెట్లు పెరిగి ఇప్పుడు పదివేల కోట్ల డాలర్లకు చేరుకున్నది. 2020 నాటికి ఈ వాణిజ్యాన్ని 50 వేల కోట్ల డాలర్లకు చేర్చే లక్ష్యంతో ఒప్పందాలు కుదిరాయి. భారత్ – అమెరికా మధ్య కుదిరిన ఒప్పందాల్లో రక్షణ పరికరాల ఉత్పత్తిలో సంయుక్త భాగస్వామ్యం కూడా ఉన్నది. పైలెట్టులేని వాయు వాహనాల సంయుక్త తయారీ, సైనిక రవాణా విమానాల పరికరాల సహా ఉత్పత్తి ఒప్పందాలు జరిగాయి. భారత శ్రమశక్తిని సామ్రాజ్యవాద ఆయుధ పరిశ్రమ చౌకగా దోచుకునే మార్గమిది. ఇరుదేశాలు ఉమ్మడిగా శాస్త్ర సాంకేతిక రంగాల్లో పరస్పర సహకారంతో రక్షణ పరికరాల ఉత్పత్తులు భారత్‌లోనే జరగనున్నవి. మోడీ కోరినట్లు

రక్షణ ఉత్పత్తుల రంగంలో ప్రైవేట్ భాగస్వామ్యాన్ని పెంచబోతున్నట్లు ఒబామా ప్రకటించారు. భారత్‌ను సైనికంగా అమెరికా సైనిక బంధాల్లో కట్టేసే క్రమం తప్ప మరొకటి కాదు. విదేశీ కంపెనీల చేతుల్లో భారత రక్షణ రంగాన్ని పెట్టడం మనదేశ సార్వభౌమాధికార స్వేచ్ఛకు హాని చేస్తుంది. అలాగే సముద్ర తీర ప్రాంతాల రక్షణ, గగనతలం సంరక్షణ, వాతావరణం సమాచారం ఇచ్చి పుచ్చుకోవడం కూడా ఉన్నది. అన్నింటి కన్నా మిన్నగా అమెరికాతో భారత్ రక్షణ ఒప్పందం మరో పదేళ్లు పొడిగించబడింది. అంతేకాదు దేశాధినేతల మధ్య హాట్ లైన్ ఏర్పాటుతో పాటు, ఇరు దేశాల జాతీయ భద్రతా సలహాదారుల స్థాయిలో కూడా హాట్ లైన్ ఏర్పాటు ప్రాధాన్యాన్ని సంతరించుకున్నది. అంతర్గత భద్రతలతో వ్యవస్థీకృత నేరాల అదుపులో పరస్పర సహకారం ఉంటుంది.

మనదేశ అణు విద్యుత్కేంద్రంలో ఏదైనా ప్రమాదం సంభవిస్తే, పరిహార బాధ్యతను ఆ కేంద్రం యజమాని అయిన భారత్ అణు విద్యుత్ కార్పొరేషన్ పై పెడుతూ ప్రతిపాదించిన అణులయబిలిటి బిల్లులో, బిజెపి సహా ప్రతిపక్షాల ఒత్తిడి వల్ల ప్రభుత్వం కొత్తగా సెక్షన్ 17(బి) ను 2010 చట్టంలో చేర్చింది. యంత్ర పరికరాల్లో లోపం వల్ల ప్రమాదం జరిగినట్లు నిర్ధారణ అయితే వాటి సరఫరాదారుపై కూడా పరిహారం చెల్లింపు బాధ్యతను విధించింది. ఆ క్లాజును వ్యతిరేకించిన అమెరికన్ అణు సరఫరాల కంపెనీలు – జిఇ హిటాచి, వెస్టింగ్‌టన్ వగైరా– దాన్ని తొలగించాలని ఒత్తిడి తెస్తున్నాయి. అణు ఒప్పందం అమలులో ప్రతిష్టంభనకు కారణం కార్పొరేట్ వ్యాపార లాభాపేక్ష, బాధ్యతా రాహిత్యం తప్ప మరొకటి కాదు. అయితే ప్రజాహితం మరిచి భారత అణు నష్టపరిహార చట్టానికి తూట్లు పడే విధంగా అణు విద్యుత్‌రంగ ఒప్పందం కుదుర్చుకున్నారు. ఈ ఒప్పందం వలన అమెరికా కంపెనీలకు ఎలాంటి బాధ్యత ఉండదు.

బిజెపి ప్రభుత్వం అధికారంలోకి వచ్చిన తరువాత అణు నష్ట పరిహార ఒప్పందంపై గత రెండు నెలలుగా భారత్ – అమెరికా ప్రభుత్వాల మధ్య అనేక పర్యాయాలు ఉన్నతాధికారుల మధ్య చర్చలు జరిగాయి. అణు ఒప్పందం అమలుకు ఒక అడుగు ముందుకు వేశామని ఇరు దేశాల నేతలు ప్రకటించారు. పైకి అణు ఒప్పందం విషయంలో ఒక అడుగు ముందుకు వేశామని చెపుతున్నప్పటికీ ఈ అంశంపై అనేక అనుమానాలు ఇప్పటికీ తలెత్తుతున్నాయి. కొన్ని కీలకాంశాలు గోప్యంగా ఉంటేనే మేలని భారత్ ప్రధాని నరేంద్రమోడీ విలేకరుల సమావేశంలో వ్యాఖ్యానించడంతో సందేహాలు పెల్లుబుకుతున్నాయి. అణు ఒప్పందం అమలుకు శాసనపరమైన అంశాలు అడ్డొస్తున్నాయి. భారత్, అమెరికాల్లో అమలులో ఉన్న చట్టాలు ఈ ఒప్పందానికి ప్రధానంగా అడ్డంకిగా మారాయి.

అణు నష్టపరిహార చట్టంలోని 17(బి) సెక్షన్ అమెరికాకు మింగుడు పడలేదు. ఈ సెక్షన్ ప్రకారం అణు విద్యుత్ రియాక్టర్ల పరికరాలు, యంత్రాలు, విడి భాగాలలో నాణ్యత ప్రమాణాలు లేకున్నా, వాటి మూలంగా జరిగే ప్రమాదాలకు వాటిని అందించిన కంపెనీయే పరిహారాలను విధిగా చెల్లించాలన్న నిబంధన అమెరికాకు కంటగింపుగా తయారైంది. 'అణు విద్యుత్ యంత్రాలు, పరికరాలు, విడి భాగాలను అమ్మకంతోటే మా బాధ్యత ముగుస్తుంది. ఆ తరువాత జరిగే పరిణామాలకు, ప్రమాదాలకు మా బాధ్యత లేద'ని అమెరికా కంపెనీలు అంటున్నాయి. నష్టపరిహారం ఇచ్చే ప్రసక్తేలేదని తెగేసి చెప్పాయి. అంతర్జాతీయ చట్టాల ప్రకారం నష్టపరిహారం ఉండదని స్పష్టం చేశాయి.

మరో చిక్కుముడి ట్రాకింగ్ ప్రొవిజన్. భారతదేశానికి అణు విద్యుదుత్పత్తి యంత్రాలు, పరికరాలు, విడి భాగాలు అందించే అమెరికా కంపెనీలు విద్యుదుత్పత్తికి దోహదపడితే అమెరికా ప్రభుత్వానికి శాశ్వత ప్రాతిపదికపై భారతీయ అణు రియాక్టర్లను తనిఖీ చేసే అధికారం ఉంటుందని అమెరికా ధీమా. భారతీయ కంపెనీలను, అణు రియాక్టర్లను తనిఖీ చేసే అధికారం అమెరికాకు లేదని భారత్ స్పష్టం చేసింది. అమెరికాకు చెందిన ఫ్లాగింగ్, ట్రాకింగ్ ప్రొవిజన్‌కు వీలు లేదని పేర్కొంది. భారత దేశంలోని అణు రియాక్టర్లతో పాటు అణు సంబంధిత కేంద్రాలు ఇంటర్నేషనల్ ఆటమిక్ ఎనర్జీ ఏజెన్సీ (ఐఎఇఎ) పరిధిలో ఉంటున్నాయి. భద్రత, రక్షణ సంబంధిత వ్యవహారాలు ఈ ఏజెన్సీ పరిధిలో నిత్యం డేగ కన్నుంటుంది.

ఒప్పందం అమలులోకి రాకపోవడానికి మరో ప్రధాన కారణం కూడా ఉంది. భారత్‌కు మూడో దేశం సరఫరా చేసే అణుశక్తి పరికరాలను పరీక్షించే అధికారం తమకు ఉండాలన్న అమెరికా ప్రభుత్వ డిమాండ్‌ను తమ వ్యవహారాల్లోకి చొరబాటుగా భారత ప్రభుత్వం తోసిపుచ్చింది. ఈ పరిస్థితుల్లో తమ బహుళజాతి కంపెనీలకు ప్రయోజన దాయకంగా ఒప్పందాన్ని అమలులోకి తేవడం అమెరికా ప్రయోజనమైతే, అణు లయబలిటీ చట్టంలో మార్పులు చేయకుండానే మార్గం సుగమం చేయడం మోడీ ప్రభుత్వ వంతైంది. దీనిపై గత నాలుగు మాసాలుగా అధికారుల స్థాయిలో ఎక్సర్‌సైజు జరుగుతోంది. గతవారం లండన్‌లో సమావేశం జరిగింది. రాజకీయ నిర్ణయమే దీనికి పరిష్కారమన్న అభిప్రాయానికి వచ్చారు. ఒబామా – మోడీ చర్చల్లో నాటకీయమైన 'పురోగతి' ఆకస్మికమో, స్నేహబంధ పర్యవసానమో కాదు. అమెరికన్ బహుళజాతి అణుశక్తి కార్పొరేషన్‌ల వ్యాపారాభివృద్ధికి జరిగిన రాజీ. భారత్‌కు మూడోదేశం సరఫరా చేసే అణుశక్తి పరికరాలపై అంతర్జాతీయ అణుశక్తి సంస్థ తనిఖీలతో తాము సంతృప్తిపడతామని, తమ సొంత తనిఖీలు కోరబోమని అధ్యక్షుడు ఒబామా తన కార్యనిర్వహక అధికారాన్ని ఉపయోగించి ప్రకటన చేశారు. మరి మోడీ ఏమి రాజీ పడ్డారు? వివరాలు అధికారికంగా వెల్లడి కానప్పటికీ, పరిహారం చెల్లింపు భారాన్ని కంపెనీల నెత్తి నుంచి దించడానికి అంగీకరించారని, అయితే లయబిలిటీ చట్టంలో సవరణలు చేయకుండానే బీమా బాట ఏర్పాటు చేశారని చెపుతున్నది. ఆ బీమా వ్యయం కూడా ఆ కంపెనీలపై పడకుండా దొడ్డితోవ ఇచ్చారని చెపుతున్నది. ఉభయతారకమైన ఈ అంగీకారమే ఒబామా, మోడీ ప్రకటించిన 'పురోగతి'.

అమెరికాతో అణు ఒప్పందానికి సంబంధించి కుదిరిన అవగాహనను కేంద్ర విదేశాంగ మంత్రిత్వశాఖ ఫిబ్రవరి 8న మీడియాకు వెల్లడించింది. అణు పరిహార చట్టాన్ని అతిక్రమించి, అమెరికాతో మోడీ సర్కార్ అణు ఒప్పందాన్ని కుదుర్చుకుందని తేలిపోయింది. అణు ప్రమాదం జరిగితే అందుకు బాధ్యత వహించాల్సిందేమీ లేదని అమెరికా కంపెనీలకు మోడీ ప్రభుత్వం భరోసా ఇచ్చింది. ఈ ఒప్పందానికి సంబంధించి భారత్–అమెరికా మధ్య పాలనాపరమైన ఏర్పాట్లు ఖరారయ్యాయని, ఇప్పుడు కంపెనీలు తమలో తాము చర్చించుకుని ఆచరణ సాధ్యమైన సాంకేతిక, వాణిజ్యపరమైన ఆఫర్లతో ముందుకు రావచ్చని, కాంట్రాక్ట్‌లు

మన చట్టం ప్రకారమే అమలవుతాయని విదేశాంగ మంత్రిత్వశాఖ వివరణ ఇచ్చింది.

అణు బాధ్యతా పరిహార చట్టాన్ని సవరించకుండానే విదేశీ అణు రియాక్టర్లు, విడి పరికరాలు, టెక్నాలజీ సరఫరాదారులకు పరిహార బాధ్యత నుంచి మోడీ ప్రభుత్వం పూర్తి మినహాయింపు నిచ్చింది. ఈ చట్టంపై తరచు తలెత్తే కొన్ని ప్రశ్నలకు విదేశాంగ మంత్రిత్వశాఖ జవాబిచ్చే ప్రయత్నం చేసింది. ముఖ్యంగా 2010లో పార్లమెంటే ఆమోదించిన అణు నష్టాల పౌర బాధ్యతల చట్టం (సిఎల్ఎన్డి) లో ప్రభుత్వం ఎటువంటి మార్పులూ చేయలేదని, ఇందులో పేర్కొన్న సరఫరాదారు బాధ్యత అన్నది కుదుర్చుకోబోయే కాంట్రాక్ట్లకు తప్పనిసరి కాదని అమెరికాకు మోడీ ప్రభుత్వం సంజాయిషీ ఇచ్చినట్లు ఆ ప్రకటన తెలియజేస్తోంది. 2011లో జపాన్లో ఫుకుషిమా అణురియాక్టర్ ప్రమాదం లాంటిదే భారత్లో జరిగితే అప్పుడు అణు సరఫరాదారులు ఎలాంటి పరిహారం చెల్లించకుండా దర్జాగా తప్పించుకోవచ్చు. అణు పరిహార చట్టం 2010 ప్రకారం అణు విద్యుత్ ప్లాంట్లో ఏదైనా ప్రమాదం జరిగితే ఆ అణు టెక్నాలజీ సరఫరాదారులే బాధ్యత వహించాలని స్పష్టంగా పేర్కొన్నారు. ఇప్పుడు మోడీ ప్రభుత్వం దీనికి నిలువునా తూట్లు పొడిచింది. ప్రమాదం జరిగిన పక్షంలో తక్షణ బాధ్యత కేవలం ప్లాంట్ నిర్వాహకులదే అవుతుందని, ప్రస్తుత సందర్భంలో అది భారత అణువిద్యుత్ సంస్థ (ఎన్సిపిఐఎల్)కు ఉంటుందని విదేశాంగ మంత్రిత్వశాఖ తన వివరణలో పేర్కొనడం విడ్డూరంగా ఉంది.

చట్టంలోని సెక్షన్ 17(బి) ప్లాంట్ నిర్వాహకులు సరఫరాదారుపై న్యాయపోరాటం చేసేందుకు హక్కు కల్పిస్తోంది. కాగా ఇది సెక్షన్ 6ఎ ప్రకారం ఎన్సిపిఐఎల్కు సరఫరాదారుకు మధ్య కుదిరిన కాంట్రాక్ట్లో ఉంటే మాత్రమే సాధ్యమవుతుందని విదేశాంగ మంత్రిత్వశాఖ స్పష్టం చేస్తోంది. ప్లాంట్ నిర్వాహకులకు న్యాయపోరాటం చేసే హక్కు ఉన్నప్పటికీ అది అనవసరమని ప్రభుత్వం వివరణ ఇచ్చింది. అణు ప్రమాద సమయంలో బాధ్యులపై ఫిర్యాదు చేసే బాధితుల హక్కును ప్రస్తావిస్తున్న సెక్షన్ 46పై వివరణ ఇస్తూ అణుబాధ్యత చట్టంలో సరఫరాదారును చేర్చాలన్న సవరణపై పార్లమెంట్లో జరిగిన చర్చలో ఈ ప్రతిపాదనకు వ్యతిరేకత వ్యక్తమైందని, అందువల్ల ఇటువంటి 'క్లాస్ – యాక్షన్ – సూట్' పరిధిలోకి సరఫరాదారుల బాధ్యత ఉండదని విదేశాంగ మంత్రిత్వశాఖ తెలిపి అణు ప్రమాద సందర్భంలో ఇతర చట్టాల కింద పరిహారం క్లయిమ్ చేసే అవకాశాన్ని సెక్షన్ 46 కల్పించనందున అణుబాధ్యతల వ్యవహారం మొత్తం కేవలం ప్లాంట్ నిర్వాహకులకే ఉంటుందని కూడా తెలిపింది.

ప్రమాద పరిహార మొత్తాన్ని ప్రస్తావించిన విదేశాంగ మంత్రిత్వశాఖ తన వివరణలో ఈ పరిహారం మొత్తాన్ని 30 కోట్ల డాలర్లు లేదా 2,610 కోట్ల రూపాయలకు పరిమితం చేసినట్లు తెలిపింది. ఇందులో ప్లాంట్ నిర్వాహక సంస్థ ఎన్సిపిఐఎల్ రు. 1,500 కోట్లు చెల్లిస్తుందని, మిగిలిన రు.1,100 కోట్ల మొత్తాన్ని కేంద్ర ప్రభుత్వం చెల్లిస్తుందని వివరణ ఇచ్చింది. దీనికి పైన ఏవైనా పరిహారాలు అందాల్సి ఉంటే అవి భారత్ గతంలో సంతకాలు చేసిన ఇంటర్నేషనల్ కన్వెన్షన్ ఆన్ సప్లిమెంటరీ కాంపెన్సేషన్ ఫర్ న్యూక్లియర్ లయబిలిటీ (సిఎస్సి) ద్వారా మాత్రమే అందుతుంది. అంటే ప్రమాదం జరిగితే అందుకు సరఫరాదారు ఏ మాత్రం బాధ్యత వహించబోదని, నిర్వాహక సంస్థ బాధ్యత కేవలం కొద్ది మొత్తానికి మాత్రమే పరిమితమవుతుందని విదేశాంగ మంత్రిత్వశాఖ జారీ చేసిన వివరణ స్పష్టం చేసింది. పరిహారం చెల్లింపు కోసం ఏర్పాటు చేసే బీమా నిధిలో 50 శాతం మొత్తాన్ని ప్రభుత్వ రంగ బీమా సంస్థలు, మిగిలిన మొత్తాన్ని ప్రభుత్వం (ప్రజల సొమ్ము నుండే) భరించాల్సి ఉంటుంది. కాగా ఈ అంశంపై ఇరుదేశాలు ఇప్పటి వరకూ పత్రాల మార్పిడి దశలోనే ఉన్నాయని అమెరికా విదేశాంగశాఖ సహాయ మంత్రి నిషాబిస్వాల్ ఫిబ్రవరి 6న ఒక పత్రికకు ఇచ్చిన ఇంటర్వ్యూలో చెప్పారు. అమెరికాతో సమాచార మార్పిడి విషయమై విదేశాంగ మంత్రిత్వశాఖ ప్రతినిధి సయ్యద్ అక్బరుద్దీన్ వివరణ ఇస్తూ 'ద్వైపాక్షిక రక్షణలేవీ లేవ'ని మాత్రమే తాను చెప్పగలనన్నారు.

చెర్నోబిల్, ఫుకుషిమా వంటి కేంద్రాలలో అణు ప్రమాదాల నేపథ్యంలో పాశ్చాత్య దేశాల్లో అణు రియాక్టర్లు తయారు చేసే కంపెనీలు మూతపడ్డాయి. వాళ్ల దగ్గర అమ్మకంకాక మిగిలి ఉన్న రియాక్టర్లు అమ్ముకోవడానికి భారత్ కనిపించింది. అందుకే అణు రియాక్టర్లు తయారు చేసే కంపెనీలు భారత్ పట్ల ఉత్సాహం చూపుతున్నాయి. నిజానికి ఇప్పుడు అమెరికన్లు అణు విద్యుత్ కేంద్రాలను నిర్మించడం లేదు. ఎందుకంటే వెస్టింగ్హౌజ్ తన అణువిద్యుత్ ఉత్పత్తి కేంద్రాల వ్యాపారాన్ని జపాన్కు చెందిన హిటాచీ కంపెనీకి అమ్మేసింది. దీంతో 1996 నుంచి ఇప్పటి వరకు అమెరికా అణువిద్యుత్ కేంద్రాల నిర్మాణాన్ని చేపట్టలేదు. మరి వీటిని నిర్మించే దేశాలు రష్యా, చైనా, ఫ్రాన్స్లు మాత్రమే. పైవన్నీ పరిశీలించినప్పుడు భారత్ – అమెరికాల మధ్య పౌర అణు ఒప్పందం ఎజెండాలో ఇదే ఎందుకు అతిముఖ్యమైన అంశంగా మారింది? అమెరికాకు చెందిన జిఇ, బెక్టెల్, ఇతర బీమా, ఫైనాన్స్ కంపెనీలన్నీ కూడా ఏదైనా కొత్త అణువిద్యుత్ ప్లాంట్ను నిర్మించే సమయంలో భాగస్వాములవుతాయి. ఆర్థిక, ఇంజనీరింగ్ వ్యవహారాల్లో అమెరికన్లు భాగస్వాములుగా ఉంటారు.

ఒబామా పర్యటన సందర్భంగా కుదిరిన అన్ని ఒప్పందాలలో భారత దేశ సార్వభౌమత్వాన్ని, ప్రజా ప్రయోజనాలను అమెరికా సామ్రాజ్య వాదానికి పణంగా పెట్టి మోడీ లొంగుబాటును ప్రదర్శించాడు. చైనాను నిలువరించేందుకు ఆసియాలో భారత్తో చెలిమి చేసే దిశగా అమెరికా వ్యూహాత్మకంగా వ్యవహరిస్తున్నట్లు విమర్శలున్నాయి. ఆరు లక్షల కోట్ల రూపాయల అమెరికా కార్పొరేట్ కంపెనీల పెట్టుబడులు భారత్కు వస్తాయని ఒబామా ఆశ చూపారు. అయితే ఏ మేరకు కార్యరూపం దాల్చుతుందన్న దానిపై సందేహాలున్నాయి. అయితే మన ఆర్థిక వ్యవస్థకు, ఉత్పత్తి రంగానికి రక్షక కవచాలుగా ఉన్న అనేకానేక రక్షణ, నియంత్రణ చట్టాలు కాలం చెల్లినవిగా మారిపోతున్నాయి. ఫలితంగా రక్షణ, బీమారంగాలతో సహా అన్నింటిలో విదేశీ పెట్టుబడులు ఏ పరిమితులు లేకుండా వచ్చి చేరుతున్నాయి. దీంతో సార్వభౌమాధికారం, స్వావలంబన అనేవి ఉనికిలో కూడా లేనివిగా మారిపోతున్నాయి. అంతిమంగా అలీన భారత్... పశ్చిమ ధృవ ప్రయాణం రోజురోజుకు వేగం పుంజుకుంటున్నది. దీర్ఘకాలంలో ఈ ఒప్పందాలు ఎలాంటి దుష్పరిణామాలకు దారితీస్తాయోనన్న ఆందోళన సర్వత్రా వ్యక్తమవుతోంది.

*(రచయిత ఉపాధ్యాయ నాయకులు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

# పాలకులకు గిట్టని 'సోషలిస్ట్, సెక్యులర్'

***భిన్న మతాల ప్రజలు జీవిస్తున్న దేశంలో హిందుత్వ శక్తులు అధికార అండతో ఇతర మతాల ప్రజల పట్ల వ్యవహరిస్తున్న తీరును ప్రజాస్వామిక వాదులు ప్రశ్నించకపోతే సెక్యులర్ అనే స్ఫూర్తికే ప్రమాదం ఏర్పడుతుందని అంటున్నారు బి. రామకృష్ణ***

సోషలిస్టు, సెక్యులర్ అనే పదాలు రాజ్యాంగంలో ఉండడం ఎంత మాత్రం సంఘ్‌పరివార్ శక్తులకు నచ్చడం లేదు. అసలు రాజ్యాంగ మౌలిక సూత్రాలే వీరికి గిట్టవని తెలుసుకోవడం కష్టమైన పనేమికాదు. వీరు నమ్ముతున్న బ్రాహ్మణ ధర్మ శాస్త్రాలు, హైందవ స్మృతులు, వివిధ రుషులు, మహర్షులు అనేక సందర్భాలలో చెప్పిన భాష్యాలు చూస్తే ఎవరి ధర్మాన్ని వారు నిర్వర్తించడమే సరైనది. స్త్రీలపైన అనేక రకాల వివక్షాపూరిత కట్టుబాట్లను క్షత్రియ, బ్రాహ్మణ, వైశ్య, శూద్ర అనే విభజనను, సమర్థించిన ఈ శాస్త్రాలు అసమానత్వాలను సహజమైనవిగా పరిగణిస్తాయి. చెప్పులు కుట్టేవారు ఆ పనిలోనే ఆనందాన్ని వెతుక్కోవాలి. అలాగే పాకీ పనివారు ఆ పని దైవ నిర్ణయమని, దాన్ని చేయడంలోనే తమ జన్మ ధన్యమవుతుందని, పుజారులు పూజలు చేయడం ద్వారా, ఇలా అనేక రకాలుగా ఎవరికి వారు వారికి నిర్దేశించబడిన వాటిని (స్వధర్మం) నిర్వర్తించి దైవ మోక్షాన్ని పొందాలి. ఇలా స్థిరీకరించబడిన ధర్మాలను యథావిధిగా కొనసాగించడం, వాటిని ఆచరింపచేయడమే ధర్మ రక్షణ అవుతుంది. వీటికి విరుద్ధంగా సమానత్వం వైపుకు, భిన్న సంస్కృతుల వ్యాప్తి కొరకు ఏమాత్రం ప్రయత్నాలు జరిగినా సహించని తనాన్ని బయటపెడుతుంటాయి హిందూత్వ శక్తులు. స్వేచ్ఛ, సమానత్వం, ప్రజాస్వామ్యం, సోషలిజం, సెక్యులరిజం అనేవి హిందూ ధర్మ మౌలిక సూత్రాలను సవాల్ చేస్తాయి. వ్యతిరేకిస్తాయి.

మనిషిని మనిషిగా, సాటివారిని తనతో సమానంగా చూడలేని, గౌరవించలేని నీతిని ప్రోత్సహించి ఆచరిస్తున్నది హైందవం. అలా కాదని ఎన్ని మసిపూసి మారెడు కాయలు చేయాలనుకున్నప్పటికీ, పిట్ట కథలు, కట్టు కథలు, పురాణాలు, ఇతిహాసాలు, మరెన్నో చెప్పినా, శాంతి, సహనం, న్యాయం అని ఎన్ని చెప్పుకుంటూ వచ్చినప్పటికీ అవన్నీ నీటి మీద రాతలేనని ప్రత్యక్షంగా పాటించబడుతున్న నిచ్చెనమెట్ల కుల వ్యవస్థ కుండబద్దలు కొట్టినట్లుగా నిరూపిస్తూనే ఉన్నది. హిందూత్వ పేరుతో ఎవరు ఏమి తినాలో, ఏ బట్టలు ధరించాలో, ఎవరు ఎవరిని పెళ్లి చేసుకోవాలో, ఎలా పెళ్లి చేసుకోవాలో, ఎవరిని ఎలా ప్రేమించాలో శాసిస్తున్నారు. అలా కాదని ఎవరైనా ప్రశ్నిస్తే ధర్మాన్ని, సంస్కృతిని, విశ్వాసాలను ఎదిరిస్తారా అని దౌర్జన్యాలకు దిగుతున్నారు.

అటవిక దశ నుండి నేడు చెప్పబడుతున్న నాగరిక దశ వరకు మానవ సమాజ పరిణామ క్రమంలో ప్రపంచ వ్యాప్తంగా విలువల్లో ఎన్నో మార్పులు చోటు చేసుకుంటూ వచ్చాయి. మతానికి రాజ్యంపై అధికారం ఉండకూడదనే విలువ సెక్యులరిజంగా రూపు దిద్దుకున్నది. ఇది మతం రాజ్యంలో, రాజ్యం మత విషయాల్లో జోక్యం చేసుకోవద్దనే దశకు వచ్చింది. ఎవరైనా సరే తమకు నచ్చిన మతాన్ని పాటించవచ్చని, ప్రచారం చేసుకోవచ్చని, భారత రాజ్యాంగంలోని 25వ ఆర్టికల్ స్పష్టం చేస్తున్నది. మత స్వేచ్ఛ ఒక హక్కుగా గుర్తించబడింది. ఇది భిన్న మతాలు, ఆచారాలు, సంస్కృతులు ఉన్న దేశంలో ఒకరినొకరు గౌరవించుకుంటూ సామరస్యంగా జీవనం సాగించే ఉన్నత ఆదర్శంగా ఉంటుంది. ఇవాళ బహిరంగంగానే సెక్యులరిజం, సోషలిజం అనే పదాలు రాజ్యాంగంలో ఉండొద్దని కొందరు పార్లమెంట్ సభ్యులు ప్రకటిస్తున్నారు. కొందరు వీటిపై చర్చ జరగాలని అంటున్నారు.

2015 జనవరి 26న రిపబ్లిక్‌డే సందర్భంగా కేంద్ర సమాచార, ప్రసార మంత్రిత్వ శాఖ ఒక ప్రకటన విడుదల చేసింది. దీంట్లో బ్యాక్‌గ్రౌండ్ వాటర్ మార్క్‌లో ఉన్న భారత రాజ్యాంగ పీఠిక చిత్రంలో సోషలిస్టు, సెక్యులర్ అనే పదాలు లేకుండా పోయాయి. ఈ ప్రకటనలో వచ్చిన ఇమేజ్ 1950 నాడున్న రాజ్యాంగ పీఠికదని అందులో ఈ పదాలు లేవని, అది 1976లో 42వ రాజ్యాంగ సవరణ ద్వారా చేరాయని సమాచార ప్రసార శాఖ చెపుతున్నది. ఒరిజినల్ రాజ్యాంగంలో ఇవి లేవని, ఆ ఒరిజినల్ కాపీని ఉన్నదున్నట్లుగా ప్రచురించడం జరిగిందని అది తప్పు కాదని అంటున్నారు. చేతిరాత కాలిగ్రఫితో ఉన్న ఒకే ఒక ఒరిజినల్ కాపీ ఉన్నదని అందులో ఈ పదాలు లేవని ఉపరాష్ట్రపతి ఓఎస్‌డి గురుదీప్ సప్పల్ చెపుతూ రాజ్యసభ ప్రచురించిన క్యాలెండర్‌లో కూడా ఈ పదాలు లేకుండా పోవడాన్ని సమర్థించారు. ఈ పదాలు లేకపోవడంపై నిరసనలు రావడంతో ఈ పదాలున్న రాజ్యాంగ పీఠికనే ఇక ముందు వాడతామని చివరకు మంత్రి అరుణ్ జైట్లీ ద్వారా చెప్పించారు. సెక్యులరిజం భారత ప్రజల రక్తంలో ఉందని దాన్ని తొలగించే ఆలోచనే లేదని వెంకయ్యనాయుడు ప్రకటించారు. శివసేన ఈ పదాలను శాశ్వతంగానే తొలగించాలని డిమాండ్ చేసింది.

నిజానికి సోషలిస్టు, సెక్యులర్ అనే పదాలు నిర్దిష్టంగా 1950 నాటి రాజ్యాంగ పీఠికలో లేనప్పటికీ కూడా పీఠిక ఆసాంతం, ప్రాథమిక హక్కులు, ప్రాథమిక విధులు, ఆదేశిక సూత్రాలలో అంతర్లీనంగా ఈ విలువల స్ఫూర్తి స్పష్టంగానే కనిపిస్తుంది. పీఠికలో పొందుపరచబడిన న్యాయం, సమానత్వం, స్వాతంత్ర్యం, సౌభ్రాతృత్వంను చదివినా సోషలిస్టు, సెక్యులర్ విలువలు అంతర్గతంగా ఇమిడి ఉన్నాయనే అర్థం చేసుకోవచ్చు. బిజెపి ప్రభుత్వం ఈ పదాలను తొలగించబోమని ఎంతగా చెపుతున్నప్పటికి దాని మాతృ సంస్థ ఆర్‌ఎస్‌ఎస్‌కు మాత్రం ఇవి రుచించనివే. ఇండియా, పాకిస్థాన్‌ల విభజన సమయంలో ముస్లింలు అందరూ పాకిస్థాన్‌కు వెళ్లారు. పాకిస్థాన్ ముస్లిం దేశం అయింది. ఇక మిగిలిన వారందరూ హిందువులే. ఈ దేశం హిందువులదేననే సూత్రీకరణను ఆర్‌ఎస్‌ఎస్ భావజాలం చేసేసింది. ఈ దేశం హిందూ దేశం కాబట్టి ఇక్కడ ఇతర మతస్థులు, హిందూ మతేతర సంస్కృతుల వారు ఉండడానికి వీలులేదు. ఒకవేళ ఉండాలంటే హిందూత్వాన్ని అనుసరించాల్సిందే. లేదంటే ఏ హక్కులకు, గౌరవానికి నోచుకోకుండా హిందూత్వ ఆధిపత్యం కింద మనుగడ కొనసాగించాలని ఆర్‌ఎస్‌ఎస్

భావజాల కర్తలలో ముఖ్యులైన సావర్కర్, గోల్వాల్కర్‌లు చెప్పి ఉన్నారు. అందువల్ల సెక్యులర్ అంటేనే భగ్గుమంటున్నాయి సంఘ్‌పరివార్ శక్తులు. విభిన్న జాతుల, మతాల, సమూహాల, సంస్కృతుల సమాహారంగా ఉన్న దేశాన్ని కేవలం హిందూ మతావలంబకులదేనని దబాయించడం సంఘ్‌పరివార్‌కే చెల్లింది. ఏ మతాన్ని పాటించని వారు, నాస్తికులు, ఒకప్పటి చార్వాకులు, పార్సీలు, సిక్కులు, బౌద్ధులు, జైనులు, క్రైస్తవులు, ముస్లింలు, ఆదివాసులు, దళితులు, మానవతావాదులు, కమ్యూనిస్టులు ఈ దేశంలో నివసిస్తున్నారు. ఇవన్నీ కాదని అబద్ధపు ప్రచారాలతో, అసత్యాలతో చారిత్రక ఆధారాలేమి లేకుండా పుక్కిటి పురాణాలతో, వక్రీకరణలతో, ద్వేష పూరిత భావజాలాన్ని వ్యాపింప చేస్తున్నారు. హిందూత్వ సంఘటిత రూపం హిందూ మహాసభ, ఆర్ఎస్ఎస్‌లు ఏర్పడిన నాటి నుండి వాటికి సైద్ధాంతిక భూమికను ఇచ్చిన సావర్కర్, హెగ్డేవార్, గోల్వాల్కర్ తదితరులు అశాస్త్రీయమైన, అసంబద్ధమైన ప్రచారాలను చేస్తూ వచ్చారు.

ప్రపంచాన్ని శాసించే స్థాయికి హిందూ దేశం ఎదగాలని, అందుకోసం 'హిందూ జాతి' అనే భావనను బలంగా పెంపొందించే అవసరం వారికి ఏర్పడింది.'సోషలిజం ఈ గడ్డన పుట్టలేదు. అది మన రక్తంలో గాని, మన సాంప్రదాయంలో గాని లేదు. ఇక్కడున్న కోట్లాది ప్రజల ఆలోచనలకు అది పూర్తిగా భిన్నమయినది. కాబట్టి మన హృదయాలను కదిలించే శక్తి గాని, నిమగ్నతతో పనిచేసే ఉత్తేజాన్ని ఇచ్చే శక్తి గాని దానికి లేవు' అని గోల్వాల్కర్ సోషలిజాన్ని వ్యతిరేకించాడు. సోషలిజం అనగానే అందరికి సమాన విద్య, ఉపాధి, సంపద, గౌరవం అనే అర్థం స్ఫురిస్తుంది. హెచ్చు తగ్గులు లేకుండా ప్రకృతి సంపదపై ప్రతి ఒక్కరికి సమాన హక్కులను సూచిస్తుంది. ప్రకృతి సంపదలు ఏ ఒక్కరి సొత్తుగానో కాకుండా మొత్తం సమాజానిది అనే అర్థం సోషలిజంలో ఉన్నది. ఇది హిందూ భావజాలానికి వ్యతిరేకమైనది. స్వధర్మాలను ఆచరించమని చెప్పేదానికి వ్యతిరేకమైనది. దేవుడున్నాడా? లేడా? అనేది ఒక అంశం అయితే దేవుడి పేరుమీద అనేక పుక్కిటి పురాణాలు, అశాస్త్రీయమైన ఆచార వ్యవహారాలు, మత క్రతువులు, అంధ విశ్వాసాలను వ్యాప్తి చేయడం అన్ని మతాల్లోనూ ఉన్నాయి. నికృష్టమైన కుల వ్యవస్థ ఇతర మతాల్లో కనిపించదు. మనిషికి వివిధ కులాల్లో పుట్టుకను బట్టి భిన్నమైన విలువలను, హక్కులను, ప్రమాణాలనూ వర్తింపచేసే నిచ్చెనమెట్ల కుల వ్యవస్థను అనుసరించే హైందవానికి సోషలిజం ఎలా పొసుగుతుంది? ఎవరి స్థానాన్ని వారు తమ కర్మ ఫలంగా స్వీకరించి ఆచరించాలని చెప్పే హైందవానికి సోషలిజం ఎలా నచ్చుతుంది? ఆర్ఎస్ఎస్‌కు సంబంధించిన ఈ పునాది భావజాలం తెలిస్తే తప్పించి దాని పరివారం సోషలిజంపై ఎందుకంతగా విషం కక్కుతారో అర్థం కాదు.

ఘర్‌వాపసీ పేరుతో ఇతర మతాల వారిని నయానో, భయానో, నజరానాలతోనో హిందూ మతంలోకి మార్పిడిలు చేస్తూ ఉన్నారు. ఇతర మతస్థులు హిందూ మతంలోకి రావాలంటే వారిని ఏ కులంలో చేర్చాలో అంతులేని ప్రశ్న. నిచ్చెనమెట్ల కుల వ్యవస్థలోకి రావడానికి ఎవరు మాత్రం ఇష్టపడతారు. కాబట్టి హిందూ మతంలోకి మత మార్పిడిలు జరగడం కష్టసాధ్యం. అయితే హిందూ మతం నుండి ఆత్మగౌరవం, సమానత్వం కోసం, కులవ్యవస్థ నుండి స్వేచ్ఛ కోసం, ఇస్లాం, క్రైస్తవంలోకి మార్పిడిలు జరగడం సహజంగా జరిగే విషయం. ఇందు కోసమే మత మార్పిడి నిషేధ చట్టం తేవాలని హిందూత్వ శక్తులు పట్టుపడుతున్నాయి. అధికారంలో బిజెపి ఉన్నది కాబట్టి హిందూత్వ శక్తులు తమ భావజాల వ్యాప్తిని వేగవంతం చేస్తున్నాయి. అధికార యంత్రాంగంలో ప్రముఖమైన, కీలకమైన, నిర్ణయాత్మకమైన స్థానాల్లో వీరి అనుంగు విశ్వాసాకులను నియమించుకుంటున్నారు. భవిష్యత్‌లో ఈ ప్రభావాలను స్థిరీకరించుకోవడం కోసం బిజెపి వేగంగా అడుగు లేస్తున్నది. దాన్ని ఆర్ఎస్ఎస్ భావజాలం నడిపిస్తున్నది. ఆర్ఎస్ఎస్ అధ్యక్షుడు నేడు ఎంతో ధైర్యంగా ఈ దేశం ఒకప్పుడు, ఇప్పుడూ, ఎప్పుడూ హిందూ దేశమేనని చెప్పేంత సాహసం చేస్తున్నాడు. దానికి విస్తృత ప్రచారం కల్పిస్తున్నాడు. ఎంత వీలైతే అంత మేరకు ఈ భావాజాలాన్ని రకరకాల సంస్థల పేరుతో వ్యాపింపచేయడమే పనిగా పెట్టుకున్నారు. అందులో భాగమే రాజ్యాంగ పీఠికపై అనవసర రాద్ధాంతం. ఈ దేశం హిందువులదే అని చెప్పాలంటే, హిందువులే ఈ దేశంలో ఉండాలని సమర్థించుకోవాలంటే సెక్యులర్ అనే పదం వారికి అయిష్టంగా మారడం సహజమే. అందుకే 1950 నాటి రాజ్యాంగ పీఠిక వారికి అవసరమైంది. అయినా వారి పిచ్చిగాని నిర్దిష్టంగా సెక్యులర్, సోషలిస్టు అనేవి లేనప్పటికీ రాజ్యాంగ పీఠికను అర్థం చేసుకున్నవారికెవరికైనా ఈ విలువలు అంతర్లీనంగా పీఠికలో ఉన్నాయని తెలుస్తుంది.

హిందూత్వ శక్తులు తెస్తున్న ప్రమాదకర భావజాలం, పాసిస్టు విధానాలు ప్రజాస్వామ్యానికి తీవ్ర విఘాతం కలిగిస్తున్నాయి. చాపకింద నీరులాగా నిరంతరంగా, కొన్నిసార్లు బహిరంగంగా ఈ ధోరణులు విస్తరిస్తుండడం గమనించవచ్చు. ఈ సందర్భంలో, మరే సందర్భంలోనైనా ప్రజాస్వామిక విలువలను కాపాడుకోవడం కొరకు ఈ భావజాల వ్యాప్తిపై నిరంతర పోరాటం చేయాల్సి ఉన్నది. హిందూత్వ భావజాల పునాదులపై సమగ్ర అవగాహనను కలిగి ఉంటూ, హిందూ మతోన్మాదాన్ని నిలువరించవలసిన అవసరమున్నది. ఆ మాటకొస్తే ఏ మతోన్మాదమైన ప్రజాస్వామిక సూత్రాలకు వ్యతిరేకమైనదే. అయితే ఈ దేశంలో అత్యంత ప్రమాదకారిగా మారి అధికారంలోకి కూడా హిందూ మతోన్మాద శక్తులు వచ్చేశాయి. ఇప్పటికే ఈ శక్తులు దేశంలో ఎన్నో రాష్ట్రాల్లో ఎన్నో చోట్ల ఎంతో విధ్వంసాన్ని సృష్టించిన చరిత్రను కలిగి ఉన్నాయి. వీటన్నింటికి పరాకాష్ఠగా 2002లో గుజరాత్‌లో జరిగిన మారణ హోమం ప్రజాస్వామిక వాదులను వెంటాడుతూనే ఉంటుంది. మత విద్వేషపూరిత రాజకీయాలు నడుపుతూ, ఒకప్పుడు పార్లమెంట్‌లో రెండు స్థానాలున్న బిజెపి నేడు సంపూర్ణ మెజారిటీతో స్వతంత్ర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడమంటే ఈ దేశంలో పెరగవలసి ఉన్న ప్రజాస్వామిక స్పృహ, చైతన్యం అవసరాన్ని, ఆవశ్యకతను తెలియచేస్తున్నది. ప్రజాస్వామిక ఉద్యమాల, విలువల వ్యాప్తి కొరకు జరగాల్సి ఉన్న కృషి తీవ్రతను తెలుపుతున్నది. ప్రజాస్వామిక, సెక్యులర్ శక్తుల మధ్య పెరగవలసిన ఐక్యతను సూచిస్తున్నది.

1993లో బాలగోపాల్ చెప్పిన మాటలతో ఈ వ్యాసాన్ని ముగిద్దాం. పెరుగుతున్న హిందూ మతోన్మాదం కేవలం మైనారిటీలకు ప్రమాదకారి కాదు. ప్రజాస్వామ్య విలువలకూ, ప్రజాస్వామ్య హక్కులకూ ప్రమాదకారి. అది కేవలం ముస్లింలకూ, క్రైస్తవులకూ, సిక్కులకూ, ఇతర మైనారిటీలకు మాత్రమే శత్రువు కాదు. పీడనకూ, అణచివేతకూ గురయ్యే ప్రజలందరికీ శత్రువు. హిందూ ఫాసిజం మనల్ని కబలించే ముందు ప్రజాతంత్ర విలువలను సంరక్షించుకోవడం కోసం, అందులో భాగంగా లౌకిక వాదాన్ని సంరక్షిచుకోవడం కోసం ఐక్యమవుదాం. హిందూ మతోన్మాదానికి జవాబు వేరొక మతోన్మాదం కాదు, ప్రభుత్వ నియంతృత్వం కాదు. ప్రజాతంత్ర చైతన్యం దానికి జవాబు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# ఇది డెమోక్రసీ కాదు, మోడియోక్రసీ

***మోడీ గెలుపు కోసం పనిచేసిన కార్పొరేట్ కంపెనీల జేబులు నింపడానికే 2015-16 బడ్జెట్ ప్రవేశ పెడుతున్నారని అంటున్నారు* వి. హనుమంతరావు**

అత్యంత అనుకూల నేపథ్యంలో భాజపా ప్రభుత్వం 2015-16 బడ్జెట్ ప్రవేశపెట్టనుంది. ఈ దేశ రాజధాని ఢిల్లీ ప్రధాని పీఠం కిందనే ఎన్నికల ఫలితాల బాంబు బద్దలైంది. దేశంలో సామాన్య ప్రజానీకం బాగోగుల గురించి పట్టించుకోకుండా వివిధ దేశాల పర్యటనకు ప్రథమ ప్రాధాన్యత నిచ్చిన ప్రధానికి సామాన్యుడైన కేజ్రీవాల్ సామాన్యుల తడాఖా అంటే ఏమిటో రుచిచూపించారు. ఎన్నికల ఫలితాలు ప్రభుత్వానికి వాతపెట్టిన తర్వాతనే హిందూ మతతత్వ వాదులు ఎటువంటి అఘాయిత్యాలకు పాల్పడుతున్నా నోరుమెదపకుండా మౌన వ్రతం పాటిస్తున్న ప్రధాని ఎన్నిక ఫలితాలు గూబగుయ్యి అనిపించిన వెనువెంటనే ఆ ఛాందస్తుల ఆగడాలను సహించబోనని హెచ్చరించాల్సి వచ్చింది. ఈ ఎన్నిక ఫలితాలు బడ్జెట్ కేటాయింపుల మీద ఎటువంటి ప్రభావం చూపనున్నదే ప్రశ్న.

దేశ ప్రజలు పన్నులు, సెస్‌లు తదితర రూపాల్లో ప్రభుత్వానికి చెల్లించే ధనాన్ని ప్రభుత్వం ఎలా ఖర్చు చేసిందనే విషయాన్ని తెలియ చేసేదే బడ్జెట్. ఆ జమా ఖర్చుల గురించి మనం తెలుసుకోకపోతే ప్రజలు ఎన్నుకొన్న ప్రభుత్వం తన ఇష్టారాజ్యంగా ఖర్చుచేయవచ్చు. పన్నుల ద్వారా మనం ప్రభుత్వానికి చెల్లించిన నిధులు దుర్వినియోగం గాని, పూర్తిగా ఖర్చు చేయకపోవడం గాని జరుగుతూ వస్తుందని మన అనుభవం. ఈ లెక్కలు, ఈ గణాంకాలు, జమా ఖర్చులు మనకు అర్థం కావని ప్రజలు అనుకుంటే మనకు మనమే అన్యాయం చేసుకున్న వాళ్లమవుతాం.

మామూలుగా దేశ, రాష్ట్ర స్థాయిల్లో బడ్జెట్ తయారీ ప్రారంభమవుతుంది. ఆర్థిక మంత్రి వివిధ తరగతుల ప్రతినిధులను సమావేశాలకు పిలిచి వారి కోర్కెలు, వాటి పరిష్కారాల గురించి వారి అభిప్రాయాలను తెలుసుకోవడం జరుగుతుంది. ఆర్థికమంత్రి దేశ ద్రవ్య, ఆర్థిక పరిస్థితుల గురించి తన గోడు తాను వినిపిస్తాడు. ఇటువంటి నేపథ్యంలో ఈ బడ్జెట్ ప్రవేశపెట్టడం జరుగుతోంది? పది సంవత్సరాల కాంగ్రెస్ పాలన దుర్గంధాన్ని వెదజల్లి ధరలు తగ్గించలేక, అవినీతిని అరికట్టలేక, నిధులను సమకూర్చుకోలేక, పరిపాలనా యంత్రాంగం భ్రష్టుపెట్టి, ప్రజానీకాన్ని వారి మానానికి వారిని వదలిపెట్టడంతో ప్రజలు విసుగెత్తి ప్రభుత్వాన్ని గద్దె నుంచి దించేశారు. ఇది ఎన్నికల్లో పోటీ చేసిన భాజాపాకు పెట్టుబడిగా మారింది. అన్ని ఎన్నికల్లో లాగే, అన్ని పార్టీల్లాగే, భాజపా కూడా చుక్కల్లో చంద్రుణ్ణి చూపించి మెజారిటీ సీట్లను (వోట్లుకాదు) గెలుచుకొని అధికారంలోకి వచ్చింది. కార్పొరేట్ సంస్థలు రు. 363 కోట్ల రూపాయలను బిజెపి ఎన్నికల నిధికి జమ చేశారు. (చట్ట ప్రకారమే) దొడ్డిదారిన ఎంతనిధిని వసులు చేశారో తెలియదు. పత్రికాధిపతులు (వీరు కూడా కార్పొరేట్లే) బిజెపికి పల్లకి మోశారు. వాళ్ల కోర్కెలు వారికున్నాయి. వాళ్ల వద్ద నుంచి ఎన్నికల నిధులు వసూలు చేసిన తర్వాత, వాళ్లకు అనుకూలమైన నిర్ణయాలు చేయక గత్యంతరం లేదు. ఆర్థిక మంత్రి అరుణ్ జైట్లీ ఈ నేపథ్యాన్ని గుర్తుంచుకొని తదనుగుణంగా బడ్జెట్ తరయారీకి పూనుకున్నారు. ఆ పనిలో ఉండగానే, కార్పొరేట్ అనుకూల బడ్జెట్ తయారీలో ఉండగా ఢిల్లీ ఎన్నికల బాంబు పేలింది. ఇపుడు అంత పచ్చి పచ్చిగా బడ్జెట్ తయారు చేస్తే, జనం ఛీ అంటారు. అలాగని కార్పొరేట్ల ఆశలను వమ్ముచేసే సాహసం చేయలేడు. అదే సమయంలో ప్రజల ఆశలను చెత్తబుట్టలో పారెయ్యలేరు. ఎలా బ్యాలన్స్ చేశారో, ఈ వ్యాసం చదివే నాటికి బడ్జెట్ మన కళ్లముందుంటుంది.

2015-16 బడ్జెట్ ప్రవేశపెట్టే నాటికి దేశ పరిస్థితులు ఎలా ఉన్నాయని చూడకపోతే 1991లో పి.వి. నరసింహరావు ప్రధానిగా, మన మన్మోహన్‌సింగ్ ఆర్థిక మంత్రిగా పదవీ స్వీకారం చేసే నాటికే ఆర్థిక పరిస్థితి అత్యంత క్లిష్టంగా ఉండి ఐఎంఎఫ్ నుంచి రుణం తెచ్చుకొని గట్టెక్కాల్సిన నాటి నుంచి ఏ మూడు, నాలుగు సంవత్సరాల్లోనో తప్ప, మిగతా కాలమంతా అప్పులు తేవడం, బండి పడిపించడంగానే ఉంటూ వచ్చింది. 2008 ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మరింత దిగజారింది. పిట్టను కొట్టి పొయ్యిలో పెట్టూ అన్నట్లు అప్పు ఎక్కడ దొరికితే అక్కడ తేవడం, బండి లాగించడంగానే ఉంటూ వచ్చింది. అప్పుతేవడం తప్పుకాదు. తెచ్చిన రుణాన్ని ఉత్పత్తి వ్యవస్థలో పెట్టుబడిగా పెట్టి, వచ్చిన లాభంతో రుణం తీర్చాలి. కాని మన ప్రభుత్వం నిత్యావసరాలకు, పరిపాలనా వ్యవస్థ నడిపించడానికే ఖర్చు చేస్తూ రావడంతో పరిస్థితి చేయిదాటి పోయింది.

దేశంలో 70 శాతం మంది గ్రామీణ ప్రాంతాల్లో నివసిస్తున్నారు. 60 శాతం మంది రైతులకు భూమే వారి భుక్తి. వారు కాదు, దేశంలో 125 కోట్ల జనాభాకు వారే తిండి పెడుతున్నారు. తిండి గింజలను ఎగుమతి చేసే స్థాయికి వ్యవసాయాన్ని అభివృద్ధి చేశారు. అలాంటి రైతులను భూమి నుంచి గెంటివేసి పారిశ్రామిక వేత్తలకు చౌకగా కట్టబెడుతున్నారంటే ప్రభుత్వం దృష్టిలో వ్యవసాయం అనేది అభివృద్ధి కాదని అనుకోవాలా? ఆ పని జరగడానికి ఆర్డినెన్స్ ప్రవేశపెట్టడం ప్రజాస్వామ్యం అవుతుందా? రాజ్యసభలో పాలక పార్టీకి మెజారిటీ లేదు కాబట్టి ఉభయ సభల ఉమ్మడిసభ గురించి ప్రతిపాదన ప్రవేశపెట్టాలనుకోవడం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని రోడ్ రోలర్ చేయడం కాదా? ఈ చర్య వల్ల భూమి మీద ప్రత్యక్షంగా, పరోక్షంగా ఆధారపడే రైతులు, కూలీలు, కౌలుదార్లు, చేతి వృత్తులవారు, మత్స్యకారుల మీద అప్రజాస్వామిక, సమాజ వ్యతిరేక చర్య తీసుకోవడమే అవుతుంది. ఈ ఆర్డినెన్స్ ప్రకారం రైతుల నుంచి తీసుకొనే భూమిని ఇటు తిండి గింజలు, అటు పారిశ్రామిక ఉత్పత్తులు చేయకుండా ఎంత

కాలమైనా ఉంచవచ్చు. భూమి అమ్మకం, కొనుగోళ్లలో స్టాంపు డ్యూటీ తక్కువగా చెల్లించడం కోసం భూమిని తక్కువ ధర చూపిస్తారు. అలా తక్కువగా చెల్లించిన స్టాంప్ డ్యూటీ ఆధారంగా నష్ట పరిహారం చెల్లిస్తారట! గ్రామాల్లోనే కాదు, పట్టణాల్లో కూడా అదే ఫార్ములా. ఉదాహరణకు ఢిల్లీ నగరంలో చదరపు మీటరు భూమి ధర రు. 820 మాత్రమే! ఇది రియల్ ఎస్టేట్ దారులకు లాభం, పాలక పార్టీకి లాభం అనేది వేరే చెప్పాల్సిన పనిలేదు. సాగునీటి ప్రాజెక్టుల నిర్మాణానికి భూమి సేకరిస్తే అది అభివృద్ధి, కాని కార్పొరేట్లకు, రియల్ ఎస్టేట్‌కు భూమి చౌకగా అమ్మడం అభివృద్ధి అవుతుందా? ఇది మోడీ తరహా అభివృద్ధి! అటవీ ప్రాంతంలో ఖనిజాలున్న చోట గిరిజనులు ఇదే అన్యాయానికి గురవుతున్నారు. మైదాన ప్రాంతాల్లో అయితే ఎంతో కొంత నష్టపరిహారం లభిస్తుంది. కాని గిరిజనులయితే, వారిని గెంటివేయడమే. లేకపోతే మావోయిస్టులని కాల్చివేయడమే. ఏం, మిలియనీర్లు, బిలియనీర్ల పేరున ఉన్న భూములను తీసుకుని అభివృద్ధి కార్యక్రమాలు చేయవచ్చుకదా. కుండలో అన్నం కుండలోనే ఉండాలి, కొడుకు కడుపు నిండాలి! మన రాష్ట్రానికి వస్తే కృష్ణా నది తీరంలో వ్యవసాయ భూములను వ్యవసాయేతర భూములుగా మార్చి భారీ కట్టడాలు నిర్మించారని వార్త. ఇది రెవెన్యూ శాఖ నిర్ధారించిన విషయం. ప్రభుత్వం ఏం చేస్తుందో చూడాలి. దేశంలో డెమోక్రసీ కాదు, మోడీయోక్రసీ నడుస్తోంది.

**పరిశ్రమలు**

వ్యవసాయం తర్వాత ముఖ్యమైనది పారిశ్రామికీకరణ. వ్యవసాయానికి సమాధి కడుతోంది ప్రభుత్వం ఎందుకు? దేశంలో పారిశ్రామికీకరణ కొద్దో గొప్పో సాగుతోంది. కాని పారిశ్రామికీకరణ, ముఖ్యంగా తయారీ రంగం కునికిపాట్లు పడుతోంది. జనవరి 2015 లెక్కల ప్రకారం తయారీ రంగం గత మూడు నెలల్లో కన్నా తక్కువగా పడిపోయింది. అత్యంత కీలకమైన ఎనిమిది రకాల (కోర్ సెక్టర్) పరిశ్రమలు నవంబర్‌లో కన్నా డిసెంబర్‌లో 6.7 శాతం నుంచి 2.4 శాతానికి పడిపోయాయి. 2007లో జిడిపి పెరుగుదల 9 శాతం ఉండగా కాంగ్రెస్ ఆఖరి సంవత్సరం పాలనలో 5 శాతానికి తక్కువగా పడిపోతే, అంకెల గారడీ చేసి 7 శాతం పైగా ఉంటుందని లెక్కవేశారు. అకాల వర్షాల వల్ల, లేదా పర్యావరణంలో మార్పుల వల్ల, వ్యవసాయోత్పత్తి తగ్గితే, తయారీ రంగం కునికిపాట్లు పడుతుంటే, పరిశ్రమలు తమ ఉత్పాదకశక్తి మేరకు ఉత్పత్తి చేయలేకపోతుంటే ఈ దిగజారుడును అరికట్టడానికి ఏం చర్యలు తీసుకోవాలో ఆలోచించకుండా 'మేక్ ఇన్ ఇండియా' నినాదాన్ని రూపొందించి అభివృద్ధి చెందిన, ముఖ్యంగా అమెరికాలోని బహుళజాతి సంస్థలను, ఇతర పారిశ్రామికవేత్తలను మోడీ స్వయంగా వెళ్లి, మీరు మా దేశం వచ్చి పెట్టుబడులు పెట్టి, పరిశ్రమలు స్థాపించి ఎగుమతి చేసుకోండంటూ బొట్టుపెట్టి పిలవడంతో మనదేశ ప్రతిష్ఠ దిగజార్చడం మోడీయోక్రసీ రెండో ముఖం. పరిశ్రమలు స్థాపించాలని కోరడంతో పాటు అత్యంతాధునిక టెక్నాలజీని కూడా అందజేయాలనే షరతు కూడా పెట్టలేదు. ఇప్పటికే మనదేశంలో బహుళజాతి సంస్థలనేకం తిష్టవేసుకొని ఉన్నాయి. లాభాలు దండుకొని వారివారి దేశాలకు తరలించి వస్తున్నాయి. ఇప్పటికే ఉన్న పరిశ్రమలు మనకు టెక్నాలజీని ఏమైనా అందజేశాయా? అధునాతన టెక్నాలజీని కోట్ల రూపాయలను వెచ్చించి రూపొందించుకొంటే, అవి మనకు ఊరకనే ఇవ్వడానికి వాళ్లేమైనా వెర్రివెంగళాయులా? అయినా, పెట్టుబడులు పెట్టమని పిలువడానికి దేశంలో ఆస్తులున్నవారు లేరా? తాజా లెక్కల ప్రకారం దేశంలో 32 మంది బిలియనీర్ల ఆస్తుల విలువ జనవరి 2014 నుంచి జనవరి 2015 మధ్య ఒకే ఒక సంవత్సరంలో రెట్టింపు అయింది. అంటే, 2014-15లో ప్రభుత్వ రంగంలో ఉన్న పరిశ్రమల షేర్లు అమ్మి ఎంత సంపాదించదలచుకొన్నారో, అంతకు సమానం వారి ఆస్తులపై ప్రభుత్వం అందుకు పన్ను పెంచితే అధికాదాయం వస్తుంది కదా. మోడీ, అమెరికాలో మీ స్నేహితుడు, ఆ దేశ అధ్యక్షుడు ఒబామా అత్యంత ధనవంతుల నుంచి అధిక పన్నులు విధించి ఆ సొమ్మును మధ్యతరగతి వారికి అందించవచ్చుకదా అని అన్నారు. అమెరికాలో అత్యంత ధనవంతుడు వారెన్ బుఫ్ఫే, సంపన్నుల మీద పన్ను పెంచాలని పిలుపునిచ్చారు. యూరప్, ఫ్రాన్స్, జర్మనీలో ధనవంతులు మా మీద అధిక పన్నులు విధించమని వారివారి ప్రభుత్వాలను కోరారు. కారణం? పేద, ధనిక వర్గాల మధ్య ఆదాయ సమానతలు పట్టి పగ్గాలు లేకుండా పెరిగిపోతున్నాయి. ఇంకా ఇలా పెరిగిపోతే అసలుకే మోసం వస్తుందేమోనని వారి భయం. ఆ భయం మనదేశంలో కూడా ఉందని పై గణాంకాలు తెలిచేస్తున్నాయి. మోడీజీ ఈ ప్రమాద ఘంటికలు మీకు వినపడలేదా? అవును కార్పొరేట్ల మోచేతి నీళ్లు తాగే మీకు ఎలా వినపడతాయి? గత నాలుగయిదు సంవత్సరాలుగా కార్పొరేట్లకు ప్రోత్సాహకాల పేరుతో – దానినే మన ప్రభుత్వ పరి భాషలో సబ్సిడీ – ప్రతీ సంవత్సరం అయిదు లక్షల కోట్లు రాయితీ కల్పిస్తున్నారు. అంటే సుమారుగా మన సంవత్సరంన్నర బడ్జెట్‌తో సమానం!

విదేశాల్లో ముఖ్యంగా స్విస్ బ్యాంకుల్లో భారత కుబేరులు దాచిన ధనాన్ని అధికారంలోకి రావడంతోనే వెనక్కు రప్పిస్తానని ఎన్నికల్లో వాగ్దానం చేసిన మోడీ ఇప్పుడు నీళ్లు నములుతున్నాడు. ఆ బ్యాంకుల్లో నల్ల భారతీయుల నల్లధనం ఎంత ఉందో రకరకాల లెక్కలున్నాయి. తాజాగా అంతర్జాతీయ పరిశోధన జర్నలిస్టుల కన్సోర్షియం డేట్లతో సహా విడుదల చేసిన లెక్కల ప్రకారం 1195 మంది భారతీయులు స్విస్ బ్యాంకులో దాచిన నల్లధనం రు. 2524 లక్షల కోట్లు! మనదేశ వార్షిక బడ్జెట్ 15 లక్షల కోట్లు మాత్రమే. ఈ నల్లధనంతో బహుశా అమెరికానే కొనివేయవచ్చునేమో! అయినా మన ప్రధాని అమెరికా వెళ్లి పెట్టుబడులు అడుక్కుంటున్నారు. ఇంతే కాదు, ఢిల్లీలోని జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయంలో ఆచార్యులు అరుణ్ కుమార్ ప్రకారం దేశంలోనే ఉన్న నల్లధనం మనదేశ డిజిపిలో 50 శాతం పైగానే ఉంది. మన దేశ డిజిపిలో ప్రత్యక్ష పన్ను మొత్తం ఇతర దేశాలతో పోలిస్తే చాలా తక్కువ, ఏడు శాతం మాత్రమే.

దేశం పారిశ్రామికంగా అభివృద్ధి కావాలంటే అప్పటికన్నా ఎన్నో రెట్లు విద్యుదుత్పత్తి కావాలి. ఆ మేరకు విద్యుదుత్పత్తి పెరగాలంటే బొగ్గు, సోలర్, గాలి మరల ద్వారా ఉత్పత్తి కావాలి. ప్రభుత్వ రంగంలో ఉన్న బొగ్గు గనులను వేలంపాటలో పెట్టి అమ్మేస్తున్నారు. గనుల నుంచి బొగ్గు ఒకసారి వెలికితీస్తే అంతే సంగతులు. చేతిలో ఉన్న బొగ్గు గనులను ప్రైవేట్ రంగం కొనేస్తే, దానితో వారు విద్యుదుత్పత్తి చేసి, ఎక్కువ ధరకు ప్రభుత్వమే కొనాల్సిన పరిస్థితి ఏర్పడుతుంది. అప్పటికే ఒక రాష్ట్రం పక్క రాష్ట్రాల నుంచి విద్యుత్ కొనాలంటే ఒక యూనిట్‌కి ఎనిమిది

# ముంచుకొస్తున్న మతోన్మాద ముప్పు

*ఏక పక్షంగా గెలిచిన బిజెపి ప్రభుత్వాన్ని అడ్డం పెట్టుకొని సంఘపరివార్ శక్తులు మత విద్వేషాలను రెచ్చగొడుతున్నాయని అంటున్నారు* **గడ్డం వెంకటరాజం**

**యు**పిఎ పది ఏళ్ల పాలనలో అవినీతి, అక్రమాలు, బంధుప్రీతి, విపరీతమైన సామాజిక ఆర్థిక, అసమానతలు, ధరలు, నిరుద్యోగం పెరుగుదల ఇంకా అనేకానేక విషయాల పట్ల ప్రజలు విసుగు చెందారు. ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పాటు అనివార్యం అనే సందర్భంలో దేశంలో ఉన్న పెట్టుబడి, భూస్వామ్య వర్గాలు, కార్పొరేట్ మీడియా, హిందూత్వ సంఘపరివార్ శక్తులు ముందుగానే ప్రధాని అభ్యర్థిగా నరేంద్రమోడీ పేరును ప్రకటించాయి. గుజరాత్ అభివృద్ధి ఎజెండాను ప్రజల దృష్టి మరల్చకుండా విస్తృతంగా ప్రచారం చేసినాయి. సాధారణ ప్రజానీకం, ఊహా లోకాల్లో బతికే మధ్యతరగతి, తమ వంతు సామాజిక బాధ్యతలు ఏవో తెలియని నేటి యువతరం ఆ గ్లోబల్ ప్రచారాన్ని నిజమేనని నమ్మారు. మోడీ అభూత కల్పనలు చేసి ఇక దేశంలో దారిద్ర్యం, పేదరికం, నిరుద్యోగం, ధరల పెరుగుదల, అంటరాని తనం మొదలైన వాటిని పారదోలి, ఆకాశమే హద్దుగా అభివృద్ధి చేస్తాడని భ్రమపడి, కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా బిజెపిని గెలిపించాయి. సంఘపరివార్ శక్తులు చివరికి మోడీ కూడా ఊహించని విధంగా మెజారిటీ పార్లమెంట్ స్థానాలు గెలుపొందారు. కొంతకాలం పాటు మత ఛాందస వాదాన్ని పక్కకు పెట్టి గుజరాత్ అభివృద్ధి ఎజెండాతో సోషల్ మీడియాలో, జాతీయ, రాష్ట్ర స్థాయి మీడియాల్లో అభివృద్ధి అనే బూటకపు అబద్ధపు ప్రచారాన్ని చేయించి ప్రభుత్వ వ్యతిరేకతను తమకు అనుకూలంగా మరల్చుకొని కొంత వరకు విజయం సాధించారు.

బిజెపి కేంద్రంలో అధికారంలోకి వచ్చినప్పటి నుండి ఈ ఏడు నెలల పాలనకాలాన్ని పరిశీలిస్తే బాధ్యత కలిగిన ఏ పౌరుడైనా మోడీ రహస్య ఎజెండా పరిపాలన ఏ విధంగా ఉందో అర్థం చేసుకోవచ్చు. ఈ ఏడు నెలల కాలంలో కాంగ్రెస్‌కు ప్రత్యామ్నాయంగా తీసుకున్న ఏ నిర్ణయం లేదు. పైగా కాంగ్రెస్ వారు ఏ నిర్ణయాలనైతే కొనసాగించి వదిలి వెళ్లారో వాటిని చాలా పకడ్బందీగా ముందుకు తీసుకెళ్తున్నారు. ఎన్నికల ముందు ఆధార్ వ్యవస్థ నిష్ప్రయోజనం, ఎల్‌పిజి సిలిండర్లపై సబ్సిడీ నేరుగా వినియోగదారుని ఖాతాలో జమచేయడం, ధరల పెరుగుదల, నిరుద్యోగం, అవినీతి, నేర చరిత్ర మొదలగు అంశాలపై అనేక సభలలో మోడీ దేశాన్ని బాగు పరుస్తాం అని ఊకదంపుడు ఉపన్యాసాలు ఇచ్చి ఏవైతే నిష్ప్రయోజనం అన్నాడో ఇప్పుడు వాటినే చాలా తెలివిగా ముందుకు తీసుకెళ్తున్నాడు. వీటన్నింటి కంటే ముఖ్యంగా దేశాన్ని తాకట్టుపెట్టే అనేక నిర్ణయాలు తీసుకుంటున్నాడు. అత్యంత కీలకమైన రక్షణ, బీమా, రైల్వే రంగాలలో 49 శాతం విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులకు అవకాశం కల్పించడంలో మోడీ చాలా తెలివిగా మైండ్ గేమ్ ఆడుతున్నట్లు కనిపిస్తున్నది. ఎఫ్‌డిఐ ల పై దేశవ్యాప్తంగా నిరసనలు, అగ్రహావేశాలు వ్యక్తం కాగా చాలా నిదానంగా ఎవరు భయపడవలసిన అవసరం లేదు, నేను రైల్వేరంగాన్ని ప్రైవేటీకరించట్లేదు. కేవలం 49 శాతం వరకు మాత్రమే ఎఫ్‌డిఐ లకు అనుమతి ఇస్తున్నాం అంటున్నాడు. ప్రైవేటీకరణతో పాటు అసలు ఎఫ్‌డిఐలు వద్దనే ఉద్యమాలు జరుగుతున్నాయి. అసలు ఏ ప్రైవేట్ వ్యక్తి అయినా ఒక రంగంలో పెట్టుబడి ఎందుకు పెడుతాడు? పెట్టుబడిదారునికి ఉండే సామాజిక బాధ్యత ఎంత? పెట్టుబడిదారీ విధానం ప్రధాన లక్ష్యం ఏమిటి? ఏ ప్రైవేట్, విదేశీ పెట్టుబడిదారుడైనా దోచుకోవడానికే ప్రయత్నిస్తాడు. ఇవేమి ప్రజలకు తెలియవు అన్నట్లుగా నేను రైల్వేలను ప్రైవేటీకరించట్లేదని సన్నాయి నొక్కులు నొక్కుతున్నారు. దేశంలో యువతకు ఉపాధి అవకాశాలు మెరుగు పర్చకుండా, నిరుద్యోగాన్ని రూపు మాపకుండా, ధరల పెరుగుదలను నియంత్రించకుండా విదేశీ రాయబారిలాగా ఈ

---

రూపాయలు అడుగుతున్నారని వార్త. ఆ లెక్కన సాధారణ పౌరులు ఆముదం దీపాలతో కాలం గడపాల్సి ఉంటుంది. పరిశ్రమలు ఏ ధరనైనా కొని, ఆ భారాన్ని ప్రజల మీద రుద్దుతారు. ప్రపంచంలో చాలా దేశాలు అణువిద్యుచ్ఛక్తికి మంగళం పాడేస్తుంటే మోడీ అన్ని షరతులకు అంగీకరించి, అమెరికా నుంచి అణు విద్యుత్ కేంద్రాలను దిగుమతి చేసుకుంటున్నారు. ప్రధాని అదే నోటితో సోలర్, గాలి మరల ద్వారా విద్యుదుత్పత్తికి ప్రాధాన్యత ఇవ్వాలని, మరింత పరిశోధన జరగాలని అంటారు.

అసలు ఇలా ప్రతీదానికి విదేశాల మీద ఆధారపడడమేమిటని రిజర్వు బ్యాంకు గవర్నర్ ప్రశ్నిస్తుంటే, ప్రధాని ప్రత్యేకంగా ఎంపిక చేసి రప్పించుకొన్న ఆర్థిక సలహాదారు సుబ్రమణియన్ జిడిపి ఇలా ఒక్కసారిగా పెరగడమేమిటని ప్రశ్నిస్తున్నారు. ఒకపక్క ఆర్థిక పరిస్థితి ఇలా దిగజారుతుంటే జిడిపి ఎలా పెరుగుతుందని ఆశ్చర్యం వెలిబుచ్చారు. నీతీ ఆయోగ్ మొట్టమొదటి సమావేశానికి ప్రత్యేకంగా ఆహ్వానించిన ఆర్థిక శాస్త్రవేత్తలు వ్యవసాయంలో పెరుగుతున్న ఖర్చు, ఉత్పాదకత గురించి ప్రభుత్వాన్ని మెత్తగా మందలించారు. ప్రైవేట్ రంగంతో కలిసి (పిపిపి) ప్రభుత్వం చేపట్టిన మౌలిక సౌకర్యాల పథకం ముందుకు పోవడం లేదు. ఈ సౌకర్యాలు లేనిదే విదేశీ పెట్టుబడులు రావు.

ఈ అయోమయ పరిస్థితిలో అరుణ్ జైట్లీ ప్రవేశపెట్టే బడ్జెట్ ఆ అయోమయాన్నే ప్రతిబింబిస్తుంది. ఏమైనా ఈ పాటికి బడ్జెట్ మీ చేతిలో ఉంటుంది తినబోతూ రుచులడగడమెందుకు?

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

ఏడు నెలల కాలంలో దేశాలన్నీ పర్యటించి వచ్చారు. పోనీ ఈ పర్యటనల సందర్భంగా సాధించింది ఏమైనా ఉందంటే జాతి సంపదను ఉపయోగించుకొని చదువుకొని విదేశాల అభివృద్ధికి, వారి జాతి సంపద పెరుగుదలకు తోడ్పడుతున్న 'జాతి ద్రోహులతో' మీటింగ్‌లు పెట్టి వాటిని టివిలలో విస్తృతంగా ప్రచారం చేయించుకుని, ఏదో ఘనకార్యం వెలగబెట్టిన వాడిలాగా గాంభీర్యం ప్రదర్శిస్తున్నారు. ఇదంతా నాణానికి ఒక పార్శ్వం అనుకుంటే ఇంకొక పార్శ్వం కేంద్రమంత్రుల, ఎంపిల, ముఖ్యంగా సంఘపరివార్ శక్తుల అత్యుత్సాహం అంతా ఇంతా కాదు.

స్వచ్ఛ భారత్ పేరు మీద ప్రజలకు చీపుర్లు, తట్టబుట్టలు అప్పచెప్పి మీరు రోడ్లనూ, చెత్తనూ ఊడ్చుకుంటూ ఉండండి, మేము చేసే పనులు మేము చేస్తామని ప్రజల ఆలోచనలు పరిపాలన వైపు మరల్చకుండా చేసి అత్యంత కీలకమైన నిర్ణయాలు ఏకపక్షంగా తీసుకుంటున్నారు. ఈ స్వచ్ఛ భారత్ కార్యక్రమానికి మన సామాజిక బాధ్యత కలిగిన వాళ్ల ఫొటో ఫోజులకు అంతూ లేదు. చాలా తెలివిగా హిందూత్వ ఫండమెంటలిజాన్ని దేశవ్యాప్తంగా వ్యాప్తి చేయడానికి పూనుకున్నట్లుగా స్పష్టంగా అర్థమవుతున్నది. స్వచ్ఛ భారత్ అనేది ప్రజల అటెన్షన్‌ను డైవర్షన్ చేసే కుట్ర. ఒకవేళ స్వచ్ఛ భారత్ కార్యక్రమం దేశాన్ని పరిశుభ్రం చేయడానికి అయితే ఎందుకు సంఘపరివార్ శక్తులు, బాబాలు, స్వాములు, కేంద్రమంత్రి మండలి ఎందుకు ఈ కార్యక్రమంలో పాల్గొనట్లేదు? అంటే రోడ్లు ఊడ్చేవాళ్లు, రోడ్లనే ఊడ్చాలనే ఆదేశమా? ఒక వేళ ఇది స్వచ్ఛమైన కార్యక్రమం అయితే ముందుగా బాబాలు, స్వాములు, పీఠాధిపతులు, పూజారులు తోటి చీపుర్లు పట్టించి రోడ్లను ఊడిపించి వారి చిత్తశుద్ధినీ, స్వచ్ఛతనూ నిరూపించుకోవాలె. ఇంకొక ప్రధాన విషయం ఏమిటంటే కేంద్రమంత్రుల, ఎంపి (బిజెపి) ల సంఘ పరివార్ శక్తుల అత్యుత్సాహం గురించి మాట్లాడుకోవాలె. భారతదేశాన్ని మరొకసారి లౌకికవాదం నుండి హిందూత్వ ఫాసిస్టుదేశంగా మార్చడానికి ఉండే అవకాశాలన్నింటిని వీలైనంత తొందరగా ఉపయోగించు కోవడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. లిఖిత రాజ్యాంగ స్ఫూర్తినీ, లక్ష్యాలనూ పక్కనపెట్టి అసమానతలకూ, వివక్షతలకూ, సకల దారిద్ర్యాలకూ, అమానుషమైన అంటరాని తనానికీ మూలమైన అమానుషమైన, అశాస్త్రీయమైన మనుధర్మ శాస్త్రాన్ని, హిందూ ఆధిపత్యాన్ని పెంచే కుట్రలు చేస్తున్నారు. దేశంలో ఉన్న భిన్నమైన సంస్కృతుల ఐక్యతను విడగొట్టే మత విద్వేషాలు రెచ్చగొట్టి సాధారణ మధ్యతరగతి వర్గం ప్రజలను ఆకర్షించి మత కల్లోలాలు చెలరేగే విధంగా కుట్రలు మొదలు పెడుతున్నారు. వీటన్నింటికి ముఖ్య కారణం మన కేంద్రమంత్రులు, ఎంపిలు అవడం చాలా దౌర్భాగ్యం. దేశంలో ఏ ప్రజా ప్రతినిధి అయిన కేవలం ఒక్క హిందువుల వోట్లతోనే గెలవలేరు. భిన్న మతస్తుల, కులాల వాళ్లందరూ వోట్లేస్తేనే గెలిచామనే కనీస బాధ్యత తెలియకుండా లౌకిక స్ఫూర్తినీ, రాజ్యాంగ స్ఫూర్తినీ వదిలేసి తమ మత ఛాందసవాదాన్ని పెంచుకునే ప్రయత్నాలు ముమ్మరం చేస్తున్నారు.

కేంద్రమంత్రి సాధ్వీనిరంజన్ జ్యోతి ఢిల్లీ ఎన్నికలను దృష్టిలో ఉంచుకుని బిజెపికి వోటు వేయని వాళ్లందరు 'హరాంజాదే'లు అని నిండు పార్లమెంట్‌లో వ్యాఖ్యానించడం భారతజాతిని, పార్లమెంట్‌ను అవమానించడం. మరో కేంద్రమంత్రి సుష్మస్వరాజ్ భగవద్గీతను జాతీయ గ్రంథం చేయాలని ప్రకటించడం ఏ లౌకికవాద, రాజ్యాంగ స్ఫూర్తికి నిదర్శనమో అర్థం చేసుకోవచ్చు. ప్రపంచంలో అనేక దేశాలు క్రిస్టియన్, ఇస్లాంలను అనుసరించే ప్రజాస్వామ్య దేశాలు ఉన్నాయి. కాని ఏ దేశం కూడా బైబిల్, ఖురాన్‌లను జాతీయ గ్రంథాలుగా ప్రకటించుకోలేదు. కాని మనదేశానికి భగవద్గీతను జాతీయ గ్రంథంగా ప్రకటించాలని అనడం ఏ ప్రజాస్వామ్యానికి నిదర్శనమో ఆలోచించాల్సి విషయం. ఇంకో పార్లమెంట్ సభ్యుడు (బిజెపి) సాక్షి మహరాజ్ మెజారిటీ ప్రజలు జాతిపితగా భావించే గాంధీని హత్య చేసిన నాథురాంగాడ్సేను దేశభక్తుడని పొగడడం. అనగా ఇక్కడ బిజెపి, సంఘపరివార్ దృష్టిలో గాడ్సే దేశభక్తుడు అయినప్పుడు గాంధీ దేశద్రోహి అయి ఉండాలి! గాంధీ దేశక్తుడు కానప్పుడు మోడీ, గాంధీ పుట్టినరోజును పురస్కరించుకుని స్వచ్ఛ భారత్ ప్రచార కార్యక్రమాన్ని ఎందుకు ప్రారంభించినట్లు? గాంధీ ద్రోహి అనే భావన సంఘ పరివార్ శక్తులకు ఉన్నప్పుడు గాంధీ పేరు మీద స్వచ్ఛ భారత్‌ను ప్రారంభించిన మోడీ కూడా ద్రోహి కావాలి. సాక్షి మహరాజ్ ఇటీవల చేసిన ఇంకొక వ్యాఖ్యానం ప్రతి హిందువు కుటుంబం తప్పని సరిగా నలుగురు పిల్లలను కనడం. అందులో ఒకరిని సైన్యానికి అప్పచెప్పడం. మరొకరిని సన్యాసులకు అప్పచెప్పడం. మిగిలిన ఇద్దరిని కుటుంబం వద్ద ఉంచుకోవడం. ఇటువంటి వ్యాఖ్యల్ని వింటుంటే మనం ఎటువంటి అనాగరిక సమాజంలో జీవిస్తున్నామో అర్థంకాని పరిస్థితి. వీరి ఉద్దేశం పేదోడు పేదోడుగానే కటిక దారిద్ర్యంలో బతకాలి. వారు మాత్రం రాజ్యాన్ని పాలించుకుంటూ ప్రజల్ని దోపిడి చేసుకుంటూ ఉండాలి. హిందువు కాని వాడు ఎవడు ఈ దేశంలో ఉండకూడదు. పాకిస్థాన్‌కు వెళ్లి పోవలసిందే అని ఆదేశించడం చూస్తే వారికి ఎంత గర్వం, అహంభావం పెరిగిందో తెలుస్తుంది. హిందువులు కాని వారు ఈ దేశంలో ఉండదు అని అంటే హిందువులు అని అనుకునే వాళ్లకు ఈ దేశాన్ని ఎవరైనా రాసిచ్చారా? హిందువులకు భారతదేశంపై పేటెంట్ హక్కులు ఉన్నాయా? విహెచ్‌పి అధ్యక్షుడు ప్రవీణ్ తొగాడియా భారతదేశంలో ఉన్నవారందరూ హిందువులే అనీ, ఆర్‌ఎస్‌ఎస్ చీఫ్ మోహన్ భగవత్ దేశం మొత్తాన్ని హిందూ దేశంగా మార్చి వేస్తామనీ హెచ్చరించడం దేశంలోని పరిస్థితులు ఎంత ప్రమాదకరంగా మారబోతున్నాయో అర్థం చేసుకోవచ్చు. స్వాతంత్ర్యానంతరం అక్కడక్కడ కొన్ని మతకల్లోలాలు, గొడవలు చెలరేగినా సాధారణ ప్రజానీకం మాత్రం మతాలతో సంబంధం లేకుండా సహజీవనం చేస్తూ ఐక్యంగా జీవిస్తున్నారు. కాని మోడీ అనంతర పరిణామాలను కనుక చూస్తే ఈ ఐక్యతకు సహజీవనానికి భంగం కలిగించే విధంగా మత కల్లోలాలు, అల్లర్లు అనివార్యమనే పరిస్థితికి నెట్టివేయబడుతున్నాయి.

ఈ మధ్యకాలంలో అత్యంత చర్చనీయాంశమైన అంశం 'ఘర్‌వాపసి' అనే పేరు మీద ఇతర మతాలలోకి మారిన భారతీయులను తిరిగి హిందూ మతంలోకి తీసుకువస్తామనే కార్యక్రమం మొదలుపెట్టడం. ఇతర మతాలలోకి వెళ్లిన వారందరూ ఒకప్పుడు హిందువులే కాబట్టి ఇప్పుడు ముఖ్యంగా ముస్లింలను, క్రిస్టియన్లను హిందువులుగా మారుస్తామని హిందూత్వ శక్తులు హెచ్చరిస్తున్నాయి. మనుధర్మం సృష్టించిన అనేకానేక అసమానతలకి, పేదరికానికి, అంటరానితనం, వివక్షతల మూలంగా, తోటి మనిషిని మనిషిగా కాకుండా కనీసం జంతువులాగా కూడా కాకుండా హీనంగా చూడబడ్డ దుర్మార్గమైన సమాజం. పందిని దశావతారాలలో వరహావతారంగా చూసి తోటి మానవుడిని పంది కంటే అత్యంత నీచంగా వెలివేయబడ్డ సందర్భంగా

కొన్ని సంవత్సరాల క్రితం కనీసం తోటి మనిషిని కనీసం మనిషిగానైనా గుర్తిస్తారు అనే ఆశతో చాలా మంది అంటరాని వారు, దళితులు, బలహీన వర్గాల వారు ఇస్లాం, క్రిస్టియన్ మతాలను అవలబించారు. నాటి నుండి నేటి వరకు అగ్రవర్ణ బ్రాహ్మణీయ వర్గం శూద్రులను, పంచములను ఆధిపత్య ధోరణితో అణచి వేస్తూ బతికినా, చనిపోయినా మీరు మా కిందనే ఉండాలి. లేని పక్షంలో దాడులు, హత్యలకు బలికావసి ఉంటుంది. శూద్రులూ, పంచములూ మతం మారినా కూడా అగ్ర వర్ణాల చేతుల్లోనే చావాలి అనే కుట్రతో పేద ముస్లింలపై, క్రిస్టియన్లపై దాడులకు, హత్యలకు పాల్పడుతున్నారు. దేశంలో శూద్రులు మతం మారి కనీసం స్వేచ్ఛగా బతకడానికి కూడా అవకాశం లేనటువంటి దౌర్భాగ్యమైన సమాజం మనది. శూద్రులూ, పంచములూ మతం ఎందుకు మారవలసి వచ్చింది? దానికి గల కారణాలు ఏమిటి? వాటికి పరిష్కార మార్గాలు ఏమిటి? అనే శాస్త్రీయమైన ఆలోచన లేకుండా మళ్లీ మేము బలవంతంగా హిందువులుగా మారుస్తాం. లేదంటే చంపుతాం అని హెచ్చరించడం మత ఛాందస అగ్రవర్ణ బ్రాహ్మణీయ ఆధిపత్యానికి పరాకాష్ఠగా భావించవచ్చును.

ఒకవేళ నయానో భయానో హిందువులుగా మారితే వారికి ఈ సమాజంలో ఏ హోదాను ఇస్తారు? బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్గాలలో చేర్చుకుంటారా? బ్రాహ్మణ, వైశ్యుల ఆడపిల్లలను మార్చబడిన హిందువుల అబ్బాయిలకు ఇచ్చి వివాహాలు జరిపిస్తారా? బ్రాహ్మణీయ పౌరోహిత్యం, వైశ్యుల వ్యాపార సామ్రాజ్యాలలో అవశాకాలు కల్పిస్తారా? అనేటువంటి ప్రశ్నలు అనేకం. ఇటీవల డిసెంబర్‌లో విహెచ్‌పి వాళ్లు ఆగ్రాలో కొంత మంది ముస్లింలను బెదిరించి, చంపుతామని హెచ్చరించి కొంతమంది అమాయక ముస్లిం కుటుంబాలను హిందువులు మార్చినట్లుగా మీడియాలో వచ్చింది. తదనంతరం డిసెంబర్ 25న లక్షలాది మంది ముస్లింలను హిందువులుగా మార్చబోతున్నామని ప్రకటించగా దేశ వ్యాప్తంగా జరిగిన నిరసన కార్యక్రమాలను గుర్తించి ఇందుకు కారకులను కొంతమందినీ, విహెచ్‌పి కార్యకర్తలనూ అరెస్టు చేసినారు. ఇంతకు ఆగ్రాలో హిందువులుగా మార్చబడ్డవారిని ఏ కులంలోకి ఆహ్వానించినట్లు? వారితో ఇప్పటి నుండి సామాజిక, సాంస్కృతిక, వైవాహిక సంబంధాలను ఏ కులం వారు ఏర్పరచు కుంటారు? అనేది మిలియన్ డాలర్ ప్రశ్న. వారే స్వచ్ఛందంగా మతం మారడానికి వస్తున్నారు. కాబట్టి మేము వారిని ఆహ్వానించి హిందువులు గా మారుస్తున్నామని అంటున్నారు. కాని ఆగ్రాలో జరిగిన వాస్తవ విషయాలు వేరు. విహెచ్‌పి సంఘ కార్యకర్తలు పేద ముస్లిం కుటుంబాల వద్దకు వెళ్లి మీరు తప్పకుండా మతం మారాలి లేదంటే మీకు ప్రభుత్వం నుండి వచ్చే ప్రయోజనాలు అన్ని రద్దు చేపిస్తాం. లేదంటే బంగ్లాదేశ్ నుండి అక్రమంగా చొరబడ్డ కుటుంబాలు అని చెప్పి జైల్లో వేయిస్తాం అని బెదిరించి వారిని బలవంతంగా యజ్ఞాలలో కూర్చొబెట్టారు. ఈ వాస్తవ విషయాలను ఏ బాధ్యత కలిగిన దేశీయ మీడియా వెల్లడించదు. దేశంలో ఇటువంటి అనేకానేక మత సంఘటనలు జరుగుతున్నా మన ప్రధానమంత్రి వీటిని ఖండించరు. వీటిపై మాట్లాడరు.

ఇటువంటి మతపరమైన వివాదాలు, సంఘటనలు ఉద్దేశ పూరితంగా ప్రజల అటెన్షన్‌ను డైవర్ట్ చేయడానికి జరుగుతున్నట్లుగా స్పష్టం అవుతున్నాయి. అంతర్జాతీయ మార్కెట్లో క్రూడ్ ఆయిల్ ధరలు చాలా కనిష్టానికి తగ్గినా భారత్‌లో మాత్రం మోడీ గవర్నమెంట్ క్రూడ్ ఆయిల్ ధరలు తగ్గించదు. పైగా ఎక్సైజ్ డ్యూటీల పేరున పన్నులు విధిస్తారు. ఆధార్ వ్యవస్థ, ఎల్‌పిజి సిలిండర్‌పై సబ్సిడీ నేరుగా వినియోగదారుల ఖాతాలో జమచేయడం ఎన్నికల ముందు అన్యాయమని ప్రకటించి ఇప్పుడేమో ఆధార్‌ను అన్నింటికి తప్పని సరిగా అనుసంధానం చేస్తూ డైరెక్ట్ సబ్సిడీ పథకాన్ని మళ్లీ అమలు చేస్తున్నారు. విదేశాలలో ఉన్న నల్లధనాన్ని రప్పించే విషయంపై చేతులెత్తేశారు. అత్యంత కీలకమైన బొగ్గు పరిశ్రమలనూ, ప్రభుత్వరంగ పరిశ్రమలనూ ప్రైవేటీకరించే ఆర్డినెన్స్‌లను తీసుకురావడం మోడీ ప్రభుత్వం విదేశీ పెట్టుబడిదారులకూ, కార్పొరేట్ కంపెనీలకూ ఊతమిచ్చి, వారికి ప్రయోజనాలను చేకూర్చడానికి మోడీ ప్రభుత్వం దళారీగా వ్యవహరిస్తోంది. మొత్తంగా దేశంలో ఉన్న వనరులను, కంపెనీలకు కట్టబెట్టడానికి ప్రజావ్యతిరేక ఆర్డినెన్స్‌లను తీసుకొస్తున్నారు. ప్రజలకు జీవనోపాధి, వ్యవసాయాభివృద్ధి, గిట్టుబాటు ధరలు, ప్రాజెక్టుల నిర్మాణం, పారిశ్రామిక రంగం అభివృద్ధి, కొత్త పరిశ్రమల స్థాపన, మొదలగు విషయాలపై దృష్టి కేంద్రీకరించకుండా దేశ సార్వభౌమాధికారాన్ని తాకట్టు పెట్టే విధంగా కార్పొరేట్ ప్రయోజనాలే లక్ష్యంగా పని చేస్తున్నట్లు కనిపిస్తున్నది. వీటిన్నింటిపై ప్రజలు స్పందించకుండా ఉండడానికి ప్రజలు ప్రభుత్వంపై తిరగబడకుండా ఉండడానికి, అతి సున్నితమైన మత వివాదాలను సృష్టించి ప్రజలను నిండుగా మత వివాదాల్లోకి దింపి హిందూ మత ఆధిపత్యాన్ని పెంచుకుంటూ పరిపాలన కొనసాగించాలని చూస్తున్నారు. ఇంకొక వైపు మీడియాలో, ప్రజలలో పాకిస్థాన్ వ్యతిరేక భావనలు ప్రచారం చేయిస్తూ, పాకిస్థాన్‌తో యుద్ధం అనివార్యమనే స్థాయికి దిగజారుతున్నారు. ఇటీవల పాకిస్థాన్ నుండి బయలుదేరిన ఒక అరేబియా సముద్రం మీదుగా అక్రమంగా ప్రయాణం చేస్తూ అందులో ఐఎస్ఐ తీవ్రవాదులు, భారీ మందుగుండు సామగ్రి, ఆయుధాలు వెంట తీసుకొస్తూ జనవరి 26న భారీ విధ్వంసానికి పాల్పడుతున్నారనే అనుమానంతో ఒక రోజంతా విస్తృతంగా టివిలలో ప్రచారం చేయించారు. కాని ఇప్పటికీ తగలబడిన విషయం ప్రభుత్వం అసలు విషయాలు ప్రకటించలేదు. సంఘపరివార్ శక్తులను ప్రజలపై ఎగదొబ్బి అటు కేంద్ర ప్రభుత్వం పాకిస్థాన్‌తో ఎప్పుడంటే అప్పుడు యుద్ధానికి సిద్ధమని సాధారణ ప్రజలను రెచ్చగొడుతూ దేశాన్ని మరొకసారి మత యుద్ధంలోకి నెట్టి వేయాలని చూస్తున్నారు.

సామాజిక బాధ్యత కలిగిన ప్రజాసంఘాలు, పౌరసమాజం, లౌకిక, మార్క్సిస్టు, అంబేద్కరిస్టు దృక్పథం కలిగిన వారందరూ భావజాల భేదం లేకుండా ప్రభుత్వం అనుసరిస్తున్న ప్రజా వ్యతిరేక విధానాలపై, సంఘపరివార్ శక్తుల వల్ల కలిగే ప్రమాదాలపై ప్రజలను చైతన్యం చేసి బిజెపి, మోడీ ప్రభుత్వం చేసే కుట్రలను బయటపెట్టి, ప్రజా ఉద్యమంలో భాగస్వామ్యం చేసి ఉద్యమించవలసిన అవసరం ఉన్నది. లేదంటే సమీప భవిష్యత్తులో మత విద్వేషాలు పెరిగి గోద్రాలాంటి అనేక భయంకర ఘటనలు పునరావృతం అయ్యే అవకాశాలు స్పష్టంగా కప్పిస్తున్నాయి. మధ్యయుగంలో యూరప్‌లో జరిగిన క్రూసేడ్ లాంటి మత యుద్ధాలు నేటి ఆధునిక ప్రజాస్వామ్య యుగంలో, ముఖ్యంగా మనదేశంలో అనివార్యంగా జరిగే పరిస్థితులు ఉన్నాయి.

*(రచయిత డిటిఎఫ్ రాష్ట్ర కౌన్సిలర్)* వీ

# పెరుగుతున్న మతభావాలు - మన స్పందన

*ఇటీవలి కాలంలో వ్యక్తిగత, సామాజిక జీవితాలలో పెరుగుతున్న మత ప్రాధాన్యతను విశ్లేషిస్తూ, దాన్ని అరికట్టే పోరాట పద్ధతులను సూచిస్తున్నారు* **ఎన్. వేణుగోపాల్**

'తెలుగునాట భక్తిరసం తెప్పలుగా పారుతోంది డ్రెనేజీ స్కీము లేక డేంజరుగా మారుతోంది' అని గజ్జల మల్లారెడ్డి నాలుగు దశాబ్దాల కింద అన్నమాటలో భక్తిరసం ఇప్పుడు తెప్పలుగా కాదు, సునామీలా ముంచెత్తుతోంది. ఆ ప్రమాదం నుంచి సమాజాన్ని తక్షణమే కాపాడవలసిన అవసరం వందలరెట్లు పెరిగిపోయింది. అత్యున్నత అధికార పీఠాల నుంచి సాధారణ ప్రజల వ్యక్తిగత జీవితం దాకా ప్రతి చోటా భక్తిరసం, మూఢవిశ్వాసాలు, మత భావాలు, అర్థం లేని ఆచారాల ప్రాధాన్యత పెరిగిపోతున్నాయి. బహిరంగంగా ప్రభుత్వాధినేతలు, ప్రభుత్వాధికారులు, రాజకీయ నాయకులు హిందూ బ్రాహ్మణీయ మత విశ్వాసాలను పాటిస్తూ, ప్రచారం చేస్తూ, సామాజిక జీవితాన్ని మత భావాలతో ముంచెత్తుతున్నారు. సాధారణ పౌరులు కూడ గతంలో లేని, ఉన్నా బహిరంగ ప్రదర్శన లేని మతాచారాలను ఆడంబరంగా, పెద్ద ఎత్తున అమలు చేస్తున్నారు. మతాచారాలు పాటించడానికి గతంలో ఉండిన బారసాల, పెళ్లి, చావు, పండుగలు వంటి సందర్భాలను ఇప్పుడు మితిమీరిన ఆర్భాటంతో, మూఢత్వంతో జరపడం మాత్రమే కాదు, అప్పుడప్పుడూ ఉండిన ఆ సందర్భాలను ఇవాళ ఏడాది పొడవునా సృష్టిస్తున్నారు, పెంచి పోషిస్తున్నారు. పాత గుళ్ల పునర్నిర్మాణం, కొత్త గుళ్ల నిర్మాణం, కొత్త దేవతలు, కొత్త పూజా విధానాలు పుట్టుకురావడం, జీవితంలో ఎప్పుడో సుదూర గతంలో పాటించి, దశాబ్దాలుగా మరుగున పడిన మూఢాచారాలను పునరుద్ధరించడం, కొత్త మూఢ నమ్మకాలను వ్యాప్తిలోకి తీసుకురావడం, యాగాలు, జపాలు, హోమాలు, శాంతులు, ముడుపులు, మొక్కులు, వాస్తు, దీక్షలు, ముహూర్తాలు, జ్యోతిష్యం, గ్రహబలం, నాడీవైద్యం... ఇవాళ జీవితం బహుశా నాలుగైదు దశాబ్దాల కిందటికన్న ఎక్కువ మత, అంధ విశ్వాసాల, మూఢత్వ మయం అయిపోయింది.

ప్రకృతి శక్తుల గురించి తెలియని కాలంలో పుట్టిన మూఢవిశ్వాసాలు ప్రకృతి శక్తుల గురించిన జ్ఞానం పెరుగుతున్న రోజులలో ఎందుకు బలపడుతున్నాయి? ఆధునికత, శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానం, విద్య పెరిగినకొద్దీ మత ప్రాధాన్యత ఇంతగా పెరిగిపోతుండడాన్ని ఎలా అర్థం చేసుకోవాలి? మతం అజ్ఞాన ఫలితం మాత్రమేనా, లేక దాని వ్యాప్తికి స్వార్థ ప్రయోజనాలు కారణమా? ఈ భావజాల వ్యాప్తి హేతువ్యతిరేకమైనదీ, అశాస్త్రీయమైనదీ, అభివృద్ధి నిరోధకమైనదీ, మనిషికి తన మీద తనకు నమ్మకం పోగొట్టి అతీతశక్తులకు అధీనం చేసేదీ గనుక దీన్ని తప్పనిసరిగా అరికట్టవలసిందే. కాని మత ప్రాధాన్యతను అరికట్టడానికి ఏం చేయాలి?

జీవితమంతా హేతువాద, నాస్తిక, ప్రజాస్వామిక భావాల ప్రచారానికి వెచ్చించిన బి. రామకృష్ణ గారి స్మృతిలో, ప్రధానంగా హేతువాద, నాస్తికవాద మిత్రులు హాజరవుతున్న ఈ సభలో ఈ అంశాలు చర్చించడానికి అవకాశం దొరికినందుకు సంతోషిస్తున్నాను.

ముందుగా, మన శిబిరం ఇంతకాలంగా మతం విషయంలో కొంత అసమగ్ర అవగాహనను ప్రదర్శించిందనీ, ఆ అసమగ్రత వల్ల మత భావాల వ్యాప్తిని అరికట్టడం అలా ఉంచి అర్థం చేసుకోవడంలోనే కొంత లోపం జరిగిందనీ నా అభిప్రాయం మీ దృష్టికి తేవాలనుకుంటున్నాను.

'మతం మత్తుమందు' అని కార్ల్ మార్క్స్ అన్న సుప్రసిద్ధమైన మాటను మనలో చాలమందిమి ఉపయోగిస్తుంటాం. మతం మనిషిని జోకొడుతుందనీ, క్రియాశీలంగా ఉండకుండా చేస్తుందనీ, అశాస్త్రీయ, హేతురహిత విశ్వాసాలు ఉండేలా చేస్తుందనీ మతానికి ఉన్న వ్యతిరేక అర్థం అది. తప్పనిసరిగా మతాన్ని ఆ దృక్పథంతో చూడవలసిందే. కాని అది మాత్రమే చూస్తే మనుషులు మతాన్ని ఎందుకు కోరుకుంటారో అర్థం చేసుకోవడం కష్టం. మత్తుమందుకు వ్యసనానికి బానిసలైనవారిని కూడ ఆ వ్యసనం నుంచి తప్పించడానికి మార్గాలున్నాయి. పూర్తిగా వ్యసనపరులు కానివారితోనైతే మత్తుమందు దుష్ఫలితాల గురించి చర్చించి అటువైపు వెళ్లకుండా కాపాడవచ్చు. మతం ప్రాబల్యం పెరగడానికి అది మత్తుమందు కావడం ఒకటే కారణం అనుకుంటే మరీముఖ్యంగా గత రెండు మూడు దశాబ్దాల ప్రపంచీకరణ క్రమంలో మత ప్రాబల్యం పెరగడాన్ని అర్థం చేసుకోవడం కష్టం. ఎక్కువ సరకులూ, కొత్త జీవన విధానమూ, ప్రపంచంతో పరిచయమూ. మనిషికి ఆత్మవిశ్వాసమూ పెరుగుతున్న కొద్దీ ప్రాచీన మూఢవిశ్వాసాలు ఆ స్థాయిలోనే ఎందుకు పెరుగుతున్నాయో వివరించడం కష్టం.

దీనికి జవాబు మార్క్స్ చెప్పిన ఆ మాటల పక్కనే ఉన్నదని నేననుకుంటాను. 'క్రిటిక్ ఆఫ్ హెగెల్స్ ఫిలాసఫీ ఆఫ్ రైట్' అనే పుస్తకానికి 1844లో రాసిన ఉపోద్ఘాతంలో మార్క్స్ అన్న పూర్తి మాటలు ఏమంటే, '...తనను తాను ఇంకా గెలుచుకోని మనిషికి, తనను తాను మళ్లీ పోగొట్టుకున్న మనిషికి మతం అనేది స్వీయ చైతన్యంగా, ఆత్మగౌరవంగా ఉంటుంది.... మత వేదన వాస్తవ వేదనకు వ్యక్తీకరణే. అదే సమయంలో అది ఆ వాస్తవ వేదన పట్ల నిరసన కూడ. మతం అణచివేతకు గురైన జీవి నిట్టూర్పు. అది హృదయం లేని ప్రపంచపు హృదయం. అది ఆత్మ లేని పరిస్థితుల ఆత్మ. అది ప్రజల పాలిటి మత్తుమందు....'

గత రెండు మూడు దశాబ్దాలలో మత ప్రాబల్యం పెరగడాన్ని ఈ అవగాహననుంచి అర్థం చేసుకోవాలనుకుంటాను. ఒకవైపు నూతన రాజకీయార్థిక విధానాల వల్ల డబ్బు అధికారమూ పెరుగుతున్న పాలకవర్గాలు, మరీ ముఖ్యంగా పాలకవర్గాలలో చేరదలచుకున్న ఉన్నత

మధ్యతరగతి వర్గం తన సంపదనూ అధికారాన్నీ స్థిరపరచుకోవడానికి మత భావాలను విపరీతంగా ప్రచారం చేస్తున్నది. మరొకవైపు ఆ రాజకీయార్థిక విధానాల వల్లనే తమను తాము పోగొట్టుకుంటున్న, గెలుపు అసాధ్యమని అనుకుంటున్న, నిరంతర వాస్తవ వేదనకూ, అణచివేతకూ గురవుతున్న అసంఖ్యాక పాలిత, పీడిత వర్గాలలో ఎక్కువ మంది, మరీముఖ్యంగా మధ్యతరగతి ఉపశమనం కోసం మతం వైపు చూస్తున్నది. మార్క్స్ చెప్పినట్టు అంతకంతకూ ఎక్కువగా హృదయం లేకుండాపోతున్న ప్రపంచంలో హృదయం కోసం, ఆత్మలేకుండా పోతున్న పరిస్థితులలో ఆత్మ కోసం వెతుకులాటే వాళ్లను మత భావాల వైపు నెడుతున్నది. ఈ మధ్యతరగతికి ఉండే ప్రభావం వల్ల, ప్రచార సాధనాలలో వాళ్ల పాత్ర వల్ల సమాజంలో మొత్తంగానే మత భావాలు విపరీతంగా పెరిగిపోతున్నట్టు కనబడుతున్నది.

ఈ పరిణామాలను మరికొంత వివరంగా అర్థం చేసుకోవడానికి సూక్ష్మస్థాయిలో నిశితంగా పరిశీలించవలసి ఉంది. మతానికి వ్యక్తిగత జీవితంలో ప్రాధాన్యత పెరగడాన్ని, సామాజిక జీవితంలో ప్రాధాన్యత పెరగడాన్ని విడివిడిగా చూడవలసి ఉంది. వ్యక్తిగత జీవితంలో ప్రాధాన్యత పెరగడానికీ, సామాజిక జీవితంలో ప్రాధాన్యత పెరగడానికీ ఫలితంలో పెద్ద తేడా లేకపోవచ్చు గాని, కారణాలలో, ప్రయోజనాలలో, పర్యవసానాలలో తేడా ఉంది. రెండు స్థాయిలలోనూ సమానమైన సామాజిక, రాజకీయార్థిక, సాంస్కృతిక కారణాలుంటాయి గాని వ్యక్తిగత స్థాయిలో మత ప్రాధాన్యత పెరగడంలో స్వార్థం పాత్ర పరిమితమైనది కాగా సామాజిక స్థాయిలో మాత్రం అది పూర్తిగా లాభాపేక్ష, అధికార లాలస, రాజకీయాధికారం, మత విద్వేషాల వ్యాప్తి వంటి అంశాలతో కలిసి ఉంది.

వర్గ సమాజంలో మొత్తంగానే పాలిత, పీడిత వర్గాల ప్రజలకు ఎప్పుడూ నిరాశా నిస్పృహలు, నిస్సహాయత, జీవిత గమనం పట్ల అనిశ్చితి ఉంటాయి. అవే ప్రజలలో తమ మీద తమకు అవిశ్వాసాన్ని కలిగించి, అతీత శక్తుల వైపు, అద్భుత వ్యక్తుల వైపు చూసేలా చేస్తాయి. గత రెండు మూడు దశాబ్దాల రాజకీయార్థిక విధానాల ఫలితంగా ప్రజలలో ఈ వ్యక్తిగత అసహాయత, నిరాశ, నిస్పృహ, అనిశ్చితి మరింతగా పెరుగుతున్నాయి. విద్య, వైద్య, ఆరోగ్య, రవాణా వంటి సేవలు విపరీతమైన ఖర్చుతో కూడినవిగా మారిపోయాయి. అంత ఖర్చు పెట్టినా నాణ్యమైన సేవలు దొరుకుతాయనే నమ్మకం ఉండడం లేదు. ఎంత ఖర్చు పెట్టి చదువుకున్నా ఉద్యోగం దొరుకుతుందనే హామీ లేదు. ఎంత ఖర్చు పెట్టి వైద్యం చేయించినా ఆరోగ్యం బాగుపడుతుందనే ఆశ లేదు. నిత్యజీవితం సమస్యల మయంగా ఉన్నది. ఆ సమస్యల నుంచి గట్టెక్కే ఆధారమూ ఆశా కనుచూపుమేరలో కనిపించడం లేదు. ఏ రోడ్డు మీద ఏ ప్రమాదం జరుగుతుందో, ఇంట్లోంచి బైటికి వెళ్లిన మనిషి సవ్యంగా తిరిగి వస్తారో లేదో నమ్మకం లేదు. కోరికలు నెరవేరుతాయో లేదో సందేహాలు పెరుగుతున్నాయి. అన్ని స్థాయిలలోనూ వాగ్దాన భంగాలు జరుగుతున్నాయి. నిరాశా నిస్పృహలు పెరుగుతున్నాయి. ఇటువంటి సమస్యలతో సతమతం కాని మనిషి బహుశా ఒక్కరు కూడ లేరు. ఈ అపనమ్మకాల, సందేహాల, భయాల, అనిశ్చితుల పరిస్థితులలో, తన మీద, తన సామర్థ్యం మీద తనకు నమ్మకం లేని స్థితిలో భారం భగవంతుడి మీద వేయడం ఒక ఉపశమనంగా కనబడడంలో ఆశ్చర్యం లేదు. ఒక భగవంతుడు కూడ ఆ భయసందేహాల నుంచి రక్షిస్తాడో లేదో నమ్మకం లేదు గనుక ముక్కోటి దేవతలను నమ్మవలసి వస్తుంది. అంతే కాదు, అన్ని రకాల అంధ విశ్వాసాలనూ ఆచారాలనూ నమ్మవలసి వస్తుంది. వేలాది సంవత్సరాల కింద అమాయక అంధ విశ్వాసంతో అడవిలో, ఊరి అంచున, చెరువు కట్ట మీద రాయిగా పుట్టిన గ్రామదేవతల నుంచి ప్రపంచంలోకెల్లా ధనవంతుడైన వేంకటేశ్వరస్వామి వరకూ ప్రతి ఒక్కరినీ నమ్మాలి. మూడువేల ఏళ్ల కింది అగ్ని హోమం నుంచి నిన్నమొన్న పుట్టిన అయ్యప్ప దీక్ష వరకూ అన్నిటినీ నమ్మాలి. అనారోగ్యానికి చికిత్సగా దిష్టినీ, తాయెత్తునూ, మొక్కునూ, ముడుపునూ, హోమాన్నీ, యాగాన్నీ, చిట్కా వైద్యాన్నీ నమ్ముతూనే పనిలో పనిగా ఒకటి రెండు ఆధునిక వైద్య విధానాలను కూడ అవలంబించాలి. ఇదీ ఇవాళ్టి మన సమాజ స్థితి. రాజకీయార్థిక పరిభాషలో చెప్పాలంటే పెట్టుబడిదారీ విప్లవం వచ్చి సమాజాన్ని లోలోతుగా కదిలించకపోవడం వల్ల సాగుతున్న పాత కొత్తల కీడు కలయికకు, అర్ధభూస్వామ్య, అర్ధ వలస వ్యవస్థకు సూచిక ఈ మనస్తత్వం.

ఈ మనస్తత్వం కూడ వ్యక్తిగత స్థాయిలో దానికదిగా తప్పు కాదు. అది కేవలం ఒక ఉపశమనం కోసం వెతుకులాట. అది అమాయకత్వమో, మూఢనమ్మకమో, అజ్ఞానమో కావచ్చు గాని దాన్ని చీల్చి చెండాడనవసరం లేదు. ఇటువంటి ఆచారవ్యవహారాలు పాటించే మనుషులు మూఢులనీ, మూర్ఖులనీ, అంధ విశ్వాసపరులనీ విమర్శించడం ద్వారా, వారిని హేతుబద్ధ తర్కం ద్వారా ఎదుర్కొంటే, వారికి జ్ఞానం కలిగిస్తే ఇదంతా మారిపోతుందని చాలకాలం హేతువాదులు ప్రయత్నిస్తున్నారు. అంటే ఇది కేవలం జ్ఞాన-అజ్ఞానాల సమస్య అనుకుంటున్నారు. కాని సమస్య అది కాదు. సమస్య అక్కడ కనబడుతుండవచ్చు గాని మూలం అది కాదు.

ఈ అంధవిశ్వాసాల విస్తరణకు, మత ప్రాధాన్యత విస్తరణకు ప్రధానమైన, మౌలికమైన కారణం పాలకవర్గాల ఉద్దేశపూర్వక ప్రయత్నాలు. హృదయం లేని ప్రపంచంలో ఉన్న ప్రజలు తమకు ఉపశమనం ఇచ్చే ఒక తప్పుడు హృదయం కోసం వెతుకులాడుతుండగా, ఆ హృదయం లేని ప్రపంచాన్ని పెంచి పోషిస్తున్న, దానివల్లనే ప్రయోజనాలు పొందుతున్న పాలకవర్గాలు ఆ తప్పుడు హృదయానికి జిలుగు వెలుగులు అద్ది, దాన్ని ఏకైక మార్గంగా అమ్ముతున్నాయి. అందువల్ల మత ప్రాధాన్యతను నానాటికీ పెంచుతున్న పాలకవర్గాల ప్రయత్నాలను వివరంగా అర్థం చేసుకోకపోతే, గట్టిగా ప్రతిఘటించకపోతే పెరుగుతున్న మత ప్రాధాన్యతను అడ్డుకోలేం.

మత ప్రాధాన్యతను పెంచడంలో పాలకవర్గాల కృషి ప్రచార సాధనాలు, విద్యావ్యవస్థ, ఇతర సామాజిక రంగాలు, ప్రభుత్వ విధానాలు అనే నాలుగు స్థాయిలలో జరుగుతున్నది. మతభావాల ప్రచారం ఇవాళ అతి ఎక్కువ లాభాలు వచ్చే బడా వ్యాపారంగా, పెద్ద అనుచరవర్గాన్నీ, ఎన్నికలలో విజయాన్నీ సాధించిపెట్టే రాజకీయంగా మారింది. అందువల్ల పాలకవర్గాల ఈ రాజకీయార్థిక ప్రయోజనాలే మత ప్రాధాన్యతను అంతకంతకూ పెంచుతున్నాయి.

ప్రభుత్వానివైనా, బడా వ్యాపారసంస్థల పెట్టుబడులతో నడిచేవైనా ప్రచార సాధనాలకు మతభావాలను ప్రచారం చేయడంలో కీలక

ప్రయోజనాలున్నాయి. ఇవాళ ప్రచార సాధనాలను చూస్తే పత్రిక, రేడియో, టివి ఛానల్, సినిమా, సోషల్ మీడియాలలో చాల ఎక్కువభాగం మత భావాల ప్రచార వేదికలుగా ఉన్నాయి. ప్రతి పత్రికా దినఫలాలు, వారఫలాలు, వాస్తు ప్రశ్న జవాబులు, దేవాలయాల వార్తలు, మత సమీకరణల వార్తలు, సంపన్నుల, అధికారుల దైవభక్తి ప్రదర్శనల వార్తలు, బాబాల, స్వాముల, సాధ్వుల ప్రకటనలు వంటి ఎన్నో మత, మూఢ, హేతురహిత అంశాలకు ప్రాధాన్యత ఇస్తున్నాయి. అచ్చులో వచ్చినదల్లా వాస్తవమే అనుకునే అమాయకత్వం సమాజంలో ఇంకా ప్రబలంగానే ఉండడం వల్ల ఈ పత్రికల ప్రచారం రోజురోజుకూ ప్రజలను మత భావాలవైపు ఆకర్షిస్తున్నది. సాధారణ పత్రికలలో మతభావాల ప్రచారం చాలనట్టు, ప్రత్యేకంగా భక్తి పత్రికలు ఎన్నో పుట్టుకువచ్చాయి. ప్రభుత్వ అధీనంలో మాత్రమే ఉండిన ఆకాశవాణిలో సుప్రభాతం ప్రసారం చేయడమేమిటని గతంలో హేతువాదులు ప్రశ్నించేవారు. ఇవాళ ఆకాశవాణిలో అంతకన్న ఎక్కువ మత ప్రచారం జరుగుతున్నది. ఇక ప్రైవేటు, ఎఫ్ ఎం రేడియో ప్రసారాలలో భక్తి, పూజలు, పునస్కారాలు, గ్రహబలాలు వంటివన్నీ యథావిధిగా సాగిపోతున్నాయి. ఇవాల్టికీ మన సమాజంలో అచ్చు పత్రికల పాత్ర, రేడియో ప్రసారాల పాత్ర తక్కువే కావచ్చు గాని అంతకన్న ఎక్కువ ప్రభావశీలమైన టివి ఛానళ్లు, సినిమాలలో మత భావాల ప్రచారం విపరీతంగా సాగిపోతున్నది. భక్తి కోసమే ప్రత్యేకించిన ఛానళ్లు తెలుగులో అన్ని మతాలకూ కలిపి డజను పైనే ఉన్నాయి. అంటే రోజుకు కనీసం మూడు నాలుగు వందల గంటల మత భావాల ప్రచారం కేవలం ఈ భక్తి ఛానళ్లలోనే జరుగుతున్నది. వాటికి తోడు, సాధారణ వార్తా ఛానళ్లలోను, వినోద ఛానళ్లలోను ఏదో ఒక రూపంలో దైవభావన, ప్రముఖుల దైవ పూజలు, దైవ మహిమలు, వాస్తు, మంత్రాలు, యాగాలు వంటి వాటి ప్రచారం జరుగుతున్నది. ఇక సినిమాలలో ప్రత్యక్షంగానో, పరోక్షంగానో దైవభావనను, మత విశ్వాసాలను ప్రచారం చేయడం అడ్డూ ఆపూ లేకుండా సాగుతున్నది. నేరుగా దైవం, భక్తి, మూఢనమ్మకాల ఇతివృత్తంతో తయారవుతున్న సినిమాలు పది శాతం కన్న తక్కువే ఉండవచ్చు గాని, ఎంతమాత్రం దైవభావన లేని, హేతు భావాలతో ఉన్న సినిమా ఒక్కటి కూడ లేదని చెప్పవచ్చు. చివరికి ఇటీవల విస్తరిస్తున్న సోషల్ మీడియాలో కూడ మత భావాల ప్రచారం పెద్ద ఎత్తున జరుగుతున్నది.

ఇవాళ మనుషులందరినీ ఏదో ఒక స్థాయిలో, ఏదో ఒక రూపంలో ప్రభావితం చేస్తున్న ప్రచార సాధనాల స్థితి ఇలా ఉంటే అసలు మనుషులను వ్యక్తులుగా, ఆలోచనాపరులుగా తీర్చిదిద్దవలసిన విద్యావ్యవస్థలో కూడ మతభావాల ప్రచారం నానాటికీ పెరుగుతున్నది. లౌకిక రాజ్యంలోని విద్యావ్యవస్థలో పాఠ్యాంశాలు మతభావాలను ప్రచారం చేయగూడదని, కనీసం రాజ్యాంగం నిర్దేశించిన శాస్త్రీయ దృక్పథాన్ని ప్రచారం చేయాలని ఎంతగా వాదిస్తున్నప్పటికీ పాఠ్యాంశాలలో మత భావాలు పెరుగుతూనే ఉన్నాయి. ప్రకృతిశాస్త్రాలలో, సామాజిక శాస్త్రాలలో ఏదో ఒక మేరకు హేతుబద్ధత ఉన్నప్పటికీ, భాషా పాఠ్యాంశాలలో ప్రాచీన సాహిత్యం పేరు మీద మత భావాలకు, హేతు రహిత, మూఢ విశ్వాసాలకు అవకాశం దొరుకుతున్నది. ప్రభుత్వ పాఠ్యాంశాలలో మతతత్వం ఒక ఎత్తయితే, ప్రైవేటు విద్యాసంస్థలలో, ప్రైవేటు విశ్వవిద్యాలయాలలో సొంత పాఠ్యాంశాలు ఉంచుకునే హక్కు పేరుతో పూర్తిగా మత తత్వ విద్యాలయాలు వెలుస్తున్నాయి. స్వయంగా మతసంస్థలు, మఠాలు, దేవస్థానాలు, అమ్మలు, బాబాలు, గురువులు విశ్వవిద్యాలయాలు ఏర్పాటు చేస్తున్నారు. సాధారణ విశ్వవిద్యాలయాలలో కూడ జ్యోతిష్యం, వాస్తు, పూజా విధానాలు వంటి మత భావజాలపు విద్యలు, పాఠ్యాంశాలు చేరుతున్నాయి.

అలా ప్రచార సాధనాలలో, విద్యావ్యవస్థలో మతభావాల వ్యాప్తికి విచ్చలవిడి అవకాశాలు ఉన్నందువల్ల, సమాజంలో అంతకు ముందునుంచీ ఉన్న మతభావాలు బలోపేతం అవుతున్నాయి. కొత్తగా మతభావాలు పుట్టుకు వస్తున్నాయి. మొత్తంగా సమాజంలోని అన్ని రంగాలలో మతభావాలు పెరిగిపోవడానికి అవకాశాలు కలుగుతున్నాయి. మరొకవైపు సమాజంలో ఉన్నత, ప్రభావశీలమైన స్థానాలలో ఉన్నవారు నిస్సిగ్గుగా మూఢనమ్మకాలను, హేతురహిత ఆచారాలను స్వయంగా పాటిస్తుండడం, ప్రోత్సహిస్తుండడం మతభావాల వ్యాప్తికి దోహదం చేస్తున్నది. రాష్ట్రపతి నుంచి గ్రామ సర్పంచి దాకా ఎన్నికైన ప్రజాప్రతినిధులు, అధికారులు, న్యాయమూర్తులు, విద్యావంతులు, శాస్త్రవేత్తలు, ప్రజాభిప్రాయాన్ని ప్రభావితం చేసేవారు తమ వ్యక్తిగత మత విశ్వాసాలను బహిరంగంగా, సామాజికంగా ప్రదర్శించడం మతభావాల వ్యాప్తికి దారి తీస్తున్నది. సమాజంలో ఎక్కువ చదువుకున్నకొద్దీ, ఎక్కువ సంపద సమకూరినకొద్దీ మతభావనలకు దగ్గర అయ్యే విచిత్రస్థితి పెరుగుతున్నది. శాస్త్ర, సాంకేతిక పరిజ్ఞానాన్ని ఉపయోగించి చేసిన అన్వేషణలకు, ప్రయోగాలకు పూజలు, బలులు జరపడం, శ్రీహరికోటలో ప్రతి రాకెట్ లాంచర్ ప్రయోగానికీ సూళ్లూరుపేట చెంగాళమ్మ నుంచి తిరుమల వేంకటేశ్వర స్వామి దాకా పూజలు జరపడం వంటి అసహ్యకరమైన ప్రదర్శనలు శాస్త్ర విజ్ఞానాన్ని అపహాస్యం చేస్తూ మత భావనలను పెంచుతున్నాయి. దైవారాధన, మత విశ్వాసాల ప్రచారం, ఆమోదం ఒక పెద్ద లాభసాటి వ్యాపారంగా మారి కొత్త కొత్త దేవతలు, కొత్త కొత్త ఆచారాలు, కొత్త కొత్త మూఢనమ్మకాలు పుట్టుకొస్తున్నాయి. మకర జ్యోతి దైవసృష్టి కాదనీ, ప్రభుత్వ అధికారుల కనుసన్నలలో, మతాచార్యులు జరుపుతున్న మోసమనీ తిరుగులేని రుజువులు వెలువడిన తర్వాత కూడ అయ్యప్ప దీక్షల విస్తృతి పెరుగుతున్నదంటే ఇది నిజానిజాల, జ్ఞాన-అజ్ఞానాల సమస్య మాత్రమే కాదు. విదేశానికి వెళ్లడానికి అవసరమైన వీసా బహుళజాతి సంస్థల రాజకీయార్థిక కారణాల మీద ఆధారపడి వస్తుంది. కాని వీసా ఇప్పించడానికి చిలుకూరు బాలాజీ వీసా బాలాజీ అని కొత్త అవతారమెత్తాడు. అన్ని తిథులలో ఒకటిగా సాధారణమైన అక్షయ తృతీయ బంగారు వర్తకుల లాభాల కోసం మహత్యాన్ని పులుముకొని బంగారం కొనుగోలు దినంగా మారిపోయింది. ఇటువంటి ఉదాహరణలు మన సామాజిక రంగాలలో నుంచి కోకొల్లలుగా కనబడతాయి. ఈ ఉదాహరణలన్నీ సమాజంలో మతభావాల పెరుగుదలకు హేతురాహిత్యం మాత్రమే కారణం కాదనీ, ఆర్థిక, రాజకీయ, సామాజిక, సాంస్కృతిక కారణాలున్నాయనీ స్పష్టం చేస్తున్నాయి.

ప్రచార సాధనాలు, విద్యావ్యవస్థ, సామాజిక రంగాలు అనే ఈ మూడు స్థాయిలలో మత భావాలు పెచ్చరిల్లడానికి పునాదీ అవకాశమూ

కల్పిస్తున్నది భారత రాజ్య స్వభావం. ప్రభుత్వాధికారంలో ఏ రాజకీయ పార్టీ ఉన్నప్పటికీ గత ఆరున్నర దశాబ్దాలుగా సాగుతున్న అన్ని ప్రభుత్వాల విధానాలూ మతభావాలను ప్రోత్సహించేవిగానే ఉన్నాయి. వలస వాద వ్యతిరేక ఉద్యమ క్రమంలోనే పాలకవర్గాలు ఉద్యమాన్ని మత భావనలతో నింపాయి. అధికారమార్పిడి సమయంలో జరిగిన మత కల్లోలాలు, లక్షలాది మంది ఊచకోత, శరణార్థులు కావడం, భారత సమాజంలో మతానికి ఏ ప్రమాదకర ఫలితాలుంటాయో చూపినప్పటికీ, జాతీయోద్యమ నాయకులు ఏ పాఠమూ నేర్చుకోలేదు. భారత రాజ్యాన్ని మతవాసనలతో, ఇంకా స్పష్టంగా చెప్పాలంటే, హిందూ బ్రాహ్మణ ఆచారాలతో పుట్టించవచ్చునని అనుకున్నారు. తనను తాను అజ్ఞేయవాదిగా చెప్పుకున్న నెహ్రూ స్వయంగా హోమం ముందర కూచుని ఉండగా, తంజావూరు నుంచి ప్రత్యేకంగా పిలిపించిన వేదపండితుల మంత్రాలతో 1947 ఆగస్ట్ 14 రాత్రి భారతదేశం ఏర్పడింది. అలా హిందూ బ్రాహ్మణీయ ఆచారాలను పాటిస్తూనే, రాజ్యాంగంలో మాత్రం ప్రతి ఒక్కరికీ మత ప్రకటన, అవలంబన, ప్రచార హక్కును ఇచ్చారు. శాస్త్రీయ దృక్పథాన్ని ప్రచారం చేయడం పౌరుల ప్రాథమిక విధి అని కూడ చెప్పారు. ప్రవేశికలోనే భారత రాజ్యపు విశేషణాలలో ఒకటిగా లౌకికత్వాన్ని ప్రకటించారు. అంటే మత భావాల విషయంలో ప్రకటనకూ ఆచరణకూ మధ్య భారత పాలకవర్గాలు ఎన్నో వైరుధ్యాలను ప్రదర్శించాయి.

ఈ వైరుధ్యాలను అధిగమించడానికి పాలకవర్గ మేధావులు లౌకికత్వానికి ఎక్కడా లేని విచిత్రమైన అర్థాన్ని ఇచ్చారు. లౌకికత్వం అంటే అసలు అర్థం రాజ్యానికీ మతానికీ సంబంధం లేకపోవడం. రాజ్య వ్యవహారాలలో మతానికి పాత్ర లేకపోవడం. మతం వ్యక్తిగత పరిధిలో మాత్రమే ఉండడం. కాని భారత పాలకవర్గాలు లౌకికవాదం అంటే సర్వధర్మ సమభావం అనీ, అన్నిమతాలనూ సమానంగా చూడడం అనీ అర్థం చెప్పారు. అన్ని మతాలూ సమానమే అనుకుంటే, మిగిలిన మతాలను వదిలి ఏ ఒక్క మతాన్నో పాటించడం అర్థరహితం అవుతుంది. రాజ్యం అన్ని మతాలకూ సమానదూరం పాటిస్తుంది అనవలసిన చోట అన్ని మతాలకూ సమానమైన దగ్గరగా ఉంటుంది అనే అర్థం చెప్పారు. అందువల్ల అత్యధిక సంఖ్యాకుల మతమే అప్రకటితంగానే రాజ్య మతం అయిపోయింది. అధికారంలో ఉన్నవారందరూ ప్రభుత్వ కార్యక్రమాలలో కూడా హిందూ బ్రాహ్మణ మతాచారాలను పాటించడం, ప్రతి ప్రభుత్వ కార్యక్రమమూ హిందూ బ్రాహ్మణ మతాచారాలను పాటిస్తూ జరగడం ఆనవాయితీ అయిపోయింది. ఇంతకుముందే చెప్పుకున్నట్టు న్యాయవ్యవస్థ కూడ మతభావాల ప్రభావంలోనే ఉంది గనుక మంత్రుల, ప్రభుత్వాధికారుల మత ప్రదర్శనను న్యాయస్థానాలు కూడ అడ్డుకోలేకపోయాయి. స్వయంగా రాష్ట్రపతి, ప్రధానమంత్రి, ముఖ్యమంత్రులు ఒక దొంగ బాబా పాదాలకు సాష్టాంగ నమస్కారం చేయడం భారత లౌకిక రాజ్యానికి హాస్యాస్పద చిహ్నంగా మారింది. ఈ మతభావాలే సంఘపరివారపు రాజకీయ ప్రాబల్యాన్ని పెంచాయి. లౌకికత్వాన్ని ఈసడించుకునే, బహిరంగంగా మతరాజకీయాలను, మతోన్మాదాన్ని పాటించే సంఘపరివారానికి అధికారం వచ్చిన తర్వాత రాజ్య సంస్థలన్నీ నగ్నంగానే మత ప్రచార కేంద్రాలయ్యాయి. గత ఎనిమిది నెలల్లో అధికారపక్షపు నాయకులు చేస్తున్న ప్రకటనలను చూస్తే, చివరికి రాజ్యాంగ ప్రవేశిక నుంచి లౌకిక అనే మాటను తొలగించడానికి చేస్తున్న ప్రయత్నాలు చూస్తే మన సామాజిక, రాజకీయ వర్గాల ప్రయాణ దిశ ఏమిటో అర్థమవుతుంది. అలాగే రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులూ తమ రియల్ ఎస్టేట్ ఎజెండాలకు వాస్తు అనే ముసుగు తొడగడం చూస్తే పాలకవర్గాల అబద్ధాలు స్పష్టమవుతున్నాయి. సంఘపరివార పాలనలో నేరుగా ప్రభుత్వం మాత్రమే కాదు, భారత చరిత్ర పరిశోధనా మండలి, భారత సైన్స్ కాంగ్రెస్ వంటి స్వతంత్ర ప్రతిపత్తి గల సంస్థలు మత భావాల, మూఢనమ్మకాల, పుక్కిటి పురాణాల ప్రచారానికి వేదికలవుతున్నాయి. అంటే భవిష్యత్తులో ఈ మత భావాల ప్రచారం మరింత ఎక్కువగా జరుగుతుంది.

అయితే, ఈ నాలుగు స్థాయిలలోనూ పైకి చూడడానికి మతభావాల ప్రచారం జరుగుతున్నట్టు కనబడుతున్నది గాని, సారాంశంలో చూస్తే నిజానికి జరుగుతున్నవి మతరూపంలో రాజకీయాలు, మతరూపంలో ఆర్థిక ప్రయోజనాలు. మత రూపంలో హింసా బీభత్సాలు. అందువల్ల, ఇవాళ మొత్తంగా సమాజం ముందూ, బుద్ధిజీవుల ముందూ, ప్రత్యేకించి హేతువాదుల ముందూ ఉన్న కర్తవ్యం మతం పేరుతో సాగుతున్న ఈ రాజకీయ, ఆర్థిక, హింసా శక్తుల ప్రచారాన్ని ఖండించడం, ప్రతిఘటించడం, ఓడించడం.

మతాన్ని, మత భావనలను ఓడించడం చర్చ ద్వారా, మతంలోని అసంగతాలను చూపడం ద్వారా, హేతు ప్రదర్శన ద్వారా సాధ్యమని ఇన్నాళ్లూ మనలో కొందరమైనా అనుకున్నాం. కాని మతాన్ని, మతభావనలను ఓడించడమంటే ఏమిటో, మళ్లీ మార్క్స్ మాటలే గుర్తు చేద్దామనుకుంటున్నాను. 'ప్రజల భ్రమాజనిత ఆనందంగా ఉన్న మతాన్ని రద్దు చేయడమంటే ప్రజల వాస్తవమైన ఆనందాన్ని ఆకాంక్షించడమే. ప్రస్తుత స్థితి పట్ల భ్రమల్ని వదిలేయమని కోరడమంటే, భ్రమలు అవసరమయ్యే పరిస్థితుల్ని వదిలెయ్యమని కోరడమే. అందువల్ల మతం మీద విమర్శ, మతం ఏ కన్నీటి ప్రవాహాల వెలుగుగా ఉన్నదో, ఆ కన్నీటి ప్రవాహాల మీద విమర్శకు బీజరూపమే... మతం మీద విమర్శ చట్టం మీద విమర్శ. మతవాదం మీద విమర్శ రాజకీయాల మీద విమర్శ' అని మార్క్స్ అన్నాడు.

మతాన్ని, మతభావాలను అరికట్టడానికి మార్క్స్ చెప్పిన మార్గం దీర్ఘకాలికమైనది కావచ్చు. కాని అదే అర్థవంతమైన, నిజమైన మార్గం. అంత సుదీర్ఘకాలం ఈ మత భావజాల వ్యాప్తిని, మూఢనమ్మకాలను ఇలాగే కొనసాగనిద్దామా అనే ప్రశ్న వస్తుంది. నిజానికి మనలో ప్రతి ఒక్కరమూ మన వ్యక్తిగత స్థాయిలోను, సమష్టిగాను తక్షణమే చేయదగిన, చేయవలసిన పనులు కూడ ఎన్నో ఉన్నాయి.

వ్యక్తిగత స్థాయిలో హేతువాద భావాల ప్రచారం, ఆచరణ కొనసాగించవచ్చు. ముందు వ్యక్తిగా మనం, మన కుటుంబ సభ్యులు, బంధుమిత్రులు, ఉద్యోగ సహచరులు వంటి అనేక స్థాయిలలో ఎక్కడ ఏ హేతురహిత, మత, మూఢనమ్మకం కనిపించినా హేతుబద్ధంగా వాదించడం, ఖండించడం, చర్చించడం వంటి చర్యల ద్వారా హేతువాద భావవ్యాప్తిని కొనసాగించవచ్చు. ఈ భావవ్యాప్తి హేతువాద, నాస్తిక, ప్రగతిశీల ఉద్యమాలు చాల కాలంగా చేస్తున్నప్పటికీ ఇవాళ పరిస్థితి ఇలా ఉన్నదంటే మనం చేయవలసిన పని చాల ఉందన్నమాట. మన శక్తి సామర్థ్యాలు, పరిధి ఇంకా ఇంకా పెరగవలసి ఉందన్నమాట.

# పత్రికా స్వేచ్ఛకు కొత్త ముప్పు

***మీడియాపై పాలకుల నియంత్రణ పెరగడం, విదేశీ పెట్టుబడిదారీ ఆధిపత్యం పెరగడం వల్ల విలువలు నశించి పోతున్నాయనీ, వీటి నుండి పత్రికా స్వేచ్ఛను, ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోవాలనీ అంటున్నారు టంకశాల అశోక్***

పత్రికా స్వేచ్ఛకు పెట్టుబడి వల్ల, లాభాపేక్షల వల్ల ముప్పు కొంత కాలంగా ఉన్నదే. ఇప్పుడు ప్రధానమంత్రిగా నరేంద్రమోడీ హయాం మొదలు కావడంతో కొత్త ముప్పు ఏర్పడుతోంది. లేదా అదే ముప్పు సరికొత్త స్థాయికి చేరింది. ఇది వ్యక్తిగా మోడీ గురించి అంటున్నమాట కాదు. కాని కొన్ని పరిణామాలు వెల్లువగా మరి పెట్టుబడులకు సంబంధించి ఒక కొత్త స్థితి ఏర్పడింది. ఆ వెల్లువకు మోడీ ప్రతీకగా, లేదా అధికార ప్రతినిధిగా మారడం వల్ల, ఆయనను నిమిత్తం చేసుకుంటూ ఈ ముప్పు ఏర్పడుతోంది.

విషయాన్ని కొంత సూటిగా చూద్దాం. కార్పొరేట్ మీడియాలో, ఇంగ్లిష్ పత్రికలూ ఛానళ్లలో అధికభాగం, భారతీయ భాషా పత్రికలలోనూ పెద్దవి అనేకం, అదే విధంగా విదేశీ, స్వదేశీ పెట్టుబడి దారుల వాటాలను ప్రత్యక్షంగానో, పరోక్షంగానో కొనుగోలు చేసిన పత్రికలూ 2014 ఎన్నికల సమయంలో మోడీని, బిజెపిని గట్టిగా బలపరచడం తెలిసిందే. బిజెపి నాయకత్వాన ఎన్‌డిఏ ప్రభుత్వం ఏర్పడిన తర్వాత ఇతర పత్రికలు కూడా ఉన్నట్లుండి వైఖరిని మార్చుకుంటున్నాయి. మోడీ, బిజెపి ఇంత శక్తివంతంగా అవతరించిన స్థితిలో తాము వ్యతిరేకంగా రాసినా, కనీసం స్వతంత్రంగా ఉన్నా ఏ సమస్య ఎదురుకాగలదోనని ఈ మీడియా జంకుతోంది.

ఈ తరహా పత్రికలు, ఛానళ్లు ఎన్నికల వరకు స్వతంత్ర వైఖరిని అవలంబించాయి. కొన్ని బిజెపి సైద్ధాంతికత పట్ల వ్యతిరేకత కారణంగా అదే విధమైన ఎడిటోరియల్ విధానాన్ని అనుసరించాయి. ఇప్పుడందుకు ధైర్యం చాలడం లేదు. వ్యక్తిగా మోడీనో, ఆయన పార్టీనో కాదు. ఆయన ప్రభుత్వం యథేచ్ఛగా అమలు పరుస్తున్న ఆర్థిక విధానాలను గాని, సంఘపరివారీయులు జోరుగా సాగిస్తున్న పరమత వ్యతిరేక కార్యకలాపాలను గాని ఈ పత్రికలు గట్టిగా విమర్శించలేకపోతున్నాయి. ఆ వార్తలు, వాటిపై ఇతరుల విమర్శలు, క్లిష్ట దృష్టిగల సంపాదకీయాలు, వ్యాసాలు తక్కువగా కనిపిస్తున్నాయి. చివరకు వార్తలను కూడా తగ్గించి వేస్తున్నారు. పత్రికా స్వేచ్ఛకు కొత్త ముప్పు అంటున్నది దీనినే. ఈ మీడియా వామపక్షీయులతో, కాంగ్రెస్‌తో కాదు. దానిని స్థూలంగా 'సాధారణమైన మీడియా' అనవచ్చు. ఆ మేనేజ్‌మెంట్లు సాధారణంగా కొంత ఉదార ధోరణి గలవి. ఆ మేరకు ప్రజాస్వామిక దృక్పథం గలవి. ఈ కారణాల వల్ల ఎడిటోరియల్ సిబ్బందికి తగు పత్రికా స్వేచ్ఛ ఉంటుంది. కాని ఇప్పుడది మారిపోతోంది. మౌలికంగా కాకపోవచ్చు. కాని మోడీ – బిజెపి ఉన్నంత కాలం ఇది కొనసాగే అవకాశం ఉంది.

బిజెపి కేంద్రంలో గెలవడమే కాదు. రాష్ట్రాలకు విస్తరిస్తోంది. చాలా ఉధృతి చూపుతోంది. అందుకు తగినట్లు కాంగ్రెస్, ఇతర ప్రతిపక్షాలు బలహీనపడుతున్నాయి. లోగడ ఒకసారి వీరు ఓడినా, అది తాత్కాలిక స్థితి అని, మరొకసారి అధికారానికి రాగలరన్న భావన ఉండేది. అది కొంత స్థైర్యాన్నిచ్చేది. తమకు గల పరిమిత పత్రికా స్వేచ్ఛకైనా ఒక భరోసా వంటిది ఉండేది. కాని గతంలో లేని విధంగా ఇప్పుడా స్థైర్యం లేకుండా పోతోంది. ఇది సహేతుకమో, నిర్హేతుకమో, తాత్కాలికమో లేక తగినంత కాలం కొనసాగగలదో చెప్పడం తేలిక కాదు. కాని ఆ భావన మాత్రం కనిపిస్తోంది. మోడీ – పరివార్ – బిజెపి ఉధృతి అల్ప సంఖ్యాక వర్గాలకు కలిగిస్తున్న అభద్రతా భావం వంటిది ఈ వర్గీకరణలోకి వచ్చే మీడియాను కూడా ఆవరిస్తోంది. 'ఎందుకులే వారితో పంచాయితీ' అనే తత్వం వస్తోంది. అది మేనేజ్‌మెంట్లలో, సంపాదక వర్గాలలో కూడా కనిపిస్తోంది. ఇటువంటిది గతంలో ఎప్పుడూ లేని స్థితి.

---

ఇటువంటి వ్యక్తిగత స్థాయి కృషితోపాటే సంఘటిత ప్రతిఘటన కూడ చేపట్టవలసి ఉంది. సామాజిక రంగాలలో సాగుతున్న మత భావాల ప్రచారాన్ని అడ్డుకోవడానికి ఏదో ఒకస్థాయి నిర్మాణాలు చేపట్టవలసి ఉంది. ముఖ్యంగా ప్రభుత్వ ఆధ్వర్యంలో మత భావాల ప్రచారం జరుగుతున్నప్పుడు అది రాజ్యాంగ వ్యతిరేకం అని ఎత్తిచూపవలసి ఉంది. చట్టపరమైన పద్ధతులలోనూ, సామాజిక చైతన్యాన్ని ప్రేరేపించే పద్ధతులలోనూ ఆ పని చేయవచ్చు. సామాజిక స్థాయిలో, విద్యలో, ప్రచారసాధనాలలో, ప్రభుత్వ కార్యక్రమాలలో రాజ్యాంగబద్ధ విలువలు, శాస్త్రీయ దృక్పథం నెలకొల్పాలనే డిమాండ్ తో అన్ని స్థాయిలలోనూ ప్రచారం, చర్చ, పోరాటం సాగించవలసి ఉంది. ఇది కేవలం తప్పుడు భావాలకూ సరైన భావాలకూ మధ్య, హేతురాహిత్యానికీ హేతుబద్ధతకీ మధ్య చర్చ మాత్రమే కాదు. ఇది ఒక రాజకీయార్థిక ఘర్షణ. మతభావాల ప్రచారం ద్వారా మతోన్మాదానికీ, మత విద్వేషానికీ భూమిక సృష్టించుకోదలచుకున్న రాజకీయాలతో ఘర్షణ. హేతుబద్ధ, శాస్త్రీయ, ప్రజానుకూల రాజకీయాల తరఫున ఘర్షణ. అందువల్ల పెరుగుతున్న మత ప్రాధాన్యతకు వ్యతిరేకంగా మన పోరాటం సంఘటిత, క్రియాశీల, దీర్ఘకాలిక ప్రతిఘటనగా ఉండక తప్పదు.

(మంగళగిరి–నిడమర్రు చార్వాకాశ్రమంలో ఫిబ్రవరి 14–15ల్లో జరిగిన 23వ రాష్ట్ర నాస్తిక మేళాలో ఫిబ్రవరి 15న 'మతం ప్రాధాన్యత ఎందుకు పెరుగుతుంది? అరికట్టడానికి మనం ఏం చేయాలి?' అనే అంశంపై చేసిన ఉపన్యాసానికి వ్యాసరూపం)

*(రచయిత వీక్షణం సంపాదకులు)*

వీ

కొన్ని రాష్ట్రాలలో ఎన్‌డిఏతో సంబంధంలేని పార్టీలు కొన్ని అధికారంలో ఉన్నాయి. వాటికి స్వంత పత్రికలు, ఛానళ్లు ఉన్నాయి. గమనించదగినదేమంటే అటువంటి మీడియా సైతం 'ఎందుకులే వారితో పంచాయితీ' అనే ధోరణినే తీసుకుంటున్నట్లు కనిపిస్తోంది. ఆ పార్టీల ప్రభుత్వాలు బిజెపి పట్ల సానుభూతి లేనివైనా, కేంద్రంతో అక్కడి రాష్ట్ర ప్రభుత్వాలతో సంబంధాలుంటాయి, జరగవలసిన పనులుంటాయి. అటువంటి స్థితిలో ఏ విధంగానైతే అటువంటి అధికార పక్షాలు మోడీ పట్ల కొంత మెతకగా ఉండక తప్పదో, ఆ పార్టీల పత్రికలు సైతం అదే విధమైన మెతక ధోరణిని చూపక తప్పడం లేదు. పత్రికలు క్లిష్టమైన, నిష్పాక్షికమైన వైఖరిని తీసుకున్నట్లయితే దాని ప్రభావం ఆ పార్టీ ప్రభుత్వాలకు మోడీ ప్రభుత్వంతో సంబంధాలపై పడుతుందన్నది వారి జంకు. దీనంతటికి మినహాయింపు అనదగ్గవి ఉన్నాయి గాని తక్కువ. వామపక్షాలవి, కాంగ్రెస్ పట్లనో లేక మరేదైనా ప్రతిపక్షం పట్లనో గట్టి అనుబంధం గల మీడియా మాట సరేసరి కాగా, మిగిలిన వాటిలో ఇటువంటి ధైర్యం చూపుతున్నవి తగ్గుతున్నాయి. ఇది నిస్సందేహంగా పత్రికా స్వేచ్ఛకు కొత్త పరిస్థితి, కొత్త ముప్పు.

ఇది చాలదన్నట్లు విదేశీ పెట్టుబడిదారులు స్వయంగానో, లేక భారతీయ పెట్టుబడిదారులతో కలిసో ఇక్కడి మీడియాలో పెట్టుబడులు పెట్టడం, లేదా పూర్తిగా స్వాధీన పరుచుకోవడం క్రమంగా పెరుగుతోంది. ఇది ఇంగ్లిష్ మీడియా పరిధిని దాటి భారతీయ భాషల మీడియాకు విస్తరిస్తోంది. తెలుగులో ఈనాడు గ్రూపు, మాటీవి గ్రూపు ఇందుకు ఉదాహరణలు. మాటీవి అయితే ఏకంగా రూపర్ట్ మర్డోక్ అనే విదేశీయుని చేతికి వెళ్లింది. మాటీవి వినోదాల ఛానల్ అన్నది నిజమే. కాని అందులో ఊరట కలిగించేదేమి లేదని మర్డోక్ గ్రూప్ నడిపే వినోదపు ఛానళ్లను చూస్తే తెలుస్తుంది. ముఖ్యంగా యువతను విష సంస్కృతి వైపు మళ్లించడం, స్థానిక ప్రజలను తమ స్వీయ భాషా సంస్కృతులకు దూరం చేయడం ఆయన గ్రూప్ చేస్తున్న పని. మరొకవైపు యువతను, ఇతరులను వినియోగ సంస్కృతితో ప్రభావం చేయడం వంటివన్నీ కలిసి పరిస్థితులను మల్టీ నేషనల్ కంపెనీలకు అనుకూలంగా, స్థానిక ఉత్పత్తులకు, వాటితో ఆలంబన గల స్థానిక సంస్కృతులకు దూరం చేస్తారు వారు. ఈ పరిణామాలు భావజాలాలను ప్రభావితం చేసి స్థానిక వాస్తవికతలను, కుటుంబ సంబంధాలను, స్వీయ స్పృహను ప్రజలు విస్మరించేట్లు చేస్తున్నాయి.

మర్డోక్ దృష్టి తెలుగులోని వార్తా ఛానళ్లపై కూడా ఉన్నట్లు వార్తలు సూచిస్తున్నాయి. కొందరు ఇతర అంతర్జాతీయ పెట్టుబడిదారుల గురించి కూడా వింటున్నాం. ప్రస్తుతం తెలుగు వార్తా ఛానళ్లు ఒకటి రెండు మినహా అన్నీ నష్టాలలో ఉండడం తెలిసిందే. ఆ కారణంగా సిబ్బందిని, ఖర్చులను తగ్గించుతున్నారు. ఉమ్మడి రాష్ట్రంలో ఉండిన కొన్ని రకాల అదనపు ఆదాయాలు వారికి తగ్గుతున్నట్లున్నాయి కూడా. అటువంటి స్థితిలో తమను గట్టెక్కించేందుకు విదేశీ పెట్టుబడులు, స్వదేశీ పెట్టుబడులు ముందుకు వస్తే సంతోషకరమే అవుతుంది. పాక్షికంగా వాటాలను అమ్మడమా లేక మొత్తం సంస్థలనా అన్నది వేరే విషయం. ఈ విధంగా ఛానళ్లతో ఆరంభమయ్యే మార్పులు ఒక రోజున పత్రికలకు విస్తరించవనే హామీలేదు. వాస్తవానికి అతిపెద్ద గ్రూప్ అయిన ఈనాడు ఇప్పటికే ఆ పరిధిలోకి వచ్చింది గనుక ఇతరులకు సందేహాలు ఉండకపోవచ్చు.

ఒకసారి ఈ క్రమం మొదలైతే ఇక అది పత్రికా స్వేచ్ఛకు లోగడ ఎన్నడూ లేనంత ముప్పు అవుతుంది. పెట్టుబడిదారులు తాము మెచ్చిన రాజకీయ పార్టీలకు, నాయకులకు అనుకూలమైన విధంగా వార్తలను, వ్యాసాలను, సంపాదకీయాలను మార్పిస్తారు. ప్రస్తుతం వీరికి ప్రియ మిత్రుడు నరేంద్రమోడీ. యథాతథంగానే పత్రికలు, అధికార పక్షాలు చాలా వరకు 'మనకెందుకులే పంచాయితీ' అనే వైఖరిని తీసుకుంటున్నట్లు పైన చెప్పుకున్నాం. బయటి నుంచి స్వదేశీ, విదేశీ పెట్టుబడులతో నిమిత్తం లేకుండానే రాజకీయమైన, పరిపాలనా పరమైన కారణాల వల్ల ఇది ఇప్పటికే నెమ్మదిగా జరుగుతోంది. అందుకు పెట్టుబడుల బలిమి కూడా తోడైతే చెప్పవలసింది ఉండదు.

మోడీ పరివారీయుడు కావడం మనం గమనించవలసిన మరొక అంశం. మనకు వ్యతిరేకం, లేదా అనుకూలం కాదనుకునే మీడియాపై కొంత ఆగ్రహం చూపడం అన్ని పార్టీలు చేసేదే. అవసరమనుకున్నప్పుడు మీడియాపై దాడులకు, అణచివేసే చట్టాలకు, ప్రభుత్వ ప్రకటనలు నిలిపివేయడం తదితర ఒత్తిడి చర్యలకు వారు సందేహించరు. ఇందుకు సంఘ్‌పరివార్ మినహాయింపు కాదు. వారు అధికారంలో ఉన్న చోట్ల వ్యవహారణను గమనిస్తే ఇది బోధపడుతుంది. అందరిలోనూ ముఖ్యంగా పరివారీయులు రహస్య ప్రచారాలకు, విష ప్రచారాలకు పెట్టింది పేరు. ఇప్పుడు మోడీ ఘన విజయం వల్ల తమకు కాగల కొన్ని దశాబ్దాల పాటు రాజకీయంగా ఎదురుండని స్థితి ఏర్పడిందన్నది వారి అంచనా. అందుకు మార్గాన్ని సుగమం చేసుకోవాలంటే మీడియాను అదుపులో ఉంచుకోవడం కూడా అవసరం. ఆ పని ప్రత్యక్ష, పరోక్ష మార్గాలలో జరగాలి. పత్రికలు 'మనకెందుకులే పంచాయితీ' అన్నట్లుగా స్వీయ నియంత్రణను విధించుకోవడం అట్లా జరుగుతున్నదే. మీడియా ఆ విధంగా నియంత్రణను విధించుకునే వాతావరణాన్ని సృష్టించడం మోడీ నాయకత్వం ఇప్పటికే సాధించిన విజయం. పరివార్‌కు చెందని పార్టీల ప్రభుత్వాలు రాజకీయంగా, పరిపాలనా పరంగా ఈ పద్ధతిని అనుసరించే వైపు మొగ్గుతున్నట్లు, మీడియా సైతం అదే పని చేస్తోంది.

బిజెపి యేతర పార్టీలు, వాటి ప్రభుత్వాలు స్వయంకృతాపరాధాల వల్ల విఫలమవుతుండడం ఈ స్థితికి ఒక ప్రధాన కారణం. వారి వైఫల్యాల వల్ల దేశంలో కేంద్రీకరణలు పెరుగుతున్నాయి. వికేంద్రీకృత, ప్రజాస్వామిక స్థితి తగ్గుతోంది. ఈ విధమైన వాతావరణం మీడియా స్వేచ్ఛకు పరిమితులను సృష్టిస్తుంది. ఇది జనరల్ మీడియా విషయంలో నిజం.

ఈ సమస్యలన్నింటికి సమాధానం మళ్లీ సమాజం నుంచే లభించాలి. మోడీ ఘనతల గురించి చాలా ప్రచారాలు జరిగాయి. ఇతర పార్టీల వైఫల్యాలతో విసుగెత్తి ఉన్న ప్రజలు ఆ ప్రచారాలను తేలికగా నమ్మారు. ఆ ఘనతలు నిజం కాదని తెలిసే కొద్ది ప్రజలు తిరిగి మామూలు స్థితికి వస్తారు. అప్పుడు మొదలయ్యే పరిణామ క్రమాలు మీడియా స్వేచ్ఛపై ఇప్పుడు వస్తున్న అప్రకటిత ఆంక్షలను తొలగించగలవని భావించాలి. ఈలోగా జరగవలసింది ప్రజాస్వామ్యం పట్ల, పత్రికా స్వేచ్ఛ పట్ల జర్నలిస్టుల ప్రేమ, విశ్వాసం, చైతన్యం చెదరకుండా ఉండేట్లు చూసుకోవాలి.

*(రచయిత సీనియర్ జర్నలిస్టు)* వీ

# కమ్యూనిస్టులకు అధికారం ఇచ్చిన గ్రీస్

***గ్రీక్ ప్రజల జీవితాలను నిర్దేశిస్తున్న విదేశీ విధానాలను వ్యతిరేకిస్తూ ప్రజలు తమ దేశ సార్వభౌమాధికారాన్ని నిలుపుకోవడానికి ఇచ్చిన తీర్పే ఇటీవలి ఎన్నికల ఫలితాలు అంటున్నారు* బైరెడ్డి సతీష్**

ప్రపంచానికి ప్రశ్నించే తత్వాన్ని, తర్కించే సూక్ష్మబుద్ధిని అందించిన ఎందరో మహా తత్వవేత్తలకు పురిటి గడ్డైన గ్రీక్ నేల ఇవాళ ప్రపంచీకరణ ప్రళయానికి అతలాకుతలమై అప్పుల ఊబిలోంచి, అస్తవ్యస్త స్థితిలోంచి తనను తాను నిలబెట్టుకునే 'దేశీయ' దారిలో ఉన్నది. 1990 లోనుంచి ప్రపంచమంతా ముసురుకున్న నూతన సరళీకరణ, ప్రైవేటీకరణ ఆర్థిక విధానాలు గ్రీక్‌ను కూడా కమ్మివేసినాయి. ప్రపంచీకరణ అంటే వసుదైక కుటుంబ భావన కాదని స్థానిక వనరులను మింగేసి, స్థానికతను చంపేసే పనే 'బహుళ జాతుల' పని అని ప్రపంచ ప్రజలందరికి బోధపడుతున్నట్టే గ్రీక్ ప్రజల జీవితాల్లో గత దశాబ్ద కాలంగా బాగా అనుభవంలోకి వచ్చింది. ఆ అనుభవమే 2015 జనవరి 25న జరిగిన ఎన్నికల్లో ప్రజలు నయా ఉదారవాద ఆర్థిక విధానాలపై తిరుగుబాటు భావుట ఎగరేసేలా ప్రేరేపించింది. కాలగమనంలో అన్ని జీవన రంగాల్లో గుణాత్మకమైన అభివృద్ధిని అనుభవించాల్సిన గ్రీక్ ప్రజలు మరింత అధఃపాతాళంలోకి ఎందుకు, ఎవరిచేత నెట్టివేయబడ్డారో, ఉపాధి ఉద్యోగం లేని జీవితానుభవాల ద్వారా తెలుసుకోగలిగినారు. ఈ దా'రుణా' నుభవాలే యురోపియన్ యూనియన్, అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ (ఐఎంఎఫ్), యురోపియన్ కేంద్ర బ్యాంకు దిమ్మదిరిగేలా తిరుగుబాటు తీర్పునిచ్చాయి. గ్రీక్ ఎన్నికల ముందు, ఫలితాలు వెలువడ్డ తర్వాత అంతర్జాతీయ ప్రసార మాధ్యమాల్లో జరిగిన చర్చంతా గ్రీక్ ఇ.యు.లో ఉంటుందా, అప్పుల్ని ఎగ్గొడుతుందా, పొదుపుచర్యల్ని కొనసాగిస్తుందా లేదా, యూరోని వదిలి స్వంత కరెన్సీకి వెళ్లిపోతుందా, త్వరలో జరిగే ఫ్రెంచ్, ఇంగ్లండ్ ఎన్నికల్లో ఇది ఎటువంటి పరిణామాలకు దారితీస్తుంది, పెట్టుబడులకు రక్షణ ఉంటుందా వంటి చప్పిడి చర్చల పరదాల వెనక గ్రీక్ ప్రజల అసలు అంతరంగాన్ని, ఆకాంక్షలను ప్రపంచం తెలుసుకొనే అవకాశాన్ని అడ్డుకున్నాయి. ఈ తీర్పు నయా ఉధారవాద ఆర్థిక విధానాలకు, పైనుండి రుద్దబడే అభివృద్ధి నమూనాకు, దేశీయ అభివృద్ధిని శాసిస్తున్న బయటి శక్తులకు, ప్రభుత్వ రంగాల్ని చంపేస్తూ ప్రైవేటు సామ్రాజ్యాలను నిర్మించే దళారీ రాజకీయ విధానాలకు, ప్రజల జీవితాలను మార్కెట్‌కు మార్టిగేజ్ చేసే దోపిడి విధానాలకు వ్యతిరేకంగా ప్రజలు ఇచ్చిన తీర్పు అనే అర్థం ధ్వనించే చర్చలేవీ చోటుచేసుకోలేదు. ఈ తీర్పును పాలకపక్షం మార్పుగా కాకుండా విధానాల మార్పుకోరే తీర్పుగా అర్థం చేసుకోవాలంటే యురోపియన్ యూనియన్ ఏర్పాటు, దానిలో గ్రీక్ సభ్యదేశంగా మారడం వంటి పరిణామాలను విశ్లేషించాలి. 1990ల్లో నుండి తీవ్రమైన సరళీకృత ఆర్థిక విధానాలు, ప్రపంచీకరణ పేరుతో బలంగా ముందుకు తోయబడ్డ చారిత్రక నేపథ్యం, 2008 నాటి ఆర్థిక మాంద్యంలో తక్షణ మూలాలు కనబడతాయి.

2000 – 2007 కాలంలో అమెరికా, ఇతర అభివృద్ధి చెందిన దేశాలుగా చెప్పుకుంటున్న దేశాలలో భారీగృహ నిర్మాణ రుణాలు, వితరణ బుడగ బద్దలవ్వడం, అనేక దేశాలు ఆర్థిక సంక్షోభంలో కొట్టుమిట్టాడడం ఆ ఆర్థిక మాంధ్యపు చీకట్లు గ్రీక్‌ను కూడా ముసురుకున్నాయి. 2004లో ఒలంపిక్స్ క్రీడలను ఘనంగా నిర్వహించిన గ్రీక్ 2010నాటికే తీవ్రమైన అప్పుల ఊభిలోకి, ఆర్థిక సంక్షోభంలోకి జారిపోయింది. జర్మనీ, నెదర్లాండ్, ఫిన్లాండ్ దేశాల బ్యాంకులు దక్షిణ ఐరోపా దేశాలైన గ్రీక్, స్పెయిన్, ఇటలీ, పోర్చుగల్‌లకు విపరీతమైన రుణాలు అందజేసినవి, మరోవైపు పాశ్చాత్య పోకడలను రుద్దుతూ, వినిమయవాధ విష సంస్కృతిలోకి గ్రీక్ ప్రజలను నెట్టడానికి విచ్చలవిడిగా రుణాలు అందజేసినవి. 2008 ఆర్థిక మాంధ్యం మూలంగా గ్రీక్ తీసుకున్న అప్పుల్ని తిరిగి చెల్లించలేని స్థితిలోకి వెళ్లిపోయింది. 2010లో ఆనాటి గ్రీక్ అధ్యక్షుడు పపాండ్రు 'త్రయం' ఆంక్షలకు తలొగ్గడంతో 20,600 కోట్ల యూరోల రుణ బెయిల్ అవుట్‌గా గ్రీక్ పొందింది. అసలు కుతంత్ర మంతా ఇక్కడే నడిచింది. ఈ బెయిల్ అవుట్ ప్యాకేజ్‌తో పాటు షరతుల ప్యాకేజి కూడా గ్రీక్ నెత్తినపడింది. ప్రభుత్వ నిర్వహణ వ్యయాన్ని భారీగా తగ్గించడం, సంక్షేమ పథకాల్లో తీవ్రమైన కోత విధించటం, స్థూల జాతీయోత్పత్తి (జిడిపి) లో నాలుగు శాతం మిగులు సాధించడం వంటి తీవ్రమైన షరతులు (అస్టరిటీ మెజర్స్) అమలు చేయడం మూలంగా పింఛన్‌లలో 40 శాతం కోత, ఆస్తి పన్నుల పెంపు, వస్తుసేవల ఉత్పత్తి 25 శాతం పైగా తగ్గడం, తీవ్ర ఆర్థిక మాంధ్యం, 26 శాతం పైగా పెరిగిన నిరుద్యోగం, ప్రజలకు వైద్య భీమా నిరాకరించడం, మందుల ధరలను 30 శాతం పైగా పెంచడం వంటి పరిణామాలు గ్రీక్ సమాజాన్ని ఒక కుదుపు కుదిపివేసినవి. ఈ పొదుపు చర్యల వల్ల గ్రీక్ రుణ భారం ఏమైనా తగ్గిందా అంటే 2009లో గ్రీక్‌లో 127 శాతం ఉన్న రుణభారం 2014 అంతానికి 31,700 కోట్ల యూరోలతో 175 శాతం చేరుకున్నది.

బెయిల్ అవుట్ రూపంలో వచ్చిన రుణాలు 10 శాతం మాత్రమే ప్రభుత్వం ప్రజల అవసరాలకు, సంక్షేమ పథకాలకు వెచ్చించింది. 90 శాతం వడ్డీలు, అసలు చెల్లింపులకే సరిపోయింది. బెయిల్ అవుట్ ముసుగులో పబ్లిక్ పవర్ కార్పొరేషన్ ఆఫ్ గ్రీక్‌ను కూడా (పిపిసి) ప్రైవేటీకరించే కుట్ర కూడా బలంగా జరిగింది. ప్రభుత్వ రంగ సంస్థల్లో అనేక ఉద్యోగాలను కుదించి వేసింద్రు. కొత్త ఉద్యోగాల కల్పనలేక ఉన్న ఉద్యోగాలు ఊడిపోవడమో, వేతనాలు తగ్గిపోవడమో మాత్రమే జరిగింది. నాలుగు లక్షల కుటుంబాల్లో కూడా ఉద్యోగాలు లేని దయనీయ స్థితి నెలకొన్నది. మొత్తం యువతలో 65 శాతం నిరుద్యోగులే. ఎనిమిది లక్షల నిరుద్యోగులకు నిరుద్యోగభృతి అందడంలేదు. ప్రజల కొనుగోలు శక్తి తగ్గడం మూలంగా గ్రీక్ రాజధాని ఒక్క ఏథెన్స్‌లోనే

# ఆదివాసులు - రాజ్యాంగం - చట్టాలు

*ఆదివాసులు చేసే పోరాటాలను శాంతి భద్రతల సమస్యగా కాకుండా సామాజిక, ఆర్థిక అంశాలుగా చూసినప్పుడే వాటికి పరిష్కారం ఉంటుందని అంటున్నారు* **తుంపాల శ్రీరామమూర్తి**

రాష్ట్రంలో తెలంగాణ తర్వాత ఉత్తరాంధ్ర జిల్లాలైన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం బాగా వెనుకబడి ఉన్నాయి. ఉత్తరాంధ్ర మొత్తం 23,304 చదరపు కిలోమీటర్ల వైశాల్యంలో 2011 లెక్కల ప్రకారం 93,38,147 జనాభా కలిగి ఉంది. వీరిలో పురుషులు 46,20,170 మంది, స్త్రీలు 46,96,052 మంది ఉన్నారు. ఉత్తరాంధ్రలో గిరిజనులు 10,20,174 మంది, దళితులు 8,32,878 మంది ఉన్నారు. ఉమ్మడి రాష్ట్రంలో మొత్తం గిరిజనులు 59,18,073 మంది. ఖమ్మం జిల్లా తర్వాత విశాఖ జిల్లాలోనే గిరిజనులు ఎక్కువగా ఉన్నారు. విశాఖ జిల్లా 11 మండలాల్లో 6,18,500 మంది గిరిజనులు ఉండగా, శ్రీకాకుళంలో 1,66,118 మంది, విజయనగరంలో 2,35,556 మంది గిరిజనులు ఉన్నారు.

విశాఖ జిల్లాలో ఆదివాసులు (ప్రిమిటివ్ ట్రైబల్ గ్రూప్స్) ఎక్కువ మంది ఉన్నారు. సీలేరు విద్యుత్ కేంద్రం ఈ జిల్లాలో ఉన్నప్పటికీ చాలా గ్రామాలకు కరెంటు సౌకర్యం లేదు. రహదారులు లేవు. సుదూర ప్రాంత గ్రామాలకు వైద్య సదుపాయం లేదు. పాడేరు, చింతపల్లి, అరకు ప్రాంతాలలో మాత్రమే ప్రధాన ఆసుపత్రులు ఉన్నాయి. మిగతా ప్రాంతాలలో పిహెచ్‌సిలు ఉన్నా వైద్య సదుపాయం అంతంత మాత్రంగానే ఉంది. ఏజెన్సీలో వంద పడకల ఆసుపత్రి లేదు. ఉన్న ఆసుపత్రులలో కూడా ఆధునాతన వైద్య పరికరాలు అందుబాటులో లేవు. చాలా మంది గిరిజనులు రోగాల బారిన పడి పౌష్టికాహారం లేక మరణిస్తున్నారు. రక్షిత మంచినీటి పథకాలు, చెక్‌డ్యామ్‌లు తగినన్ని అందుబాటులో లేవు.

పదేళ్ల క్రితం జాతీయ మానవహక్కుల కమిషన్ సభ్యుడు కె.ఆర్. వేణుగోపాల్ తన బృందంతో పర్యటించి వైద్య సదుపాయాలు

---

20 శాతం దుకాణాలు మూతపడి వేలాది మంది ఉపాధిని కోల్పోయారు. చిన్నచితకా ఉపాధి అవకాశాల కోసం ప్రజలు వెంపర్లాడుతున్నారు. ఇంతటి అస్తవ్యస్తత, ఆర్థిక సంక్షోభంలోకూడా కులీన వర్గాల విలాసాలు, ఆడంబరాలు ఏమాత్రం తగ్గలేదు. అంతరాలు, అసమానతలు మరింతగా పెరిగినవి. ప్రజల జీవితాలకు ఏరకంగా ఉపయోగపడని ఆయుధాల, రక్షణ సామాగ్రి కొనుగోలు జర్మనీ నుండి యథేచ్ఛగా కొనసాగడం చూస్తే గ్రీక్ దళారీ పాలకవర్గాల ప్రాధాన్యతేమిటో ఇట్టే అర్థం చేసుకోవచ్చు. సాధారణ ప్రజలు సమిధలౌతుంటే సంపన్నులు మరింత సంపన్నులుగా మారుతున్నారు.

సరిగ్గా ఈ నేపథ్యంలోనే పొదుపు చర్యల పదఘట్టనల కింద నలిగిపోతున్న ప్రజలకు 'సిర్జియా' రూపంలో మరో ప్రత్యామ్నాయం కనిపించింది. అనేక వామపక్షాల విప్లవ సంఘాల కూటమిగా ముందుకు రావటం పొదుపు చర్యల్ని, బెయిల్ అవుట్ షరతుల మోసాలను ప్రజల్లో బట్టబయలుచేయడం, ఉపాధి ఉద్యోగ సంక్షేమ రంగాలకు పెద్దపీట వేస్తామని, అభివృద్ధిని దేశీయ దారిలో నడిపిస్తామని చెప్పడం నలిగి పోయిన ప్రజల్లో నమ్మకాన్ని తీసుకొచ్చింది. ఫలితంగా 'సిర్జియా' ఎన్నికల్లో గెలవటం దాని నాయకుడు ఎలక్సిన్ సిప్రాస్ ప్రధానమంత్రి కావడం, మార్క్సిస్ట్‌గా ముద్రపడిన వ్యక్తి ఆర్థిక మంత్రి కావటం సహజంగానే యురోపియన్ యూనియన్‌లో ప్రకంపనలు పుట్టించింది. యూనియన్ ఉనికి ప్రశ్నార్థకమవుతుందా, అప్పులు ఎగ్గొట్టబడతాయా, ఇతర యూరోప్ దేశాల్లో వీటి ప్రభావం తీవ్రంగా ఉండబోతుందా, సిర్జియా చితికిన గ్రీక్‌ను పునర్జీవింపజేస్తుందా, నయా ఉదారవాద విధానాలను పూర్తిగా పక్కకు పెడుతుందా, పెద్దన్నల పెత్తనానికి అడ్డుకట్టవేస్తూ దేశీయ ముద్రతో కింది నుండి పైకి వెళ్లే అభివృద్ధి నమూనాను బలంగా ముందుకు తెస్తుందా వంటి అనేకానేక సవాళ్లకు సాగుతున్నకాలమే సమాధానం చెపుతుంది.

అయితే ఈ వర్తమాన గ్రీక్ ఎన్నికల తిరుగుబాటు చరిత్ర నుండి, ప్రపంచమంతా అమలవుతున్న ప్రపంచీకరణ, నయా ఉదారవాద విధానాలు, ప్రజల సహజ వనరులను ఆసాంతం మింగేసి వ్యక్తులకు అప్పగించడం, వారు విదిల్చే ఎంగిలి మెతుకులనే అభివృద్ధి అనడం, 'మరో మార్గాంతరం' లేదు ప్రజల జీవితాలను భవిష్యత్ చరిత్రను నిర్దేశించేది పెట్టుబడి, మార్కెట్ మాత్రమే అనే భావజాలాన్ని, అలాంటి అభివృద్ధి నమూనాను అడ్డుకునే ప్రత్యమ్నాయ రాజకీయాలు, ప్రజల అసలు అభివృద్ధి నమూనాను ముందుకు తెచ్చే శక్తులకు గ్రీక్ ఫలితాలల్లో (ఎన్నికలే కావచ్చు) స్ఫూర్తిని, స్థైర్యాన్ని ఇచ్చే అంశాలేవిలేవా? ప్రపంచీకరణ ప్రజల్ని తరుముకొస్తున్న గత రెండున్నర దశాబ్దాల కాలం లోనే పది లాటిన్ అమెరికా దేశాల్లో వామపక్షాల ప్రభుత్వాలు ఏర్పడి కొద్దోగొప్పో ప్రజల పక్షాన నిలబడ్డాయి. ఈ ఫలితాలు 'బహుళ జాతుల ప్రపంచీకరణ' భావజాలానికి పెనుసవాలు. సామ్రాజ్యవాద యుద్ధోన్మాధ ఆర్థిక విధానాలకు చెంపపెట్టు. ప్రజా రాజకీయాల విశ్వాసాన్ని రెట్టింపు చేసిన తీర్పు అది. ఈ ఎన్నికల తీర్పు పునాదుల్ని పెకిలించే మహావిప్లవం కాకపోవచ్చు గానీ పునాదుల్ని కూల్చే రాజకీయాలకు మాత్రం స్ఫూర్తిగా నిలబడుతుంది. 'మరో మార్గాంతరం' ఉంది అని చెప్పే అవకాశం, అంతిమ విజయం, సార్వభౌమాధికారం ప్రజలదే అనే నమ్మకాన్ని నిలబెట్టే పరిణామం అది. ఈ సందర్భంగానే ఫిడెల్ కాస్ట్రో అన్న మాటల్ని గుర్తుకు తెచ్చుకోవాలి. 'వాళ్లు సామ్యవాద వైఫల్యం గురించి మాట్లాడతారు గానీ, ఆఫ్రికా, ఆసియా, లాటిన్ అమెరికాలో పెట్టుబడి విజయం ఎక్కడుంది?'

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)* వీ

మెరుగుపరచాలని కోరుతూ ప్రభుత్వానికి అనేక సిఫారసులు చేశారు. అవి నేటికి అమలుకు నోచుకోలేదు. ప్రతీ ఏడాది పిల్లలతో కలిసి సుమారు 1500 మంది గిరిజనులు మరణి స్తున్నారు. భూమి హక్కుకు సంబంధించి 1/70 చట్టం ఉన్నప్పటికీ వేలాది ఎకరాల భూమి గిరిజనేతరుల అధీనంలో ఉంది. భారీ భవంతులు, లాడ్జీలు తదితర ఆస్తులన్నీ గిరిజనేతరులవే. విశాఖ ఏజెన్సీలో 3,399 షెడ్యూల్డు గ్రామాలు ఉన్నాయి. నాన్ షెడ్యూల్డ్ గ్రామాలు 55 ఉన్నాయి. శ్రీకాకుళం జిల్లాలో 108 షెడ్యూల్డ్ గ్రామాలు, 16 పంచాయితీల్లో ఒక్క సీతమ్మపేట మండలంలో ఉన్నాయి. ఇంకా 240 గ్రామాలు నాన్ షెడ్యూల్డ్ ప్రాంతాల్లో ఉన్నాయి. శ్రీకాకుళం గిరిజన రైతాంగ పోరాటం 1968–71 వరకూ సాయుధంగా జరిగిన నేపథ్యంలో సుమారు 300 మంది అమరులైనారు. ఈ క్రమంలో 1/70 చట్టం వచ్చినప్పటికీ ఆ చట్టం షెడ్యూల్ ప్రాంతాలలోనే విశాఖపట్నం, విజయనగరం, శ్రీకాకుళం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, ఖమ్మం, వరంగల్, మహబూబ్‌నగర్, ఆదిలాబాద్ జిల్లాల్లో మాత్రమే వర్తించింది.

1959 భూ బదలాయింపు చట్టంలోని సవరణల్లో భాగంగా 1/70 చట్టం వచ్చింది. ఈ చట్టం ప్రకారం ఏజెన్సీ ప్రాంతాలలోని ఆదివాసులు భూమిని (షెడ్యూల్డ్ ఏరియా) గిరిజనేతరులకు బదలాయించడం చెల్లదు. గిరిజనేతరుల అధీనంలో (1963 కంటే ముందుగా ఉన్న వాటిని మినహాయించగా) ఉన్న స్థిరాస్తి గిరిజనుల నుంచి అక్రమంగా సంక్రమించిందేనని ఈ చట్టం భావిస్తుంది. అలా కాదని రుజువు చేసుకోవలసిన బాధ్యత గిరిజనేతరులదే. ఏజెన్సీ ప్రాంతాలలో స్థిరాస్తిని గిరిజనులకు తప్ప వేరొకరికి అమ్మడానికి వీలులేదు. ఒకవేళ గిరిజనులు ఎవరైనా కొనడానికి సిద్ధంగా లేకపోతే అట్టి స్థిరాస్తిని ప్రభుత్వానికి అప్పగించాలి. ఈ విధంగా అప్పగించిన భూమికి ప్రభుత్వం విధిగా తగు నష్ట పరిహారం చెల్లించాలి. ఇతర జిల్లాలలో గిరిజనులు ఉన్నప్పటికీ షెడ్యూల్ ప్రాంతంగా గుర్తించనందున వారికి వర్తించలేదు. అంతేకాక షెడ్యూల్ ప్రాంతంగా గుర్తించిన జిల్లాలలో కూడా నాన్ షెడ్యూల్ గ్రామాల పేరుతో ఈ చట్టం వర్తించలేదు. పోరాటం జరిగిన శ్రీకాకుళం జిల్లాలో నాన్ షెడ్యూల్డ్ గ్రామాలు 240, విజయనగరం జిల్లాలో 170 ఉన్నాయి. ఈ గ్రామాలలో భూమి 90 శాతం గిరిజనేతరుల అధీనంలో ఉన్నది. నాన్ షెడ్యూల్ గ్రామాలను షెడ్యూల్ ప్రాంతంగా గుర్తించాలని 1962లో ఢేబర్ కమిషన్ సూచించగా జిల్లాలో సర్వే జరిపించి 805 నాన్ షెడ్యూల్ గ్రామాలను గుర్తించి షెడ్యూల్ గ్రామాలుగా పరిగణించాలని 1976లో రాజ్యాంగానికి సవరణతెచ్చి చర్యలు తీసుకోవాలని కోరుతూ 1980లో కేంద్ర ప్రభుత్వానికి నివేదిక పంపింది. దశాబ్దాలు గడిచినా దీనిపై సమాధానం లేదు. 1985 మహారాష్ట్ర, 1987లో రాజస్థాన్ రాష్ట్రాలు పంపిన నివేదికలు ఆమోదం పొందాయి. 1977లో రాజకీయాల ప్రభావంతో లంబాడాలను ఎస్‌టిలుగా గుర్తిస్తూ ప్రభుత్వం నిర్ణయం తీసుకున్నది. దీని వలన తెలంగాణ ప్రాంతం బాగా దెబ్బతిన్నది. మహారాష్ట్రకు చెందిన ఇరుగు పొరుగు జిల్లాల వారు ఇక్కడకు వలస వచ్చారు. దీని వలన ఆదిమ తెగకు చెందిన కొందరి భూములు ఆక్రమణకు గురయ్యాయి. నిజానికి లంబాడాలు అత్యధిక జనాభా కలిగిన అతిపెద్ద గిరిజన తెగ. ఇది చెంచు, కోయ, కోందు, కోలాం మొదలైన తెగల వారి ప్రయోజనాలకు నష్టం కలిగిస్తుంది.

రాజ్యాంగం 6వ షెడ్యూల్‌లో జిల్లా కౌన్సిల్స్ (మండళ్లు)కు ఇవ్వబడిన అధికారాలన్నీ 5వ షెడ్యూల్ ప్రాంతాలకు వర్తింపచేయాలి. ఈ ప్రాంతాల్లో జిల్లా స్వయంప్రత్తి మండళ్లు (డిస్ట్రిక్ అటానమస్ కౌన్సిల్స్) ఏర్పాటుకు అవసరమైన చర్యలు తీసుకోవాలి.

షెడ్యూల్ ఏరియాకాని మిగిలిన జిల్లాలలో 24,19,298 మంది గిరిజనులున్నారు. గుంటూరు, ప్రకాశం, కర్నూలు జిల్లా సరిహద్దులో నల్లమల అటవీ ప్రాంతం ఉంది. కాని షెడ్యూల్ ఏరియా కాదు. మహబూబ్‌నగర్ సరిహద్దు నల్లమల అటవీ ప్రాంతం మాత్రమే షెడ్యూల్ ఏరియా.

### కోనేరు రంగారావు కమిటీ

రాష్ట్రంలోని పేదలకు భూములను అందుబాటులోకి తెచ్చేందుకు చట్టాలు, నియమాలు, పాలనా పద్ధతుల్లో రావలసిన, తేవలసిన మార్పులను సూచించమని 2004లో రాష్ట్ర ప్రభుత్వం కమిటీ వేసింది. అది పీపుల్స్‌వార్ పార్టీ వారితో చర్చలు జరుపుతున్న కాలం. ఉభయ కమ్యూనిస్ట్ పార్టీలు భూ పోరాటం చేస్తున్న సందర్భం. అప్పటి మంత్రి వర్గంలో పురపాలక శాఖా మంత్రి కోనేరు రంగారావు ఈ కమిటీకి అధ్యక్షత వహించడంతో అది కోనేరు రంగారావు కమిటీగా ప్రాచుర్యం పొందింది. రెండు సంవత్సరాల తర్వాత 2007లో ఈ కమిటీ 104 సిఫారసులతో ఒక నివేదికను ప్రభుత్వానికి సమర్పించింది. ఇందులో 12 అధ్యాయాలు ఉన్నాయి. 104 సిఫారసులలో 41 సిఫారసులు ఆదివాసుల భూ సమస్యల పరిష్కారానికి ఉద్దేశించినవే. భూములను పేదలకు అందుబాటులోకి తేవాలంటే అధికారుల్లో పేదల అనుకూల దృక్పథం ఏర్పడాలని కమిటీ భావించి అందుకో సిఫారసు చేసింది. 2007 సెప్టెంబర్‌లో రాష్ట్ర ప్రభుత్వం జి.ఒ. నెంబర్ 1049, 1176 ద్వారా 90 సిఫారసులను ఆమోదించినట్లు తెలిపింది. ఈ సిఫారసుల అమలు తీరును ఎప్పటికప్పుడు పర్యవేక్షించుటకు మూడు కమిటీలను, ఒక సీనియర్ ఐఎఎస్ అధికారిని అదనపు కమిషనర్‌గా నియమించారు. 2009 నాటికి ఆమోదించిన సిఫారసులలో 65కు సంబంధించి జిల్లా కార్యాలయాలకు ఆదేశాలు వెళ్లాయి. రాజధాని భూమి శిస్తు కమిషనర్, రెవెన్యూశాఖ ముఖ్య కార్యదర్శి నుంచి వెళ్లిన 65 సిఫారసుల్లో ఎన్ని అమలుకు నోచుకున్నాయి. క్షేత్ర స్థాయిలో వాటి ప్రభావం ఏమిటి అన్న ప్రశ్న పక్కనపెడితే, 2009 నుంచి ఇప్పటివరకు ఐదేళ్లలో ఎలాంటి ప్రగతి లేదు. మిగిలిపోయిన 20 సిఫారసులకు ఇంకా ఆదేశాలు వెళ్లాల్సి ఉంది. బాధాకరమైన విషయం ఏమిటంటే ఉండిపోయిన 25 సిఫారసుల్లో పది ఆదివాసుల భూ సమస్యకు, నాలుగు భూ వ్యాజ్యాలకు, మూడు భూ సంస్కరణల చట్టం అమలుకు సంబంధించినవి కావడం. ఎస్‌సి, ఎస్‌టి సబ్‌ప్లాన్ చట్టం తెచ్చినప్పటికీ దళిత ఆదివాసులకు సంబంధించిన భూ సమస్య పరిష్కారానికి చిత్తశుద్ధి లేదు. 50 శాతం గిరిజన జనాభా దాటిన సబ్‌ప్లాన్ గిరిజన గ్రామాలను షెడ్యూల్ ప్రాంతంలో కలపాలని కోనేరు రంగారావు భూ కమిషన్ నివేదిక సిఫారసు చేసింది.

### రాజ్యాంగం

భారతదేశంలో 8.2 శాతం ఉన్న గిరిజనులకు రాజ్యాంగంలో డా. బి.ఆర్. అంబేద్కర్ 5, 6 షెడ్యూళ్లను పొందుపరిచారు. (ఆర్టికల్ 244

(1), 244 (2), 275 (1). 6వ షెడ్యూల్‌లో అస్సాం, మేఘాలయ, మిజోరాం, త్రిపుర రాష్ట్రాలకు చెందింది. మిగిలిన రాష్ట్రాలకు 5వ షెడ్యూల్‌లో పొందుపరచబడింది. రాజ్యాంగం అమలులోకి వచ్చిన సంవత్సరం నుండే భారత రాష్ట్రపతి ఈ 'షెడ్యూల్ ఏరియా' ఆర్డర్‌ను ప్రకటించారు. ఈ ఆర్డర్‌లో మన ఉమ్మడి రాష్ట్రంలోని 9 జిల్లాలు అనగా మహబూబ్‌నగర్, ఖమ్మం, వరంగల్, ఉభయ గోదావరి, విశాఖ, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలలోగల సుమారు 5,400 గిరిజన గ్రామాలను 5వ షెడ్యూల్ జాబితాలో అనగా షెడ్యూల్ ఏరియా ఆర్డర్‌లో చేర్చారు. ఏ గ్రామాల పేర్లయితే అందులో లేవో ఆ గ్రామాలలో గిరిజనులే నివసిస్తున్నా అవి గిరిజన గ్రామాలుగా గుర్తింపు లేకుండా పోయాయి. షెడ్యూల్ ఏరియా జాబితాలో లేకపోతే ఆ గ్రామ గిరిజనులు ఎన్ని హక్కులు కోల్పోతారో మనం తెలుసుకోవాలి. ముఖ్యంగా షెడ్యూల్ ఏరియాలకు రాజ్యాంగం ఇచ్చిన కొన్ని ప్రత్యేక హక్కులు ఉన్నాయి. షెడ్యూల్ ఏరియాలపై గవర్నర్, రాష్ట్రపతులకు, శాసన వ్యవస్థపై (అసెంబ్లీ, పార్లమెంట్) కొన్ని ప్రత్యేక అధికారాలు ఉంటాయి. వారి అనుమతి లేకుండా చట్టాలు చేసే అధికారం ఎవరికీ లేదు. గ్రామ పంచాయితీ నుంచి పార్లమెంట్ సభ్యుల వరకు ఎన్నికయ్యే అన్ని పదవులు షెడ్యూల్ ఏరియా గిరిజనులకు మాత్రమే రిజర్వు చేయబడ్డాయి. షెడ్యూల్ 1/70 చట్టం ఏరియాలో గిరిజనుల భూములు కొనకుండా చూసే భూ అన్యాక్రాంత నిషేధ చట్టం, వడ్డీ నియంత్రణ చట్టం వంటి సంక్షేమ రక్షణ చట్టాలు గిరిజనులకు ఉంటాయి. షెడ్యూల్ ఏరియాలో ఉద్యోగ అవకాశాలు జి.ఒ. నెం. 3 అనుసరించి గిరిజనులకే రిజర్వు చేయబడ్డాయి. షెడ్యూల్ ఏరియాకు వర్తించే పంచాయితీరాజ్ చట్టం గ్రామసభ పంచాయితీలకు విశేషాధికారాలు తెచ్చింది. షెడ్యూల్ ఏరియా లో లేని గిరిజనులు వీటిని పొందలేకపోతున్నారు. షెడ్యూల్ ఏరియా అభివృద్ధికి కేంద్ర ప్రభుత్వ ప్రణాళిక నుంచి నిధులు విడుదల అవుతాయి.

సమీకృత గిరిజనాభివృద్ధి సంస్థ (ఐటిడిఏ) నిధులతో సంక్షేమ కార్యక్రమాలు నిర్వహిస్తారు. నాన్ షెడ్యూల్ గ్రామాలకు ఈ నిధులు అందవు. ఈ విధంగా రాజ్యాంగ రక్షణలు ఉద్యోగ, రాజకీయ రిజర్వేషన్లు, సంక్షేమ రక్షిత చట్టాలు, అభివృద్ధి నిధులు నాన్ షెడ్యూల్ గిరిజనులు కోల్పోతున్నారు.

**సబ్‌ప్లాన్**

షెడ్యూల్ ఏరియా (ఏజెన్సీ లేదా గిరిజన ప్రాంతం)గా ప్రకటించని గిరిజన ప్రాంతాలకు సబ్‌ప్లాన్ ఏరియా లేదా మైదాన ప్రాంత గిరిజనులు అని రెండు పదాలు వాడుతున్నారు. అయితే ఇవి వాస్తవికతను ప్రతిబింబించకపోగా కొంతవరకు పొరపాటు అర్థాన్ని కలిగిస్తున్నాయి. 5వ పంచవర్ష ప్రణాళిక (1974 – 79) అనుబంధంగా ట్రైబల్ సబ్‌ప్లాన్ స్ట్రాటజీ అనే ఉప ప్రణాళికను రూపొందించారు. కేంద్ర ప్రణాళికను అనుసరించి (1974) సబ్ ఏరియా అన్నారు. ఈ విధంగా సబ్‌ప్లాన్ ఉప ప్రణాళిక అమలయ్యే ప్రాంతాలను సబ్‌ప్లాన్ ఏరియా అన్నారు. ఈ విధంగా సబ్‌ప్లాన్ ఏరియా పదం ప్రచారంలోకి వచ్చింది. మరెందుచేతో ఐటిడిఏ వారు షెడ్యూల్ కాని ప్రాంతాలకు సబ్‌ప్లాన్ ఏరియా అని పిలుస్తుండడంతో వారికి సహకారం అందించడం లేదు. మైదాన ప్రాంత గిరిజనులు అనగానే అడవుల నుంచి దూరంగా మైదానాలకు వలస వచ్చినవారనే భావనే కలుగుతుంది. నిజానికి కొన్ని షెడ్యూల్ ప్రాంతాలను గమనిస్తే ఉదాహరణ పశ్చిమగోదావరి జిల్లా జీలుగుపల్లి మండలంలో కొండలు, అడవులు వంటి వాతావరణం కనిపించదు కాని చాలా షెడ్యూల్ కాని గిరిజన ప్రాంతాలు అరణ్యాలకు మధ్య ఉన్న గ్రామాలకు ఏమాత్రం తీసిపోవు. విశాఖ జిల్లా రావికమతం మండలం కళ్యాణపులోవ, సలిసింగం గ్రామాలు ఇందుకు ఉదాహరణ. అందుచేత సబ్‌ప్లాన్ లేదా మైదాన గిరిజనులు అనడం కంటే షెడ్యూల్ కాని గిరిజనులు అనడమే మంచిది.

**పీ(పె)సా చట్టం**

పంచాయతీరాజ్ విస్తరణ 1996 చట్టం ఆదివాసులకు స్వయం పరిపాలనాధికారం, ఉమ్మడి వనరులను కాపాడుకునే అధికారం గ్రామ సభలకు ఉంటుందని స్పష్టం చేసింది. షెడ్యూల్ ప్రాంతంలో గల భూమి, అడవి, నీరు, సహజ వనరులపై పూర్తి అధికారం గ్రామ సభలకు ఉండాలని కేంద్ర ప్రభుత్వం నియమించిన దిలీప్‌సింగ్ భూరియా కమిటీ సిఫారసు చేసింది. ఈ చట్టం ప్రకారం షెడ్యూల్ ప్రాంతంలో వనరులపై అధికారం రాష్ట్ర ప్రభుత్వానికి లేదు. స్థానిక పంచాయితీలకు, గ్రామ సభలకే ఉంటుంది. ఇప్పటికీ పంచాయితీలు, స్థానిక సభలు బాక్సైట్ తవ్వకాలను వ్యతిరేకిస్తున్నాయి. ఈ చట్టం 5వ షెడ్యూల్ ప్రాంతంలో శాంతి, మంచి పాలన కొరకు గవర్నర్‌కు విస్తృత అధికారం కట్టబెట్టింది. అసెంబ్లీ, పార్లమెంట్ చేసిన చట్టాలను పక్కన పెట్టి ప్రత్యేక అధికారాలు జారీ చేసే అధికారం రాష్ట్రపతికి, గవర్నర్‌కు కల్పించింది. రాజ్యాంగంలో పేర్కొన్న ఉద్దేశాలు ఆదివాసుల సామాజిక, ఆర్థిక పురోభివృద్ధికి ప్రాతిపదికగా ఉండాలని రాజ్యాంగ కర్తల ఉద్దేశం కావచ్చని 1997లో సమతా కేసులో జస్టిస్ రామస్వామి అభిప్రాయపడ్డారు. పీసా చట్టాన్ని ఉల్లంఘించి గనుల తవ్వకాల కోసం ప్రభుత్వం బహుళజాతి కంపెనీలతో ఒప్పందం చేసుకుంది. మనరాష్ట్రంలో 33 తెగలు ఉన్నాయి. ఆదివాసుల ఆవాస హక్కుల పరిరక్షణను ఉద్దేశించిన అటవీ హక్కుల చట్టం 2006 ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో అమలు జరుగుతున్న తీరును పరిశీలించేందుకు ఒక అంతర్జాతీయ నిర్ధారణ కమిటీ ఆరు నెలల క్రితం ఈ ప్రాంతాలను పర్యటించి చట్టం అమలులో జరుగుతున్న అవకతవకలనూ, ఆదివాసులు ఎదుర్కొంటున్న కీలక సమస్యలనూ సమీక్షించి పరిష్కారం కొరకు తమ సిఫారసులను కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలకు పంపింది. గిరిజనుల సంక్షేమం కొరకు అనేక చట్టాలు, జిఒలు, సర్క్యులర్లు విడుదలయ్యాయి. సంక్షేమం హక్కులను కాపాడాల్సిన బాధ్యత గవర్నర్, రాష్ట్రపతులదే అయినా వారు పట్టించుకోలేదు. కొన్ని రాష్ట్రాలు షెడ్యూల్ ఆర్డర్‌లో నేటికీ లేవు. మన గవర్నర్‌లు ఎవరూ షెడ్యూల్ ప్రాంతాలలో పర్యటించలేదు. పార్లమెంట్, అసెంబ్లీలు పట్టించుకోలేదు. ఏజెన్సీలో కొనసాగుతున్న ఉద్యమాలకు మూలాలు సామాజిక, జీవన ఆర్థిక అంశాలతో ముడిపడి ఉన్నాయి. శాంతి భద్రతల సమస్యగా కాకుండా సామాజిక అంశంగా గుర్తించి ఆచరణ జరిగినప్పుడే గిరిజనుల జీవితాలు మెరుగుపడతాయి.

*(ఆదివాసుల హక్కులకై నిరంతరం శ్రమించిన డాక్టర్ బి. జనార్దనరావు స్మృతిలో)*

*(రచయిత జిల్లా అధ్యక్షుడు, ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం, విశాఖపట్నం)* వీ

# శ్రామిక మహిళలదే మహిళా దినోత్సవం

***అంతర్జాతీయ మహిళా దినోత్సవ నేపథ్యాన్ని తెలియపరుస్తూ, దాని ప్రాముఖ్యతని వివరించిన వారి అభిప్రాయాలను తెలియజేస్తూ, మహిళా దినోత్సవ స్ఫూర్తిని కొనసాగించాలని అంటున్నారు* కవిని ఆలూరి**

మార్చ్ 8ని అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా ప్రకటించడం వెనుక ఉన్న చారిత్రక నేపథ్యం మనందరికీ తెలిసినదే! అయినా మరొకసారి విశ్లేషించుకుందాం.

1908 మార్చ్ 8న వస్త్రాలను తయారు చేసే మహిళా కార్మికులు తమ సమస్యలు, అలాగే శక్తివంతమైన ట్రేడ్ యూనియన్ల ఏర్పాటు వంటి డిమాండ్‌లతో ఒక ప్రదర్శనను విజయవంతంగా నిర్వహించారు. ఈ ప్రదర్శనకు వస్త్ర తయారీ మహిళా కార్మికులే నాయకత్వం వహించారు. విదేశాలలోని సోషలిస్టు మహిళలను ఈ ప్రదర్శన విశేషంగా ఆకర్షించింది. అమెరికా కార్మిక మహిళా ప్రదర్శన దినమైన మార్చ్ 8న అంతర్జాతీయ మహిళా దినోత్సవంగా ప్రకటించాలన్న తీర్మానాన్ని 'కోపెన్ హగెన్'లో క్లారా జట్కిన్ ప్రవేశపెట్టారు. 1911 మార్చ్ 8న జర్మనీ, ఆఫ్రికా, డెన్మార్క్, స్విడ్జర్లాండ్‌లలో తొలి అంతర్జాతీయ మహిళా దినోత్సవం జరిగితే రష్యాలో మాత్రం 1913లో జరిగింది.

నేడు దాదాపుగా అన్ని దేశాలలో అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని సామ్రాజ్యవాద సంస్కృతిలో భాగంగా, ఒక వేడుకగా, ఒక వ్యాపారంగా జరుపుకుంటున్నారు. ఐతే అంతర్జాతీయ మహిళా దినోత్సవం పట్ల సరైన దృక్పథాన్ని, అవగాహనను ఏర్పరచుకోవడానికి ఆనాటి ప్రముఖులు ఇచ్చిన సందేశాలనూ, అభిప్రాయాలనూ పరిగణనలోకి తీసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది...

1921, మార్చ్ 4న కా. లెనిన్ ఇలా అన్నారు – సామ్రాజ్యవాద శృంఖలాల నుండే ప్రజానీకపు విముక్తినీ, పెట్టుబడి శృంఖలాల నుండి శ్రామిక స్త్రీ, పురుషుల విముక్తినీ ఏ శక్తీ ఆపలేదు. పట్టణాలలోనూ, గ్రామాలలోనూ, కోటాను కోట్ల శ్రామిక స్త్రీ, పురుషులు ఈ ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోతున్నారు. అందుకనే పెట్టుబడి శృంఖలాల నుండి శ్రమను విముక్తం చేసేందుకు జరిగే ఈ ఉద్యమం ప్రపంచమంతటా జయిస్తుంది.

1926, మార్చ్ 8న కా. స్టాలిన్ ఇలా అన్నారు – మహిళా విమోచన సాధనకు, కార్మిక వర్గ ఉద్యమ అజేయతకు అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఒక చిహ్నం...కార్మిక వర్గానికి రిజర్వుగా ఉన్న కార్మిక స్త్రీలను, రైతాంగ మహిళలను, కార్మిక వర్గ విముక్తి పోరాటంలో క్రియాశీల పాత్ర వహించే సైన్యంగా రూపుదిద్దడానికి అంతర్జాతీయ మహిళా దినోత్సవం ఒక సాధనం కావాలి...

మూడవ ఇంటర్నేషనల్ ప్రముఖ నాయకురాలు, కార్మిక మహిళా ట్రేడ్‌యూనియన్ కార్యకర్త, స్త్రీయే ఓటు హక్కు, సమాన హక్కుల కోసం పోరాడుతూ... అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని ప్రపంచ మహిళలకు అందించిన అంతర్జాతీయ సోషలిస్టు మహిళల కార్యదర్శి, స్త్రీ విముక్తికి శాస్త్రీయమైన సిద్ధాంతాన్ని రచించిన సిద్ధాంత కర్త, పితృస్వామ్యాన్ని నిర్మూలించడానికి అహర్నిశలు పోరాడిన యోధురాలు క్లారా జెట్కిన్. పురుషులు స్త్రీలపై చేస్తున్న పెత్తనాన్నీ, అధికారాన్నీ నాశనం చేయడమే బూర్జువా మహిళా ఉద్యమ లక్ష్యమని అభిప్రాయపడ్డారు. బూర్జువా మహిళా ఉద్యమం పెట్టుబడిదారీ ఉత్పత్తి విధానం నుండే తలెత్తిందనీ, చట్టపరంగానూ, సామాజికంగానూ పురుషులతో సమానమైన స్థానాన్నీ, హోదానూ, తమకు కల్పించాలన్న డిమాండ్‌ను బూర్జువా మహిళా ఉద్యమం లేవనెత్తిందని అన్నారు. ఈ డిమాండ్ గనుక సాధించబడితే, ఎట్టి మినహాయింపులు లేకుండా మొత్తం స్త్రీలందరూ విముక్తి చెందినట్టేనని ఆ ఉద్యమ నాయకులు ఉద్ఘాటించారు కానీ ఇది వాస్తవం కాదన్నారు.

స్త్రీ, పురుషులన్న భేదం లేకుండా, దోపిడీ చేయబడుతున్న ప్రజలందరూ కలిసి సంఘటితమైన విప్లవకర వర్గ పోరాటం మాత్రమే మనల్ని ఈ గమ్యానికి చేర్చగలదు తప్ప వర్గ భేదాన్ని దృష్టిలోకి తీసుకోకుండా పురుషాధిక్యతకు వ్యతిరేకంగా సాగే మహిళల పోరాటం గమ్యాన్ని చేరలేదని స్పష్టపరిచారు.

1919 మార్చ్‌లో మాస్కోలో జరిగిన మూడవ ఇంటర్నేషనల్ కాన్ఫరెన్స్ కమ్యూనిస్టు మహిళా ఉద్యమానికి నాంది పలికింది. కమ్యూనిస్టు మహిళా ఉద్యమం సామ్రాజ్యవాద ప్రపంచ యుద్ధం నుండీ, రష్యన్ విప్లవం నుండీ, ఆ తర్వాత జరిగిన చారిత్రక ఘటనల నుండీ సిద్ధాంతరీత్యానూ, ఆచరణ రీత్యానూ విలువైన నిర్ణయాలకు రాగలిగింది, మార్క్సిజానికి సంబంధించిన చారిత్రక అవగాహన నుంచే కచ్చితంగా కట్టుబడి ఉండే వైఖరి, సామాజిక అభివృద్ధి క్రమంలో ఎదురయ్యే సమస్యలనూ, కర్తవ్యాలనూ నిరంతరాయమైన, శక్తివంతమైన లెనినిస్టు అన్వయింపు కమ్యూనిస్టు ఉద్యమానికి మార్గదర్శకాలు అయ్యాయని క్లారా జెట్కిన్ ఉద్ఘాటించారు.

మార్చ్ 8 అంతర్జాతీయ శ్రామిక మహిళా దినోత్సవం విముక్తి పోరాటంలో ప్రపంచ శ్రామిక స్త్రీల మహత్తర ఐక్యతా చరిత్రను సంస్మరించే పర్వదినమనీ, ఈ పోరాటం ప్రపంచ కార్మిక వర్గ విముక్తి పోరాట విజయ పురోగమనంతో సన్నిహితంగా ముడిపడి ఉన్నదని అభిప్రాయపడ్డారు – నుకువాంగ్. మహిళా దినోత్సవానికి మహిళా కార్మికోద్యమమే బలమైన గొలుసులో లింకు ఉన్నదన్నారు – అలెగ్జాండ్రాకొలంటాయ్...

అంతర్జాతీయ మహిళా దినోత్సవాన్ని గురించి ప్రముఖుల

అభిప్రాయాలు వైవిధ్యంగా ఉన్నాయి. ఐతే, భారతదేశంలో జరిగినటు వంటి, జరుగుతున్నటువంటి ఉద్యమాలలో మహిళల పాత్ర గురించి విశ్లేషించుకుంటే – భారతదేశంలో జరిగిన ఉద్యమాలన్నిటిలోనూ, భారతీయ మహిళల పాత్ర ఎంతో కీలకమైనదే, కాకుండా ప్రాముఖ్యతను సంతరించుకున్నది. సామాజిక మార్పులో మహిళల పాత్ర ప్రశంసనీయమైనది. జాతీయోద్యమాల నుండే మొదలుపెడితే స్వాతంత్రోద్యమం లోనూ, సంస్కరణోద్యమాలలోనూ మహిళల భాగస్వామ్యం చెప్పుకో దగినది. నేటి స్థానిక ఉద్యమాలలో కూడా మహిళల పాత్ర చెప్పుకోదగినది. గత, ప్రస్తుత చారిత్రక ఉద్యమాలలో నయితే మహిళల విరోచితమైన త్యాగాల పాత్ర మరువలేనిది. దాదాపుగా అన్ని ఉద్యమాలలోనూ సామాజిక సమస్యలతో పాటు మహిళలు పితృస్వామ్య భావాలకు వ్యతిరేకంగా ముందు నుండే పోరాడుతూనే ఉన్నారు.

ఐతే, నేటి ఆధునిక సమాజంలో స్త్రీలు ఎదుర్కొంటున్న జటిలమైన సమస్యల్ని ఎలా అవగాహన చేసుకోవాలి? ఏ విధంగా పరిష్కరించు కోవాలన్నది నేటి యువత ముందున్న ప్రధాన సమస్య. నేడు మహిళలు ఉద్యోగ బాధ్యతలతో పాటు కుటుంబ బాధ్యతలను కూడా నిర్వర్తించవలసి వస్తోంది. గృహ హింసతో పాటుగా అన్ని రంగాలలోని మహిళల పట్ల పీడన, వివక్ష, లైంగిక వేధింపులు, హింస బాగా పెరిగిపోయాయి. వయోభేదం లేకుండా పసిపిల్లల దగ్గర నుండీ, వృద్ధ మహిళల దాకా అత్యాచారాలకు గురయ్యే ఒక రకమైన విష సంస్కృతి పెరిగిపోయింది. విస్తృతమవుతున్న సాంకేతిక పరిజ్ఞానం కొత్త కొత్త సమస్యల్ని మనముందుకు తెస్తోంది. వెర్రితలలు వేస్తున్న అందాల పోటీలు, స్త్రీని అంగడి సరుకుగా మారుస్తున్న వ్యాపార ప్రకటనలు, ఇవన్నీ యువతను పక్కదారి పట్టిస్తున్నాయి. స్త్రీని ఒక అంగడి ఆట బొమ్మగా చూసే సంస్కృతిని పెంచిపోషిస్తున్నాయి. పాలకులు చట్టాలు తెస్తున్నారు కానీ చిత్తశుద్ధి లేకపోవడం వలన బలహీనమవుతున్నాయి.

సహజంగానే స్త్రీల సమస్యలనగానే సున్నితమైనవిగా, మనోభావాల (సెంటిమెంట్) కు సంబంధించినవిగా అనిపిస్తుంటాయి. దీని వలన మనం స్త్రీల సమస్యల పరిష్కారానికి వర్గ దృష్టికోణం నుండి పక్కకు వెళ్లే అవకాశం ఎంతయినా ఉంది. వర్గ దృష్టికోణం నుండి కాకుండా స్త్రీ సమస్యలను చూడడమంటే పెట్టుబడిదారులకూ, సామ్రాజ్యవాదులకూ లాభాన్ని చేకూర్చడమే అవుతుంది. పితృస్వామ్య పురుషాధిక్య భావజాలం మహిళలందరి మీదా ఉన్నప్పటికీ పేద, అట్టడుగు వర్గాల మహిళలపై అదనంగా ఆర్థిక దోపిడీ, పీడన ఉన్నదన్న విషయం గమనించవలసింది. స్త్రీ, పురుషుల మధ్య ఉన్నది ముమ్మాటికి మిత్ర వైరుధ్యమేనన్న అంశాన్ని పరిగణనలోకి తీసుకుంటూ స్త్రీల సమస్యల్ని ఆయా కాలాలలోని చారిత్రక గతితార్కిక భౌతికవాద దృష్టికోణం నుండి చూడడమే కాకుండా వర్గ విశ్లేషణ చేసుకుంటూ పురుషునితో పాటు భుజం భుజం కలిపి ముందుకు సాగితేనే స్త్రీల సమస్యలకు మౌలిక పరిష్కారాన్నీ, సంపూర్ణ స్త్రీ విముక్తినీ సాధించగలుగుతాం.

*(రచయిత లెక్చరర్)* వీ

# మిషన్ కాకతీయలో రైతుల భాగస్వామ్యం ఎక్కడ?

***తరతరాలుగా చెరువులతో సంబంధాలు కలిగి ఉన్న ప్రజలతో చెరువుల పునరుద్ధరణ అంశాన్ని చర్చించకుండా, వారిని భాగస్వాములను చేయకుండా మిషన్ కాకతీయ కాంట్రాక్టర్ల చుట్టూ పరుగులు పెడుతోందని అంటున్నారు* ఆశాలత**

ఒకప్పుడు తెలంగాణ పల్లె జీవితం గొలుసు చెరువుల చుట్టూ తిరిగేది. చెరువు నిండితే పచ్చని పంటలు, చెరువు చుట్టూ పరుగులు పెట్టే లేగ దూడలు, నీటిలో మునిగి సేదదీరే బర్రెలు, చెరువుపై సందడి చేసే పక్షుల గుంపులు, చెరువులో పెరిగే చేపలు, ఒకవైపు బట్టలు ఉతుక్కునే స్త్రీలు, కేరింతలతో ఈతలు కొట్టే పిల్లలు, చెరువు మట్టిని పొలాల్లో వేసుకునే రైతులు, కుండలు చేయడానికి మట్టిని తీసుకెళ్లే కుమ్మర్లు. ఇట్లా సకల జీవాల బతుకుతెరువుకూ, వృత్తులకూ, సంస్కృతులకూ, పండగ పబ్బాలకూ, పెళ్లిళ్లకూ, చావులకూ ఆదరవు చెరువు. తెలంగాణలో ప్రతి ఊరికి చెరువు ఉంది, దానికో కథ ఉంది. రాను రాను చెరువులు ఎండిపోతుంటే, చెరువుశిఖం కబ్జా అవుతుంటే ఆ పల్లెల జీవితం ఎట్లా ధ్వంసవుతున్నదో అందరం చూస్తూనే ఉన్నాం. ఆ చెరువే ఎండిపోతే బతికే దారిలేక పల్లె జనం పట్టణాలకు వలస పోతున్నారు. పొలాలు బీడై, రైతులు కూలీలుగా మారుతున్నారు. నీలు లేక, పంటలు పండక అప్పులు తీరక ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. చెరువుల నిర్వహణ పట్ల పూర్తిగా నిర్లక్ష్యం వహించటం వల్ల ఆయకట్టుకు నీరు అందక పోవటమే కాదు భూగర్భ జలాలు ఇంకిపోయి రైతులు బోర్లు మళ్ళీ మళ్ళీ తవ్వటం వల్లనే అప్పులు పెరిగిపోయి తెలంగాణలో రైతుల ఆత్మహత్యలకు ఇది ఒక ప్రధాన కారణంగా మారింది.

చెరువుల విధ్వంసానికి కారణం ప్రభుత్వ విధానాలా? విధ్వంసక అభివృద్ధి నమూనాలా, చెరువులపై పెత్తందారుల ఆధిపత్యమా? చెరువుతో ప్రతినిత్యం సంబంధం కలిగి ఉండే శ్రామిక జనాలకు వాటిపై హక్కులు లేకపోవడమా, ఉమ్మడిగా కాపాడుకోవలసిన నీటి వనరులు ప్రైవేటు ఆస్తులుగా మరిపోవడమా? అన్న మౌలిక అంశాలపై చర్చ విస్తృతంగా జరగవలసిందే.

సాగు నీటి చెరువులు తవ్వడంలో కాకతీయ రాజులు తమకు ఎవరూ సాటి లేరని చాటి చెప్పుకున్నారు. రాజులు ప్రజల సొమ్మును దోచుకుని తిరుగులేని అధికారాన్ని చెలాయించడమే కాదు. నిజంగా వారు తలచుకుంటే దేశాన్ని సుభిక్షం చేసి ప్రజలకు మేలుకూడా చేయవచ్చునని కాకతీయులు నిరూపించారు. నాటి పాలకులను ఆదర్శంగా తీసుకుని నేటి పాలకులు ప్రతిష్మాత్మకంగా చేపట్టిన 'మిషన్ కాకతీయ' అనబడే చిన్న నీటి వనరుల పునరుద్ధరణ ప్రస్తుతానికి మాత్రం ఇదేళ్లలో 45000 చెరువులు, 20 వేల కోట్ల రూపాయలు, టెండర్లు, ఇంజినీర్లు, కాంట్రాక్టులు, జెసిబిలు అనే పరిభాషను మించడం లేదు. మొదటగా ఆక్రమణకు గురైన చెరువు శిఖం భూములను వెలికి తీయకుండా, వాటిలో కట్టిన అక్రమ కట్టడాలను కూలగొట్టకుండా చెరువుల పునరుద్ధరణ గురించి మాట్లాడడంలో అర్థం లేదు.

కొన్ని వేల సంవత్సరాలుగా గ్రామంలోని నీరడి వాళ్లు, రైతులు, మహిళలు, మత్స్యకారులతో పాటు అందరికి చెరువులతో సంబంధం ఉంది. వీరికి చెరువుల గురించి అపారమైన జ్ఞానం ఉంది. చెరువులను కాపాడుకోవాలనే శ్రద్ధ ఉంది. ఏ చెరువు నిండితే ఏ కాలువ ద్వారా కింది పొలంలోకి నీళ్లు ఎట్లా వస్తాయో, చెరువు నిండుగా నీటితో కళకళలాడాలంటే తూములను, కాలువలను ఎప్పుడు ఎట్లా మరమ్మత్తు చేయించాలో వారికి తెలుసు.

ఊరి చెరువుతో మహిళలకు ఉన్న అనుబంధం మరింత ఎక్కువ. చెరువు నిండుగా ఉంటే, ఊరందరికీ చేతినిండా పనే. ఆయకట్టు భూములలో మగవాళ్లు దున్నితే ఆ వెనుక విత్తనాలు వేసిన దగ్గర నుండి పంట చేతికి వచ్చే దాక ఆ పంట చేనులో రోజూ నడుమువంచి పనిచేసేది మహిళలే. బతుకమ్మలకు, బోనాలకు చెరువులో నీళ్లులేనిదే జరగదు. చెరువు ఎండిపోతే ఇంటిల్లిపాదికీ కష్టమే. ఊరందరికీ నష్టమే. అందుకే ఆ చెరువును బతికించమని, చెరువునిండా నీళ్లుండేలా చూడమని కోరుకునేది ముందుగా మహిళలే.

అయితే ప్రస్తుతం జరుగుతున్న మిషన్ కాకతీయ పనులు, ప్రణాళికలు ఊరి ప్రజల అనుభవాన్ని తీసుకోవడం కానీ, సంప్రదాయకంగా చెరువుల బాగోగులను చూసుకుంటున్న నీరడివాళ్లను కానీ, గ్రామంలోని రైతులను, మహిళలను, యువకులను ఈ పనిలో భాగస్వాములను చేయడం కానీ ఎక్కడా కనపడడం లేదు. చాలా గ్రామాలలో ఆఖరికి గ్రామ సర్పంచ్‌లకు, జిల్లా పరిషత్ సభ్యులకు కూడా చెరువు కమిటీలలో కలుపుకోవడం లేదని వాపోతున్నారు. వాళ్లు మహిళలైతే అసలు వివరాలు కూడా తెలియ చేయడం లేదు. ఏ ఊరికి ఎంత నిధి మంజూరు అయింది, పనులు ఎవరు, ఎప్పుడు మొదలుపెడతారో అనేది డబ్బున్న కొద్ది మంది అగ్రకులాల మగవాళ్లకు మాత్రమే తెలిసిన రహస్యంగా మారింది.

ఊరి చెరువును బాగు చేసుకోవడానికి ఊరిలో చెరువుతో సంబంధం ఉన్న వారందరు, రైతులు, పశుపెంపకందార్లు, మత్స్యకారులు, మహిళలు కలిసి రోజుల తరబడి చర్చించి, సాంకేతిక విషయాలను అర్థం చేసుకుని, ప్రణాళిక వేసుకుని చెరువుకు కలసికట్టుగా ప్రాణం పోసుకున్న ఉదాహరణలు తెలంగాణలోనే ఎన్నో ఉన్నాయి. చెరువుల పునరుద్ధరణ ప్రజల భాగస్వామ్యంతో, జవాబుదారీతనంతో, అక్రమాలు జరిగితే ఎండగట్టే అప్రమత్తతో జరగకపోతే, గ్రామ ప్రజలను కూలీలుగా మాత్రమే చేసి, కాంట్రాక్టర్లు కమిషన్లు చెల్లించి డబ్బులు దండుకునే పరిస్థితి మాత్రమే మిగులుతుంది. అలా జరగకుండా ఉండాలంటే పౌర సమాజం కూడా కొంత బాధ్యతను భుజాలపై వేసుకోవాలి. ప్రజాసంఘాలు, ప్రజలను సంఘటిత పరచి గ్రామీణ ప్రాంతాలలో పనిచేస్తున్న వేదికలు, హక్కుల సంఘాలు కొన్ని గ్రామాలలోనైనా చెరువు పునరుద్ధరణ పనులు జరిగే తీరును గ్రామా ప్రజల సహకారంతో సామజిక తనిఖీ చేయడానికి పూనుకోవాలి.

*(రచయిత సామాజిక కార్యకర్త)* వీ

# హిజ్రా సమస్య - 2

*హిజ్రా సమస్యకు ఉన్న వ్యక్తిగత మానసిక, శారీరక, సామాజిక కోణాలను చర్చిస్తూ పరిష్కారాలు సూచిస్తున్నారు*

**రంగనాయకమ్మ**

*(గత సంచిక తరువాయి)*

హిజ్రాలుగా తిరిగే అందరూ ఆడ రకం మార్పుల కోసం రక రకాల వైద్యాలు చేయించుకోరు. అందరికీ అది సాధ్యం కాదు. వాళ్ళు చేయగలిగేవి, ఆడ బట్టలూ, జుట్టు పెంపకాలూ, మొహాలకు రంగులు పూసుకునే ముస్తాబులూ, సెంట్ల పూతలూ, వంటి మార్పులే. ఏ మార్పు కోసమైనా వైద్యం చేయించుకుంటే, ఆ మార్పు జరగడం గ్యారంటీ కాదు. జరగవచ్చు, జరగక పోవచ్చు.

'అసలు, మగ వాడిగా పుట్టిన వాడికి, ఆడగా మారాలనే కోరిక కలగడానికి, శారీరకమైన కారణం ఏదైనా ఉంటుందా?' అనేది తెలుసుకోవాలనే ఆసక్తితోనే నేను చాలా వ్యాసాలు చదివాను. అదే నేను డాక్టర్లని అడిగాను మొదట.

**డాక్టరు ఇందిర చెప్పిన కారణం**

'మగ శిశువు ఏర్పడడానికి ఎక్స్, వైలు అనీ, ఆడ శిశువుకి అయితే ఎక్స్, ఎక్స్‌లు అనీ, తెలుసుకుంటాం. వై ఉన్న చోట ఎక్స్ ఒక్కటే గాక రెండు ఎక్స్ లు కలిస్తే, అంటే ఎక్స్, ఎక్స్, వైలు కలిస్తే, ఆ శరీరంలో ఒక తేడా జరగవచ్చు. వై ఉన్నచోట తప్పనిసరిగా మగశిశువే ఏర్పడుతుంది. కానీ, వైతో పాటు ఎక్స్‌లు రెండు ఉండడం వల్ల, ఆ మగ మనిషికి ఆడ లక్షణాలు ఏర్పడవచ్చు' అన్నారు.

'ఆడ లక్షణాలు' అంటే, మీసాలు రాక పోవడం, రొమ్ములు పెరగడం, ఆడ కంఠ స్వరం రావడం – వంటి లక్షణాలు. కానీ, ఆ లక్షణాలేవీ మగ శరీరంలో ఎక్కడా సహజంగా జరగడం లేదు. ఆ మగ పిల్లవాడు చిన్నతనం నుంచీ ఏ ఆడవాళ్ళని చూస్తాడో, ఆ ఆడ రకంగా ప్రవర్తించాలని అనిపించడమే, అది మాత్రమే ఆడ లక్షణంగా ఉంటుంది. దొరై స్వామి పెద్ద వాడైనా కూడా అతని శరీరంలో ఏ ఆడ లక్షణమూ లేదు. 'ఆడ'గా ఉండాలని మనసుకి అనిపించడమే అదంతా. తర్వాత కొన్ని వైద్యాల వెంట పడ్డాడు.

ఇందిర, నేను అడిగిన ప్రశ్నల్లో, 'నపుంసకత్వం' వంటి సమస్యలతో ప్రారంభించి, ఎక్కడ ఏ సందేహం వస్తే అవన్నీ అడిగాను. ఆవిడ శ్రద్ధగా చెప్పారు.

**డాక్టరు:** 'నపుంసకత్వం ఉన్నట్టయితే, చాలా చిన్న తనం నుంచీ పిల్లవాడి అంగంలో అది పెద్ద వాళ్ళకు తెలుస్తుంది. కానీ అది లోపంగా ఉన్నట్టు చిన్న పిల్లలకి తెలియదు. ఆ మగ మనిషి, పెద్దవుతూ ఆ లోపాన్ని గ్రహించుకోవచ్చు. ఆ లోపం ఉండడం వల్లే ఆడ ఫీలింగ్స్ ఉంటాయని కాదు. అది ఒక లోపం మాత్రమే. దానికి వైద్యం ఉంటుంది కూడా. ఎక్స్, ఎక్స్, వై లతో వచ్చే ఆడ ఫీలింగ్స్ నిజంగా ఉంటే, దాని వల్ల నపుంసకత్వం ఉంటుందని కాదు. ఉండవచ్చు, ఉండక పోవచ్చు. ఎక్స్, ఎక్స్, వై రకమూ, నపుంసకత్వమూ, రెండూ కలిసి ఉన్న కేసులూ ఉంటాయి; కలిసి లేని కేసులూ ఉంటాయి.'

డాక్టరు ఇందిర, 'కావచ్చు, అలా ఉండవచ్చు, అలా అనిపించవచ్చు' అని చెప్పారేగానీ, దేన్నీ కూడా 'గ్యారంటీ' అని చెప్పలేదు. పైగా, ఆ డాక్టరు చాలా స్పష్టంగా చెప్పిన విషయం, 'ఎక్స్, ఎక్స్, వై లు కలవడం, అతి అరుదుగా జరిగే విషయం' అని. అంటే, హిజ్రాలుగా తిరిగే ప్రతీ వ్యక్తీ, ఎక్స్, ఎక్స్ వై లు కలవడం వల్లే అలా తయారయ్యారని చెప్పడానికి లేదు – అని అర్థం.

ఇందిర, 'జీన్స్ డిజార్డర్' విషయం కూడా చెప్పారు. 'కానీ, అందులో కూడా స్పష్టమైన పరిశోధనలు ఇంకా లేవు. హిజ్రాగా కనపడే ప్రతీ మనిషీ, జీన్స్ డిజార్డర్ వల్లో, హార్మోన్స్ డిజార్డర్ వల్లో, అలా తయారైనట్టు నిర్ధారించలేం' అన్నారు.

నేను, 'నపుంసకత్వాన్ని అర్థం చేసుకున్న మగ మనిషి, ఆ విరక్తితో, ఆ అంగాన్ని తీసి పారేసి, ఆడదానిగా మారవచ్చని భావిస్తాడా?' అని అడిగాను.

'ఆ వ్యక్తిని పరీక్ష చేసి, ఇంటర్‌వ్యూ చేస్తేనే, ఆ వ్యక్తి నిజం చెపితేనే, అది తెలుస్తుంది' అన్నారు డాక్టరు. ఆవిడ ఇంకా చెప్పారు. 'హిజ్రా లుగా అయిన వాళ్ళలో కొందరు, పేదతనం వల్ల, సెక్స్ వృత్తితో బతకవచ్చని అలా తయారై ఉండవచ్చనే అర్థం కూడా కనపడుతోంది. పిల్లల్ని ఎత్తుకుపోయి వాళ్ళతో వ్యభిచారం చేయించే అనేక కేసుల్ని చూస్తున్నాం. హిజ్రా సమస్యలో కూడా కొన్ని మోసాలు ఉంటాయి. పూర్వం రాజుల కాలంలో, ఆ రాజులు పేద మగవాళ్ళని నపుంసకులుగా మార్పించేసి, వాళ్ళని అంతఃపురాల్లో కాపలాదారులుగా ఉంచేవారని చదివాం. అదే, క్రమంగా ఇలా కూడా తయారై ఉండొచ్చు' అంటూ అలాంటి విషయాలే కొన్ని చెప్పారు.

నేను, 'హిజ్రాలుగా తిరిగే వాళ్ళల్లో మోసం లేని కేసునే తీసుకుందాం. ఎక్స్, ఎక్స్, వైల వల్ల ఏర్పడిన మగ శిశువునే తీసుకుందాం. అతడు పుట్టినప్పుడు మగపిల్లవాడే. ఆపరేషన్ కోసం డాక్టర్ దగ్గరికి వచ్చినప్పుడు, 'ఆపరేషన్ తప్పు' అనీ, ఆ తర్వాత 'వ్యభిచారం మరీ నీచం' అనీ, డాక్టర్లు ఆ పేషెంట్‌కి బోధించలేరా? ఆ కుర్రవాణ్ణి అలా మార్చలేరా?' అని అడిగాను.

'అదే జరగాలి. అది జరగకే ఇది జరుగుతోంది. ఆపరేషన్ల కోసం వాళ్ళందరూ డాక్టర్ల దగ్గరికి రారు కదా? ఆ హిజ్రాల్లోనే పెద్దవాళ్ళు చేసేస్తారు చాలా సార్లు' అన్నారు ఇందిర.

నేను, 'మగ పిల్లవాడికి 'ఆడ' గా అవ్వాలని కోరిక కలిగినట్టు, ఆడ పిల్లకి మగవాడిగా అవ్వాలని కోరిక కలగదా? మగ శరీరంలో ఏదో తేడా అయినట్టు, ఆడ శరీరంలో కూడా ఏదైనా తేడా జరగదా?' అన్నాను.

**డాక్టరు:** 'ఆడ శిశువుకి రెండు ఎక్స్‌లతో పాటు మూడో ఎక్స్ కూడా జత పడితే, దాని వల్ల ఆడ లక్షణాలే పెరగాలి గానీ, మగ లక్షణాలు రావు కదా? ఎక్స్ లతో పాటు వై కూడా కలిస్తే గానీ మగ లక్షణాలు రావు. వై కూడా ఉంటే, ఆ శిశువు తప్పనిసరిగా మగ శిశువుగానే పుడుతుంది. వై లేకుండా ఎక్స్‌ల తోనే పుట్టిన ఆడపిల్లకి, శరీరంలో వై లేనప్పుడు, మగవాడిగా మారాలనే కోరిక ఎలా పుడుతుంది?' – అలా చెప్పిన డాక్టరు

ఇందిర, ఒక వింత విషయం కూడా చెప్పారు. అమెరికాలో కొందరు ఆడపిల్లలు, మగ వాళ్ళుగా మారాలని అనుకోవడం కూడా జరుగుతోందన్నారు. 'ఆ ఆడపిల్లలు క్రాపులు చేసుకుని దాదాపు మగ బట్టలు లాంటివి వేసుకుంటూనే ఉంటారు. అయినా ఆ మార్పులతో సంతృప్తి పడరు. పూర్తిగా మగ వాడిగా అయి పోవాలనుకుంటారు. కానీ, వాళ్ళకి పురుషాంగం ఎలా వస్తుంది? అది రాదు గానీ, లూప్రాన్ ఇంజక్షన్లు అప్పుడప్పుడూ తీసుకుంటూ ఉంటే, కొన్ని మార్పులు జరగవచ్చు. ఆడపిల్లకి బహిష్టులు ఆగిపోవడం, రొమ్ములు అణిగిపోవడం, గడ్డాలూ మీసాలూ మొలుచుకు రావడం – వంటి మార్పులు జరిగి, ఆ ఆడవాళ్ళకి, మగ వాళ్ళు అయినట్టు అనిపించవచ్చు' అన్నారు.

**నేను:** 'ఒకటి చెప్పండి! మగవాడికి ఆడ దానిగా అవ్వాలనే కోరిక పుట్టడానికి 'ఎక్స్, ఎక్స్, వై కలవడం' అనే కారణం చెప్పారు. ఆడవాళ్ళకి, మగవాళ్ళుగా అవ్వాలనే కోరిక కలగడానికి అటువంటి శారీరక లక్షణం ఏదీ ఉండదు కదా? అలాంటప్పుడు ఆ మార్పుకి ఏ సైన్సు కారణం ఉందనుకోవాలి?'

**డాక్టరు:** 'కొన్ని విషయాలు ఇంకా 'అన్ నోన్'. ఇంకా తెలియనివే. ఇంకా పరిశోధనలు జరగవలసి ఉంటుంది. తర్వాత ఏదైనా బయట పడుతుందేమో అనుకోవడం తప్ప ఇప్పుడేం అనుకోగలం?'

**నేను:** 'ఇప్పుడు అనుకోవలిసింది, బూర్జువాలకు లూప్రాన్ ఇంజెక్షన్ల వ్యాపారం బాగా దొరికిందని. అసలు ఆ లూప్రాన్ ఇంజెక్షన్లు, రెండు అంగాలతో పుట్టిన పిల్లల్ని మగవాడిగా మలచడానికి అవసరం కావచ్చు నేమో కదా? అటువంటి తప్పనిసరి వైద్యానికి అవి అవసరం కావచ్చు. అలాంటి ఇంజెక్షన్లని ఆడవాళ్ళకి ఇవ్వడం అంటే, ఆ సరుకుని ఎక్కువగా అమ్మడం కోసమే కాదా?'

**డాక్టరు:** 'అప్పుడే అలా అనుకోలేం. ఆడవాళ్ళ కోరికలో ఏదైనా కారణం ఉందో లేదో తేలాలి కదా? కానీ, ఆడపిల్ల మగవాడిగా మారడం అంటే, ఎలాగా పురుషాంగం రాదు. అది లేనప్పుడు, మగవాడు అవ్వ గలిగేది ఏముంటుంది? నా ప్రాక్టీస్ అది కాదు. ఆ కేసులు వివరంగా నాకు తెలియవు.'

**నేను:** 'ఆడ లక్షణాల్ని తీసివేసే ఆ లూప్రాన్ ఇంజెక్షన్లని దొరై స్వామి లాంటి కుర్రాడికి ఇస్తే, అతనిలో ఆడ ఫీలింగ్స్ని తీసివేసి, అతన్ని పూర్తి మగవాడిగా దిద్దడానికి అవి సరిపోవా? ఒక్కటి చెప్పండి! ఒకళ్ళ కిడ్నీ తీసి ఒకళ్ళకి పెడుతున్నారు కదా? అలాగే, మగవాడు కోయించుకునే పురుషాంగాన్ని, మగవాడిగా మారాలనుకునే ఆడపిల్లకి అతికించ వచ్చా? ఇంత గొప్ప సరుకుల వ్యాపారం గురించి బూర్జువా కంపెనీలు ఇంత వరకూ ఆలోచించడం లేదా?'

ఇందిర నవ్వారు. ఆవిడ, ఆ తర్వాత ఎండోక్రైనాలజిస్ట్తో కూడా మాట్లాడి ఆ విషయాలన్నీ కూడా చెప్పారు. 'ఎండోక్రైనాలజీ' అంటే, హార్మోన్లని స్రవించే గ్రంథుల సముదాయాన్ని చెప్పే శాస్త్రం. ఇన్సులిన్, థైరాక్సిన్ వంటి కొన్ని ద్రవాలే హార్మోన్లు' అని చెప్పారు. 'టెస్టిక్యులర్ ఫెమినైజేషన్ సిండ్రోమ్' అనే పొడుగైన విషయం కూడా చెప్పారు. 'టెస్టికల్స్' అంటే, పురుషాంగంలో ఒక భాగం. 'సిండ్రోమ్' అంటే, 'ఒక స్థితికి గానీ, ఒక జబ్బుకి గానీ, సంబంధించిన లక్షణాల మొత్తం. 'ఆడ గా మారాలనే కోరికతో ఉన్న మగ వ్యక్తికి మగ హార్మోన్లు ఇచ్చి, ఆడ ఫీలింగ్స్ తగ్గించవచ్చు' అన్నారు.

**నేను:** 'అటువంటి వైద్యమే ఉంటే, అంగాన్ని కోయించేసుకోవడం, వ్యభిచారం, అడుక్కోవడం, అవన్నీ ఎందుకు? అసలు, ఒక మనిషిలో ఎక్స్ వై ఉందా, ఎక్స్ ఎక్స్ ఉందా, ఎక్స్ ఎక్స్ వై ఉందా – అనేది తెలుసుకోవడం సాధ్యమేనా? ఆ పరీక్షలు ఉన్నాయా?'

డాక్టరు, 'జెనెటిక్ క్లైయిన్ ఫిల్టర్ – అంటే అదే. దాని వల్ల ఆ పుటక విషయాలు తెలుస్తాయి' అన్నారు.

నేను, 'పుటకలో ఒక తేడా జరిగి 'అంధత్వం' ఏర్పడితే, దానికి వైద్యం ఉంటుంది కదా? అలాగే, ఎక్స్ ఎక్స్ వైల పుటక వల్ల ఒక తేడా ఏర్పడితే, దానికి సరైన వైద్యం ఉండదా?' అన్నాను.

డాక్టర్ ఇందిర, ఇంకో కారణం కూడా చెప్పారు, 'ట్రాన్స్ లొకేషన్ ఆఫ్ జీన్స్' అని. 'ఇది ఎక్స్ ఎక్స్ వై ల సమస్య కాదు. ఎక్స్ ఎక్స్ ఎక్స్ లు కాని వాళ్ళలో ఎవరికైనా జీన్స్లో ఎక్కడో ఏదో తేడా జరిగి ఉండాలి – అని అర్థం. కానీ, ఇవన్నీ చాలా చాలా అరుదైన విషయాలు. దీన్ని స్పష్టంగా గ్రహించే పరిశోధనలు ఇంకా లేవు' అన్నారు.

**నేను:** 'వైద్య శాస్త్రానికే ఇంకా అందని విషయాల్ని 'అన్నోన్' అంటారు. తెలియని ప్రతీదాన్నీ ప్రకృతి సైన్సు విషయంగానే తీసుకోవాలా? 'సమాజ సైన్సు' నుంచి పుట్టుకొచ్చే కారణాలేమీ ఉండవా?'

ఇందిర కూడా చాలా విషయాల్లో, 'మానవ జీవితాల్లో మానవ సమాజ పరిస్థితుల పాత్ర చాలా ఉంటుంది' అన్నారు. కానీ నేను మొదట ఎక్కువగా అడిగినవి ప్రకృతి సైన్సు విషయాలే కాబట్టి ప్రధానంగా అవే చెప్పారు.

'హిజ్రా ఆపరేషన్ అమెరికాలో చట్టబద్ధమేనా?' అని అడిగితే, 'చట్ట బద్ధమే అని చెప్పే చట్టాలేం లేవు. అంటే, అవి 'చట్ట విరుద్ధం' కాదు. చట్టవిరుద్ధం కాదు కాబట్టి, డాక్టర్లు, ఆ ఆపరే షన్లు చేయవచ్చు, ఎవరైనా చేయించుకోవచ్చు. కానీ, దానికి అయ్యే ఖర్చుని ఇన్సూరెన్స్ కంపెనీ భరించదు. సొంతంగా పెట్టుకోవలిసిందే' అన్నారు.

'హిజ్రా' అనే మాట, పురుషాంగాన్ని తీసి వేయించుకున్న వాళ్ళ (క్యాస్ట్రేటెడ్ మెన్) గురించే గానీ, మిగతా రకాల వాళ్ళకి కాదు.

మగ మనిషి ఆడ బట్టలు వేసుకోగానే స్త్రీ అయిపోవడం ఎంత అబద్ధమో, పురుషాంగాన్ని తీయించేసుకోవడం వల్ల స్త్రీ అయిపోవడం కూడా అంత అబద్ధమే. ఎలాగంటే, ఆపరేషన్ జరిగి పురుషాంగం పోయినా, ఆ శరీరంలో ఇతర మగ లక్షణాలేవీ మారవు. మగ కంఠ స్వరం మారదు. రొమ్ములు పెరగవు. గర్భకోశం రాదు. గడ్డాలూ మీసాలూ పెరగడం ఆగదు. అవన్నీ 'ఆడ'గా జరగాలంటే, ప్రతీ దానికీ బూర్జువా మందులూ, బూర్జువా వైద్యాలూ ఉన్నాయి. కానీ అవి కూడా 'గ్యారంటీ' గా జరగవు. ఎటొచ్చీ, ఆ ఆపరేషన్ల తర్వాత గానీ, ముందు నుంచే గానీ, జుట్లు పెంచుకోడం, నగలూ, ఆడ బట్టలూ, దూదిఉండల రొమ్ములూ, ఇవే హిజ్రాలు చేసుకోగలరు. ఈ మార్పులతో మాత్రమే వాళ్ళకి ఆడతనం రావాలి. ఆ మనిషికి, మనసులో స్త్రీ లక్షణాలు ఉండ వచ్చుగానీ, పురుషాంగాన్ని తీసివేయడం జరిగితే, దాని వల్లే ఆ శరీరంలో స్త్రీ లక్షణాలు సహజంగా ఏర్పడవు. ఈ విషయం రేవతి ద్వారా తెలిసే ఉదాహరణలు ఉన్నాయి ఆమె పుస్తకంలో.

దొరైస్వామి, ఆపరేషన్ చేయించుకుని చీర కట్టుకుని, వాలు జడ వేసుకుని, ఇంటికి మొదటి సారి వచ్చినప్పుడు, ఒక అన్న అతన్ని కొట్ట బోయాడు. అప్పుడు దొరై స్వామి 'ఇప్పుడు నేను ఆడదాన్ని. నన్ను కొట్టకు. కావాలంటే నేను ఆడ దాన్నో కాదో చూడు' అంటూ చీర ఎత్తేశాడు అన్న ముందు. ఆ మనిషిలో నిజంగా ఆడ లక్షణం వచ్చి ఉంటే, అలా చేసేది కాదు. ఒక మగవాడికి, ఇంకో మగవాడు తన దిసమొల చూపించడానికి అంతగా సంకోచం ఉండదు. దొరై స్వామి చిన్నతనం నుంచీ పొంగి పొర్లే స్త్రీత్వంతో ఉన్న వాడైతే, స్త్రీగా మారిపోయానని నమ్మిన వాడైతే, అన్నకి అలా చీర ఎత్తి చూపించలేడు.

ఇంకో సంఘటన కూడా ఉంది. నడి రోడ్డు మీద రేవతి ఒక చోట ఉంటే, దూరంగా మగవాళ్ళు ఆమె గురించి వెకిలిగా 'దొరై స్వామికి రొమ్ములు ఉన్నాయా' అని మాట్లాడుకుంటూ ఉంటారు. అప్పుడు రేవతి కోపంగా, వాళ్ళ మీద పోరాటం చేసినట్టు, 'ఉన్నాయో లేవో మీకు చూపించాలా?' అని అరిచింది. ఆమె ఆడతనం, తెచ్చి పెట్టుకున్న ఆడతనం కాబట్టే, నడివీధిలో తన రొమ్ములు చూపిస్తానని అరవగలిగింది.

హిజ్రాలు, వీధుల్లో అడుక్కోవడానికి తిరిగేటప్పుడు కూడా మగ వాళ్లని కావిలించినంతగా ముట్టుకుంటారు. మగవాళ్ల భుజాల మీదా చెంపల మీదా వీపుల మీదా చరుపులేస్తూ సరసాలాడి విసిగించి డబ్బు సంపాదిస్తేగానీ కదలరు. వీళ్లు మగవాళ్లే కాబట్టి, ఇతర మగవాళ్లని ముట్టుకోడానికి జంకు లేకుండా ప్రవర్తిస్తారు. హిజ్రాల్లో మగతనమే, మగ ప్రవర్తనే గానీ, ఆడతనం కనపడదని హిజ్రాల్ని చూసే అనేక మంది అంటారు.

ఒకావిడ, తను కళ్లారా కొన్ని సార్లు చూసిన ఒక సంగతి చెప్పింది. ఒక సారి ఆవిడ ఒక చిన్న కూరల బండి దగ్గర పళ్లు కొంటున్నప్పుడు నలుగురు హిజ్రాలు వచ్చారు. బండి అతన్ని పళ్లు ఇమ్మని అడిగారు. 'మొన్న ఇచ్చాను, ఎన్ని సార్లు ఇవ్వగలను?' అన్నాడు బండి మనిషి. అది తగువుగా మారింది. 'ఎందుకివ్వవు? చూడు, మేం ఆడవాళ్లం' అంటూ ఇద్దరు హిజ్రాలు చీరలెత్తేశారు అతని ముందు. బండి మనిషి రెండు కమలా పళ్లు దూరంగా విసిరేశాడు. వాళ్లు అవి తీసుకుని కదిలారు. నాకు చెప్పిన ఆవిడ 'నేను అక్కడ ఉన్నా కూడా వాళ్లు అలా చేశారు. ఇంతకు ముందు కూడా వాళ్లు అలా చేయడం చూశాను. దౌర్జన్యంగా అడుక్కునే ఎత్తుగడ వాళ్లకి' అంది.

షాపుల్లో అడుక్కోవడానికి వెళ్లినప్పుడు, హిజ్రాల చప్పట్లకీ, వాళ్ల సరసాలకీ, షాపుల యజమానులు విసిగిపోయి, 'ఇంత మంది గుంపుగా రావద్దు. ఎవరో ఒక్కళ్లు వచ్చి అడగండి. డబ్బు ఇస్తాను' అని షాపుల వాళ్లు అంటారని రేవతి రాసింది. ఈ ఆడ – మగవాళ్లు అల్లరి చేస్తూ, సరసాలాడుతూ, వీధుల్లో విచ్చల విడిగా తిరుగుతూ అడుక్కుంటారు. అందులో ఆడ వాళ్ల ప్రవర్తన కన్నా మగవాళ్ల సిగ్గు పడని చొరవ ప్రవర్తనే అధికంగా ఉంటుంది. రోడ్ల మీద ఎందరో పేద ఆడవాళ్లు కూడా అడుక్కుంటూనే ఉంటారు కదా? కానీ వాళ్లు సిగ్గులు వొదిలేసి ఎగురుతూ అడుక్కుంటారా? వాళ్లు ఎప్పుడైనా చీరలెత్తేసి అడుక్కుంటారా? హిజ్రాల ప్రవర్తనలు, ఆడ ప్రవర్తనలుగా ఉండవు. మగవాళ్ల రకంగానే ఉంటాయి. వాళ్లకి ఆడ లక్షణాలు అలవడవనే అర్థం వస్తుంది – అంటారు కొందరు.

రేవతి అయితే, వీధిలో రొమ్ములు చూపిస్తానని అరిచి ఊరుకుంది గానీ, ఇప్పటి బూర్జువా నాగరికత బలిసిన నిజం ఆడవాళ్లు (సినిమా తారలూ, టివి యాంకర్లేకాదు, కుటుంబ తారలు కూడా) గుడ్డలు ఇప్పేసుకుని, రొమ్ములు బాహాటంగా ప్రదర్శిస్తూనే వీధుల్లో తిరుగుతున్నారు. మరి, వీళ్లని స్త్రీలు కారనీ, మగ లక్షణాల వల్లే అలా చేస్తున్నారనీ, అంటామా? అలా అనడానికి వీలవదు. ఈ అచ్చంగా స్త్రీ లైన వాళ్లకి 'మగలక్షణం' అనే కారణం వర్తించదు. అయినా, ఈ నాగరిక స్త్రీల ఆడతనం మీద కూడా 'వీళ్లెందుకిలా ఉంటున్నారు?' – అనే ప్రశ్నలు వస్తాయి. కానీ, ఇప్పటి రకం ఆడతనం, బూర్జువా ఆడ తనం. బూర్జువా సమాజపు ఆడతనం ఇలాగే ఉంటుంది.

ఇది, ఇంతకు ముందు కాలంలోనే సినిమాల ద్వారా ప్రారంభమై, ఇప్పుడు బూర్జువా ఫేషన్ బట్టల ద్వారా ఇంకా పెరిగింది. ఇప్పటి బూర్జువా బట్టల కంపెనీలు తయారుచేసే ఆడ వాళ్ల బట్టలు, ఆడ వాళ్ల శరీరం మొత్తాన్ని నగ్నంగా చూపించగలిగే టెక్నిక్కులతో తయారవుతు న్నాయి. ఒకప్పటి స్వతంత్ర పోరాటం రోజుల్లో 'విదేశీ బట్టల్ని వీధుల్లో కుప్పబెట్టి తగలబెట్టేవారు కదా? అలాగే, బూర్జువా ఫేషన్ల బట్టల సరుకుల్ని వీధుల్లో బ్రహ్మాండమైన రాసులుగా పోసి తగలబెట్టే కాలం రావాలి. ఈ బూర్జువా నాగరికతలో మునిగి తేలుతోన్న ఆడవాళ్లు, చంకల్నీ, రొమ్ముల్నీ, తొడల్నీ అన్ని పక్కలా ప్రదర్శిస్తున్నారు గానీ, చిట్టచివరి రహస్య అంగాన్ని కూడా పూర్తిగా బయట పెట్టడానికి ఇంకా తెగించడం లేదు. ఇక త్వరలో జరగబోయేది అదే. ఎవరు ఎంత నగ్నంగా తిరగడానికైనా హక్కులు ఉంటాయని కొత్త చట్టాలు కూడా చేస్తారు. ఆ చట్టాల కోసం బూర్జువా స్త్రీ వాదులు పోరాటాలు చేస్తారు. 'మా శరీరం మా ఇష్టం. నగ్నంగా తిరిగే హక్కు మాకు కావాలి' అంటారు. కొన్ని సంవత్సరాల కిందట ఒక ఫెమినిస్టు సంఘం స్త్రీ, 'స్త్రీలు నగ్నంగా తిరగాలనుకుంటే తిరిగే స్వేచ్ఛ కావాలి' అని నాకు 'స్వేచ్ఛ'కి అర్థం చెప్పింది. ఇక అది కూడా జరగవచ్చు త్వరలో.

కొడుకు వీర్యంతో ఎక్కడో తయారైన పిండాన్ని తల్లి కడుపులో పెట్టి, తొమ్మిది నెలల తర్వాత బిడ్డని బయటికి తీస్తే, 'నాయనమ్మే, తల్లి అయింది' అని బూర్జువా పత్రికలు బాజాలతో రాయడం లేదూ? అలాగే, నగ్నత్వం చట్టాలు వచ్చాక, 'బట్టలు కొనుక్కునే ఖర్చు తప్పిపోయిందిగా' అని ఆ పత్రి కలు రాస్తాయి. ఇలాంటివన్నీ శరీరాల్లో మార్పులు కావు, సంఘంలో జరిగే మార్పులు.

దొరెస్వామి లాంటి మగ పిల్లల ప్రవర్తనల్లో జరిగేది పూర్తిగా శరీర లక్షణాల వల్ల ఏర్పడే మార్పు మాత్రమే కాదు. అందులో చాలా భాగం సంఘ పరిస్థితుల వల్ల ఏర్పడే మార్పు కూడా ఉంటుంది. కొందరి విషయంలో సంఘ పరిస్థితుల ప్రభావమే పూర్తిగా ఉంటుంది. పిల్లలకి ఇంటా బయటా మగవాళ్ల దగ్గర ఎక్కువ ముస్తాబులు కనపడవు. ఆడ వాళ్ల దగ్గిరే రకరకాల ముస్తాబులు కనపడతాయి. పెళ్లిళ్లలోనూ పండ గల రోజుల్లోనూ, ఆ ముస్తాబులు పదిరెట్లు పెరుగుతాయి కూడా. నగలు దొరకని పేద ఆడ పిల్లలకు కూడా నగల మీద ఆశా, పట్టు పరికిణీల మీద ఆశా, పట్టుకుంటాయి. ఆడా – మొగా తేడా తెలియని చిన్న వయసు మగపిల్లలకు కూడా పూల బట్టల మీదా, నగల మీదా, ముస్తాబుల మీదా, ఆసక్తి పుడుతుంది. ప్రతీ మగపిల్ల వాడికీ ఆడ ముస్తాబు కావాలని అనిపించకపోయినా, కొందరికైనా ఎదురుగా చూసేదాన్ని బట్టే అలా అనిపిస్తుంది. ఆ అనిపించడంలో ఎక్కువ తక్కువ స్థాయిలు ఉండవచ్చు. అంటే, మగపిల్లవాడికి ఆడపిల్లగా మారాలనే కోరికలో, ఆ శరీర లక్షణాల్లో తేడాలతో పాటు, సాంఘిక పరిస్థితుల ప్రభావం కూడా జత పడవచ్చు. లేదా, ఒక్కో కేసులో, అంతా సాంఘిక ప్రభావమే కావచ్చు కూడా.

చీరలు కట్టుకోవాలని ముచ్చటపడే రేవతి, పంజాబీ డ్రెస్సులూ, స్కర్టులూ వంటి మోడ్రన్ డ్రెస్సుల్లోకి కూడా మారింది. ఎందుకంటే, 'సెక్స్ కస్టమర్లు, అలాంటి మోడ్రన్ డ్రస్సులు వేసుకున్న వాళ్లనే ఎంచుకుంటున్నారు. నన్ను ఎంచుకోవడం లేదని నేనూ అలాంటి మోడ్రన్ బట్టలే ఇష్టపడుతున్నాను' అని రాసింది. అంటే, బట్టల అభిరుచిలో ఆ మార్పు, సమాజ పరిస్థితుల్లో మార్పుని బట్టి పుట్టుకొచ్చిన మార్పే కదా? కానీ, బట్టల్లో ఏ మార్పు జరిగినా, ఆ మారినవి కూడా ఆడ బట్టలే. అసలు, మగవాడికి ఆడ బట్టలు వేసుకోవాలనే ఆసక్తి ఎందుకు పుట్టింది? – అనేదే మౌలికమైన ప్రశ్న అవుతుంది.

దొరైస్వామి పుట్టి పెరిగిన సమాజంలో, ఆడవాళ్లు ఏ బొట్లూ కాటుకలూ, వాలు జడలూ గాజులూ గొలుసులూ వంటి ప్రత్యేక ముస్తాబులు లేకుండా ఉంటారనుకుందాం. ఎప్పుడూ ఇంటి పనులే చేస్తూ ఉండడం కాకుండా, బయటి పనులు కూడా చేస్తూ ఉంటారను కుందాం. దొరైస్వామి తండ్రీ అన్నలూ కూడా ఇంట్లో ఏదో ఒక పని అందుకుంటూ ఉంటారనుకుందాం. ఆడ వాళ్ల బట్టలకీ, మగవాళ్ల బట్టలకీ, విపరీతమైన తేడాలు లేకుండా ఉంటాయనుకుందాం. అన్ని కుటుంబాలూ అలా సాగుతూ ఉంటే, దొరైస్వామికి ఏ ఆడ మనిషి దగ్గరా బొట్లూ కాటుకలూ కనపడవు. మగవాళ్లు కూడా చీపుళ్లు పట్టుకుని ఊడుస్తూనే ఉంటే, దొరై స్వామి చీపురు పట్టుకోగానే, 'ఆడంగి వెధవా' అని తిట్టేవాళ్లూ, నవ్వే వాళ్లూ, ఉండరు. ఆడ ముస్తాబులేవీ కనపడకపోతే, కనపడని ముస్తాబులు కావాలనే కోరిక దొరైస్వామికి ఎలా పుడుతుంది? ఆడ పనులూ – మగ పనులూ అనే తేడాలు లేకుండా పనులు జరుగు తుంటే, ఆడ పనులు ప్రత్యేకంగా ఉన్నట్టు ఎలా కనపడుతుంది? అలాంటి పరిస్థితుల్లో కూడా దొరైస్వామి ఆడ పిల్లగా మారాలని కోరుకుంటాడా? – ఇది ప్రధానమైన ప్రశ్న.

*(ఇంకా ఉంది)*

*(రచయిత బహు గ్రంథకర్త, మార్క్స్ 'పెట్టుబడి' పరిచయకర్త)* వీ

# ప్రశ్నించే తత్వాన్నే ప్రశ్నించాలి

- రాణి శివశంకర శర్మ

ముందుగానే సమాధానాలను సంసిద్ధం చేసుకొని ప్రశ్నలు అడిగే కాలం ఇది. దేన్ని ప్రశ్నిస్తున్నామని, నిలదీస్తున్నామని అంటారో, దానిలోనే భాగంగా జీవించే మేధావులు వర్ధిల్లుతున్న కాలం నేటి కాలం. అందుకే ప్రశ్నించడం గురించి ఎవరు మాట్లాడినా విసుగొస్తోంది. రోమిలా థాపర్ వ్యాసం చదివినా అదే జరిగింది.

రోమిలా థాపర్ వలసవాదాన్ని వ్యతిరేకించాలని అంటూనే వలస వాదానికి అనుకూలమైన తర్కాన్ని నిర్మిస్తున్నారు. హిందూవాదాన్ని వ్యతిరేకిస్తున్నట్లు కనపడుతూనే దానికి ఉప్పందిస్తున్నారు

రోమిలా థాపర్ లాంటి మేధావులు చేసే పెద్ద పొరపాటు పాశ్చాత్య దేశాల ఆలోచనల చరిత్రతో భారతీయ తాత్వికతను పోల్చడమనే తొందర పాటుకు గురికావడం. అంతే కాదు ఆంగ్ల విద్య వలన అబ్బిన భావ జాలాన్ని వదులుకోలేకపోవడం.

ఆమె ప్రధానంగా రెండు విషయాలను గురించి మాట్లాడారు 1) హేతుబద్ధ ఆలోచనా వారసత్వం 2) పౌరహక్కులు.

ఈ హేతుబద్ధత అనేది పాశ్చాత్యంలో చర్చిని, క్రైస్తవ పూజారి వర్గాన్ని ప్రశ్నించడం నుంచి మొదలైంది. మతం నుంచి, దైవభావన నుంచి వేరుపడి స్వతంత్రంగా ప్రశ్నించడం నుంచి హేతుబద్ధత ఎదుగుతూ వచ్చింది. భారతదేశ పరిస్థితి వేరు. ఇక్కడ చర్చి లేదు. మతం లేదు. ఎవరి మతం వారిది, నా మతం నాది.

'బ్రహ్మణానామనేకత్వం'. అనేకత్వం అనేది బ్రాహ్మణ స్వభావం. బ్రాహ్మణుణ్ణి పోపులా భావించి, అతన్నొక మతాధిపతిగా చిత్రించి దాడి చేయడం అనేది వలసవాద ఆలోచనా విధానంలో భాగం. ఇది మతం లేని చోట మతాన్నీ, మతాధిపతి లేని చోట మతాధిపతినీ, ఒకే దేవుడు లేని చోట ఒకే దేవుణ్ణి కనుగొనడానికి చేసే ప్రయత్నం.

రోమిలా థాపర్ లాంటి వలసవాద చరిత్రకారులు ఈ ప్రయత్నాన్ని ఎలా మొదలుపెట్టారు? పాశ్చాత్య క్రైస్తవ చరిత్రని భారతదేశానికి గుడ్డిగా అన్వయించడం ద్వారా మొదలు పెట్టారు.

దైవాన్ని ప్రశ్నించినందుకు సోక్రటీసుని విషం పెట్టి చంపారు. బుద్ధున్ని ఎవరూ అలా చేయలేదని గుర్తిస్తారు రోమిలా థాపర్. పైగా బ్రాహ్మణులు ఆయన శిష్యులుగా కూడా మారారు. బుద్ధుడిపై దాడి చేసింది ఆయనపై ఈర్ష్య పడిన దేవదత్తుడు. ఇతడు బుద్ధునికి దగ్గరి బంధువు. కాని బుద్ధుడు బతికి బయటపడ్డాడు. భావజాల సంఘర్షణ బుద్ధునికి ఎటువంటి ముప్పూ తేలేదని, సుదూర ప్రాంతాల్ని చుట్టబెట్టాడనేది అసలు సంగతి.

బౌద్ధ శ్రమణుల్ని పతంజలి పాము, ముంగిసలుగా పోల్చి ఉండవచ్చు. ఈ ఉపమానాన్ని సాగదీయలేం. మాయావాదం కూడా బౌద్ధ పరిణామ క్రమంలో వచ్చిందే. బ్రాహ్మణులు బౌద్ధంలో చేరి కుట్రపూరితంగా మాయావాదాన్ని బౌద్ధ అంతర్భాగం చేశారని, అందువల్లనే బౌద్ధం అంతరించిందనే వాదానికి బలం చేకూర్చేదిగా ఉంది రోమిలా థాపర్ అభిప్రాయం.

ఈ వాదానికి మూలం ఏమిటి? ఈ వాదం వెనుక ఉన్న హేతుబద్ధత ఎటువంటిది? ఈ హేతుబద్ధత వలసవాద హేతుబద్ధత.

భారతదేశంలో క్రైస్తవాన్ని పోలిన మతం కోసం వెతికినప్పుడు వారికి బౌద్ధం కనపడింది. ఎందుకంటే రెండిటిలోనూ ప్రవక్త ఉన్నాడు. గ్రంథం ఉంది. బౌద్ధంలో దేవుడు లేకపోయినా, బౌద్ధ ప్రాపంచిక దృక్పథమూ, క్రైస్తవ ప్రాపంచిక దృక్పథమూ నిరాశావాదం మీద ఆధారపడ్డాయి. ప్రపంచం దుఃఖం లేక పాపం అనేది వాటి భావన. అందుకే షోపెన్ హోవర్ అనే జర్మన్ తత్త్వవేత్త రెండు మతాల్లోనూ సామ్యాన్ని చూశాడు.

కానీ క్రైస్తవులు వచ్చేనాటికి బౌద్ధం భారతదేశంలో లేదు. బ్రాహ్మణులు ఇంకా తమ ప్రాచీన ఆచారాల్ని కొనసాగిస్తున్నారు. యజ్ఞ కర్మ కాండల్ని నిర్వహిస్తూనే ఉన్నారు. బుద్ధుడు ప్రశ్నించిన అనేక వేల సంవత్సరాల తర్వాత కూడా బ్రాహ్మణ సంస్కృతి సజీవంగానే ఉంది. కానీ అది బహుళత్వంలో విరాజిల్లుతోంది. ఆ వైదిక సంస్కృతిని సమూలంగా తుడిచి పెట్టేస్తే భారతీయ ఆధ్యాత్మిక మూలాలే నశిస్తాయి. సంస్కృతం, పర్షియన్ ఈ రెండు భాషల్నే మెకాలే నిందించాడు. అంటే బ్రాహ్మణులూ, ముస్లింలూ ఈ ఇద్దరి సంస్కృతీ నశించిపోవాలి అని వలసవాది తలపెట్టాడు. అందుకోసం చనిపోయిన బౌద్ధాన్ని తవ్వి తీశాడు. ఆ కంకాళాన్ని పోటీకి నిలబెట్టాడు. బౌద్ధాన్ని, ముస్లిం దండయాత్రలు నాశనం చేశాయని కొందరు అన్నారు. బ్రాహ్మణులే నాశనం చేశారన్నారు మరికొందరు. అసలు సంగతి ఇండో అరబిక్ సంస్కృతిని తుడిచిపెట్టి, ఆ స్థానంలో క్రైస్తవ సంస్కృతినీ, క్రైస్తవ ఆధిపత్యాన్నీ నెలకొల్పడం, బుద్ధుని బోధనలు మాయావాదంగా బ్రాహ్మణులు అభివర్ణించారనీ, అందుకే అది దేశం నుంచి నిష్క్రమించిందనీ అంటారు రోమిలా థాపర్.

అసలు విషయం ఏమిటంటే ప్రపంచం స్వప్నంలా మిథ్యాపూర్వక మైనదని బౌద్ధ మహాయానం వర్ణించింది. కానీ దాన్ని ఎదుర్కొన్నది బ్రాహ్మణ తాత్వికుడే. ఆయన పేరు కుమారిలుడు. ఆయన మాయా వాదాన్ని ఖండించాడు. జగత్తే సత్యమన్నాడు. ప్రత్యక్షానికి ప్రాధాన్యం ఇస్తూ అనుమాన ప్రమాణం దాని మీదే ఆధారపడుతుందని అన్నాడు. ఇంద్రియాతీత శక్తులని కూడా ఖండించాడు. దేవుడు లేడు పొమ్మన్నాడు. కాని వేదమే పరమ ప్రమాణమనీ, యజ్ఞంలో మంత్రాలే ఫలితాన్ని ఇస్తాయనీ వేరే దేవతలు ఎవరు లేరనీ వాదించాడు.

ఈ కుమారిలుడి పేరే స్మరించదు రోమిలా థాపర్. ఎందువల్ల? బ్రాహ్మణుల్ని దుర్మార్గులుగా, మూర్ఖులుగా, బుద్ధి హీనులుగా, హేతు విరుద్ధ అస్తిత్వం కల వారిగా చిత్రించడం ఆధునిక అవసరం. ఇదంతా వలస వాద చరిత్ర రచనకు కొనసాగింపు.

నిజానికి విష్ణు పురాణంలో బౌద్ధుల్ని మాయామోహుడనే రాక్షసుడిగా వర్ణించడంలో అంత వింతేమీ లేదు. నిజానికి మాయావాదాన్ని తార్కికం గా అభివృద్ధి పరిచింది బౌద్ధులే. దాన్ని బ్రాహ్మణ సాంప్రదాయంలో సమన్వయం చేసిన వాడు శంకరాచార్యులు. అందుకే ఆయన ప్రచ్ఛన్న బౌద్ధుడనే పేరు పొందాడు.

నిజానికి ప్రత్యక్షమే సత్యమనే వాదాన్ని వైదిక ధర్మమే ప్రాచుర్యంలోకి తెచ్చింది. మీమాంస శాస్త్రం ఈ కర్తవ్యాన్ని నిర్వహించింది. మీమాంస శాస్త్రానికి మూలమైన జైమిని సూత్రాల్లో గానీ, దానికి భాష్యమైన శబర భాష్యంలో కానీ ఎక్కడా దేవుడి ప్రసక్తి లేదు సరే, కర్మ సిద్ధాంతం, పునర్జన్మ, మోక్షం ప్రసక్తి కూడా లేదని కొందరు పాశ్చాత్య పండితుల అభిప్రాయం. మీమాంస శాస్త్రం (పూర్వ మీమాంస) బ్రాహ్మణ వైదిక ధర్మానికి చెందినది.

బహుశా దీని తీవ్ర రూపమే చార్వాకం కావచ్చు. చార్వాకం వైదిక కర్మ కాండనీ, ఆత్మ అస్తిత్వాన్నీ కూడా నిరాకరించింది. ఐతే రాజులకి బోధించవలసిన విద్యలో హేతు విద్య ఒకటి. దానినే అన్వీక్షకి అనే వారు. ఈ విషయం అర్థశాస్త్ర గ్రంథాల ద్వారా తెలుస్తోంది.

అంటే హేతు విద్య (చార్వాకం కావచ్చు) నిషిద్ధమేమీ కాదు. అది తప్పక అభ్యసించవలసిన ప్రత్యేకమైన సబ్జెక్టు. చార్వాకం, లోకాయతం అనే పేర్లు జనాకర్షణ కలిగినవి అనే అర్థాన్ని సూచిస్తున్నాయి కానీ నిందార్థకాలు కావు.

భారతదేశంలోని ప్రత్యేకమైన విషయం ఏమిటంటే – దేన్నీ తిరస్కరించక పోవడం. మాధవాచార్యులు సర్వదర్శన సంగ్రహాన్ని చార్వాకంతో మొదలు పెట్టాడు. చిట్టచివర అద్వైత వేదాంతాన్ని వివరించాడు. అంటే వివిధ సిద్ధాంతాలు అద్వైత స్థితికి సోపానాల వంటివని భావించాడన్న మాట.

ఛాందోగ్యోపనిషత్తులోని ఒక కథ భారతీయుల సమన్వయ దృష్టిని తెలియజేస్తుంది. దేవతల రాజు ఇంద్రుడికి రాక్షసుల రాజు విరోచనుడికి ప్రజాపతి ఆత్మబోధ చేశాడు. నీటిలో ప్రతిబింబాన్ని చూడమని అదే ఆత్మ అని బోధించాడు. విరోచనుడు దానితో తృప్తి చెంది దేహమే ఆత్మ అని భావించాడు. ఇంద్రుడు మళ్లీ మళ్లీ ప్రశ్నించి చివరికి ఆత్మ నిర్గుణమైనదని తెలుసుకున్నాడు. ఈ జ్ఞానానికి అతడు వివిధ దశల ద్వారా చేరుకున్నాడు. మాధవాచార్యులు కూడా సర్వ దర్శన సంగ్రహంలో వివిధ దర్శనాల్ని అద్వైతానికి మెట్లుగా భావించి సమన్వయించాడు. అందుకే ఈనాటికీ పండితులు విభిన్న దృక్పథాలు గల అన్ని శాస్త్రాల్ని అభ్యసిస్తుంటారు. వాటిని తమ సిద్ధాంతానికి దారులుగా భావిస్తారు.

ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే బ్రాహ్మణ శ్రమణ సంప్రదాయాల్ని పరస్పర విరుద్ధమైనవిగా చూడడం, పైగా శ్రమణ సంప్రదాయాన్ని హేతుబద్ధమైనది గా, ప్రశ్నించేదిగా, నిర్ధారిస్తూ, బ్రాహ్మణ సంప్రదాయాన్ని ప్రశ్నించబడేదిగా, ఛాందసమైనదిగా అభివర్ణించడం. వలసవాదుల పుణ్యమా అని ఇటువంటి తర్కం సులభంగా ఆమోదాన్ని పొందుతుంది. కానీ దీని వెనుక పాండిత్యము లేదు. వివేకమూ లేదు, తీవ్ర విచారణా లేదు క్రైస్తవ హేతుబద్ధత మత్రమే ఉంది.

దేవుణ్ణి తిరస్కరించిన బ్రాహ్మణ పండితుడు కుమారిలుడు జాతిని (కులాన్ని) మాత్రం తిరస్కరించలేదు. జాతి కూడా ప్రత్యక్షమే అన్నాడు.

అయితే బౌద్ధులు కూడా సత్యాన్ని వ్యావహారిక పారమార్థిక సత్యాలుగా విభజించడం ద్వారా కులాన్ని వ్యావహారిక సత్యంగా వర్గీకరించారు. అది వాడుకలో కొనసాగడాన్ని వారు వ్యతిరేకించలేదు. ఇర్ఫాన్ హబీబ్ కూడా కుల వ్యవస్థ మూలాలు ప్రాచీన బౌద్ధంలో ఉన్నాయన్నారు. నిజానికి బుద్ధుడు కూడా కులాన్ని వ్యతిరేకించలేదు. నిర్వాణానికీ, జాతికీ సంబంధం లేదన్నాడు అంతే. బౌద్ధ గ్రంథాల్లో పాపం చేసినవాడు నీచ కులంలో పుడుతాడనే వర్ణనలు ఉన్నాయి. జైన మతం ప్రకారం మొదట బ్రాహ్మణ గర్భంలో చేరిన జినుడు తర్వాత పొరపాటు గ్రహించి క్షత్రియ గర్భంలో చేరినట్టు వర్ణన ఉంది. వారి వర్ణనల ప్రకారం క్షత్రియుడే ఉన్నతుడు. బుద్ధుడు కూడా క్షత్రియులే నిక్కచ్చిగా వర్ణ ధర్మాన్ని పాటిస్తున్నారన్నాడు. బ్రాహ్మల్లో వర్ణ స్వచ్ఛత లేదన్నాడు (అంబట్ట సుత్తం).

అందువల్ల బౌద్ధ శ్రమణ సంప్రదాయాల గురించి రోమిలా థాపర్ చేసే ప్రగతిశీల వాదనలు నిలవవు. నిజానికి ఈ వాదనలు చాలా పాతవి. ఇటువంటి వాళ్లు కులంతో పోలిస్తే మతమూ, భాషా, ప్రాంతీయతలు తక్కువ అణచివేతను కొనసాగిస్తాయని భావిస్తున్నట్లు కనిపిస్తుంది. ఈ దృష్టి కోణం కూడా వలసవాదం నుంచి వచ్చిందే.

కులాన్ని అణచివేత సాధనంగా భావించి సంపూర్ణంగా నిరాకరించే రోమిలా థాపర్ ఆధునిక ఆర్యజాతి వాదం పట్ల అంత వ్యతిరేకతను చూపరు. అది హేతుబద్ధం కాదని తెలిసినా సరే.

ఆర్య జాతి వాదాన్ని వేరువేరు కారణాలతో తిలక్, జ్యోతిరావు పూలేలు సమర్థించారు. స్థానికులైన శూద్రులను విదేశీ ఆర్యులైన బ్రాహ్మణులు పీడించారని పూలే అన్నాడు. ఈ ఆర్య జాతివాదం తప్పు అంటూనే దీని ఆధారంగా గొప్ప ప్రశ్నే వేశాడని మెచ్చుకుంటుంది థాపర్. కానీ ఆర్య జాతివాదమే భారతీయ బహుళత్వానికి ముప్పు. స్వచ్ఛమైన రక్తం అనే ఫాసిస్టు భావాలకు మూలం.

నిజానికి మనుస్మృతి వివిధ కులాల సాంకర్యాన్ని వర్ణించడం ద్వారా వర్ణ స్వచ్ఛత అనే భావానికి ముప్పుగా పరిణమించిందని బౌద్ధ గ్రంథాలు అభివర్ణించాయి. కాని ఆర్య జాతివాదం బ్రాహ్మణుల రక్తం విదేశీ రక్తమని అది సంకరం కానిదనే ఫాసిస్టు తర్కాన్ని బలపరిచింది.

పూలే బ్రాహ్మణులు విదేశీయులంటే, అంబేద్కర్ స్వదేశీయులన్నాడు. ఈ రెండు వాదాలూ తప్పే. నేషన్ స్టేట్ – జాతి రాజ్యం అనే భావనే కొత్తది. నేటి సరిహద్దులు ప్రాచీనమైనవి కావు. వలస వాదానంతరం ఏర్పడినవి.

బ్రాహ్మణుల గురించి ఈ స్వదేశీ విదేశీ వాదం ఆర్యజాతివాదం ముదిరి ముదిరి హిందూవాదంగా పరిణమించింది. ముస్లింలు విదేశీయులనే వాదానికి బీజాలు వేసింది.

అంటే చరిత్రని నలుపు – తెలుపులుగా ప్రగతిశీల – ప్రగతి వ్యతిరేక శక్తులుగా వర్గీకరించడం అతి సులభం. కానీ విజ్ఞత మాత్రం కాదు. ఇదంతా వివిధ శక్తుల మీద శాశ్వతంగా లేబుల్స్ – ముద్రలు వేయడం మాత్రమే.

ఇటువంటి సంకుచిత ధోరణితోనే వైదిక గ్రంథాల గురించి వ్యాఖ్యానిస్తారు రోమిలా థాపర్. బుద్ధుడి బోధనల్లో రాజ్యం పుట్టుక గురించి సోషల్ కాంట్రాక్టు సిద్ధాంతం ఉందంటారు రోమిలా థాపర్.

కానీ ఒక వైదిక పౌరాణిక గాథను వ్యాఖ్యానిస్తూ, ఆ కథని రాజుకి దైవ సమ్మతిని గూర్చే మూఢవిశ్వాసంగా కొట్టేస్తారు. కానీ అది నిజం కాదు. కృష్ణ యజుర్వేధంలోని ఈ కథ ఒక తెగలోని వివిధ వ్యక్తుల మధ్య, వివిధ తెగల మధ్య ఐక్యత అవసరమనే భావాన్ని పౌరాణికంగా బోధిస్తుంది అంతే.

ఆ కథ ఇది. ఒకప్పుడు దేవాసురులు యుద్ధానికి సన్నద్ధం అవుతారు. దేవతలలో ఐక్యత లోపిస్తుంది. దేవతలు ఎవరికి వారే గొప్ప వాళ్లమని భావిస్తూ ఎవరి నాయకత్వాన్నీ అంగీకరించకుండా వివిధ గుంపులుగా

విడిపోతారు. అప్పుడు ఇంద్రుడు ప్రజాపతి వద్దకు వెళ్లి సలహా అడుగుతాడు. ప్రజాపతి ఐకమత్యం కొరకు ఒక యజ్ఞం చేయమంటాడు. ఆ యజ్ఞంలో అందరు దేవతలకూ ఇంద్రుడు సమానంగా ఆహారాన్ని పంచుతాడు. అప్పుడు దేవతలలో ఐక్యత సిద్ధించి ఇంద్రుని అధికారాన్ని అంగీకరిస్తారు.

మరోకథలో మణి ముక్తాది ద్రవ్యాలని ఒక చోట భద్రపరచి, ఎవరైనా విడిపోతే వాటిని మిగిలిన వారు పంచుకొనే ఒప్పందానికి వస్తారు. నిజానికి ఈ కథలు కూడా వివిధ తెగల మధ్య ఒప్పందాన్ని సూచించేవే. కాని దేవతలకు సంబంధించిన కథలుగా చిత్రించబడ్డాయి.

'హేతు బద్ధత గురించి చెపుతున్నప్పుడు. నేనేమీ ఒక ఆలోచనాశక్తిగా ఊహాశక్తి ప్రాధాన్యతను కొట్టి వేయడం లేదు' అన్న రోమిలా థాపర్ ఇటువంటి వైదిక కథల్ని కేవలం దేవతలకు మాత్రమే సంబంధించిన మూఢ భక్తి కలిగిన కథలుగా ఎలా భావించింది. వీటిలోని సోషల్ కాంట్రాక్టుని ఎలా మిస్సయింది ? ఆమెలోని ఊహా శక్తిని వలస వాద ఆధునిక తర్కం మింగేసింది.

బౌద్ధాన్నీ, జైనాన్నీ ప్రగతిశీలమైనవిగా వర్ణించడం సులభమే కాని వాస్తవం మాత్రం కాదు. వైద్యశాస్త్ర అభివృద్ధికి ఆటంకంగా నిలిచినవి ఈ మతాలే. మితిమీరిన అహింసనీ, శాకాహార వాదాన్నీ ప్రచారం చేయడం ద్వారా ఈ మతాలు వైద్యశాస్త్రంలో మాంసాహార వినియోగాల్ని అడ్డుకొన్నాయి.

అంతే కాదు ఖగోళశాస్త్రంలో కూడా 'గ్రావిటీ' సిద్ధాంతాన్ని బౌద్ధం వ్యతిరేకించిందని భాస్కరాచార్యులు సిద్ధాంత శిరోమణి గ్రంథంలో తెలియ జేశారు. బౌద్ధ అహింసావాదం గిరిజనుల పట్ల, రైతుల పట్ల వివక్షకు కారణమైందని ఇర్ఫాన్ హబీబ్ స్పష్టం చేశారు.

ఇటువంటి వివిధ పరిశోధనల్ని రోమిలా థాపర్ పట్టించుకోదు. ఎందుకంటే వర్గ సంఘర్షణ మోడల్‌లోకి చరిత్రని ఇమిడ్చేయడం ఆమెకి తక్షణ అవసరంగా కనిపిస్తుంది. ఎందుకంటే ఆధునిక ఉద్యమాలన్నీ ఇటువంటి తర్క రహిత సరళ ప్రతిపాదనల మీద ఆధారపడ్డవే.

వలస వాద విద్య మీద ఆధారపడిన ఆధునిక సంస్కర్తల గురించి మాత్రమే రోమిలా థాపర్ ప్రస్తావిస్తుంది. కానీ గిరిజనుల ప్రత్యేక జీవిత విధానం, వారి సంస్కృతీ మాత్రమే కాదు, వారి జీవన భద్రత కూడా ఆధునిక వ్యాపార తత్త్వం వల్ల దెబ్బ తింటోంది. గనుల తవ్వకం వంటి అభివృద్ధి విధానాలు వారి జీవితంలో నిప్పులు పోస్తున్నాయి.

సాంప్రదాయిక జ్ఞానం, జ్ఞానం కాకుండా పోతోంది. సాంప్రదాయిక వ్యవసాయం, వ్యవసాయం కాకుండా పోతోంది. ఆరోగ్యంగా, ఆనందంగా జీవించడం కాదు. ఆధునిక మార్కెట్ వ్యవస్థలోకి ఇమిడి పోవడమే అభివృద్ధి తర్కంగా మారింది.

చాలా ఏళ్ల క్రితం దేవిప్రసాద్ చటోపాధ్యాయ అనే కమ్యూనిస్టు మేధావి ఇండియన్ ఫిలాసఫీ అనే గ్రంథానికి ముందుమాటలో కర్మ సిద్ధాంతం వల్లనే రైతు ఆధునిక టెక్నాలజీని స్వీకరించలేక పోతున్నాడన్నారు. ఈనాడు రైతు నష్టమైనా కష్టమైనా యంత్రాల్నీ, కృత్రిమ ఎరువుల్నీ ఆశ్రయించవలసి వస్తోంది.

ఈ క్రమంలో వేల సంవత్సరాలుగా కొనసాగుతూ వస్తున్న సాంప్రదాయిక జ్ఞానం మరుగున పడిపోతోంది. ప్రత్యామ్నాయ గొంతులు మూగబోతున్నాయి.

దీని కంతటికీ కారణం మానవహక్కుల భావనే. మానవహక్కుల భావనలో ప్రకృతికి స్థానం లేదు. ఈ భావం పాశ్చాత్య అభివృద్ధి నమూనా నుంచి, వ్యక్తివాదం నుంచి వచ్చింది. అందుకే దేవీప్రసాద్ చటోపాధ్యాయ పాత పద్ధతుల నుంచి కొత్త పద్ధతుల్లోకి రావడానికి తటపటాయిస్తున్న రైతుని కర్మ సిద్ధాంతపు బానిసగా అభివర్ణించాడు.

దీని ఫలితం ఈనాడు బిటి విత్తనాల్నీ ఆధునిక వ్యవసాయ పద్ధతుల్నీ ప్రశ్నించే మేధావులకి వేదిక లేదు. వారు క్రమేపీ బలహీన పడుతున్నారు. ఒడిషా నియమగిరి కొండల్లో గనుల తవ్వకాన్ని గిరిజనులు వ్యతిరేకించారు. అదే ప్రాంతంలో ప్రభుత్వం పాఠశాలలు స్థాపిస్తోంది. బియ్యం పంచుతోంది. సిమెంటు ఇళ్లు కడుతోంది. వీటి వలన వారికి సాంప్రదాయికంగా వస్తున్న వాతావరణానికి తగిన నివాసం, పౌష్టిక ఆహారం కనుమరుగవుతున్నాయి. అరకొర విద్యను అభ్యసించిన గిరిజనులే ఆధునికతలో భాగమైపోయి గనుల తవ్వకాన్ని అంగీకరించే కాలం రావచ్చు.

అంటే పౌరహక్కుల పేరుతో అణచివేత జరిగే అవకాశం ఉందన్న మాట.

ఇటువంటి సూక్ష్మ రహస్యాల్ని మరుగుపరచడం వల్లనే భారత దేశంలో ప్రశ్నించే పేరుతో మూలాల్ని తెగ నరికే దుర్మార్గం చిరకాలం కొనసాగింది. అటువంటి బౌద్ధిక దౌర్జన్యం నుంచే హిందూత్వ – అభివృద్ధి అనే నినాదం పురుడు పోసుకుంది.

నిజానికి హిందూవాదులకీ, వారిని వ్యతిరేకించే వారికీ మౌలికమైన తేడా లేదన్న సత్యాన్ని ఇటీవలి చర్చలు తెలియజేస్తాయి. వేదాలలోనే ప్లాస్టిక్ సర్జరీలు, విమానాలు ఉన్నాయన్న వాదాన్ని ఈ మధ్య హిందూ వాదులు లేవదీశారు. వెంటనే హేతువాదులు ఈ వాదాన్ని ఖండించారు. కాని చేయవలసినది ఖండించడం కాదు. ఈ అభివృద్ధి నమూనాలోని లోపాల్ని చూపడం, దుర్మార్గాన్ని ఎత్తి చూపడం. వేదాల్లో ఉందని ఒకరంటారు. కాదు పాశ్చాత్య విజ్ఞానమని మరొకరంటారు. కానీ ఇద్దరూ దీనినే పరమ విజ్ఞానంగా భావిస్తారు. హిందూత్వవాదులూ – హేతు వాదులూ ఇద్దరూ సైన్సు పేరుతో కొనసాగుతున్న ఏకశిలా సదృశ జ్ఞానానికి బానిసలు. అందుకే ఇద్దరికీ తేడా లేదు. ప్రకృతిపైన, తోటి మానవులపైన విచక్షణారహితంగా సాగుతున్న దోపిడీని ఆపి, సామరస్య పూర్వకమైన జీవన విధానాన్ని ఎన్నుకుందామన్న తపన లేదు.

ఈ అభివృద్ధి నమూనాలో హింస సర్వసాధారణం. భయంకరమైన నిర్మూలన అనేది సర్వ సామాన్యం. రెడ్ ఇండియన్స్‌నీ, వారి సంస్కృతినీ నిర్మూలిస్తే కాని అమెరికా జన్మించలేదు. కులనిర్మూలన, కుల సంస్కృతుల నిర్మూలన, బహుళ సంస్కృతుల నిర్మూలన జరిగితే కాని ఆధునిక హిందు ఇండియా నిర్మాణం కాదు.

బ్రాహ్మణ సంస్కృతి ఇది కాదు. ఇది కానే కాదు. జైమిని సూత్రాల శబర భాష్యంలో శబరుడు వేదాన్నీ వేదమంత్రాలనీ అర్థం చేసుకోవడానికి మ్లేచ్ఛ భాషా పరిజ్ఞానం పనికి వస్తుందన్నారు. మ్లేచ్ఛులైన యవనులని కూడా మనం పూజించాలని, వారి దగ్గర ఖగోళ శాస్త్ర జ్ఞానం విరివిగా ఉందని వరాహ మిహిరుడు కీర్తించాడు బృహత్సంహితలో.

కానీ మనం చేస్తున్నదేమిటి? స్వచ్ఛ ఆర్యజాతి కోసం, స్వచ్ఛ హిందూ జాతి కోసం అన్వేషణ. ఈ వాదాలకి మూలాలు ఆధునికులమని, ప్రగతిశీలురమని ముద్ర వేసుకున్న అనేక మంది మేధావుల్లో ఉన్నాయని నేను ఇప్పటికే స్పష్టం చేశాను. అందుకు రోమిలా థాపర్ మినహాయింపు కాదు. వీ

(... 4వ పేజీ తరువాయి)

'వీక్షణం' బాగుంది. అయితే, ఇది ఎవరి కోసమో అర్థం కాలేదు. మేధావుల కోసమా? మామూలోళ్ల కోసమా? మేధావుల కోసమైతే ఓకే. కానీ, మామూలోళ్ల కోసమైతే మాత్రం కాస్త ఆలోచించాల్సిందే. ఎందుకంటే, మేగజైన్ ప్రెజెంటేషన్ మామూలోళ్లకు అసలు కనెక్టయ్యేలా లేదు. ఇందులో కంటెంట్ చాలా విలువైనదని, ఎంతో శ్రమపడి రాసినదని అర్థమవుతోంది. కానీ, ప్యాకేజింగ్ బాగాలేదని నాకు అనిపించింది. నాకు తోచిన లోపాలు చెప్పాలని ఈ నాలుగు ముక్కలు రాస్తున్నాను.

భాష : ఇందులో చాలావరకు గ్రాంథిక భాష వాడారు. కమ్యూనిస్ట్, సోషలిస్ట్ పుస్తకాల్లో కనిపించే చాలా మాటలు ఇందులో ఉన్నాయి. తప్పులేదు, ఉండొచ్చు. కానీ, నాలాంటి మామూలోళ్లకు అర్థం కావాలి కదా. తేలిగ్గా, అచ్చ తెలుగులో రాయొచ్చు కదా. సంస్కృత పదాలు అవసరమా? ఇంగ్లిష్ మాటలు ఖచ్చితంగా ట్రాన్స్‌లేట్ చేయడం వీలు కానప్పుడు, ఆ మాటలకు దగ్గరగా ఉండే మాటలు రాయడంలో తప్పులేదు కదా. కొన్ని ఇంగ్లిష్ మాటలు అలాగే వదిలేయడంలో కూడా తప్పు లేదు. సంస్కృత పదాలు జనం మీద రుద్దడం కన్నా ఇంగ్లిష్ మాటలు రుద్దడమే బెటర్ కదా. కొన్ని ఇంగ్లిష్ మాటలు జనానికి నేర్పినట్టవుతుంది. అవి ఉపయోగపడతాయి. సంస్కృత పదాలు రుద్దితే ఉపయోగం ఏమీ ఉండదు కదా. 'వీక్షణం' ఫిబ్రవరి 2015 సంచికలో రెండే రెండు ఆర్టికల్స్ అందరికీ అర్థమయ్యేలా ఉన్నాయి. 1.అధ్యక్షుడు ఒబామా ప్రధాని మోడీ ముఖాముఖి 2. హిజ్రా సమస్య. ఈ రెండూ తప్ప మిగతావి ఏవీ మామూలు రీడర్ కి ఏమాత్రం అర్థం కావు. ఇంగ్లిష్ మాటలు వాడితే చీప్ అని కొంతమంది అనుకోవచ్చు. ఏదైనా సరే అర్థం కావడం అవసరం. జనానికి అర్థం కానప్పుడు, ఏది రాసినా, ఎంత రాసినా లాభం ఏముందనేదే నా వాదన. ఉదాహరణకు మేగజైన్ పేరు 'వీక్షణం' అని పెట్టారు. దీన్నే అచ్చ తెలుగులో 'చూపు' అని పెడితే ఎంత హాయిగా ఉండేదో కదా! పలకడం తేలిక, రాయడం తేలిక. అర్థం కానివారెవరూ ఉండరు కదా! శ్రీశ్రీ, గురజాడ చెప్పింది చేసింది ఇదే కదా. ఆర్టికల్స్ ఎలా రాస్తే ఈజీగా ఉంటుందనే దానికి మోడల్ గా ఓ ఆర్టికల్ లో ఒక పేరాను మార్చి రాశాను. కింద ఉంది చూడండి.

లే ఔట్ : మేగజైన్ లే ఔట్ చూస్తే ఏదో సావనీర్ లా ఉంది తప్ప, మేగజైన్ లుక్ లేదు. బొమ్మలు, ఫొటోలు వాడడం తప్పు అనుకున్నట్టు ఉంది. పేజీలకొద్దీ అక్షరాలు కుమ్మరించేస్తే.... చదవడానికి ఆసక్తి ఉంటుందా? ఎన్ని ఆర్టికల్స్ ఇస్తున్నామని చూశారు తప్ప, ఎలా ప్రెజెంట్ చేశామన్నది చూసినట్టు లేదు. ఏదైనా సరే, చదివించేలా ఉండాలి తప్ప....నీరసం తెప్పించకూడదు కదా!

హెడ్డింగులు: ఈ మేగజైన్‌లో హెడ్డింగులు చూద్దాం. 'పరిహాస స్వేచ్ఛ, ఆధిక్యతా ప్రదర్శన, హంతక రాజకీయాలు'. 'పారిశ్రామిక విధానం – తెలంగాణ ప్రయోజనాలు'. ఇలాంటి హెడ్డింగులు పెడితే ఎవరికైనా చదవాలని అనిపిస్తుందా?

కవర్‌పేజ్ : కవర్ పేజ్ కలర్‌లో ఉంది. కానీ, ఏం లాభం? 'ఫొటో వేస్తే మహాపాపం' అన్నట్టుగా కేవలం రంగులు మాత్రం పులిమేసి పెద్ద పెద్ద హెడ్డింగులతో భయపెట్టేశారు. పుస్తకాల షాప్‌లో ఈ మేగజైన్ చూసి.... ఎవరన్నా కొనేటట్టుందా? కళ్లకు ఎంతో ఇబ్బందిగా ఉంది కదా!

కంటెంట్ : ఇందులో కంటెంట్ బాగుంది. లెఫ్ట్ మేధావుల అభిప్రాయాలు తెలిశాయి. అయితే, వీటిలో కొన్ని ఆర్టికల్స్ చదివితే....కొన్ని ధర్మసందేహాలు వస్తాయి. ఉదాహరణకి, 'క్షీణిస్తున్న మీడియా చైతన్యాలు' ఆర్టికల్ లోనూ, 'పరిహాస స్వేచ్ఛ, ఆధిక్యతా ప్రదర్శన, హంతక రాజకీయాలు' అనే సంపాదకీయ వ్యాఖ్యలోనే 'చార్లీ హెబ్డో' మీద దాడిని ఖండిస్తూనే.... 'మనోభావాలు దెబ్బతిన్నందునే ఈ దాడి జరిగింది' అనే ముగింపు ఇచ్చారు. అది నిజమే. కానీ, ఇదే మేగజైన్‌లో భగవద్గీత మీద ఇష్టమొచ్చినట్టు రాశారు. ఇది చదివితే, 'హిందువులకి మాత్రం మనోభావాలుండవా? ఉండకూడదా? ఉంటే, అవి దెబ్బతినవా?' అని సందేహం రాకమానదు.

ఉదాహరణకు – 'సామ్రాజ్యవాద స్వచ్ఛ బానిస మోడీ' హెడ్డింగ్‌తో వచ్చిన ఆర్టికల్‌లో మొదటి పేరా అలా ఉంటే జనానికి కనెక్ట్ అవుతుందా? లేకపోతే, ఈ కింది విధంగా ఉంటే జనానికి కనెక్ట్ అవుతుందా? అనేది ఆలోచించండి. మీ టార్గెట్ మామూలు జనం. వాళ్లని దృష్టిలో పెట్టుకుని ఇది చదవండి. మేధావులకి మీరు కొత్తగా చెప్పనక్కర్లేదు. చదువుకోని వాళ్లకు, సరైన చదువులేని వాళ్లకు అర్థం కాకపోతే ఏది రాసినా వేస్టే కదా. ఈ ఆర్టికల్ రాసినవారిని నేను తప్పుపట్టడం లేదు. ఆయన భావాలు తప్పుకాదు. దాన్ని జనం భాషలో చెప్తే చదవడానికి హాయిగా ఉంటుందనేదే నా పాయింటు.

ఒకటీ రెండూ కాదు. ఏకంగా 282 సీట్లతో మెజారిటీ సంపాదించి, 2014 ఎలక్షన్లు ఎవరూ మరిచిపోకుండా చేసింది బిజెపి. ఒంటిచేత్తో బిజెపిని గెలిపించిన నరేంద్రమోడీ ప్రైమ్ మినిస్టర్ కుర్చీలో కూర్చున్నారు.

ఇది ఉన్నట్టుండి జరిగిందా....లేదే ! మూడేళ్ల నుంచీ ఒక ప్లాను ప్రకారం జరిగింది ఇదంతా! హిందూ మత పిచ్చి ఉన్న మోడీని 'వికాస్ పురుష్' అన్నారు. 'రోల్ మోడల్' అన్నారు. గుజరాత్ బోల్డంత డెవలప్ అయిపోయిందని సినిమా చూపించారు. గుజరాత్ లో కరెంట్ లేని ఊళ్లే లేనట్టు, చదువు తప్ప, పనులకు పోయే పిల్లలే లేరన్నట్టు, పొలం లేని కుటుంబమే లేనట్టు....ఇలా బోల్డంత బిల్డప్ ఇచ్చారు.

మోడీ ఎలక్షన్ మీటింగులు హైటెక్. ఆయన స్టయిల్ హైటెక్. త్రీడీ టెక్నాలజీతో మీటింగ్‌లు. మోడీనే జనం ముందున్నట్టుగా మాయ. ఆ మీటింగుల్లో మోడీ వేసుకున్న అదిరేటి డ్రెస్సులు వారెవా ! రోజుకి పాతిక లక్షలు ఖర్చు పెడితే....అదరవా మరి. ఈ మాయ చేయడానికి పైసలెలా వచ్చాయి?.. ఈ డ్రెస్సు ఖర్చులు ఎవరు పెట్టుకున్నారు?.. అసలు ఈ ప్లాను వెనకాల ఉన్నదెవరు? ఈ ప్రశ్నలకు జవాబులు వెతకడానికి పెద్దగా ఆలోచించనక్కర్లేదు. కార్పొరేట్ కంపెనీలు డబ్బు కుమ్మరించాయి. కార్పొరేట్ మీడియా రెచ్చిపోయి ప్రచారం చేసింది. ప్రచారం పనిచేసింది. మోడీ వస్తే....ఈజీగా జాబ్ వచ్చేస్తుందని నమ్మేసిన స్టూడెంట్లు, తమ బతుకులు హైక్లాస్ కు మారిపోతాయని నమ్మేసిన మిడిల్ క్లాస్ జనం పిచ్చిపిచ్చిగా ఓట్లేశారు. మోడీ పార్టీ అవలీలగా గెలిచేసింది. కార్పొరేట్ కంపెనీల జోష్ ఇంతా అంతా కాదు. పేరుకే మోడీ ప్రధాని. రాజ్యం వాళ్లది. అధికారం వాళ్లది. పెట్టిన పెట్టుబడి రాబట్టుకోడానికి, లాభాలు జేబులో వేసుకోడానికి ఇప్పుడా కంపెనీలు రెడీ అయిపోయాయి.

**– మదన్ మోహన్**
హైదరాబాద్

జనవరి సంచికలో వచ్చిన 'ప్రశ్నిద్దామా వద్దా అనేదే అసలు ప్రశ్న' అనే సైద్ధాంతిక వ్యాసం రాసిన రొమిల్లాథాపర్‌కు కృతజ్ఞతలు. అందులో చర్చ చాలా వివరనాత్మకంగా ఉంది. చరిత్రను వర్తమానాన్ని చాలా చక్కగా వివరించారు. సమాజానికి ఉపయోగపడే ఇలాంటి చర్చలకు ప్రాధాన్యం ఇస్తూ, మెరుగైన సమాజ నిర్మాణం కోసం ఆలోచనా రంగంలో వీక్షణం చేస్తున్న కృషికి అభినందనలు. ఆర్థికంగా ఇబ్బందుల్లో ఉన్న వీక్షణంను పాఠకులు, అభిమానులుగా చేయూతనిచ్చి ఆదుకోవాలని కోరుతున్నాం.

**– రమేష్ గోండ్యాల**
శ్రమజీవి సంఘం, ముంబాయి

జనవరి సంచికలోని 'యువతను ఆకర్షించలేకపోతున్న ప్రజా సంఘాలు' అనే నా వ్యాసానికి ఎస్. జనార్దన్ (సిద్దిపేట) స్పందిస్తూ చేసిన విమర్శకు నా ప్రతిస్పందన ఇది. మార్క్సిస్టు ప్రజా సంఘాలు యువతను ఆకర్షించడంలో విఫలమవడానికి వివిధ కారణాలున్నాయని నేను నా వ్యాసంలో ఒప్పుకుంటూనే, నేను గత కొన్ని సంవత్సరాలుగా పరిశీలించిన ఒక కారణాన్ని వివరిస్తానని స్పష్టంగా రాశాను. జనార్దన్ ఈ వాక్యాన్ని ఎందుకో పరిగణలోకి తీసుకోకుండా దాదాపు పది రకాల జాతీయ, అంతర్జాతీయ, ప్రాంతీయ, సాంస్కృతిక కారణాలను ఈ సమస్యకు కారణాలుగా చూపారు. ఇవన్ని కారణాలను వదిలేసి కేవలం నాయకత్వాన్ని ఈ సమస్యకు కారణంగా చూపానని అన్నారు. నేను రాసిన వ్యాసం కేవలం యువతను దృష్టిలో పెట్టుకొని రాశాను. నేటి యువతకు ఏ పద్ధతిలో చెప్పాలి. వారితో ఎలా కమ్యూనికేట్ చేయాలి. వారు ప్రజా సంఘాలు ఎలా ఉండాలని కోరుకుంటున్నారు. నాయకత్వం, సంస్థ సభ్యులు యువతతో ఎలా ఉంటే వారికి నచ్చుతుంది లాంటి అంశాలను సంతృప్తికర స్థాయిలో మార్క్సిస్టు ప్రజా సంఘాలు ఆచరించక పోవడం వలన, యువతకు దూరం అవుతున్నాయనే ప్రధాన అంశంపై మాత్రమే నేను రాశాను. కేవలం ఈ అంశంలో నాయకత్వం విఫలం కావడానికి జాతీయ, అంతర్జాతీయ పరిణామాలు కారణం కాదు. నా వ్యాసంలో రాసినట్టు ఈ లోపాలకు ముమ్మాటికి నాయకత్వ వైఫల్యమే కారణం. ఇంత స్పష్టంగా నేను వ్యక్తీకరిస్తే, ఆ కారణాలపై చర్చించకుండా నాయకత్వాన్ని విమర్శించినందుకు జానార్దన్ బాధపడడం ద్వారా నేను లేవనెత్తిన లోపాలు మాయం కావు.

ఇలాంటి అతిశయోక్తినే జనార్దన్ ఇంకో చోట వాడుతూ నేను వ్యక్తం చేయని

భావాలను నాకు ఆపాదించారు. నా వ్యాసంలో నేను సూచించిన కొన్ని సూచనలు ప్రజా సంఘాలకు అసలే తెలియనట్టు, ప్రజా సంఘాలు ముందుకు పోలేక పోవడానికి ఆ లోపాలే కారణం అన్నట్టుగా నేను వ్యక్తీకరించానని నాకు లేని, నేను రాయని భావాలను నా వ్యాసానికి అంటగట్టారు. ప్రజా సంఘాలు 'ఫీడ్‌బ్యాక్' తీసుకోవడం లేదనే నిర్ణయానికి నేను ఎలా వచ్చానని అడిగారు. ఈ వ్యాసం రాయడానికి కొన్ని సంవత్సరాల ముందు నుండే నేను ఆ మార్క్సిస్టు సంస్థలను దగ్గరగా పరిశీలించాను. ఎందరినో ఇంటర్వ్యూలు కూడా చేశాను. చాలా ఆశ్చర్యకరమైన లోపాలు, విషయాలు గ్రహించిన తర్వాతనే బాధా తప్తంగా, బాధ్యతగా ఆ వ్యాసం రాశాను తప్పించి ఆషామాషీగా కాదు.

మార్క్సిస్టు ప్రజా సంఘాల నాయకత్వంపై నాకు కూడా ప్రేమ, గౌరవాలు ఉన్నాయి. అయితే, అది గుడ్డి ప్రేమగా మారి, కళ్లెదుట కనబడుతున్న లోపాలను కూడా జాతీయ, అంతర్జాతీయ పరిణామాలకు అంటగట్టి నాయకత్వానికి 100 మార్కులు వేయడం వలన, ఏదో ఒక రోజు ఆ సంస్థ నిరాదరణకు గురవుతుంది. కొందరు నాయకుల కన్నా సంస్థ గొప్పది. సంస్థ కన్నా ప్రజలు గొప్ప. నాయకుల ప్రయోజనాల ప్రజల ప్రయోజనాలు ముఖ్యం. ఇకపోతే, నేను వాడిన కొన్ని ఇంగ్లిష్ పదాలను జనార్దన్ పెట్టుబడిదారీ వ్యక్తి వికాసం, సంస్థా నిర్వహణ పాఠాల్లో చెప్పే చిట్కా వైద్యాలుగా ముద్రవేశారు. ఫీడ్‌బ్యాక్, బ్రెయిన్ స్టామింగ్ లాంటి పదాల అర్థాలు ఏ ఇంగ్లిష్ డిక్షనరీలోనైనా ఉంటాయి. ఇకపోతే 'రి–ఇన్వెంటింగ్ ది వీల్' అనేది ఒక సామెత. మానవ చరిత్రలో చక్రాన్ని కనిపెట్టడం అతి గొప్ప మార్పును తెచ్చింది. అంత మార్పును తెచ్చిన చక్రాన్ని మళ్లీ కొత్తగా ఆవిష్కరించడానికి ఏ స్థాయిల్లో మేధోమథనం చేయాలో అంత స్థాయిలో ఒక సమస్య పట్ల ఆలోచించడం అనే అభిప్రాయాన్ని వ్యక్తీకరించాలనుకున్నప్పుడు ఈ సామెత వాడుతారు. ఇక, 'లెర్నింగ్ ఆర్గనైజేషన్' అంటే నేర్చుకునే తత్వం ఉన్న సంస్థ. ఈ పదాన్ని మార్క్సిస్టు సంస్థలు కూడా వాడుకోవచ్చు.

మార్క్సిజం వేరు, మార్క్సిస్టు ఛాందసవాదం వేరు. 'గతితార్కిక దృష్టి లేదు', 'అంతర్గత వైరధ్యాలను గుర్తించి దాని చలనం ఎటువైపు ఉన్నదో అంచనా కట్టలేదు' లాంటి మార్క్సిస్టు పదజాలాన్ని జనార్దన్ (పడికట్టుగా) వాడుతూ, ఇంకో వైపు ఆయన మార్క్సిజానికి పూర్తి వ్యతిరేకమైన భావాలను నేను వాడిన ఇంగ్లిష్ పదాల పట్ల వ్యక్తపరిచారు. ఫీడ్‌బ్యాక్ (అభిప్రాయాలను, సూచనలను తీసుకోవడం), బ్రెయిన్ స్టామింగ్ (ఏదైనా ఒక అంశంపై విస్తృతంగా మేధోమథనం చేయడం) తదితర పెట్టుబడిదారీ పదాలను మార్క్సిస్టులు వాడకూడదని అనడం సజీవమైన మార్క్సిజాన్ని నిర్జీవమైన మార్క్సిస్టు ఛాందసవాదంగా మార్చడమే అవుతుంది. అసలు అవి 'పెట్టుబడిదారీ' పదాలు (లేదా చిట్కా వైద్యాలు) కావు. ఒక వేళ పెట్టుబడిదారీ పదాలైనా ఆ పదాల్లో పెట్టుబడిదారీ అభివృద్ధి నిరోధకతత్వం ఉంటే మాత్రమే మార్క్సిస్టులు వాడ నిరాకరించాలి తప్పించి, పెట్టుబడిదారీ వ్యవస్థలో ఆ పదం పుట్టినంత మాత్రాన ఆ పదాన్ని వెలివేయకూడదు. ఆ మాటకొస్తే భాష అనేది బానిస సమాజం, భూస్వామ్య సమాజం, పెట్టుబడిదారీ సమాజాల్లో గుండా ప్రయాణించి, అభివృద్ధి చెందింది. భూస్వామ్య, పెట్టుబడిదారీ అభ్యుదయ వ్యతిరేక భావజాలంతో కూడిన పదాలను మార్క్సిస్టులు వాడకూడదు. అంతే తప్పించి, అసలు పెట్టుబడిదారులు వాడే పదాలేవీ (వైద్యాలేవి) మనం వాడకూడదనే వాదన సజీవమైన మార్క్సిజాన్ని ఛాందసవాదంగా మార్చడం అవుతుంది. ఆ మాటకొస్తే ఒక మార్క్సిస్టు సంస్థ 'బోల్షివిక్ స్పిరిట్, అమెరికన్ ఎఫిషియన్సీ' తమ పని విధానంగా తమ సాహిత్యంలో రాసుకున్నారు. అమెరికన్ సామ్రాజ్యవాదమే ప్రపంచ ప్రజల ప్రథమ శత్రువుగా చెప్పే ఈ మార్క్సిస్ట్ సంస్థ అమెరికన్ ఎఫిషియన్సీ (సామర్థ్యత) ని ఆదర్శంగా చూపడం మార్క్సిజం ప్రకారం శాస్త్రీయమైన ఆలోచనే. కాని మార్క్సిస్టు ఛాందసవాదం ప్రకారం తప్పు అవుతుంది. నిజానికి, ఏ పెట్టుబడిదారుడైనా 'ఎఫిషియన్సీ' అనే పదాన్ని వాడకుండా ఒకరోజు కూడా ఉండలేడు. జనార్దన్ చెప్పే మార్క్సిస్టు ఛాందసవాదం ప్రకారం ఈ మార్క్సిస్టు సంస్థ తమ క్యాడర్‌కు పెట్టుబడిదారీ చిట్కా వైద్యం ఇస్తున్నట్టా? ఎంతకూ కాదు. అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రపంచ ప్రజల ప్రథమ శత్రువు అనేది ఎంత నిజమో, అదే సమయంలో అమెరికన్ పెట్టుబడిదారులు (అన్ని రంగాల్లో కాకపోయినప్పటికీ) చాలా రంగాల్లో సమర్థతని ఎంతో ఉన్నతీకరించారనేది అంతే నిజం. కొన్ని రంగాల్లో అమెరికన్ల సామర్థ్యత కన్నా, జపానీయుల సామర్థ్యత చాలా గొప్పది. మరి కొన్నింటిలో జర్మన్లది, ఇంకొన్నింటిలో స్విస్ వారిది గొప్ప.

నేనైతే పెట్టుబడిదారీ సామర్థ్యత (క్యాపిటలిస్టు ఎఫిషియన్సీ) అనడం ఎక్కువ అర్థవంతంగా ఉంటుందనుకుంటున్నాను. ఏమైనప్పటికీ ఆ మార్క్సిస్ట్ సంస్థ అమెరికన్ ఎఫిషియన్సీ అనే వ్యక్తీకరించినందున, ఆ కోణంలో చూసినా సోషలిస్టు వ్యవస్థ నెలకొల్పే క్రమంలోని పోరాటాల్లో సోషలిస్టు వ్యవస్థలో వీలైన చోటల్లా అమెరికన్ సామర్థ్యతను కార్మిక వర్గీకరించి వాడితే లాభం, వాడకపోతేనే నష్టం. చేసే పనిని మరింత సమర్థవంతంగా చేయగలిగే టెక్నిక్‌లను పెట్టుబడిదారులు కనిపెట్టినా అవి మార్క్సిస్ట్‌లకు కూడా లాభమే.

చివరగా, ఎలానైనా నాయకత్వం తప్పు లేదని నిరూపించడానికి జనార్దన్ ఏవేవో కారణాలు, వాదాలు ముందుకు తెచ్చారు. రెండు, మార్క్సిస్టు పదజాలాన్ని పడికట్టుగా వాడి మార్క్సిజం ప్రకారం నా వ్యాసం గతితార్కిక విరుద్ధంగా ఉందని తేల్చారు. మూడు సజీవమైన మార్క్సిజాన్ని మార్క్సిస్టు ఛాందసవాదంగా మార్చి నేను వాడిన ఇంగ్లిష్ పదాల పట్ల మార్క్సిస్టు వ్యతిరేక భావాలను వ్యక్త పరిచారు. మొత్తంగా ఈ మూడు కూడా నేర్చుకోవాలనే నమ్రత ఉంటే తప్పుని సరి మార్చుకోవాల్సిన డీవియేషన్లే.

**–లోకసంచారి**

హైదరాబాద్

విప్లవకారులు, విప్లవకారులుగా (మావోయిస్టులు) ముద్ర వేయబడిన నేను, నాలాంటి అనేక మంది జైలు గోడల మధ్య జీవితాలను వెళ్లదీస్తున్నారు. ఒడిషా ప్రభుత్వం, పాలక వర్గాలు, పోలీసులు పోరాడే ప్రజల, రాజకీయ ఖైదీల ప్రజాస్వామిక హక్కులను, మానవ హక్కులను అత్యంత నిర్దాక్షిణ్యంగా కాలరాస్తున్నారు. చెరసాల మధ్య నుండి కొన్ని విషయాలను మీతో పంచుకోవాలని అనుకుంటున్నాం. సాధారణ ప్రజలనూ, ఆదివాసులనూ మానవహక్కుల కార్యకర్తలనూ మావోయిస్టుగా ముద్రవేసి అరెస్టు చేసి, అక్రమ కేసులు బనాయించడం, అరెస్టు చేయబడిన వారిపై సహేతుకమైన నిర్దిష్ట సమయం లోపల కేసులను నమోదు చేసి కోర్టులలో హాజరు పర్చకపోవడం. కేసులలో నిర్దోషులుగా కోర్టు తేల్చి విడుదల చేసిన తర్వాత జైలు గేటు నుండి ఎత్తుకెళ్లి మళ్లీ తప్పుడు కేసులు బనాయించి జైలుకు పంపడం. అనేక సంవత్సరాలుగా జైలులో మగ్గుతున్న అనేక మందిపై కేసులు విచారణ పూర్తి అవుతున్న సమయంలో ఇన్వెస్టిగేషన్ ఒపెన్ ఉన్నాయనే పేరుతో ఇతర తప్పుడు కేసులలో నిందితులుగా చేర్చడం. కోర్టులలో ఉద్దేశ పూర్వకంగా వివిధ పద్ధతుల ద్వారా విచారణ ప్రక్రియను జాప్యం చేస్తూ, ఖైదీల హక్కులు అయిన శీఘ్ర విచారణ, బెయిల్ పొందే హక్కులను చిన్న చిన్న కారణాలను సాకుగా చూపెట్టి నిరాకరించడం. చివరకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రకటించిన మావోయిస్టుల సరెండర్ పాలసీ ప్రకారంగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వద్ద సరెండరైన నన్ను కూడా విడిచిపెట్టకుండా అరెస్టు చేసినట్లు చట్ట విరుద్ధంగా ఒడిషా ప్రభుత్వం ప్రకటిస్తూ తప్పుడు కేసులు బనాయించడం; అవి విచారణ పూర్తి అవుతున్న సమయంలో మూడు సంవత్సరాల ఎనిమిది నెలల తర్వాత మరి కొన్ని తప్పుడు కేసులు పెట్టడం ద్వారా వారు ప్రకటించే సరెండర్ పాలసీల నిజ స్వరూపాన్ని చాటుకుంటున్నారు.

మరో పక్క నేటి న్యాయ వ్యవస్థను చూసుకుంటే – కింది కోర్టులలో సరైన లాయర్‌లను పెట్టుకోలేక పోవడం, పై కోర్టుకు వెళ్లగలిగే ఆర్థిక స్తోమత, ఇతర వనరులు అందుబాటులో లేకపోవడం లాంటి కారణాలు ఒక వైపు అయితే రాజ్యం, పోలీసులు తమకున్న అధికారంతో న్యాయ వ్యవస్థను ప్రభావితం చేస్తూ సకాలంలో నిష్పక్షపాతంగా న్యాయం అందకుండా చేసి సంవత్సరాల తరబడి అన్యాయంగా, అక్రమంగా జైలులో నిర్బంధిస్తున్నారు.

మాలాంటి వారి పక్షాన నిలబడి కోర్టుల్లో వాదించి న్యాయం అందించడానికి ముందుకు రాగలరని ప్రగతి శీల, ప్రజాస్వామిక న్యాయవాదులకు విజ్ఞప్తి. మాకు అండగా నిలబడి మీకు తోచిన పద్ధతులలో మద్దతు అందిస్తూ, కనీసం రాజ్యాంగం కల్పించే హక్కులనైనా పొందే విధంగా గొంతెత్తి నినదించడానికి ముందుకు రావాల్సిందిగా ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, ప్రజా సంఘాలందరికీ వినమ్రతతో వేడుకుంటున్నాం.

**– రాజకీయ ఖైదీల తరఫున డి. కేశవరావు (ఆజాద్)**

(మెయిల్‌లో వచ్చిన స్కాన్ కాపీలో ఊరి పేరు స్పష్టంగా లేదు)

### తెలంగాణ పునర్నిర్మాణంలో పాలమూరు

తెలంగాణ పునర్నిమాణంలో పాలమూరు భవిష్యత్' అనే అంశంపై ఫిబ్రవరి 1న హైదరాబాద్‌లోని మాసబ్‌ట్యాంక్‌లో ఉన్న పాలిటెక్నిల్ కళాశాలలో పాలమూరు అధ్యయన వేదిక ఆధ్వర్యంలో సభ జరిగింది. ఈ సభకు ప్రొ. హరగోపాల్ అధ్యక్షత వహించగా, సభలో పాల్గొన్న వక్తలు పాలమూరు కరువుకు, వలసలకు పాలకులే కారణమని, ప్రతి ఏడాది వేలాది మంది ప్రజలు బతువుదెరువు కోసం దేశంలోని వివిధ పట్టణాలకు, నగరాలకు వలసలు వెళుతున్నారని, ఈ వలసలను నివారించవలసిన బాధ్యత ప్రభుత్వాలదేనని డిమాండ్ చేశారు. ఈ సభకు చుక్కా రామయ్య, పొత్తూరి వెంకటేశ్వరరావు, ఆంధ్రజ్యోతి ఎడిటర్ కె. శ్రీనివాసులతో పాటు అనేక మంది ప్రజలు హాజరయ్యారు.

### బొబ్బిలిలో విరసం సాహిత్య పాఠశాల

విజయనగరం జిల్లా బొబ్బిలిలో విరసం ఫిబ్రవరి 7, 8 తేదీల్లో సాహిత్య పాఠశాలను గంటి ప్రాసాదం వేదిక పై నిర్వహించింది. పాఠశాలకు కవులు, రచయితలు, విప్లవాభిమానుల హాజరయ్యారు. సాహిత్య పాఠశాలలో 'సామాజిక ఉద్యమాలు – ప్రజాస్వామిక విప్లవం' అనే అంశంపై వక్తలు ప్రసంగించారు. ఈ వేదికలో ఐదు తీర్మానాలు ప్రవేశపెట్టారు. 1. పెరుమాళ్ మురుగన్‌కు సంఘీభావం; 2. కేరళలో సిఆర్‌పిపి బాధ్యుల అరెస్టులపై ఖండన; 3. ఎపి రాజధాని కోసం రైతుల నుండి బలవంతంగా భూములు లాక్కోవడం; 4. తెలంగాణలో రాజ్య నిర్బంధం; 5. సంఘపరివార్ హిందుత్వ క్యాంపెయిన్‌ను వ్యతిరేకిస్తూ; 6. ఉత్తరాంధ్రలో భారీ విస్థాపనను వ్యతిరేకిస్తూ తీర్మాణాలు చేసింది. ఫిబ్రవరి 8న బహిరంగ సభ జరిగింది.

### అంధ విద్యార్థుల ధర్నా

అంధుల కోసం ప్రవేశపెట్టిన మూడు శాతం రిజర్వేషన్లను అమలు చేయాలని విజయవాడ నుంచి వచ్చిన 60 మంది అంధ విద్యార్థులు హైదరాబాద్‌లోని వికలాంగుల సహకార సంస్థ కార్యాలయం వద్ద ఫిబ్రవరి 12 ధర్నా చేశారు. అంధుల రిజర్వేషన్లకు సంబంధించిన జిఒను వెంటనే విడుదల చేయాలని ఆంధ్రప్రదేశ్ అంధ విద్యార్థుల జెఎసి అధ్యక్షులు వీరభద్రరావు డిమాండ్ చేశారు.

### రచయిత కేశవరెడ్డి మృతి

ప్రముఖ రచయిత, నవలాకారుడు డా. పెనుమూరి కేశవరెడ్డి (66) ఫిబ్రవరి 13న క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ నిజామాబాద్‌లోని ఆయన స్వగృహంలో చనిపోయారు. ఆయన 1946 మార్చ్ 10న చిత్తూరు జిల్లా, తలుపులపల్లి గ్రామంలో జన్మించారు. ఆయన మూగవాని పిల్లనగ్రోవి, చివరి గుడిసె, అతడు అడవిని జయించాడు, ఇన్‌క్రెడిబుల్ గాడెన్, స్మశానం దున్నేరు, మునెమ్మ, సిటీ బ్యూటిఫుల్ మొదలైన నవలలు రాశారు. ఆయన నవలలు వివిధ భాషల్లోకి అనువాదం అయ్యాయి.

### న్యూస్ ప్రెజెంటర్, కార్టూనిస్టుల మృతి

టీవి9 న్యూస్ ప్రెజెంటర్ బద్రి (కాళ్ల వీరభద్రయ్య) ప్రయాణిస్తున్న కారు పశ్చిమ గోదావరి జిల్లా, భీమడోలు– రాజమండ్రి మార్గమధ్యలో కారు చెట్టును ఢీకొట్టడంతో మృతి చెందారు. ఫిబ్రవరి 8న ఈ ప్రమాదం జరిగింది. ఈ ప్రమాదంలో ఆయనతో పాటు ఆయన చిన్న కొడుకు స్వాతిక్ కూడా చనిపోయారు. ఆయన భార్యకు, పెద్ద కొడుకుకు తీవ్ర గాయాలయ్యాయి. ఆయనది పశ్చమ గోదావరి జిల్లా, ఉంగుటూరు గ్రామం. ఫిబ్రవరి 19న ప్రముఖ మహిళా కార్టూనిస్టు రాగతి పండరి (50) అనారోగ్యంతో బాధపడుతూ విశాఖపట్నంలో చనిపోయారు. ఆమె 1965 జూలై 22న జన్మించారు. ఆమెకు చిన్నతనంలోనే పోలియో వచ్చినా ఆత్మస్థైర్యం కోల్పోకుండా మంచి కార్టూనిస్టుగా ఎదిగారు. ఆమె 40 వేలకు పైగా కార్టూన్స్ వేశారు.

### సినీ నిర్మాత డి. రామానాయుడు మృతి

సినీ నిర్మాత డి. రామానాయుడు (79) ఫిబ్రవరి 18న క్యాన్సర్ వ్యాధితో బాధపడుతూ హైదరాబాద్‌లోని జూబ్లీహిల్స్‌లో ఉన్న ఆయన స్వగృహంలో చనిపోయారు. ఆయన ప్రకాశం జిల్లా, కారంచేడు గ్రామంలో 1936 జూన్ 6న జన్మించారు. ఆయన తెలుగు, తమిళం, హిందీ, కన్నడం, మళయాలం మొదలైన భాషలలో మొత్తం 140 చిత్రాలను నిర్మించారు. అత్యధిక చిత్రాలు నిర్మించి గిన్నిస్ రికార్డుకెక్కారు. ఆయన ఎంపిగా కూడా పనిచేశారు.

### సిఆర్‌డిఎపై ప్రజాహిత వాజ్యం

ఆంధ్రప్రదేశ్‌లో నూతన రాజధాని నిర్మాణం కోసం భూసేకరణ చేపట్టిన 'కాపిటల్ రిజియన్ డెవలప్‌మెంట్ అథారిటీ' (సిడిఆర్ఎ) ని సవాలు చేస్తూ దానిపై ప్రజాహిత వాజ్యం ఫిబ్రవరి 18న దాఖలైంది. ఈ వాజ్యాన్ని గుంటూరు జిల్లా, మంగళగిరి మండలం, నిడమర్రు గ్రామానికి చెందిన రైతు బి. శివరామిరెడ్డితో పాటు తాడెపల్లి మండలం, పెనుపాక గ్రామానికి చెందిన 13 మంది రైతులు సంయుక్తంగా దాఖలు చేశారు. ఈ వాజ్యంలో ప్రతివాదులుగా పురపాలక ముఖ్యకార్యదర్శి, సిఆర్‌డిఎ కమిషనర్లతో పాటు, గుంటూరు, కృష్ణా జిల్లాల కలెక్టర్లను చేర్చారు.

### శాసన మండలి ఎన్నికల షెడ్యూల్ విడుదల

తెలంగాణ, ఆంధ్రప్రదేశ్‌లలో నాలుగు శాసన మండలి స్థానాలకు ఫిబ్రవరి 19న ఎన్నికల ప్రధాన అధికారి భన్వర్‌లాల్ నోటిఫికేషన్‌ను విడుదల చేశారు. ఇందులో రెండు పట్టభద్రుల స్థానాలు, రెండు ఉపాధ్యాయ స్థానాలు ఉన్నాయి. ఈ ఎన్నికలు మార్చ్ 16న జరుగుతాయి.

### సచివాలయంలోకి మీడియాకు అనుమతి లేదు

తెలంగాణ ముఖ్యమంత్రి కె. చంద్రశేఖరరావు ఫిబ్రవరి 19న రాష్ట్ర సచివాలయంలోకి మీడియాను రాకుండా నిషేధించాలని, అవసరమైనప్పుడు మీడియాను పిలుద్దామని, వార్తలను పంపిద్దామని అధికారులను ఆదేశించారు. ఢిల్లీ, తమిళనాడులలో సచివాలయంలోకి రాకుండా మీడియాపై ఉన్న ఆంక్షలను అమలు చేద్దామని అధికారులకు సూచించారు. ముఖ్యమంత్రి వ్యాఖ్యలను జర్నలిస్టు సంఘాలు, రాజకీయ పార్టీల నాయకులు, ప్రజా సంఘాలు ఖండించాయి.

### ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు

కృష్ణా జిల్లా, విజయవాడలోని శ్రీ కృష్ణవేణి టాలెంట్ స్కూల్‌లో కృష్ణా జిల్లా రచయితల, ప్రపంచ తెలుగు రచయితల సంఘాల ఆధ్వర్యంలో మూడవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు ఫిబ్రవరి 21, 22 తేదీలలో జరిగాయి. ఈ సభలలో పాల్గొన్న వక్తలు తెలుగుభాష పరిరక్షణకు ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేయాలని, ప్రభుత్వ ఉత్తర్వులూ, ఉత్తర ప్రత్యుత్తరాలూ, న్యాయస్థానాల తీర్పులు తెలుగులోనే ఉండాలని, హిందీ కేంద్రీయ సంస్థాన్ లాగానే తెలుగుకు తెలుగు సంస్థాన్‌ను ఏర్పాటు చేసి, దాని ద్వారా ప్రముఖ తెలుగు రచయితల సాహిత్యాన్ని ప్రచురించాలని డిమాండ్ చేశారు. ఈ సభలకు అనేకమంది కవులూ, రచయితలూ, భాషావేత్తలూ భాషాభిమానులూ, సాహితీవేత్తలూ, ప్రతినిధులూ హాజరయ్యారు.

### జననాట్య మండలి బాలయ్య మృతి

జననాట్య మండలి వ్యవస్థాపక సభ్యులు, ప్రజా కళాకారుడు ముదుపు బాలయ్య (ఖవాలీ బాలయ్య) ఫిబ్రవరి 23న హైదరాబాద్‌లోని గొల్లగూడలో ఉన్న ఆయన స్వగృహంలో చనిపోయారు. ఆర్ట్ లవర్స్ సాంస్కృతిక సంస్థ ద్వారా కళాకారునిగా జీవితం ప్రారంభించి, తరువాత 1972లో ఏర్పడ్డ జననాట్య మండలి వ్యవస్థాపక సభ్యులలో ఒకరు అయ్యారు. వీ

## కేరళలో సామాజిక కార్యకర్తల అరెస్ట్

సామాజికి కార్యకర్త జైసన్‌కూపర్, న్యాయవాది మానవ హక్కుల కార్యకర్త తుషార్ నిర్మల్ సారథిలతో సహా 17 మందిని యుఎపిఎ చట్టం కింద జనవరి 29న కేరళ పోలీసులు అరెస్ట్ చేశారు. ఈ చర్యను అన్ని మానవ హక్కుల సంఘాలు, ప్రజాస్వామిక వాదులు తీవ్రంగా ఖండించారు. అక్రమ మైనింగ్‌కు వ్యతిరేకంగా, నిరాశ్రయులైన ప్రజలకు అండగా పోరాడుతున్న ఈ కార్యకర్తలను అక్రమంగా అరెస్ట్ చేయడం ప్రజాస్వామిక మానవ హక్కుల ఉల్లంఘన అని మానవ హక్కుల సంఘాలు తెలిపాయి. వీరిని వెంటనే విడుదల చేయాలని, యుఎపిఎ వంటి అప్రజాస్వామిక చట్టాలను రద్దుచేయాలని డిమాండ్ చేశాయి.

## నక్సల్స్ ప్రాంత ముఖ్యమంత్రులతో సమావేశం

నక్సల్స్ ప్రభావిత నాలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులతో కేంద్ర హోంమంత్రి రాజనాథ్ సింగ్ ఫిబ్రవరి 9న సమావేశం అయ్యారు. నక్సల్స్ కార్యకలాపాలు కొనసాగుతున్న ప్రాంతాల్లో మౌలిక వసతులు ఏర్పాటు చేయాలని, అందులో భాగంగా రహదారులు, ఆనకట్టలు, రైల్వేలైన్లు, మొబైల్ టవర్లు, పోస్టాఫీసులు, బ్యాంకులు, విద్య, వైద్యం, రేడియో, టివి, అనుసంధానం, అటవీ, పర్యావరణ అనుమతులు వంటి కార్యకలాపాలు ఎలా కొనసాగుతున్నాయనీ ఈ సదస్సులో సమీక్షించారు. నక్సల్స్ సమస్యను ఎదుర్కోవడానికి సమన్వయంతో కార్యాచరణకు దిగాలని సూచించారు. ఈ సమావేశానికి చత్తీస్‌గడ్ సిఎం రమణ్‌సింగ్, మహారాష్ట్ర సిఎం ఫడణవీస్‌లతో పాటు తెలంగాణ, ఒడిశా ముఖ్యకార్యదర్శులు, డిజిపిలు హాజరయ్యారు.

## బాలచంద్ర నెమడేకు జ్ఞానపీఠ్ అవార్డు

ప్రముఖ మరాఠీ సాహిత్యవేత్త బాలచంద్ర నెమడేకు 2014వ సంవత్సరం జ్ఞానపీఠ్ అవార్డుకు ఎంపికయ్యారు. ఈ మేరకు భారతీయ జ్ఞానపీఠ్ ఫిబ్రవరి 6న ఓ ప్రకటించింది. నెమడే 1938లో పుట్టారు. 1963లో వచ్చిన 'కోసల' నుంచి ఇటీవలి 'హిందు' వరకు అనేక రచనలు చేసి మరాఠీ సాహిత్యంలో గొప్ప స్థానాన్ని సంపాదించారు. గతంలో పద్మశ్రీ, సాహిత్య అకాడమీ అవార్డులు అందుకున్నారు.

## గవర్నర్ల సదస్సు

దేశ రాజధాని ఢిల్లీలో ఫిబ్రవరి 10, 11 తేదీల్లో జరిగిన గవర్నర్ల 46వ సదస్సును రాష్ట్రపతి ప్రారంభించారు. రాజ్యాంగ సూత్రాలు, నిబంధనల నుండి ఏమాత్రం తప్పినా అది దేశ ప్రజాస్వామ్య పొందికను బలహీన పరుస్తుందన్నారు. దానివల్ల ప్రజల సామాజిక, ఆర్థిక, రాజకీయ సంక్షేమాన్ని కూడా స్తంభింపజేస్తుందని అన్నారు. ఈ సదస్సులో ప్రధానంగా నాలుగు అంశాలపై చర్చించారు. 1. అంతర్గత భద్రత, అంతర్జాతీయ సరిహద్దు కలిగిన రాష్ట్రాల్లో భద్రతపై ప్రత్యేక దృష్టి పెట్టడం. 2. ఉపాధితో కూడిన ఆర్థిక విధానాలు, ఉపాధి, నైపుణ్యం పెంపొందించే అభివృద్ధి కార్యక్రమాలు. 3. పారిశుద్ధ్యం, గాంధీజీ 150వ జయంతి అయిన 2019 నాటికి స్వచ్ఛభారత్ లక్ష్యాలు సాధించడం. 4. రాజ్యాంగంలోని అయిదవ, ఆరవ షెడ్యూళ్లతో ముడిపడిన అంశాలపై ప్రత్యేకంగా దృష్టి పెట్టడం. ఈ సమావేశానికి ప్రధానమంత్రితో పాటు మంత్రులు కూడా హాజరయ్యారు.

## ఢిల్లీ ముఖ్యమంత్రిగా కేజ్రీవాల్

ఢిల్లీ ఎన్నికల్లో మొత్తం 70 అసెంబ్లీ స్థానాలకు ఆమ్ ఆద్మీ పార్టీ 67 స్థానాలను గెలుచుకుని పూర్తి ఆధిక్యత సాధించింది. భారతీయ జనతా పార్టీ 3 స్థానాలను గెలిచింది. కాంగ్రెస్ పార్టీ ఖాతానే తెరువలేదు. ఆమ్ ఆద్మీ పార్టీ కన్వీనర్ కేజ్రీవాల్‌ను ముఖ్యమంత్రిగా ఎన్నుకుంది. ఢిల్లీలోని రాంలీల మైదానంలో ఫిబ్రవరి 14న కేజ్రీవాల్ చేత ఢిల్లీ లెఫ్టినెంట్ గవర్నర్ నజీబ్‌జంగ్ ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేయించారు. మరో ఆరుగురు ఎంఎల్‌ఎలు మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేశారు.

## బూటకపు ఎన్‌కౌంటర్ల కేసులో పోలీసులకు విముక్తి

ముంబయి బూటకపు ఎన్‌కౌంటర్ కేసులో గుజరాత్ మాజీ డిజిపి పిపి పాండేను సిబిఐ ప్రత్యేక న్యాయస్థానం ఫిబ్రవరి 4న విడుదల చేయాలని తీర్పునిచ్చింది. తుల్సీరామ్ ప్రజాపతి ఎన్‌కౌంటర్‌కు సంబంధించిన కేసులో పాండే ఆరోపణలు ఎదుర్కొంటున్నారు. 2006లో ఈ ఎన్‌కౌంటర్ జరిగింది. గుజరాత్ రాజధాని అహ్మదాబాద్‌లో ఇష్రత్ జహాన్, సొహ్రాబుద్దీన్ షేక్‌ల బూటకపు ఎన్‌కౌంటర్ల కేసులో నిందితుడైన మాజీ ఐపిఎస్ అధికారి డి.జి వంజారా సబర్మతి కేంద్ర కారాగారం నుంచి ఫిబ్రవరి 18న విడుదలయ్యారు.

## బొగ్గు కుంభకోణంలో మధుకోడాకు బెయిల్

జార్ఖండ్ మాజీ ముఖ్యమంత్రి మధుకోడా, మరో ఏడుగురికి ప్రత్యేక న్యాయస్థానం ఫిబ్రవరి 18న బెయిల్ మంజూరు చేసింది. మధుకోడా ముఖ్యమంత్రిగా ఉన్న సమయంలో అధికారాన్ని అడ్డుపెట్టుకొని బొగ్గుగనుల కుంభకోణానికి పాల్పడ్డాడనే అరోపణతో అరెస్టై జైల్‌లో ఉన్నారు.

## ప్రభుత్వ రహస్య పత్రాలు మాయం

పెట్రోలియం శాఖలో జరిగిన అవినీతిలో కార్పొరేట్ గూఢచర్యం బయటపడింది. ఈ కేసులో ఇప్పటి వరకు అరెస్ట్ చేసిన 12 మందిలో మాజీ విలేకరి, ఇంధన కన్సల్టెంట్ శంతన్ సైకియా...ఇది రు. 10 వేల కోట్ల కుంభకోణమని అంటున్నారు. ఢిల్లీ పోలీసులు ఫిబ్రవరి 20న ఇంధన రంగాలకు చెందిన శైలేశ్ సక్సేనా (రిలయన్స్ ఇండస్ట్రీస్ లిమిటెడ్), వినయ్ కుమార్ (ఎస్సార్), కె.కె. నాయక్ (కెయిర్న్), సుభాష్ చంద్ర (జూబిలంట్ ఎనర్జీ), రిషీ ఆనంద్ (అడాగ్ రిలయన్స్) లతో పాటు శంతను సైనియా ప్రయాస్ జైన్ అనే ఇద్దరు కన్సల్టెంట్లను అరెస్ట్ చేశారు. దీంతో అరెస్ట్ అయినవారి సంఖ్య 12 కు చేరింది. ఈ ముఠా సభ్యులు కేవలం పెట్రోలియం శాఖకు సంబంధించిన సమాచారం మాత్రమే కాకుండా...బొగ్గు, ఆర్థిక, విద్యుత్ తదితర శాఖలకు చెందిన సమాచారాన్ని కూడా దొంగిలించినట్లు తెలిసింది.

## బీహార్ ముఖ్యమంత్రిగా నితీష్

బీహార్ రాజకీయ సంక్షోభానికి ముగింపుగా జెడియు నేత నితీష్‌కుమార్ మళ్లీ ముఖ్యమంత్రి అయ్యారు. రాష్ట్ర 22వ ముఖ్యమంత్రిగా ఆయనతో రాజ్‌భవన్‌లో గవర్నర్ కేసరీనాథ్ త్రిపాఠీ ఫిబ్రవరి 22న ప్రమాణ స్వీకారం చేయించారు. ఆయనతో పాటు 22 మంది మంత్రులుగా ప్రమాణ స్వీకారం చేశారు. ఈ కార్యక్రమానికి జనతాదళ్ (యు) అధ్యక్షుడు శరత్ యాదవ్, ఆ పార్టీకి చెందిన ఇతర నాయకులు, మాజీ ప్రధాని దేవెగౌడ, పశ్చిమ బెంగాల్ సిఎం మమతా బెనర్జీ, అస్సాం సిఎం తరుణ్ గొగోయ్, యుపి సిఎం అఖిలేష్ యాదవ్, ఐఎన్‌ఎల్‌డి నేత అభయ్ చౌతాలా తదితరులతో పాటు మాజీ సిఎం మాంఝీ హాజరయ్యారు.

## భూసేకరణ ఆర్డినెన్స్ అప్రజాస్వామికం

భూసేకరణ ఆర్డినెన్స్‌ను విరమించుకోవాలని అన్నాహజారే ఫిబ్రవరి 23న ఢిల్లీలోని జంతర్ మంతర్ వద్ద రెండు రోజులు ఆందోళన చేశాడు. ఈ ఆందోళనకు వందలాది మంది ప్రజలు మద్దతుదారులు, నర్మదా బచావో ఆందోళన్ నాయకురాలు మేధాపాట్కర్, ఢిల్లీ ముఖ్యమంత్రి కేజ్రీవాల్ హాజరయ్యారు. భారతదేశ ప్రజల ప్రధాన జీవనాధారం వ్యవసాయమని రైతుల ప్రయోజనాలే ప్రధానం కావాలన్నారు. భూసేకరణ చట్టంతో రైతుల సమ్మతి నిబంధనను తొలగిస్తూ ఆర్డినెన్స్ జారీచేయడం అంటే కార్పొరేట్ శక్తుల ప్రయోజనాలను నెరవేర్చడానికే చేసిందని ఆరోపించారు. ఆర్డినెన్స్‌కు వ్యతిరేకంగా దేశ నలుమూలల నుంచి వచ్చిన రైతు సంఘాల సభ్యులు జంతర్ మంతర్‌లోని కేరళ హౌజ్ నుంచి పార్లమెంట్ వీధి వరకు ర్యాలీ నిర్వహించారు. వీ

## గ్రీస్ ఎన్నికలు

జనవరి 25న జరిగిన ఎన్నికల్లో సిర్జియా పార్టీ విజయం సాధించింది. ఆ పార్టీ అధ్యక్షుడు ఎలక్సిస్ సిప్రాస్ ప్రధానమంత్రిగా ఎన్నికయ్యారు. ఆయన గ్రీస్ ప్రధానమంత్రి అయిన వారిలో అతి పిన్నవయస్కుడు. యూరోపియన్ యూనియన్ ఆంక్షలు, ప్రభుత్వ పొదుపు చర్యలతో తల్లడిల్లిపోయిన గ్రీస్ ప్రజలు ఈసారి అనేక వామపక్షాల విప్లవ సంఘాలు కూటమిగా ముందుకు వచ్చి పొదుపు చర్యల్ని, బెయిల్ అవుట్ షరతులను నిరసిస్తూ, ఉపాధి ఉద్యోగ సంక్షేమానికి అధిక ప్రాధాన్యమిస్తామని హామీ ఇచ్చిన సిర్జియా పార్టీకి పట్టం కట్టబెట్టారు.

## ఉక్రెయిన్‌పై కొనసాగుతున్న సందిగ్ధత

ఉక్రెయిన్ సంక్షోభం ఇంకా కొనసాగుతూనే ఉంది. ఈ సంక్షోభాన్ని పరిష్కరించేందుకు ఫిబ్రవరి 13న రష్యా, ఫ్రాన్స్, జర్మనీ, ఉక్రెయిన్ నేతలు కలిసి కుదుర్చుకున్న మిన్స్క్ ఒప్పందాలకు మద్దతుగా రష్యా రూపొందించిన తీర్మానాన్ని ఐక్యరాజ్య సమితి భద్రతా మండలి ఏకగ్రీవంగా ఆమోదించింది. తూర్పు ఉక్రెయిన్‌లో హింసాకాండ కొనసాగడం పట్ల తీర్మానం ఆందోళన వ్యక్తం చేసింది. ఉక్రెయిన్‌లో పూర్తిగా కాల్పుల విరమణ జరగాలని తీర్మానం పిలుపునిచ్చింది. ఉక్రెయిన్ సార్వభౌమాధికారాన్ని, స్వాతంత్ర్యాన్ని, ప్రాదేశిక సమగ్రతను గౌరవించాలే రాజకీయ పరిష్కారం ఉండాలని తీర్మానం పేర్కొంది.

## మాల్దీవుల మాజీ అధ్యక్షుడు నషీద్ అరెస్ట్

మాల్దీవుల మాజీ అధ్యక్షుడు, ప్రస్తుత ప్రతిపక్ష నేత మహమ్మద్ నషీద్‌ను ఫిబ్రవరి 22న పోలీసులు అరెస్టు చేశారు. ఆయనపై ఉగ్రవాద కార్యకలాపాలకు పాల్పడ్డారన్న ఆరోపణతో ఈ చర్యకు పూనుకున్నారు. నషీద్ అధ్యక్షుడిగా పనిచేసిన 2012లో ఓ న్యాయమూర్తి అరెస్టుకు సంబంధించిన ఉత్తర్వులు జారీచేసిన కేసులో అరెస్టు చేసినట్లు పోలీసులు తెలిపారు. ఇదే కారణంతో మాల్దీవుల అధ్యక్ష పదవికి నషీద్ రాజీనామా చేశారు. తర్వాత జరిగిన ఎన్నికల్లో మామూన్ అబ్దుల్ గయ్యూం చేతిలో నషీద్ ఓడిపోయారు.

## ఇరాక్‌లో ఆగని హింసాకాండ

ఇరాక్‌లో హింసాకాండ తీవ్ర రూపం దాల్చుతోంది. ఇటు భద్రతా దళాలు, అటు మిలిటెంట్ల మధ్య జరుగుతున్న పోరులో సామాన్య ప్రజలు తీవ్రంగా ప్రాణ, ఆస్తి నష్టానికి గురవుతున్నారు. యూనైటెడ్ నేషన్స్ (యుఎన్) సంస్థ నివేదికలో గత నెలలో దాదాపు 1375 మందికి పైగా మరణించారని తెలిపింది. వేల సంఖ్యలో పౌరులు గాయపడ్డారని వెల్లడించింది. ముఖ్యంగా రాజధాని బాగ్దాద్‌లో 256 మంది పౌరులు చనిపోగా, ఏడు వందల మందికిపైగా గాయపడ్డారని పేర్కొంది.

## ఫుకుషిమా అణుకేంద్రంలో చిల్లు

జపాన్‌లోని ఫుకుషిమా అణు విద్యుత్ కేంద్రంలో అణు ధార్మిక జలం లీకేజి అవుతున్నట్లు నిర్వాహక సంస్థ టోక్యో ఎలక్ట్రిక్ పవర్ కంపెనీ (టెప్కో) కనుగొన్నది. దైచీ అణు విద్యుత్ కేంద్రం సమీపంలో కురిసిన భారీ వర్షాలతో సమీపంలో ఏర్పడిన నీటి గుంటలలోని నీటితో పాటు అక్కడి భూగర్భ జలాలలో సాధారణ స్థాయి కంటే 70 రెట్లు అధికంగా అణు ధార్మికతను సెన్సార్లు గుర్తించాయని టెప్కో తెలిపింది. సమీప జలాల్లో గుర్తించిన అణు ధార్మికత సముద్రంలో కలవకుండా నిరోధించేందుకు గట్టర్‌ను మూసి వేస్తున్నామని తెలిపింది.

## బంగ్లాదేశ్ - ఆందోళనలు - పడవ ప్రమాదం

బంగ్లాదేశ్‌లో జనవరి మాసంలో మొదలైన ఆందోళనలు కొనసాగి తూనే ఉన్నాయి. ప్రధాని షేక్ హసీనా ప్రభుత్వానికి వ్యతిరేకంగా ప్రధాన ప్రతిపక్షం బంగ్లాదేశ్ నేషనల్ పార్టీ (బిఎన్‌పి) నేతృత్వంలోని ఇరవై పార్టీల కూటమి ఆధ్వర్యంలో నిరసన ఉద్యమం కొనసాగుతోంది. హర్తాళ్, దిగ్బంధం పేరుతో దేశవ్యాప్తంగా అరాచకపరిస్థితి, హింసాకాండ తీవ్రరూపం దాల్చింది. గృహదహనాలు, లూటీలు, హింసకాండలో దాదాపు ఎనభై మంది మరణించారు. జనవరి 5న రాజధానిలో తమను ర్యాలీ నిర్వహించు కునేందుకు ప్రభుత్వం అనుమతి నిరాకరించడానికి నిరసనగా ప్రస్తుత ప్రభుత్వాన్ని రద్దు చేసి అఖిలపక్ష ఆపద్ధర్మ ప్రభుత్వ సారథ్యంలో తక్షణమే ఎన్నికలు నిర్వహించాలన్న డిమాండ్‌తో బిఎన్‌పి, ఇతర ప్రతిపక్ష పార్టీలు గత నెల నుండి నిరవధిక నిర్బంధాన్ని కొనసాగిస్తున్నాయి. దీంతో దేశ వ్యాప్తంగా ప్రజలు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. మరోవైపు ఫిబ్రవరి 22న బంగ్లాదేశ్‌లోని మాణిక్యంజ్ జిల్లాలోని పద్మావతి నదిలో పడవ ప్రమాదం జరిగింది. 90 మందితో కిక్కిరిసి ప్రయాణిస్తున్న పడవను రవాణా నౌక ఢీకొనడంతో దాదాపు 68 మంది మరణించారు.

## మయన్మార్‌లో కార్మిక సమ్మెపై నిర్బంధం

మయన్మార్‌లో అతిపెద్ద పారిశ్రామిక ప్రాంతంగా పేరొందిన స్వేపిత్యార్‌లో వేతనాలను సవరించాలని కోరుతూ కార్మికులు నెల రోజుల నుంచి చేస్తున్న సమ్మెపై ప్రభుత్వం అణచివేత ధోరణి ప్రారంభించింది. మూడు విదేశీ దుస్తుల తయారీ కంపెనీలైన కాస్టక్ ఇంటర్నేషనల్, ఫోర్డుగ్లోరి, ఈ-లాండ్ మయన్మార్ సంస్థల్లో పనిచేస్తున్న దాదాపు రెండు వేల మంది కార్మికులు ఆ కంపెనీల ఎదుట సమ్మెకు దిగారు. ఆసియా ప్రమాణాలకు అనుగుణంగా వేతనాలు చెల్లించాలని కోరుతున్న కార్మికుల డిమాండ్‌ను పరిష్కారానికి చర్చించకుండా ప్రభుత్వం కార్మికులను తక్షణమే సమ్మె విరమించి హెచ్చరించింది. కార్మికులు ఈ హెచ్చరికలను లెక్క చేయక పోవడంతో ప్రభుత్వం పోలీసులను రంగంలోకి దింపింది. ముప్పై మంది కార్మిక నాయకుల్ని అరెస్టు చేయించింది.

## అమెరికాలో చమురు కార్మికుల సమ్మె

అమెరికాలోని చమురు పరిశ్రమలు తమ సమస్యలు పరిష్కరించడం లో నిర్లక్ష్యం వహిస్తున్నాయని ఆరోపిస్తూ చమురు కార్మికులు, ఉద్యోగులు ఫిబ్రవరి 21న పెద్ద ఎత్తున సమ్మె బాట పట్టారు. దేశవ్యాప్తంగా వివిధ రిఫైనరీలు, టెర్మినల్స్, పెట్రో కెమికల్ ప్లాంట్లు, పైప్‌లైన్లకు చెందిన దాదాపు ముప్పై వేల మంది కార్మికులు ఈ సమ్మెలో పాల్గొంటున్నారని యూనైటెడ్ స్టీల్ వర్కర్స్ యూనియన్ తెలిపింది. పని పరిస్థితులు, వేతనాలను మెరుగుపరచాలన్న డిమాండ్‌తో ఈ సమ్మె మొదలైంది. ఈ సమ్మె కారణంగా దేశవ్యాప్తంగా 12 రిఫైనరీలతో సహా మొత్తం పదిహేను ప్లాంట్‌లో ముడిచమురు ప్రాసెసింగ్ ప్రక్రియ నిలిచిపోయింది.

## ఆస్కార్ అవార్డుల పండుగ

అమెరికాలోని లాస్ ఏంజిల్స్‌లో ఫిబ్రవరి 23న 87వ ఆస్కార్ అవార్డుల ప్రధానోత్సవం జరిగింది. ఈ కార్యక్రమంలో ఉత్తమ చిత్రంతో పాటు, ఉత్తమ దర్శకుడు, ఉత్తమ సినిమాటోగ్రఫీ, ఉత్తమ స్క్రీన్‌ప్లే విభాగాల్లో 'బర్డ్‌మ్యాన్' చిత్రం ఆస్కార్ అవార్డు గెలుచుకుంది. 'ది థియరీ ఆఫ్ ఎవ్రీథింగ్' చిత్రంలో నటించిన ఎడ్డీ రెడ్‌మానెకు ఉత్తమ నటునిగా, 'స్టిల్ ఎలైస్'లో నటించిన జూలియన్ మోరే ఉత్తమ నటిగా ఆస్కార్ అవార్డులు గెలుచుకున్నారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : వై.రామచంద్రం, ఎస్. వెంకటేష్

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుదుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగాను, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(జనవరి 1 నుండి జనవరి 31, 2015 వరకు తెలంగాణలోని 6 జిల్లాలు (852), ఆంధ్రప్రదేశ్‌లోని 7 జిల్లాలలో (502) అసహజ మరణాల పాలైన వారి సంఖ్య 1354)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు స్త్రీ | ఇతరాలు పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| మెదక్ | 3 | 42 | 6 | 9 | 11 | 19 | 25 | 2 | 11 | 19 | 19 | 19 | 11 | 9 | 32 | 9 | - | 3 | - | 5 | 4 |
| కరీంనగర్ | 3 | 3 | 4 | 4 | 8 | 1 | 3 | 1 | - | 1 | 13 | 11 | 2 | 9 | 35 | 17 | - | - | - | - | 12 |
| ఖమ్మం | - | 1 | - | 7 | 12 | 10 | 11 | 2 | 1 | - | 3 | 1 | - | 7 | 23 | 19 | - | - | - | - | 3 |
| మహబూబ్‌నగర్ | - | 3 | - | 20 | 22 | - | - | 2 | 8 | 11 | 10 | 11 | 10 | 12 | 59 | 5 | - | - | - | - | - |
| రంగారెడ్డి | - | 3 | - | 12 | 11 | 9 | 14 | 2 | 4 | 5 | 8 | 3 | 6 | 4 | 39 | 13 | - | - | - | - | 1 |
| నల్గొండ | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| నిజామాబాద్ | - | - | - | 7 | 12 | 2 | - | - | 1 | 4 | 3 | - | - | 7 | 23 | 11 | - | - | - | - | - |
| **తెలంగాణ** | **6** | **52** | **10** | **49** | **76** | **41** | **53** | **9** | **25** | **40** | **56** | **45** | **29** | **48** | **211** | **74** | **-** | **3** | **-** | **5** | **20** |
| అనంతపురం | | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | | | |
| చిత్తూరు | - | - | - | 6 | 2 | - | - | - | - | - | 4 | 3 | 6 | 1 | 29 | - | - | - | - | - | - |
| కడప | - | 1 | - | 4 | 9 | - | - | - | - | - | - | 2 | - | 2 | 15 | 7 | - | - | - | - | 1 |
| కర్నూలు | - | 2 | - | 9 | 5 | 4 | 8 | 10 | 4 | 6 | 3 | 5 | 7 | 4 | 25 | 13 | - | - | - | - | 8 |
| ప్రకాశం | 1 | 4 | - | 9 | 7 | 2 | 1 | 2 | 2 | 4 | 8 | 5 | 9 | 3 | 18 | 4 | - | - | 3 | 1 | - |
| తూర్పు గోదావరి | - | - | - | 4 | 6 | 6 | 7 | - | - | 3 | 2 | - | 3 | - | 38 | 10 | - | - | - | - | - |
| శ్రీకాకుళం | - | - | - | 5 | 9 | 1 | 8 | 1 | - | 3 | - | 1 | 2 | 3 | 34 | 5 | - | - | - | 2 | 2 |
| విశాఖపట్నం | 1 | - | - | 3 | 9 | 1 | 2 | 1 | - | 4 | 1 | 2 | 4 | 1 | 26 | 13 | - | - | - | 9 | 1 |
| **ఆంధ్రప్రదేశ్** | **2** | **7** | **-** | **30** | **38** | **14** | **26** | **14** | **6** | **20** | **18** | **18** | **31** | **14** | **185** | **52** | **-** | **-** | **3** | **12** | **12** |

# వీక్షణం దగ్గర అమ్మకానికి ఉన్న పుస్తకాలు

### ఆర్థిక వ్యవస్థ – సామ్రాజ్యవాదం

| | | |
|---|---|---|
| ఒక దళారీ పశ్చాత్తాపం | జాన్ పెర్కిన్స్ | రు. 75 |
| కుట్రాజకీయం | స్టీఫెన్ కింజర్ | 40 |
| అభివృద్ధిని ఇలా చూద్దాం | ముదునూరి భారతి | 80 |
| కొత్తచూపు | ఆర్.ఎస్. రావు | 120 |
| ఊరి దారి | ఎన్. వేణుగోపాల్ | 60 |
| రాబందు వాలిన నేల | ఎన్. వేణుగోపాల్ | 180 |
| వ్యవసాయం – ప్రపంచీకరణ | కె.ఆర్. చౌదరి | 100 |
| నిత్యజీవితంలో సోషలిజం | భూసారం శివన్న | 100 |
| విధ్వంసకల అభివృద్ధి | డిఎస్‌యు | 180 |
| భారతదేశంలో ఉత్పత్తి విధానం | | |
| ఉత్పత్తి సంబంధాలు | విరసం | 20 |

### తెలంగాణ

| | | |
|---|---|---|
| లేచినిలిచిన తెలంగాణ | ఎన్. వేణుగోపాల్ | 120 |
| తిరగబడ్డ తెలంగాణ | ఇనుకొండ తిరుమలి | 100 |
| తెలంగాణ రాజకీయాలు | దాగ్మార్ బెర్న్‌స్టార్ఫ్, హ్యూగ్ గ్రే | 80 |
| కొత్త వంతెన | కె. శ్రీనివాస్ | 120 |
| తెలంగాణ జైత్రయాత్ర | ఘంటా చక్రపాణి | 200 |
| తెలంగాణ కాలజ్ఞాని ప్రొ. జయశంకర్ | ఘంటా చక్రపాణి | 20 |

### శాస్త్రవిజ్ఞానం

| | | |
|---|---|---|
| విశ్వాంతరాళం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| మానవ పరిణామం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవకణాలూ నాడీకణాలూ | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 80 |
| ప్రకృతీ – పర్యావరణం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| జీవశాస్త్ర విజ్ఞానం – సమాజం | కొడవటిగంటి రోహిణీప్రసాద్ | 100 |
| విజ్ఞాన శాస్త్రం మనిషి విస్తరణ | జెడి బెర్నాల్ | 80 |

### కులం–మతం

| | | |
|---|---|---|
| భారతదేశంలో కుల సమస్య | అనురాధ గాంధీ | 120 |
| శూద్రవర్ణం ఎలా పుట్టింది | ఆర్.ఎస్. శర్మ | 80 |
| కులం వర్గం | బొజ్జా తారకం | 30 |
| ఎస్‌సి, ఎస్‌టి నిధులు, విధిలింపు - మళ్లింపు | బొజ్జా తారకం | 40 |
| ఎస్‌సి, ఎస్‌టిలపై అత్యాచారాలు | బొజ్జా తారకం | 50 |
| ఖైర్లాంజి | ఆనంద్ తేల్‌తుంబ్డే | 100 |
| గులాంగిరి | జోతిబా ఫూలే | 40 |
| కుల నిర్మూలన | అంబేద్కర్ | 30 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| దళితులు – రాజ్యం | అంబేద్కర్ | 25 |
| శూద్రులు – ఆర్యులు | అంబేద్కర్ | 8 |
| ఆధునిక భారతదేశంలో అంటరానితనం | అంబేద్కర్ | 25 |
| దాస్య విముక్తి కోసం | అంబేద్కర్ | 15 |
| భారతదేశం ప్రజాస్వామ్యం | అంబేద్కర్ | 12 |
| ఆంగ్లేయపాలకులు – అంటరానివాళ్లు | అంబేద్కర్ | 20 |
| రాష్ట్రాలు – మైనారిటీలు | అంబేద్కర్ | 40 |
| రాముని కృష్ణుని రహస్యాలు | అంబేద్కర్ | 20 |
| మతతత్వంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| దేవుని రాజకీయతత్వం | కంచె ఐలయ్య | 70 |
| నేను హిందూవు నెట్లయిత? | కంచె ఐలయ్య | 80 |

### సాహిత్య విమర్శ – వ్యాసాలు

| | | |
|---|---|---|
| గురజాడ దేశభక్తి | ఎన్. వేణుగోపాల్ | 20 |
| మహోదయం | కె.వి.ఆర్. | 200 |
| పరామర్శ | నల్లూరి రుక్మిణి | 80 |
| సాహిత్యంపై బాలగోపాల్ | కె. బాలగోపాల్ | 150 |
| విరసం సాహిత్య విమర్శ | విరసం ప్రచురణ | 150 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–1 | శారదాంబ స్మారక కమిటీ | 300 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–2 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| కెవిఆర్ సాహిత్య వ్యాసాలు–3 | శారదాంబ స్మారక కమిటీ | 250 |
| సాహిత్య సమాలోచన | కృష్ణాబాయి | 300 |
| సందిగ్ధ సందర్భం | సి.వి. సుబ్బారావు | 40 |
| సామాజికం | వి. చెంచయ్య | 30 |
| స్త్రీవాద సాహిత్యం | డా. నళిని | 70 |
| రియాలిటీ చెక్ | పూడూరి రాజిరెడ్డి | 250 |
| మన ప్రపంచం | దుప్పల రవికుమార్ | 75 |
| దారులేసిన అక్షరాలు | భారతీయ మహిళల రచనలు | 400 |

### చరిత్ర–జీవిత చరిత్ర

| | | |
|---|---|---|
| భారత చరిత్ర అధ్యయానికి ఒక పరిచయ | డి.డి. కొశాంబి | 250 |
| భారత చరిత్ర పరిచయ వ్యాసాలు | డి.డి. కొశాంబి | 40 |
| ప్రాచీన భారత దేశ చరిత్ర | కె. బాలగోపాల్ | 50 |
| చరిత్రలో ఏం జరిగింది? | గార్డన్ చైల్డ్ | 80 |
| తరతరాల భారతదేశ చరిత్ర | రొమిల్లా థాపర్ | 80 |
| ఆధునిక భారతదేశ చరిత్ర | బిపిన్ చంద్ర | రు. 100 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్‌సన్ | 150 |
| 24 గంటలు | కె.జి. కన్నబిరాన్ | 200 |
| బాబాసాహెబ్ అంబేద్కర్ | బి. విజయభారతి | 70 |
| చేగువేరా | కాత్యాయని | 80 |
| ఒక సెక్స్ వర్కర్ ఆత్మ కథ | నళినీ జమీలా | 50 |
| పరాయి పాలనను ఎదిరించిన ఝాన్సీ | మహాశ్వేతాదేవి | 150 |
| నిర్జన వారధి | కొండపల్లి కోటేశ్వరమ్మ | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీ దేవి | 120 |
| పరిచయాలు | ఎన్. వేణుగోపాల్ | 50 |
| నా ప్రజాజీవితం | పెండ్యాల రాఘవరావు | 50 |
| ఛత్రపతి సాహూ మహరాజ్ | కాత్యాయని | 40 |
| నూరేళ్ల కాళోజీ | వరవరరావు | 60 |
| ఆకుల భూమయ్య రచనలు | తెలంగాణ విద్యార్థి గళం | 40 |
| ఇండియాలో దాగిన హిందుస్థాన్ | పెరి ఆండర్సన్ | 150 |

### తత్వశాస్త్రం

| | | |
|---|---|---|
| మార్క్సిస్ట్ సాహిత్య విమర్శ | డా. శ్రీనివాస్ | 100 |
| మార్క్సిస్ట్ తత్వశాస్త్రం | న్యూవిస్టా పబ్లికేషన్స్ | 80 |
| మార్క్సిజం–లెనినిజం–మావోయిజం | విరసం | 125 |
| లెఫ్టిస్ట్ స్టడీ సర్కిల్ ప్రచురణలు అన్ని | | |

### విప్లవోద్యమం

| | | |
|---|---|---|
| పోలీసులు అరెస్ట్ చేస్తే | బొజ్జా తారకం | 30 |
| భారత్‌పై అరుణతార | యాన్ మిర్డాల్ | 100 |
| జంగల్‌నామా | సత్నామ్ | 100 |
| కోటి జ్ఞాపకాలు | విరసం ప్రచురణ | 50 |
| మంద్రస్థాయి యుద్ధం | విరసం ప్రచురణ | 100 |
| జగిత్యాల జంగల్‌మహల్–1 | విరసం ప్రచురణ | 75 |
| జగిత్యాల జంగల్‌మహల్–2 | విరసం ప్రచురణ | 100 |
| నేటి రాయలసీమ | విరసం ప్రచురణ | 100 |
| దండకారణ్యంలో గ్రీన్‌హంట్ | విరసం ప్రచురణ | 60 |
| రివిజనిజం | విరసం ప్రచురణ | 75 |
| జనతన జైత్రయాత్ర | విరసం ప్రచురణ | 20 |
| అంతర్యుద్ధంలో ఆదివాసులు | విరసం ప్రచురణ | 20 |
| ఆదర్శ జీవులు ఆమరులు | విరసం ప్రచురణ | 30 |
| మావో రచనలు – 1 | విరసం ప్రచురణ | 170 |
| మావో రచనలు – 2 | విరసం ప్రచురణ | 220 |

### కథ – నవల

| | | |
|---|---|---|
| దండకారణ్య కథలు(2005–2012) | విరసం ప్రచురణ | 100 |
| వసంతగీతం | అల్లం రాజయ్య | 250 |
| రేపు కథ | వెర్నన్ గొంజాల్విస్ | 20 |
| మిగిలేటోళ్లు | బాసిత్ | 50 |
| కాంత పున్నం వెన్నెల | పద్మకుమారి | 20 |
| ఏడుతరాలు | అలెక్స్ హేలీ | 80 |
| కథలగూడు | దేవులపల్లి కృష్ణమూర్తి | 60 |
| పథేర్ పాంచాలి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| చంద్రగిరి శిఖరం | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 50 |
| అపరాజితుడు | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 100 |
| వనవాసి | బిభూతిభూషన్ బంధోపాధ్యాయ | 120 |
| నేల నాగలి – మూడెద్దులు | బొజ్జా తారకం | 25 |
| పంచతంత్రం | బొజ్జాతారకం | 100 |
| ఇంట్లో ప్రేమ్‌చంద్ | శివరాణీదేవి ప్రేమ్‌చంద్ | 120 |
| ఇస్మత్ చుగ్తాయి కథలు | ఇస్మత్ చుగ్తాయి | 100 |
| స్పార్టకస్ | హోవార్డ్ ఫాస్ట్ | 80 |
| రేపటి కల | రిచర్డ్ రైట్ | 50 |
| పంచమం | చిలుకూరి దేవపుత్ర | 100 |
| ఒంద్రుమట్టి | నల్లూరి రుక్మిణి | 170 |
| బీజభూమి | వరవరరావు | 100 |
| మరల సేద్యానికి | శివరామ కారంత్ | 150 |
| హింసపాదు | బమ్మిడి జగదీశ్వరరావు | 180 |

### డివిడి

| | |
|---|---|
| వీక్షణం (2003 – 2012) | 200 |
| సృజన (1966–1992) | 240 |
| అరుణతార (1970–2013) | 125 |
| ఓ యుద్ధకాండ | 100 |

**వీక్షణం,** మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3,
హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.
ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 164 - March 2015 ● ISSN 2231-6892
● RNI Regn.No.APTEL/2003/11482 ● Published on 27/2/2014 ● Postal Regn. No. L II/RNP/HD/1100/2014-16

Date of Posting : 29th, 30th

# 'వీక్షణం'ను ఆదుకుందాం
## 'వీక్షణం' నాలుగు కాలాల పాటు నిలిచేందుకు చేయూతనిద్దాం

తెలుగులో ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ వంటి పత్రిక ఉండాలనే ఆలోచనతో, సీనియర్ పాత్రికేయులు వి. హనుమంతరావు సంపాదకులుగా 2003లో ప్రారంభమై, 2005 నుంచి ఎన్. వేణుగోపాల్ సంపాదకత్వంలో నడుస్తున్న రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక 'వీక్షణం' తెలుగు సమాజానికి అవసరమైన చర్చావేదికగా పనిచేస్తున్నదని, మనందరితో పాటు ఎందరో పాఠకుల ఆదరాభిమానాలు చూరగొన్నదని మనకు తెలుసు. పన్నెండు సంవత్సరాలుగా నిరంతరాయంగా నడుస్తున్న ఈ పత్రిక ఆర్థిక పరిస్థితి ఇప్పటికీ దినదిన గండంగానే ఉంటున్నది. ఎప్పుడు ఆగిపోతుందో తెలియదని దాదాపు ప్రతినెలా పత్రికలో అచ్చవుతున్న ఆందోళనాకరమైన ప్రకటన, ఈ పత్రికను నిలబెట్టడానికి తోడ్పడమనే అభ్యర్థనలు మా ఈ బహిరంగ ప్రకటనకు కారణం. ఇంతకాలంగా నిర్వాహకులు కష్టనష్టాలు భరిస్తూ సాగించిన కృషికి ఇప్పుడు మన సహకారం అవసరమని చెప్పడానికే ఈ ప్రకటన.

'వీక్షణం' ఈ పన్నెండు సంవత్సరాలలో మూడువేలకు పైగా వ్యాసాలను ప్రచురించి ప్రాంతీయ, దేశీయ, అంతర్జాతీయ అంశాలెన్నిటి పైననో తెలుగు సమాజానికి అత్యవసరమైన సమాచారాన్నీ, వివరణలనూ, విశ్లేషణలనూ అందించింది. సంపాదకుడి అభిప్రాయాలే వైనప్పటికీ, తెలుగు సమాజంలో ఉన్న ప్రగతిశీల భావాలకూ, ధోరణులకూ అన్నిటికీ ప్రజాస్వామిక స్ఫూర్తితో వేదిక కల్పించింది. ప్రతిష్ఠాత్మకమైన ఐఎస్ఎస్ఎన్ గుర్తింపు సంపాదించి పరిశోధక విద్యార్థులకు, విశ్వవిద్యాలయ అధ్యాపకులకు అవకాశాలు కల్పించింది. ప్రతి సంవత్సరం రచయితల సమావేశాలు, సంభాషణలు ఏర్పాటు చేసి తెలుగు సమాజంలో సామాజిక శాస్త్ర రచనను ప్రోత్సహించింది. వ్యాసరచనా అధ్యయన తరగతులు నిర్వహించి వ్యాసప్రక్రియ ప్రమాణాలు పెంచడానికి తన వంతు కృషి చేసింది. పత్రికలో లబ్ధప్రతిష్ఠుల రచనలు ప్రచురించడంతో పాటు, విషయమే ప్రధానంగా ఐదారు వందలమంది కొత్త వ్యాసకర్తలకు అవకాశం కల్పించింది. 'ఒక దళారీ పశ్చాత్తాపం' వంటి విస్తృత ప్రచారం పొందిన పుస్తకంతో సహా దాదాపు డజను పుస్తకాలు ప్రచురించింది.

తెలుగు సమాజానికీ, మేధో ప్రపంచానికీ, రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణకూ ఇంత దోహదం చేసిన 'వీక్షణం' ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు, ఆ దీపం కొడిగట్టిపోకుండా కాపాడడం సమాజం బాధ్యత. ఇతోధిక పాఠకులను తయారు చేయడం, విరివిగా చందాలు చేర్పించడం, వ్యాపార ప్రకటనలు సేకరించిపెట్టడం, విరాళాలు అందించడం మన కనీస కర్తవ్యం. 'వీక్షణం' శ్రేయోభిలాషి, చరిత్రకారులు వకుళాభరణం రామకృష్ణ 'వీక్షణం' రచయితల సమావేశాల్లో సూచించినట్టుగా ఆర్థిక ఇబ్బందుల నుంచి సుస్థిరమైన పద్ధతిలో గట్టెక్కాలంటే 'వీక్షణం'కు ఒక మూలనిధి కూడ ఏర్పాటు చేయవలసి ఉంది. మనంతట మనం మన శక్తి మేరకు గాని, విరాళాలు ఇవ్వగలిగిన మిత్రుల ద్వారా గాని ఈ మూలనిధి విరాళాలు సేకరించి మనందరికీ, మొత్తంగా సమాజానికీ అవసరమైన 'వీక్షణం' రాజకీయార్థిక, సామాజిక మాసపత్రికను కాపాడుకుందాం. ఈ చైతన్యజ్వాల ఆరిపోకుండా మన రెండు చేతులూ అడ్డుపెట్టి వెలుగు నిరంతరం ప్రసరించనిద్దాం.

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020 and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao